

మాధవీ కంబైన్స్

# సుపుత్రుడు




సంగీతం
కె.వి. మహదేవన్
కథ

LAKSHMI లక్ష్మీ ఫిలింస్







నిర్మాతలు
జె. సుబ్బారావు
జి. రాజేంద్రప్రసాద్
దర్శకత్వం
తాతినేని రామారావు






ముఖచిత్రం : రవిరాముడు

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 18—00

దీపావళి ప్రత్యేక సంచికతో రు. 23—00

యువ వడపళని మద్రాసు-26


యుగయుగాలుగా సమాజంలో
స్త్రీకి గల స్థానం ఏమిటి?
ఇలా భర్తల చేతులలో
భార్యలు పొందే అవమానాలకు
అంతం ఎప్పుడు?
ఆడవాళ్ళంటే
ఆటవస్తువులా?
ఆటల్లో పావులా?
విచిత్రదాంపత్యం
నిర్మాత: పి. చిన్నపరెడ్డి M.Sc
దర్శకత్వం: పి. చంద్రశేఖరరెడ్డి
నవయుగ విడుదల
అనిల్ ప్రకాశ్ ఎంటర్‌ప్రైజెస్
SUVARNA




ఆర్యా,

ప్రతినెల మీ యువ మాసపత్రికను చదువుతున్న పాఠకులలో నేను ఒకణ్ణి.

మీ ఏప్రెల్ ఉగాది సంచిక వసంత రాములు ముఖచిత్రంతో చూడముచ్చటగా, ముద్దుగా వున్నది.

ముచ్చటైన కథలతో, ఉత్సాహము కలిగించు సీరియల్స్‌తో, మనసులను మురిపించు పెద్ద కథలతో, నవ్వు పుట్టించు కార్టూనులతో, ప్రతినెల 200 పైగా పేజీలతో విందు ముత్తయిదువులా యువ సింగారించుకొని వస్తున్నది.

"యువ"కు "మీనా" సీరియల్ హైలైట్ యద్దనపూడి సులోచనరాణి రచన అత్యంత ఆనందదాయకం మీనా పాత్రను చాల చక్కగా పోషించినది

ఇటువంటి ఉత్తమైన రచనను పాఠకులకు అందించి, అందరి మనసులను ఆనందడోలికలలో ముంచివేసిన రచయిత్రి సులోచనారాణిగారికి నా ప్రత్యేకమైన అభినందనలు

తీయనిబాధ' కథలన్నిటిలోను బాగున్నది 'ప్రగల్భప్రేతము' చాలా తమాషాగా వుంది 'ఆసుపత్రిలో' అనునది అంతసమంజసముగా లేదు.

సంపాదకీయము యువకు మకుటాయమానమని చెప్పవచ్చు.

# యువ

సచిత్రమాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 23 | మే—1971 | సంచిక 5


శ్రీమతి ఇందిరాగాంధి, ఎన్నికలలో ఘనవిజయంపొందిన తరువాత, తను ప్రధాన మంత్రిగా, మంత్రిమండలిని ఏర్పాటుచేసింది ఈ మంత్రి మండలి ఏర్పాటులో ఎంతో మందివ్యక్తులకు ఎన్నోవర్గాలకు చాలా ఆశాభంగం కలిగింది. పదవులను ఆశించిన వ్యక్తులకు ఆశాభంగం కలుగడంలోగాని, ఎవరో ఒకవ్యక్తికి పదవిస్తే దానివల్ల తమకు ప్రయోజనం వుంటుందని ఆశించినవర్గం, ఆవ్యక్తికి పదవిరాకపోతే ఆశాభంగం పొందడంలోగాని విశేషం ఏమీలేదు ప్రతి మంత్రిమండలి విషయం లోనూ, ఇలా బాధపడే వ్యక్తులూ వర్గాలూ వుంటాయి.

అయితే, శ్రీమతి ఇందిరాగాంధి మార్చినెలలో ఏర్పాటుచేసిన మంత్రిమండలి విషయంలో, ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, కేరళ రాష్ట్రాలకు చాలా ఆశాభంగం కలిగింది ఏమంటే, ఈ రాష్ట్రాలలో దేనినుంచీ ఒక్కరైనా కేబినెట్ మంత్రి హోదాలో నియమింప బడలేదు ఒరిస్సా, కేరళ వంటి చిన్న రాష్ట్రాలతరఫున ఎవరూ కేబినెట్ మంత్రులుగా లేకపోతే పోవచ్చును గాని, ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలాంటి పెద్దరాష్ట్రాల తరఫున కేబినెట్‌లో ఒక్క మంత్రికూడా లేకపోవడం, ఆ రాష్ట్రప్రజలకు బాధ కలిగించక

పోదు. అయితే, శ్రీమతి ఇందిరాగాంధీ ఉత్తరప్రదేశ్ నుంచి ఎన్నిక అయినందున, ఆ రాష్ట్రంనుంచి మరొక కేబినెట్ మంత్రిని నియమించకపోయినా ఆ రాష్ట్రానికి ఫరవాలేదు.

ఇక మిగిలిన రెండు రాష్ట్రాలలోను, మధ్యప్రదేశ్‌కు ఆంధ్రప్రదేశ్‌కన్న స్టేట్ మంత్రులలోనూ, డిప్యూటి మంత్రులలోను ఎక్కువ స్థానాలు వచ్చాయి. ఆంధ్ర ప్రదేశ్ తరపున ఇద్దరే ఇద్దరు స్టేట్ మంత్రులుగా నియమింప బడ్డారు.

కేంద్రమంత్రి మండలిలో, మొదటినుంచీ ఆంధ్రులకు తక్కువ స్థానాలే ఇవ్వ బడుతున్నవి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, 1947 నుంచి 1952 వరకు కేంద్ర మంత్రి మండలిలో ఆంధ్రులెవరూ లేరు. 1952 నుంచి 1970 వరకు, పద్దెనిమి దేళ్ళలో అంటే నాలుగు మంత్రి మండలులలో మొత్తం ఆరుగురు మాత్రం ఆంధ్రులు కేబినెట్ మంత్రులుగా వున్నారు. వా రెవరంటే, శ్రీ వి వి. గిరి, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ దామోదరం సంజీవయ్య, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ మర్రి చెన్నారెడ్డి, శ్రీ కొత్త రఘురామయ్య. ఈ ఆరుగురిలోనూ, ఏ ఒక్కరూకూడా ఒక మంత్రివర్గకాలం, అంటే పూర్తిగా అయిదేళ్ళు, మంత్రిపదవిలో వుండలేదు. మొదట్లో వచ్చి మధ్యలో పోవడమో, మధ్యలోవచ్చి మళ్ళీ ఎన్నికలలో పోవడమో జరిగింది. వీరి మంత్రిపదవుల పరిమితి.

పూర్తిగా ఒక మంత్రి మండలిపదవీ పరిమితికాలం, అంటే అయిదేళ్ళు, ఏ ఒక్క ఆంధ్రుడూ కేబినెట్ మంత్రిగా వుండకపోవడంవల్ల, ఆంధ్రప్రదేశ్ అభి వృద్ధికి పథకాలను రూపొందించడానికీ, వాటిని అమలు జరపడానికీ పట్టు బట్టే మనిషి కాని, ఆంధ్రప్రదేశ్ అవసరాలను కేబినెట్‌లో చర్చకు తెచ్చే మనిషికాని లేకపోవడం జరిగింది. అందువల్లనే, ఆంధ్రప్రదేశ్‌కు అభివృద్ధి పథకాలవిషయంలోగాని, పరి శ్రమల స్థాపన విషయంలోగాని, ఇప్పటివరకూ న్యాయం జరుగలేదు.

ఇప్పటివరకూ ఏర్పడిన మంత్రి మండలులలో, ఒక్క 1967 మంత్రి మండలిలో తప్ప తక్కిన వాటిలో తమిళనాడుకూ, మహారాష్ట్రకూ మంచి ప్రాతినిధ్యంవుంది. అంచేత, ఆ రెండురాష్ట్రాల అభివృద్ధికి విశేషమైన కృషి జరిగింది.

ఇప్పుడు, 1971 మార్చి ఎన్నికల అనంతరం, ఏర్పడిన మంత్రి మండలిలో కూడా ఆంధ్రప్రదేశ్‌కు, జనాభా దృష్టిలో చూసినా, వైశాల్యం దృష్టిలో చూసినా, రాష్ట్రంలో అమలు జరపవలసివున్న అభివృద్ధి పథకాలను పరిగణించినా, తగిన ప్రాతినిధ్యం ఆంధ్రప్రదేశ్‌కు ఇవ్వబడలేదనే చెప్పాలి.

మార్చిలో ఏర్పడిన మంత్రిమండలిని విస్తరించడం త్వరలోనే జరుగుతుందనే మాట పదే పదే వినబడుతున్నది. దానితోపాటు, ఫలానా వ్యక్తులు మంత్రులుగా నియమింప బడుతారనే ఊహాగానాలు కూడా చెవిని పడుతున్నాయి. కాని, ఈ ఫలానా, ఫలానా వ్యక్తుల పేర్లలో ఆంధ్రుల పేర్లు ఏవీ వినపడటం లేదు. ఈ ఊహలే నిజమైతే, ఆంధ్రప్రదేశ్‌కు తీరని అన్యాయం జరుగుతుందన్నమాట. మహారాష్ట్రనుంచి ఇద్దరు కేబినెట్ మంత్రులు ఉన్నప్పుడు, తమిళనాడు నుంచి ఇంకొకరిని కేబినెట్ మంత్రిగా నియమించబోతున్నప్పుడు, ఆంధ్రప్రదేశ్‌నుంచి అధమం ఇద్దరినైనా కేబినెట్ మంత్రులుగా నియమించడం న్యాయం. ఆంధ్రప్రదేశ్‌కు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ తీరని అవసరాలు ఎన్నో వున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో కొత్త పరిశ్రమలను స్థాపించవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ విషయాలను, కేబినెట్‌లో ప్రస్తావించి, ఆంధ్రప్రదేశ్ విషయమై శ్రద్ధ తీసుకొనేటట్టు చేయగల, సమర్థులైన ఇద్దరినైనా, కేబినెట్ మంత్రులుగా ప్రధానమంత్రి నియమించాలి.

చిన్న చిన్న రాష్ట్రాలలో, పార్టీలను మార్చుకుంటున్న శాసనసభ్యులను తృప్తి పరచడానికి విపరీత సంఖ్యలో మంత్రులను నియమించడం, జరుగుతున్నది. అలాటప్పుడు, 380 మంది సభ్యులతో, మూడింట రెండువంతుల బలంతో గెలిచిన తన పార్టీనుంచి ఒక పాతికమందిని కేబినెట్ మంత్రులుగా నియమిస్తే శ్రీమతి ఇందిరా గాంధిని విమర్శించే వారెవరూ వుండరు. కేబినెట్ మంత్రుల సంఖ్యను పెంచినప్పుడు, స్టేట్ మంత్రులను, డిప్యూటి మంత్రులను ఎక్కువగా నియమించ నక్కరలేదు. ఒక కేబినెట్ మంత్రికి తోడు, ఇద్దరూ, ముగ్గురూ స్టేట్ మంత్రులూ వుండవలసిన అవసరం ఏమీలేదు. ఈ చిన్న మంత్రులవల్ల జరిగే పనికూడా ఏమీలేదు; వారి పరివారాలకూ, సంచారాలకూ డబ్బు ఖర్చు తప్ప. కష్టపడి, సమర్థతతో పనిచేసే కేబినెట్ మంత్రులు పాతికమంది వుంటే, చిన్నమంత్రుల సంఖ్యను సగానికి సగం కూడా తగ్గించవచ్చును.

త్వరలోనే, శ్రీమతి ఇందిరాగాంధి చెయ్యబోయే మంత్రిమండలి విస్తరణ, ఎంత ఎక్కువగా జరిగినా, ఎంత తక్కువగా జరిగినా ఆంధ్రప్రదేశ్‌కు న్యాయం జరిగేటట్లూ, కేంద్ర కేబినెట్‌లో తగిన ప్రాతినిధ్యం ఉండేటట్టూ జరగాలని ఆంధ్రుల కోరిక.

---

# శతమానం భవతి

"నన్ను మళ్ళీ తిట్టేడు. ఇంక వాడి దగ్గర పని చెయ్యలేను!"

"తొందర పడబోక. ఏమని తిట్టాడూ?"

"వెధవా అని తిట్టేడు. ముండా అని తిట్టేడు. ఇంకా ఇంతకన్నా ఏమని తిట్టాలీ?"

"ఇంతేనా తిడత? ఫరవాలేదు."

"..............................."

"ఫరవాలేదులే! అలా చూడకు."

"అయితే యివన్నీ దులిపేసుకుని వాడిదగ్గరే పని చెయ్యమంటారా?"

"నిక్షేపంలాగ! తిట్టేడన్నమాటేగాని వాడికీ నీకూ మధ్య అంతకన్న ఏం జరిగిందీ, వెళ్ళు: మామూలుగా పనికి వెళ్ళు...."

"అలా వున్నావేం?"

"మళ్ళీ చెడతిట్టాడు పట్టుకుని."

"ఈవేళ ఏమని తిట్టాడూ?"

"గాడిదన్నాడు, చేటపెయ్యన్నాడు, గుడ్లగూబలా చూస్తానన్నాడు."

"ఇన్నిమాటలూ అన్నాడా?" "ఇంతకన్న ఎక్కువే అన్నాడు."

"అన్నాడు గదా! అయితే ఫరవాలేదు." "...................."

"ఫరవాలేదోయి. మామూలుగా పనికి వెళ్ళిపో రేపు."

"ఇన్ని తిట్లూ తినా?"

"వెళ్ళు. మరేం ఫరవాలేదు. వెళ్లు. అలా చూడక."

"ఇంక వాడివద్ద పనిచేస్తే...." "ఏం. ఏం?"

"పడతిట్టాడు పట్టుకుని."

"ఈవేళానా?" రోజూకన్న ఎక్కువగా!"

"రోజూకన్న ఎక్కువగా తిట్టాడా?"

"ఓ! వీపు వాచిపోయేట్టు తిట్టేడు."

"అయితే ఇంక ఫరవాలేదు."

"ఏమిటి ఫరవాలేదు, మీ మొహం?"

"నీకే తెలుస్తుందిలే—"

"ఇంకా వాడిదగ్గరకు పనికి వెళ్ళమంటారా?"

"ఇదే అసలు నువ్వు వాడిదగ్గర నుంచి వృద్ధిలోకి రావలసినవిషయం—"

"..........................."

"ఇంకొంచం నేర్పుగా ప్రవర్తించావంటే—"

"ఛా! ఇంక నేర్పూలేదు, ఓర్పూలేదు. ఈవేళతో రాజీనామా...."

"వొద్దు వొద్దు. చెడిపోతావు. వృద్ధిలోకి వస్తూన్నవాడివి...."

యం. యస్. మూర్తి

"ఏమిటి వృద్ధీ—తిట్లూ, శాపనార్థాలూనా?"

"వాటి అర్థం నీకు తెలీదు. కొద్ది కాలంలోనే తెలుస్తుందిలే రేపు మాత్రం పనికి వెళ్ళాలి సుమా! మానేశావు గనక, నా సలహా విని ఎవడూ పాడుకాలేదు—"

"ఈవేళటివరకూ మీ సలహా పాటించాను. ఇంక నన్ను మొహమాటి పెట్టకండి—"

"ఏం? ఈవేళ ఏం జరిగిందేమిటి?"

"నూరు తిట్లు తిట్టేడు. పేలేపి?"

"లెక్కపెట్టేవా? సరిగ్గా నూరూ తిట్టాడా?"

తిట్టేడు—"

"ఇక నిన్ను విడవడు. నీకింక నిరుద్యోగసమస్య వదలిపోయింది—"

"మీమాటలు నాకు అర్థం కావడం లేదు"

"ఇంక నువ్వు వాడిదగ్గర స్థిరపడ్డావన్నమాట—"

"మీకు మతిపోయిందా? అలా పట్టుకు తిడుతూంటే వాడు నన్ను . ."

నీకింకా తెలిసి రావడంలేదు వాడి తత్వం. నువ్వు చవటవెయ్యమ్మవయితే మొట్టమొదటరోజునే ఒక్కతిట్టు తిట్టకుండానే అవతలకు పంపించేసి వుండేవాడు—"

"మరి ఈ తిట్లూ?"

"నూరువరకూ భరించగలిగే సమర్థత నీలో వుందో లేదో అతడు పరీక్షించేడు"

"ఏమి వింత మాటలు!"

"నూరువరకు భరించావు—పరీక్ష ప్యాసయ్యావు—ఇంక నిన్ను విడవడు!"




(గత సంచిక తరువాయి)

“ఫో వే వాజా! ఈ సంగతంతా నేను తెలుసుకోలేదనుకున్నావు కాబోలు. ఇలాంటి టక్కులూ గిక్కులూ మన దగ్గర సాగవ్!” అన్నాడు, తలాడిస్తూ.

ఈ ప్రసంగం అంతా అయి, బయటికి రాగానే గుమాస్తా రసిక చక్రవర్తి ఎదురు వచ్చాడు. అతడితో గోకుల్ ఇలా అన్నాడు :

"ఏమండోయ్, ఒక కొత్త సంగతి విన్నారో లేదో మీరు! ఇంతకాలంనుంచీ ఇంత చేసుకువస్తున్నా కదా, నేనే ఇవ్వాళ ఆ అమ్మదృష్టిలో కంటకమైపోయాను. ఆవిడ రెండు కళ్ళకూ నేను విషమైపోయాను. నాతో ఆవిడగారు మాటాడటం మానుకుంది. ఒకవేళ యాధాలాపంగా ఎదురుపడితేకూడా ఆవిడ నన్ను చూసి మొహం తిప్పేసుకుంటూంది సుమండీ!"

చక్రవర్తి నిజమైన ఆశ్చర్యంతో—"కాదు, కాదు, పెదబాబూ!—ఇలాంటి మాటలాడుతున్నారేమిటి తమరు? ఆమె ఎన్నడూ అలా చేసే మనిషికాదు." అన్నాడు.

"అలా చెయ్యదంటారా? ఉండండి, మీకు వినిపిస్తాను."

అక్కడే వున్న దాసీదాన్ని పిలిచి, "ఒసే, ఇలారా! ఒక్కమాట వినిపో!" అన్నాడు గోకుల్.

ఆమె చిన్నప్పట్నుంచీ వీళ్ళింటోనే పనిపాటులు చేస్తూంది. ఏదో పనిమీద పోతూ వున్న ఆ దాసీది గోకుల్ పిలుపు విని దగ్గరకొచ్చింది. ఆమె రాగానే అతడు చక్రవర్తి కేసి చూసి, "ఇదుగో, కావాలంటే దీన్నడిగి చూడండి. ఇంకా ఏమే, విన్నే?— అమ్మ నాతో మాటాడుతూ వుండగా చూశావా? నే నెదటపడితే ఆవిడ నన్నుచూసి గిరుక్కున మొహం తిప్పేసుకోవటం లేదూ?" అనడిగాడు.

దానికేం తెలుసు పాపం, ఈ గొడవలన్నీ? ఏమీ ఎరగదు. ఒక్కనిమిషం మొద్దల్లే వింటుని చూస్తూ ఊరుకుంది. చివరికి యజమానిమాట నరే అన్నట్టు తల వూపి, తన పనిమీద తను వెళ్ళిపోయింది.

"తెలిసిందిగా ఇప్పుడు నిజమో అబద్ధమో?" అని ప్రశ్నిస్తూ చక్రవర్తిని చూసి కన్నెగరేసి గోకుల్ ఇంకెక్కడికో వెళ్ళిపోయాడు.

ఆ రోజున ఊళ్ళో వున్న బంధువులు ఎంతోమంది భవానినీ గోకుల్‌నీ చూచి పోదామని వచ్చారు. అంతమందితోనూ గోకుల్ "నా సవితల్లి నాతో సరిగా ఉండటం లేదు. ఎంతకయినా నే నామెకు సవితికొడుకునే కదా, పరాయివాణ్ణయిపోయాను! అంతకంటె ఎక్కువేమీ కాను. అందుకనే, నాన్నగారు పోకముందే నేనావిడ కళ్ళకి విషమైపోయాను." ఈ మాటలే అస్తమానం జపంచేస్తూ తిరగ నారంభించాడు.

సాయంకాలమైంది.

గోకుల్ భవాని గదిలోకి వెళ్ళి, ఆమెను చూసి, ఇలా అన్నాడు:—

బర్ద్వాన్‌కు మనుషుల్నికట్టి, అక్కడ్నించి చిన్నత్తనూ వాళ్ళనీ పిలిపించటానికి నాకేమంత పట్టలేదు. వాళ్ళంతట వాళ్ళే వస్తే రానీ, లేకపోతే మానుకోనీ."

భవాని మొహం పైకెత్తి చూసింది. మృదుస్వరంతో—"అబ్బాయీ!—అలా ఊరుకోవడం ఏమంత మంచిది కాదుసుమా!'' అన్నది.

మంచో చెడో నాకేం తెలియదు తల్లీ!—రెండు చేతులతోనూ విరజిమ్మటానికి నాదగ్గిరేం మూటా ముల్లే పెట్టుక్కూచోలేదు. ఈ విషయంలో నువ్వు నన్ను బలవంత పెట్టి బాధించకు. ముందే చెబుతున్నా!''

బర్ద్వాన్‌నించి ఆడబిడ్డనీ వాళ్ళనీ పిలిపించాలని విన్ననే భవాని గోకుల్‌తో చెప్పింది, అయితే ఇప్పుడు మరేం చెప్పలేక, తన పనేదో తను చూసుకుంటూ ఊరుకుంది. ఆవిడ ఊరుకున్నా గోకుల్ ఊరికే ఉండక, ఆమె ముందు అటు యిటు పచార్లు చేస్తూ ఇలా ప్రారంభించాడు—''నువ్వయితే వాళ్ళనీ వీళ్ళనీ తీసుకురమ్మని ఆజ్ఞా పించావుగాని, అంతమాత్రాన నేను పిలిపించలేనమ్మా!—తలకి మించిన అప్పులు చేసి నే మునిగిపోలేను" అన్నాడు.

ఇంకిప్పుడు భవాని అతడికి వినీ వినిపించేట్టు—"సరే నాయనా!—నీకెలా మంచి దనితోస్తే అలా చెయ్యి. అది నీకు మించిన పని అనితోస్తే, వాళ్ళకోసం పంపనే వద్దు, పంపకుంటే మానిరిలే!" అన్నది,

''అదేమిటి అలా అంటావ్? నాకు తోచటమేమిటమ్మా! ఇప్పుడిప్పుడే నా కన్ని విషయాలూ తెలిసొస్తున్నాయిలే. నాకు అమ్మలేదు. 'నా' అనే వాళ్ళెవరూ లేరు. నేను బతికుంటే యేం, ఛస్తే యేం, ఎవడిక్కావాలి? ఇహ ఇప్పుడు నా సంగతి నేనే చూసుకోవాలి, నన్ను నేనే సంబాళించుకోవాలి. ఎవళ్ళకెంత యివ్వాలో డబ్బూ, దస్కం ఆ లెక్కంతా నేనే సరి చూసుకోవాలి. ఎందుకనీ?—నన్ను కన్న అమ్మ నాకు లేదుగా?—'' ఇలా అనుకుంటూ గోకుల్ అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

అకస్మాత్తుగా గోకుల్‌కి డబ్బుమీద ఇంత ఆసక్తి పుట్టడం చూసి, భవాని పైకి చెప్పడు కాకుండా ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకుంది.

కాని, కొంతదూరం దాకా వెళ్లిన గోకుల్ మళ్ళీ ఆ మట్టునే తిరిగి వచ్చి, ఇలా అన్నాడు—''అమ్మా!—నాకేం తెలియదనుకున్నావు కాబోలు! నామీద కోపంచేతనే నువ్విల్లా అన్నావు? మరివాళ్ళే—ఎవరినైనా పంపించి, మీ అత్తనీ వాళ్ళనీ ...ంచమని విన్న నీ అంతట నువ్వేగా చెప్పావు?! ఇవాళేమో నీకేదితోస్తే అది ...య్యమంటున్నావే? మించిన పని అయితే మానేసెయ్యమనే చెబుతున్నావే!

'నాకు తండ్రీలేడు. తమ్ముడూ లేడు. అందుకనే నువ్వు నన్నింత ఇరుకున పెడుతున్నావు. వీడికి సాయపడటానికి ఎవడొస్తాడో చూదామనే కదా నువ్విలా నన్ను వెలి వేసినట్టు చూస్తున్నావు ? ఇదంతా చూసి, లోకులేమనుకుంటా రమ్మా !—విశ్రాంగానే గోకుల్ తల్లి మాట వినటంలేదు అనుకోటోరూ ?'

కాస్తయినా అర్థం పర్థం లేకుండా గోకుల్ ఇలా నిందాస్పదంగా మాటాడేసరికల్లా భవాని వెర్రిదానిలాగా కాస్సేపు అతడి ముఖంకేసి చూసి, ఇలా అన్నది—"నాయనా, గోకుల్ !—మీకు సంబంధించిన విషయాలు వేటిల్లోనూ నాకు జోక్యంలేదు. నేను విన్నేమీ అన్లేదు తండ్రీ !—"

అకస్మాత్తుగా గోకుల్ కళ్ళు రెండూ నీళ్ళతో నిండిపోయాయి.

"అమ్మా !—నీమాట నేనేది వినలేదని చెప్పూ. ఇప్పుడు నువ్విలా మాటాడు తున్నావ్ ?—కాని, నువ్విల్లా ఉండడం ఏం బాగాలేదమ్మా ! మనసులో మాట చెప్పేస్తున్నాను—వినోద్ ఏమో సిగ్గుచేతా అభిమానం చేతా ఇల్లూ వాకిలీ వదిలేశాడు. నాకూ ఏదో ఒకదారి కనిపించకపోదు. "నేనూ ఎక్కడైనా వెళ్ళిపోతాను. ఇహ ఈ సంపత్తి అంతా చూసుకుంటూ, నువ్వీ మేడలో హాయిగా విశ్రాంతిగా ఉండు !" అంటూ, గోకుల్ కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ గబగబా బయటికి వెళ్ళిపోయాడు.

## 7

గోకుల్ పెద్దకూతురు హేమాంగిని. ఆ అమ్మాయి రోజూ నాయనమ్మ భవానిదగ్గ పడుకుంటూ వుంటుంది. హేమ తెల్లారగట్టేలేచి, "అమ్మా ! బాబాయొచ్చాడే, బాబాయ్ !" అని కేకలెట్టుకుంటూ వచ్చింది.

పక్కగదిలోనే పడుకుని వున్న గోకుల్, నిద్రపోతున్నవాడల్లా చటుక్కున లేచి పక్కమీద కూర్చున్నాడు. "ఏమిటే, ఎప్పుడొచ్చారే నీ బాబాయ్ ?" అని తన భార్య మనోరమ, సంతోషంలేని ఆశ్చర్యంతో కూతుర్ని అడగటం అతడికి వినిపించింది.

"నడిరాత్రిల్లో వచ్చారమ్మా" అన్నది హేమ.

"ఇప్పుడేం చేస్తున్నాడే ?" అనడిగింది, తల్లి.

"ఇంకా లేవలేదు. ఆ గదిలో ఇంకా నిద్దరోతూనే వున్నాడు."

మరేమీ అడగలేదు మనోరమ. ఆమె వెళ్ళగానే గోకుల్ తలుపు సందులో మెడ చాపి, చెయ్యి ఆడిస్తూ కూతుర్ని దగ్గరికి పిలిచాడు. "వాడితో మీ నాయన ఏం చెప్పిందే ?" అని ప్రశ్నించాడు.



హేమ తల తిప్పుతూ, "నాకేం తెలియదు నాన్నా!" అని అన్నది.

తెలియదంటే ఊరుకోలేదు తండ్రి. "చాలా చాలా కోప్పడే వుంటుంది. అవునా? ఏం?" అని మళ్ళీ అడిగాడు.

హేమ రెండుమూడుసార్లు తలవూపింది గాని, దాన్నిబట్టి ఆమె భావం ఏమిటో తెలుసుకోవటానికి అవకాశం ఏమీలేదు. ఏమనుకున్నదో యేమో గాని, "ఉఁ" అన్నది ఒక్కమాటు.

గోకుల్‌కి కలవరం పుట్టింది. హేమను చెయ్యిపట్టి లోపలికి బర్రుమని లాక్కుపోయాడు. "ఆఁ—అమ్మాయీ! మీ నాయనమ్మ ఏమిటి చెప్పిందో నాకు కాస్త చెప్పవే తల్లీ!—" అంటూ మెల్లిగా లాలించి, బుజ్జగించి మళ్ళీ అడిగాడు.

హేమ చిక్కులో పడింది. ఏమంటే వాళ్ళ బాబయ్య వచ్చినప్పుడు అది నిదరోతోంది. అందుకని దానికేం తెలియదు. "నాకేం తెలియదు నాన్నా!—" అన్నది.

గోకుల్ నమ్మలేదు. పైగా చిరాకుపడ్డాడు. "ఇప్పుడే కాదుటే 'ఉ' అన్నావ్ నువ్వు—తెలుసునన్నట్టుగా? ఒహో, నాయనమ్మ చెప్పొద్దు అందా యేం? నాతో చెప్పమ్మా, నే నెవళ్ళకీ చెప్పన్లే!—" అంటూ పిల్లని పొంగవేశాడు.

తండ్రి చెప్పిన యుక్తిమాటల్లో హేమ చిక్కుపడి, ఎటూ చెప్పలేక, గుడ్లప్పగించి వింటుండిపోయింది. అప్పుడు గోకుల్ కూతురి తలా ముఖమూ నిమురుతూ ఉత్సాహం కలిగించాడు. "కొంచెం చెప్పమ్మా!—ఏం మాటలు జరిగాయో కాస్తంత

నాతో చెప్పవే తల్లీ!—"నువ్వు ఈ యింట్లోంచి ఫో. వెళ్ళిపో" అందా. బాబా యివి?—అఁ—అల్లా అనే వుంటుంది. నాకు తెలుసు కదూ. ఇదుగో, ఈ రెండు రూపాయిలు తీసుకో అమ్మా!—ఎంచక్కా నీక్కావల్సిన బొమ్మలు కొనుక్కో!" అంటూ, దిండు కిందవించి రెండు రూపాయిలు తీసి కూతురిచేతుల్లో పెట్టాడు గోకుల్.

హేమ తెల్లబోయి, సంతోషంకొద్దీ "ఊఁ" అనేసింది.

"ఊఁ—తరవాత?" అంటూ మళ్ళీ కవ్వించి అడిగాడు.

హేమకి ఏడుపు వచ్చింది. "తరవాత . తరవాత....ఏమయిందో, నాకేం తెలీదు. నాన్నా!"—

గోకుల్ మళ్ళా కూతురి తలా, మొహం నిమిరి, "తెలియదంటావేం? తెలుసు. నీకు తెలుసు. నీకు తెలియకుండా ఎలా వుంటుంది? పోనీగానీ, మీ బాబయ్యేమని చెప్పాడే, అమ్మాయ్!" అనడిగాడు.

"ఏమీ చెప్పలే," అంది హేమ.

గోకుల్ నమ్మలేదు ఈమాటు కోప్పడుతూ ఇలా అడిగాడు—"ఛా, అబద్ధాలాడతావా? ఏమీ చెప్ప లేదంటావా?" అని గద్దించాడు.

తండ్రి కోప్పడేసరికి, హేమకు ఏడుపొచ్చింది, "నాకేం తెలీదు, నాన్నా!" అనేసింది,

"తెలీదూ? ఫో, అవతలికి ఫో! బండముండా!" అని ఉరుముతూ, దాని చెంప మీద ఛెళేల్ మనిపించాడు. ఒఖ్ఖమాటు, "ఫో—ఇక్కణ్నించి దూరంగా ఫో!—" అంటూ కసిరి, తోసేటప్పటికి, హేమ ఏడ్చుకుంటూ వెళ్ళిపోయింది.

అప్పుడు గోకుల్ గబగబా మేడదిగి, సవిత్తల్లి ఉన్న గదిలోకి వెళ్ళి, ఇలా అన్నాడు .

"భేష్!—చాలా మంచిపని చేశావ్! తమ్ముడింకా గుమ్మంలో అడుగు పెట్టక ముందే, వాడికన్నీ మారిపోశావ్. నామీద వాడి మతి విరిగిపోయేట్టు చేశావ్!—ఇంతేకద, నువు చేయగలిగింది?—నాకంతా తెలుసులే, అన్నీ విన్నాన్లే. అయితే ఇహ నీ కొడుకుని జాగ్రత్తపెట్టుకో! వాడు నా ఎదటికి రాకుండా చేసుకో, ఇప్పుడే ముందుగానే చెబుతున్నా." అనేసి అంగలేసుకుంటూ ఉంగారుతో, వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

* * *

భవాని కిదేం అర్థం కాలే. చూస్తూ నిలబడ్డది.



ఇంటో—ముందరా, వెనకా, లోపలా అందరూ వాళ్ళవాళ్ళ పనులు చేసుకు పోతున్నారు. గోకుల్‌కూడా అటు డిటూ, ఇటు దటూ ఏదో చేస్తూవచ్చాడు. కాస్సేపు మళ్ళీ దాసీదాన్ని దగ్గి కి పిలిచి.

"ఏమే, తమ్ముడొచ్చాడు. ఇంటికి తెలుసా?" అనడిగాడు.

"అవును బాబూ!—చిన్నబాబు వచ్చేసరికి రాత్తిరి చాలా పొద్దోయింది!" అన్నది.

"ఆ సంగతి నాకూ తెలుసు లేవే. వాడొచ్చిన తరవాత తల్లీకొడుకుల మధ్య ఏం మంత్రాంగం జరిగిందీ అని? నామీద అమ్మ లేనిపోని నేరాలన్నీ చెప్పిందా? ఇంటోంచి పొమ్మన్నాడనీ గిమ్మన్నాడనీ చెప్పి వాడికి పురెక్కించిందా ఏమైనా? ఎక్కించే వుంటుంది. ఇంటోంచి వెళ్ళగొట్టడం సంగతి?—" అని రొక్కటించి అడిగాడు.

మాట మధ్యలోనే అడ్డొచ్చింది దాసీది. "రామ, రామ! ఎంతమాట!—అప్పటి కింకా అమ్మగారు లేవనేలేదు, నాయనా!—గొల్లాడు చినబాబు తోలుపెట్టె లోపలికి తెచ్చాడు నేనేమో గదితెరిచి దీపం వెలిగించా నంతే. చినబాబు గదిలో అడుగు పెట్టాడు మళ్ళీ ఇంతవరకు బయటికి రానేలేదు...." అంది.

అందుకు గోకుల్ దాని మాటలు నమ్మక—"నా దగ్గరెందుకే దాస్తావ్?—అన్నీ విన్నాన్లే నేను!" అన్నాడు.

అతడి మాటలకు దాసీది తుళ్ళిపడి విస్తుపోయింది. "అలా అనకండి బాబయ్యా!—

ఒట్టేసుకు మరీ చెబుతున్నా. వినండి!—చినబాబు వచ్చినదగ్గర్నించీ ఆయన పనులన్నీ నేనేగా చూసేది? "అమ్మని పిలవనా బాబూ?" అనడిగా.

"పిలవొద్దే, నాకేం పనిలేదిప్పుడు" అన్నారు.

"దీపంమాత్రం వెలిగించా, ఇహ ఆయన వెళ్ళిపోయి పడుకున్నారు. అవురా!—ఆ కళ్ళూ, ముఖమూ పీక్కుపోయి, ఎంత నల్లబడిపోయాడో, బిడ్డ!—" అన్నది.

గోకుల్ కళ్ళలో నీళ్ళు నిండాయి "ఏమిటే అంటున్నావ్, ముసిలీ!—వాడు చిక్కిపోయాడంటేనూ, నల్లబడిపోయాడంటేనూ ఆశ్చర్యమేముందీ? చిక్కిపోడా?—నాన్న చచ్చాడాయె, అభాగ్యుడు గాకపోతే, పీడొచ్చి కడసారిచూపైనా చూసుకోలేక పోయాడు పైగా, ఆస్తిలో ఒకపైసా అయినా వాడికి ముట్టలేదాయె. వాడికి కావాల్సిం దేమిటో తప్ప, మరోటి వాడికి పట్టదు. తండ్రి అంటే వాడెంత ఇదవుతాడో మీ అందరికీ తెలుసుగా? ఏమే ముసిలీ!—నా మాటలు నిజమేనంటావా, కాదా?" అంటూండగానే గోకుల్ కళ్ళనుంచి అశ్రుధారలు ప్రవహించాయి

అది ఈ యింటో చాలా కాలంగా వుంటున్న దాసీ. గోకుల్ కళ్ళనీళ్ళు చూసేటప్పటి కల్లా దానికీ కళ్ళవెంబడి నీళ్ళు వచ్చాయి.

"అవును నాయనా!—చినబాబు సంగతి నువ్వు నాకు చెప్పాలా? తండ్రి అంటే ప్రాణం విడుస్తాడు. అయితే ఏం? పాపం!—పెద్దపెద్ద చదువులు చదవడంతో బుర్ర వేడెక్కిపోయింది. అందుకనే ..." అంటూ గట్టిగా అరిచింది.

ఇప్పుడు గోకుల్ దాసీదాని మాట దొరకపుచ్చుకుని, "అందుకనే . ఆఁ—అదే సంగతి వాడి మెదడు వేడెక్కిపోదూ?—వాడు చదివిన చదువేం తక్కువదా!" అనర్చ గ్రాడ్యుయేటు వాడు. పోనీగానీ—యిక్కడ హూగ్లీలో, చామడాలో, బాలూ గంజ్‌లో ఎక్కడైనా సరే, నా తమ్ముడు చదివినంత చదువు ఎవరికైనా వుంటే, ఒక్కణ్ణి చూపించు, చూదాం

స్వయంగా తెల్లదొర గవర్నరే వొచ్చేసి, నా తమ్ముణ్ణి చెయ్యిచ్చుకు తీసుకు పోయి, కుర్చీలో కూర్చో బెట్టుకుంటాడు. తమ్ముడంటే అల్లాటప్పకింద కట్టకూ, వాడేం లాకాయ్ లూకాయ్ మనిషి కాడు.

ఇదుగో చూడూ—నువు దాసీవే కావచ్చు. కలకత్తా వెళ్ళి పెద్దమనుష లెవరితో నయినా, 'నేను వినోద్ బాబుగారి యింటి దాసీదాన్ని' అని చెప్పావంటే, యిహ చూసుకో— వాళ్ళు నిన్ను అందలంమీద కూర్చోబెడతారు, వెయ్యిమంది నీ చుట్టూ చేరతారు, వెయ్యి కబుర్లడుగుతారు, ఎంత మర్యాద చేస్తారని?—

అయితే ఎందుకూ—పెరటిచెట్టు మందుకిరాదుట. వాడి విలువా మర్యాదా



" మీరు డ్రై వోర్సు వొప్పుకొంటారా ? '   " ఉహూఁ నేను అసలు పెళ్ళే వొప్పుకోను !"

తెలిసున్న వెధవాయ ఒక్కడయినా వున్నాడూ, యిక్కడ? ఏమే, వాడి ముఖం అంతా, ఎండిపోయిందా? అహాఁ—ఏం? ఏం?—" అంటూ అడిగాడు, ఆత్రంగా.

తల ఊపి దాసీది—"ఆయన్ని చూస్తే దుఃఖం ఆగటం లేదు, పెదబాబూ!" అన్నది.

గోకుల్‌కి కళ్ళనీళ్ళు కాలవలు కట్టాయి.

పై తువాలుతో కన్నీళ్లు తుడుచుకున్నాడు

"నువ్వేగదా వాణ్ణి చిన్నప్పటినుంచీ ఎత్తుకుని, పెంచి పెద్దవాణ్ణి చేశావ్. వాడి సంగతి నీ కంటే ఎవరి కెక్కువ తెలుస్తుంది, ముసిలీ!—ఆటపాటల్లోనూ, చదువు సంధ్యల్లోనూ వాడికాలం చాలావరకు గడిచిపోయింది ఇలాంటి గొడవలూ ఉపద్రవాలు వాడెప్పుడైనా పడ్డాడా? వాడికేం తెలుస్తుంది, చెప్పూ.

"విల్లు రాసేసినంత మాత్రాన వాడికి ఆస్తి పంచిపెట్టక ఊరుకుంటానా? ఇది వాడి తండ్రి ఆస్తేకదా, చూస్తాగా, ఏ వెధవ అటకాయిస్తాడో!—వాడేం చేశాడని? దొంగ తనం చేశాడా, ఖూనీలు చేశాడా? ఇంతకీ వాడు చెయ్యగా చూసిందెవడు? అటువం టప్పుడు ఆస్తిలో వాడికి భాగం ఎందుకు లేదు, చెప్పూ. 'లా' ఉంది, కోర్టులున్నాయి. తమ్ముడు అలా దావా పడేశాడూ అంటే, నాన్న చెప్పినట్టుగా, వాడి సగంవాటా

వాడికి దమ్మిడీ టోలీలతో సహా లెక్కగట్టి ఇచ్చి తీరాల్సిందే. అప్పజెప్పే తీరాలి!—అవునా?—ఏమే, ముసిలీ!—విన్నావా?—"

అనేసరికి దాసీది "అవున్నాయనా!—యిచ్చేసెయ్యక తప్పుతుందా?" అంటూ, గోకుల్ ప్రసంగానికి ఊతం యిచ్చింది.

చెప్పలేని ఉత్సాహంతో గోకుల్ కళ్ళల్లోనూ ముఖంలోనూ ఒక విధమైన కొత్త వెలుగొచ్చింది. "ఆఁ—అల్లా అను. అల్లా అనాలిగాని. వాడి తల్లేమిటీ? నువ్వూ ఆడదానివే. ఆడది ఆడదానిలా ఉండిపోవాలి. అల్లా ఎందుకుండ లేదూ?—

"విల్లు రాయమని అసలు నువ్వెందుకు మంత్రాంగం చెయ్యాలీ? ఇదేమయినా యోగ్యమైన పనేనా? తల్లి చెయ్యాలిసిన పనేనా? ధర్మం వహించిందా? దేవుడు చూడ డనుకున్నావా? విర్దోషికి కష్టం కలిగిస్తే ఆ దేవుడిముందు నువ్వు సమాధానం చెప్పుకోవాలన్న సంగతి మరిచావా?—"

"ఇహ ఆస్తి అంటావా? మహా గొప్ప ఆస్తిలే! ఇవాళ గాకపోతే రేపయినా వాడు హైకోర్టు జడ్జీ అవుతాడు. అయితీరతాడు. దానికెవడూ అడ్డగించలేడుగా?—అప్పుడు వాడి ఆస్తి ఎక్కడ దాచిపెడతావ్?—ఏ పని చేసినా, ఈ సంగతులన్నీ బాగా ఆలోచించుకు మరీ చెయ్యాలి. చేశామనంగానే అయిపోయిందా?—యిప్పుడు వాడి భాగం వాడికి మర్యాదగా యివ్వకపోతే, అప్పుడు తల వంచుకు మరీ యివ్వాల్సి వస్తుంది. తెలిసిందా?" అన్నాడు గోకుల్.

ఈ మాటలు విని ముసిలిది పొంగిపోయింది. వినోదుణ్ణి చిన్నప్పట్నించీ పెంచి పెద్దవాణ్ణి చేసింది అదే. ఈ వీలునామాలు, గిలునామాలు ముసిలిదానికేం ఇష్టంలే. అందుకని యిలా అంది—"పరేకాని నాయనా!—మళ్ళీ చినబాబుని పిలిచి, "తమ్ముడూ! నీ ఆస్తి నువ్వు తీసుకో!" అని ఎందుకు చెప్పకూడదూ? నీ అంతట నువ్విలా చేసిననాడు, కాదూ కూడదూ అని అనటాని కెవళ్ళకి దమ్ములుంటాయి?" అన్నది.

ఇక్కడే అసలు గోకుల్‌కు భయం. కాస్సేపు చూస్తూ ఊరుకుని, మళ్ళీ ఇలా చెప్పాడు—"అయితే ముసిలీ!—లోకులంతా ఏమనుకుంటున్నారన్నావ్?" 'అలా అనటానికి వీల్లేదు, నీకేం హక్కులేదు" అని. కనుక నాన్న రాసిన విల్లు రద్దు చేయలేను.

"మీ అమ్మగారికి మేనమామ తమ్ముడొహాయన ఉన్నాడు. గొప్ప వ్యవహర్త. ఆ వీలునామా గనుక రద్దుచేస్తే నేను జైలుకిపోయి కూచోవలసి ఉంటుందని ఆవిడపేర ఉత్తరం రాశాట్ట. ఆఁ—అలా ఆయినా, మా అమ్మ యిష్టపడితేనూ,

మీ అమ్మ ఒప్పుకుంటేనూ, అంతా సవ్యంగా జరిగిపోతుంది. ఆస్తి పంచెయ్యటానికి నేను సిద్ధంగా ఉన్నాను."

దీనికేం సమాధానం చెప్పలేక పోయింది. ముసిలిది. అంచేత దాని పనిమీద అది పోయింది.

అక్కణ్నించి గోకుల్ వెనక్కి తిరిగాడు. హేమ ఆడుకోటానికి వెళ్ళబోతూంది. ఎంతో అప్యాయంగా కూతుర్ని బుజ్జగించి దగ్గరికి పిలిచాడు. "ఏమే అమ్మాయీ! మీ బాబాయి నిద్దరలేచాడా?" అనడిగాడు.

హేమ మెడ అష్టవంకరలు తిప్పి. "ఆఁ—లేచాడు!—లేస్తూనే తను కూచునే గది లోకి వెళ్ళాడు. ఎవళ్ళతోటీ మాటాడలేదు" అని చెప్పింది.

వీధిపక్కన ఒక గదివుంది. అదే వినోదుడి గది. అక్కడి కెవళ్ళూ వెళ్ళరు. అది ఏకాంతంగా ఉంటుంది. ఆ గదిలో కుర్చీలూ, బెంచీలూ విదేశీ పద్ధతిలో అమర్చి ఉంటాయి వినోద్‌ని కలుసుకోటానికీ, మాటాడ్డానికీ వచ్చే స్నేహితులూ వాళ్ళూ అక్కడికే వచ్చి కూచుంటూవుంటారు.

గోకుల్ మెల్లిగా అక్కడికి వెళ్ళి కిటికీలోంచి తొంగి చూశాడు. వినోద్ కుర్చీలో కూచోలేదు. కింద నేలమీదే కూర్చుని, మాటాడక అటుకేసి మొహం పెట్టుకుని చూస్తున్నాడు. అతడిప్పుడు కూర్చున్న వైఖరి చూసేటప్పటికి గోకుల్‌కి కళ్ళనీళ్ళు తిరిగాయి. తమ్ముడి మొహం చూదాంకదా అనే ఆశతో అయిదారు నిమిషాలసేపు అలాగే నించున్నాడు. చివరికి, కళ్ళు తుడుచుకుంటూ వెనక్కి తిరిగి వచ్చేశాడు.

రసిక్ చక్రవర్తి గోకుల్ దగ్గరికొచ్చి —"పెదబాబూ!—పండితులకూ, అధ్యాపకులకూ ఇవ్వవలసిన సంభావనల జాబితా ఇంకా అలాగే " అంటున్నాడు ఈ మాట చెవినిపడేసరికి గోకుల్‌కి హఠాత్తుగా అంధకారంలో వెలుగురేఖ కనిపించి నట్లయింది.

"ఏమయ్యా గుమాస్తాగారూ!—ఈ విషయాలన్నింటిలోనూ నన్నెందుకు లాగుతారూ? సాక్షాత్తూ సరస్వతీదేవి స్వయంగా వచ్చి కూచుందిప్పుడు ఎవరికెంత పాండిత్యముందో, ఎవరి దర్జానుబట్టి వారికెలాంటి సత్కారం చెయ్యాలో, ఇవన్నీ తమ్ముడి దగ్గర దాగవు. వాణ్ణే అడగండి వారికింత, వీరికింత అని లెక్కలు తేల్చేసుకోండి ఇహమీదట నేనీ విషయాలు వేటిల్లోనూ వేలెట్టను" అనేశాడు

"అల్లాగే లెండి. కాని, తమ్ముడుగారింకా నిద్దర్లేవలేదు" అన్నాడు, రసికచక్రవర్తి

ఈ మాటకు కాస్త మొహం చిట్లించాడు, గోకుల్. చిట్లించి నవ్వుతూ ఇలా అన్నాడు—"ఇంకా నిద్దర్లేవలేదూ? అరెరె!—వాడికేమయినా నిద్రాహారాలుంటే గదు!

ఏదీ, ఆ ముసలిదాన్ని పిలిచి అడగండి—అది కళ్ళారా స్వయంగా చూసింది. 'చిన బాబు మొహం చూస్తే నాకు దుఃఖం ఆగటంలేదు బాబయ్యా. చదివి చదివి ఆయన బంగారంలాంటి ఛాయంతా మసిబొగ్గులా మారిపోయిందీ' అంటూ అదే చెప్పింది."

ఇలా అని, వినోదుడి గదివంక వేలెట్టి చూపిస్తూ "కాస్త అక్కడికిపోయి చూడ వయ్యా. చల్లటి నేలమీద వాడొఖ్ఖడూ మాటాడక ఎలా కూర్చున్నాడో :—చూసిరా. ఫో!—వాణ్ణి చూస్తే ఎవడిగుండె బద్దలవదో, నువ్వే చెప్పూ " అన్నాడు.

అందుకు రసికచక్రవర్తి, వినీ విననట్టుగా. ఏదో దుఃఖ సూచకమయిన మాట అనేసి పద్దుకాగితాలు తీసుకుని పోబోతున్నాడు

వెళుతున్నవాడ్ని వెనక్కి పిలిచాడు, గోకుల్. "ఇదుగో, మాట !—" అంటూ. "మా కుటుంబం విషయాల్లో నీకు తెలియందేదీ లేదుగద. ఒక్కమాట అడుగుతా, చెప్పండీ! పెద్దవాణ్ణి నేనుండగా తమ్ముడికింత కష్టం, హైరాణ ఎందుకని ?—అసలే వాడు ఉరిపిలివాడు ఉపోషాలూ గిపోషాలూ కాస్తంతా ఓర్చగలడా ?—ఒకవేళ తప్పనిసరిగా ఓరుస్తాడే అనుకుందాం. జబ్బుపడిపోడూ, కుర్రకుంక !—కాబట్టి, నే చెప్పేమాట ఏమిటంటే—ఆహార విహారాల్లో అతగాడికి ఎలా అలవాటో, ఇప్పుడూ అలాగే జరగనివ్వండి. ఏం ? తెలిసిందా ?"—

ఇదేమంత ఇష్టంగా కనిపించలే, చక్రవర్తికి. నిరుత్సాహంతో, "ఒకవేళ ఆయన ఉండలేకపోతే మాత్రం " అనేసరికల్లా అతడు మాట పూర్తి చెయ్యకముందే గోకుల్ అడ్డుతగిలి ఇలా అన్నాడు :

"అరె, నువ్వే చెప్పవయ్యా. ఎలా వుండగలడో ? మనమంటే కాయకష్టం చేసే వాళ్ళం. ఒక్కటికాదు, ఇల్లాటి ఉపోషాలు ఎన్నయినా చెయ్యగలం. మన శరీరం వేరు. వాడి శరీరం అలాంటిదేం కాదు డిగ్రీలు ప్యాసయి, దేశానికంతటికీ శిరో భూషణం అనిపించుకుంటున్నవాడు. వాడి ఒంటికీ, మన ఒంటికీ ఎందుకని పోలిక తెస్తావ్ ?

"ఎవర్రా అక్కడ ? భుతువా !—గుబుక్కునపోయి భట్టాచార్యులుగార్ని వెంట పిలుచుకురా ! తద్దినం పెట్టేటప్పుడు ఎంత డబ్బయితే అంతా నేనే ఇచ్చేస్తాను. అంతే గాని ఇందుకోసమని అనవసరంగా నా తమ్ముణ్నిమాత్రం కష్టపెట్టి చంపేసుకోను. వాడికి పిండీ గిండీ పెట్టి ఇంటోంచి వెళ్ళగొట్టేస్తాననుకున్నారు కాబోలు, అలాంటిదేం జరగదు. ఎవరేమనుకోనీ, చూస్తా!—"

చక్రవర్తి తెల్లబోయాడు.

యజమాని మాటలు సమర్థిస్తూ ఊతంగా — "అవును బాబూ ! ఆఁ — మీరు




" చూడండి, మీ మంచికే చెప్పుతున్నాను. ఏమీ
భయపడక ఆ విల్లుమీద సంతకం పెట్టండి. "

చెప్పేది చాలా బాగుంది. అదే సరయిన పద్ధతి. కాని. పెదబాబూ!—లోకులేమో అనుకుంటారని...."

మళ్ళీ గోకుల్ గుమాస్తా మాటకి అడ్డుపడి ఇలా చెప్పాడు—"ఏమిటయ్యా. నీ మాటలూ నువ్వూను. లోకులేమో అనుకుంటారని నా తమ్ముణ్ణి నేను చంపేసు కుంటానుటయ్యా? ఆహా—ఏం బుద్ధి మీది? ఏం తెలివితేటలు! ఇప్పుడీ పద్దులూ గిద్దులూ వాడిదగ్గరికి పట్టుకెళ్ళి వాణ్ణి వేపుకు తినకు. వాడిక్కావలసినట్టుగా ఇష్టమైనవి ఏదో రెండు మెతుకులు నోట్లో వేసుకుని, ఖులాసాగా కూచోని, విశ్రాంతి తీసుకోనీ!—"

ఇలా నిష్కారణంగా చక్రవర్తి మీద కోప్పడి గోకుల్ అక్కణ్నుంచి వెళ్ళి పోయాడు.

## 8

వంట బ్రాహ్మడు టీ పట్టుకెళ్ళి వినోద్‌కిచ్చాడు. ఆ కప్పు తీసుకుని వినోద్ దూరంగా విసిరిపారేశాడు. ఆ టీ ఎంతో రహస్యంగా తయారు కాబడ్డది. విసిరి పారెయ్యటం వ్ల అది ఎవరి హృదయానికి పోయి కొట్టుకుంటుందో, అందువల్ల ఎంతటి గాయం గిలిందో ఆ సంగతంతా అంతర్యామికి తప్ప మరెవ్వరికీ తెలియదు!—

పగటిపూటల్లా వినోద్ అందరితోనూ అంతో యింతో మాటాడుతూనే వున్నాడు.

కాని, అన్నగారి ఛాయ కవిపి స్తేపట్టుకు తప్పుకుపోవటం మొదలెట్టారు. అయితే, ఆ ఛాయకూడా, అతడు తప్పుకుపోవటానికి, ఒక్క నిమిషంకంటె ఎక్కువ అవకాశం కలగనిచ్చేది కాదు. వినోద్ పెడమొహం పెట్టుకుని ఎటుకేపి వెళ్ళినా, గోకుల్‌కూడా పని తొందరమీద అటుకేసే రావలసి వచ్చేది. ఈ విధంగా పగలల్లా గడిచిపోయింది

రెండు జాములు దాటింది వినోదుడు తనగదిలో ఒక్కడే కూర్చునివున్నాడు.

అంతలో, ఒక కాగితం చేతపట్టుకుని గోకుల్ అక్కడికి వచ్చాడు అకారణం గానే ఒక చిన్న వెర్రినవ్వు నవ్వి, ఇలా అన్నాడు—

"కలకత్తాలో నువ్వు నీ బస వదిలిపెట్టేపి హజారీబాగ్ వెళ్ళావే—అప్పుడు నాన్న పోయాడు—ఆ సంగతంతా వినేవుంటావ్ నువ్వు—అదంతా ఒక తమాషా—అంత కంటే మరేంకాదు" అని, మళ్ళీ ఒకమాటు వెర్రినవ్వు నవ్వి, చెప్పాడు.

"నీదంతా అదో చిత్రమైన పద్ధతి. కాకపోతే ఫలానాచోట ఉన్నానని కాస్త కబురయినా చేశావు కాదు! సరే, దానికేంగాని, అదంతా తరవాత సావకాశంగా మాటాడుకోవచ్చు—ముందీ కార్యం ముగిసిపోనీ—దానపత్రం ఒకటి రాపిపారేస్తే, తెలిసిందా తమ్ముడూ!—కొన్ని రూపాయిలు మాత్రమే ఖర్చవుతుంది—కాని, తెలియలే?—ఇక్కడున్నవాళ్ళంతా అపాత్రపు వెధవలు, వర్ధి దగుల్బాజీలు—నీ వందర్నీ ఎరుగుదువుగా?—తెలిసిందా—తమ్ముడూ!—అదంతా జాంతానై —

"ఆస్తంతా మీ అన్నదమ్ములిద్దరిదీనని నాన్న చెప్పిపోయారు—ఈమాట ఒక్కటీ నీకు తెలిస్తే చాలు—ఆ సంగతలా ఉండనీ—దాన్నెవరూ అటకాయించలేరు—కాని, తమ్ముడూ!—నా మతేమీ సరిగ్గా ఉండటంలేదు—నీకూ తెలుసుగా?—ఇదుగో, ఈ ఇనప్పెట్టె తాళాలు తీసుకుని నీ దగ్గర అట్టెపెట్టుకో.

"అందరికీ పిలుపు వెళ్ళింది. పండితులూ, అవధాన్లూ ఎవరెవరో అప్పుడే వచ్చేశారు కూడా. ఎవరికెంత ఇవ్వాలో, ఎవరినెలా సత్కరించాలో, అంతా నువ్వు చూసుకోవాలి గాని, మరొహళ్ళవల్ల కాదు రెండునిమిషాలు కూచుని నీతో మాటాడ మంటే కూడా, నాకు తీరికలేకపోయె!" అని చెప్పి, ఆ కాగితమూ తాళంచెవీ ఎలాగో ఒకలాగా వినోదుడిముందర పెట్టేసి, అక్కడినించి వెనక్కి తిరిగి వచ్చేదామనుకున్నాడు.

తెల్లారి లేచింది మొదలూ, గోకుల్ ఈ మాటలే తనలో తను వల్లించుకుంటున్నాడు.

వినోదుడు ఆ కాగితమూ, తాళంచెవీ దూరంగా తోసేస్తూ—"మీరు నన్నీపనుల్లో ఇరికించకండి. నేను ఇవేవీ తాకనుకూడా తాకను" అన్నాడు.

ఇలా అనేసరికి, గోకుల్ ముఖంలో వెర్రినవ్వంతా రాయిలా గడ్డకట్టుకుపోయింది.

పొద్దిటివించీ అతడు కట్టుకుంటూ వచ్చిన గాలిమేడలన్నీ కూలిపోవటానికి సిద్ధమయ్యాయి

అప్పుడు గోకుల్ "ముట్టుకోవా. వాటివి? ఎందుకు ముట్టుకోవూ?" అనడిగాడు.

"ముట్టుకోవలసిన పనేముంది. నాకూ? నేను పరాయివాణ్ణి. ఈ రెణ్ణాళ్ళూ కాగానే నా దారిన నే పోతా. రెండురోజుల పనికోసమని మాత్రమే వచ్చినవాణ్ణి; అని చెప్పాడు.

"వెళ్ళిపోతావా?"

"వెళ్ళిపోక ఏముందీ? ఇదంతా డబ్బుతోకూడిన వ్యవహారం. నేనో గర్భదరిద్రుణ్ణి. దీనుణ్ణి. ఒకవేళ లెక్కాడొక్కా సరిగ్గా చెప్పలేకపోతే, నన్ను దొంగ కింద కట్టి, నన్ను మీరు పోలీసులకి అప్పగించి జైల్లోకూడా పెట్టించగలరు!" అన్నాడు.

ఈ మాటలకి సమాధానం చెప్పడానికి గోకుల్ పెదవులు వణికాయి. కాని, తరవాత ఇహ నతడు వంగి ఆ తాళాలూ కాగితమూ తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తండ్రి శ్రాద్ధం అట్టహాసంగా జరిపించి, ఎవరూ ఇంతిలా చెయ్యలేరని నలుగురి చేతా అనిపించుకుందామనీ, గొప్పపేరు సంపాయిద్దామనీ అనుకున్నాడు గోకుల్. అయితే ఇప్పుడు ఆ కోరిక అతడి మనస్సులోవించి ఎండమావుల్లాగా మాయమైపోయింది।

ఇవాళ పొద్దుట లగాయతు గోకుల్ ఉత్సాహానికీ, అరిచి కేకలేసి చేసే గడబిడకూ విధీ విరామం లేకుండా వుంది ఇప్పుడీ విధంగా అతడికి ఉత్సాహభంగం కాగానే, గోకుల్ హఠాత్తుగా గదిలోకి పోయి, పొద్దూక్కముందే మాటాడక పడుకున్నాడు.

ఇది చూసి అతడిభార్య మనోరమకు ఆశ్చర్యం కలిగింది.

"ఏమండీ, వంటో బాగాలేదా?" అనడిగింది.

"అబ్బే, యేంలేదు, బాగానేవుంది." అన్నాడు.

"అయితే మరిల్లా పడుకున్నారేం?"

గోకుల్ జవాబు చెప్పలేదు. అయేసరికి మళ్ళీ అడిగింది—"మరిదిగారికీ మీకూ ఏమైనా మాటామాటా జరిగిందా?"

"ఉహుఁ—"

ఇల్లా అనంగానే ఇహ మనోరమ అతడి దగ్గిరగా తిష్ఠవేసుక్కూచుని, మెల్లిగా ఇలా ప్రారంభించింది—"మరిదిగారు ఏమని చెప్పకు తిరుగుతున్నారో ఏమైనా మీ

చెవిని బడిందా?

మాట్లాడలే గోకుల్

ఇంకా దగ్గరికొచ్చింది మనోరమ

నాన్నగారికి జబ్బుచేసిన సంగతీ అదీ ఆయనకే గొడవా తెలియనే తెలియదుట. హజారిబాగ్ అంటారో మరేమంటారో తెలియదుట కాని మీ తమ్ముడెన్ని మాయలు నేర్చాడండీ!

మాయలా మాయలేమిటి ఇందులో?—ఏం నువ్వుమాత్రం నమ్మవూ?

నేనా?—నే నేమంత ఎర్రిదాన్ని కాను ఆయనగారు గంగలో మునిగి ఒట్టేసుకు చెప్పినా నేను నమ్మను " అన్నది మనోరమ

ఈమాట గోకుల్‌కి చాలా ఇదిగా తోచింది ఏమంటే—అసామాన్యుడు మహా మేధావి ఎం ఏ ఆనర్స్ గ్రాడ్యుయేటు కులదీపకుడు అయిన తన తమ్ముణ్ణిగురించి విరుద్ధంగా ఎవరేమన్నా అతడికి చర్రుమని కోపం వచ్చేస్తుంది

అటువంటిదిప్పుడు ఆ తమ్ముడికీ తనకూ జరిగిన సంభాషణవల్ల హృదయంలో చెప్పలేని బాధ కలిగింది దాంతో శరీరమంతా అదోలా అయిపోయింది అంచేతనే ఇప్పుడేమీ మాటాడక ఊరుకున్నాడు

గదిలో ఓ దీపమయితే వెలుగుతూంది గాని అది మిటమిటలాడుతూ వుంది. అంచేత ఆ మసగవెలుగులో మనోరమ భర్తముఖం చూసి అతడి మనోభావాన్ని కనిపెడదామనుకుంటే వీల్లేకపోయింది

చూడండీ మీరిప్పుడు చాలా జాగర్తగా వుండాలి ఈ సమయంలో ఎన్నెన్నో కుట్రలూ కుతంత్రాలూ పన్నాగాలూ బయల్దేరతాయి మీరుమాత్రం వాటివేటికీ చెవొగ్గవొద్దు సుమండీ మీరేపని చేసినా ముందుగా మా నాన్నగార్ని అడిగి మరీ చెయ్యండి ఆయన సలహా లేందీ ఒక్కటీ చెయ్యకండేం!—మరిమరీ బతిమాలు కుంటూ నే నాయనకి ఉత్తరం రాశా రేప్పొద్దుటి బండీలో ఆయన రానే వచ్చేస్తారు ఏమైనా గాని మా నాన్నగారు రాకపోతే మీరేం చేసేస్తారో అనిమాత్రం నాకు భయంగానే వుంది అన్నది

గభీమని లేచి కూచుని ఇలా అన్నాడు గోకుల్— మీ నాన్న వస్తారా?

రారా మరి? ఇప్పుడు గనక ఆయన రాకపోతే ఈ చిక్కులన్నీ తీర్చేవారెవరు? సీలిమతల్లా వారి కమీషన్ కొట్లో నాన్నగారెంత చెబితే అంత దానికంతా మేనేజరు రాయనే అలా అని ఇటువంటి ఆపద సమయంలో కూతుర్నీ అల్లుణ్ణీ విడిచిపెట్టేసి ఊరుకుంటాడా ఆయన?



పామిస్ట్రీ సైన్సు అయితే లెగిస్ట్రీ సైన్సు ఎందుకు కాదూ?

మాటాడక వింటూ కూర్చున్నాడు గోకుల్

ఇంకా సంతోషపడింది మనోరమ మరింత ఉత్సాహంతో అందుకుంది—

మీ దుకాణం పనులు యావత్తూ ఆ ఖాతాపుస్తకాలూ అవ్వీ మా నాన్నగారి నెత్తిన పెట్టేసి ఊరుకోండి! ఇహ మళ్ళీ ఎవరి మాటా వినవలసిన అగత్యమేమీ ఉండదు ఒహవేళ ఎవళ్ళయినా అంతగా కలగజేసుకుని అడిగితే నాకేం తెలియదు వెళ్ళి మా మామగార్నే అడగండి! అనిమాత్రం అంటూ వుండండి అంతే అటువంటప్పుడు—మరిదే కానివ్వండి మరెవరైనా కానివ్వండి ఆయనముందు నోరు విప్పటానికే వీలుండదు అంటూ ఒక చిన్న కటాక్షరేఖ భర్తమీద ప్రసరింపజేసింది

భార్య ప్రయోగించిన కటాక్షరేఖ ఆ మసగవెలుగులో గోకుల్‌కి కనబడిందో లేదో తెలియదు కాని అతడు అవుననిగాని కాదనిగాని ఏమాటా చెప్పలేదు ఆ తరవాతకూడా మనోరమ ఇంకా ఎన్నెన్నో మంచిమంచి మాటలు మాటాడినా గోకుల్ మౌనంగానే వున్నాడు అంచేత గాలి ఏ దిక్కుకి వీస్తుందో తెలియలేదు అంతు చిక్కలేదు కనుక గతరాత్రికి మల్లేనే అక్కడికి సంభాషణ ఆపేసి ఊరుకున్నది

మర్నాడుదయాన్నే గోకుల్ తొందర తొందరగా భవాని గదిముందరికి వెళ్ళి వింటున్నాడు అమ్మా!—ఆనప్పెట్టె తాళంచెవి నీ కిచ్చి వెళ్ళాడా తమ్ముడూ?

అనడిగాడు

"లేదే!— అన్నది భవాని ముక్తసరిగా

నిజానికి అసలు తాళాలు గోకుల్‌దగ్గరే వున్నాయి కాని మనస్సులో ఏదో ఆలోచన చేసుకునే అబద్ధమాడి తల్లిని ఇలా అడిగాడు ఇనప్పెట్టె తాళాలు తమ్ముడి కిచ్చాననగానే తల్లి హడావిడి పడుతుందనీ ఇటువంటి వస్తువు వాడిచేతి కెందు కిచ్చావ్? అనడుగుతుందనీ గోకుల్ అనుకున్నాడు కాని ఆమె టూకీ జవాబుతో అతడు వేసినఎత్తు ఒక్కసారిగా ఎగిరిపోయింది

అప్పుడు గోకుల్ మొహం ముడుచుకుని మెల్లిగా అన్నాడు— ఏమో మరిచా నమ్మా —తాళాలు వాడే ఎక్కడయినా పెట్టాడో లేకపోతే నేనే ఎక్కడైనా పడేశానో తెలియకుండా వుంది!

దీనిక్కూడా ఏం అనలే భవాని కొంపలో బోలెడంతమంది విడిది ఉన్నారాయె తాళంచెవి కనబడకుండా పోయిందని విన్నాక ఆమె కాస్తంతయినా గాబరాపడలేదు సరికదా ఎంతో అలక్ష్యంగా వుందిగాని అతడికేసి కన్నెత్తి అయినా చూశ్శేదు

ఇదంతా ఆలోచించి చూడగా మళ్ళీ తల్లిని బతిమలాడి అమ్మా సంసారం కొంచెం చూడవమ్మా?" అని అనటానికయినా మనస్కరించలేదు ఏం చెబుదామన్నా ఎలా చెబుదామన్నా ఏమీ పాలుపోక నాలుకే ఆడలేదు

కాస్సేపు మాటాడక నిలుచున్నాడు

తరవాత— అత్తనీ వాళ్ళనీ తీసుకురమ్మని పంపాం గదా వాళ్ళకోసమని వెళ్ళిన శంభూ నవుకరూ ఇద్దరూ కూడా ఇంకా రాలేదు అన్నాడు

మృదు స్వరంతో భవాని యిలా అన్నది— ఏమో నాయనా ఎందుకు రాలేదో! నేనేం చెప్పనూ?

అప్పుడు గోకుల్ తల్లితో యిలా అన్నాడు అమ్మా నువ్వు మనిషిని పంప మనడం ఎంత మంచిదయిందీ ఇహ వాళ్ళు రాకపోతే వాళ్ళిష్టం మనమీద మాత్రం తప్పులేకుండా పోయింది అమ్మా!—నీ దెంత దూరదృష్టి తల్లీ!—ఎంతదూరం ఆలోచిస్తావమ్మా ఏ విషయమైనా?—నాకు ఆశ్చర్యమవుతుందీ నువ్వేగనక లేకపోతే మాకు

ఇప్పుడు కూడా భవాని మాటాడక ఊరుకుంది గోకుల్ ఇలా అన్నా విషాదంతో కూడిన ఆమె గంభీర ముఖంలో లేశమయినా సంతోషమూ లేదు ఆనందమూ కనిపించలేదు చేసేదిలేక చాలాసేపు గోకుల్ అక్కడే నిలబడి చివరికి మెల్లిమెల్లిగా జారుకున్నాడు

గోకుల్ బయటికి వస్తూ చాలా కలవరపడిపోయాడు. ఏమంటే—ఈ లోగానే, ఆహ్వానం అందుకున్న పోలీస్ ఇన్స్పెక్టరూ, డిప్టీ కలెక్టరూ, అయిదారుగురు వకీళ్లూ, వాళ్ళ క్లయంట్లూ, మరెక్కడినించో యిద్దరు డాక్టర్లూ యింకా పెద్దమనుషులూ అందరూ కూర్చునివున్నారు.

వినోదుడు వాళ్ళ మధ్యని కూచుని, వారితో మృదుకంఠంతో సంభాషిస్తూ ఉన్నాడు

ఈ ప్రముఖులందరిముందూ తన తమ్ముడి సంగతి చెప్పి, వారికి పరిచయం చెయ్యటానికి అవకాశం ఎలా దొరుకుతుందా అని గోకుల్ ఆత్రంతో ఎదురు చూస్తున్నాడు. కాని, వినోద్ ఎదురుగ్గానే కూర్చుని ఉన్నాడు. అతడు అక్కడుండగా, అతడెన్నెన్ని పరీక్షలు ప్యాసయాడో చెబుదామంటే వీల్లేదు. అలా చెబితే వాడికి ఎంతయినా కోపం వచ్చేస్తుంది. అందుకని, ఖంగారుతో కిందట్టు మీదట్టు అయిపో తున్నాడు.

కాస్సేపు అటుతిరిగీ, యిటుతిరిగీ, చివరికి డిప్టీ కలెక్టర్ దగ్గరికి వెళ్ళి వినయంతో వంగి ఒక్కమాటు నమస్కారం చేశాడు—"ఇతడు నా తమ్ముడు—ఆనర్స్ గ్రాడుయేట్" అన్నాడు.

వినోద్ మంటలు గక్కుతూ చూశాడు, అన్నమీద. కాని, గోకుల్ అటువైపు చూడనైనా చూడలే. అతడు చేతులు జోడించి, "తమరంతా రావటం మా భాగ్యం—వినోద్!—వీరందరితో నువ్వు ఇంగ్లీషు మాటాడవేం! వీరంతా ఆఫీసర్లు, గొప్ప అధికార్లు అటువంటివారితో బెంగాలీ మాటాడ్డం ఏం బాగుంటుందీ?—నలుగురూ వింటే విన్నేమనంటారూ?—" అన్నాడు.

పెద్దమనుషులంతా తలెత్తి చూశారు. డిప్టీకలెక్టరు సిగ్గుపడి, మాటాడుతున్నవాడల్లా వెనక్కు తగ్గాడు. ఇంతవరకూ వాళ్ళు చేస్తున్న ప్రసంగం నట్టుపడ్డది.

వినోదుడికి భరించలేనంత సిగ్గువల్ల కళ్ళూ మొహమూ ఎర్రపడ్డాయి. అన్నగారి స్వభావం అతడికి బాగా తెలుసు. కనుక, ఇప్పుడుగానే అతణ్ణి ఆపకపోతే, ఆ ప్రసంగం ఎంతదాకా పోతుందో ఊహకి అందదు.

ఈ పరిస్థితిలో వినోద్, "ఇదుగో, ఒక్కమాట!" అంటూ బలవంతంగానే అన్నగారి చేతుల్చుకుని ఇవతలకి లాక్కొచ్చి—"అన్నయ్యా!—నన్నిప్పుడే వెళ్ళ గొట్టాలనుందా, ఇంటోవించీ? ఇంకా మీ రిలాగే మాటాడుతూవుంటే, ఒక్కక్షణం కూడా ఉండేది లేదు, నే నిక్కడ!" అన్నాడు.

భయంతో గోకుల్: "ఏమిటి తమ్ముడూ, ఎందుకూ?" అనడిగాడు.

నా మీద మీ రిలాంటి అత్యాచారం చేస్తే నేను సహించలేనని ఎన్నాళ్ళనుంచో చెబుతున్నాను గదండీ. మీకు? ఎంత చెప్పినా మీరు నన్ను విడిచిపెట్టరే! వాలాగా డిగ్రీలు ప్యాసయిన వాళ్ళు కొట్టుకు పోయినంతమంది సందు సందుల్లోనూ పడి మూలుగుతున్నారని తెలుసునా, మీకు?'' అంటూ వినోదుడు కోపంతో, క్షోభతో, అభిమానంతో ముఖం యింత చేసుకుని మళ్ళీ తన చోటికొచ్చి కూర్చున్నాడు.

సిగ్గుతో గోకుల్ చిన్నబుచ్చుకు నుంటాడు. "ఇటువంటిమాట మరెన్నడూ అనను" అని మనస్సులోనే అనుకుంటూ, యింకో చోటికి వెళ్ళిపోయుంటాడు.

మరొక్క అరగంటకల్లా—

ఏ నవుకర్నో గోకుల్ మందలిస్తూ, ఇలా గట్టిగా అరవడం యించుమించు అందరికీ వినబడుతూనే వుంది—"ఓసేవ్, చూడూ!—అదేమిటనుకున్నావ్? చినబాబు గారి ఆనర్స్ గ్రాడ్యుయేట్ మెడల్? గోల్డ్ మెడల్!—

దాన్ని ఎక్కడికైనా తీసికెళ్ళనిచ్చావంటే వాళ్ళూ వీళ్ళూ మోగించి చూసి పాడు చేసేరు!"

డిప్టీకలెక్టరు చిరునవ్వునవ్వుతూ వినోద్‌కేసి చూసి, ముఖం మళ్ళీ అటువేపు తిప్పేసుకున్నాడు!

# 9

శ్రీమతల్లేవాలాగారి కమీషన్ కొట్టును అంధకారంలో అస్తవ్యస్తంగా వాదిలేసి గోకుల్ మామగారు దిగాడు. ఆ నెరిసిన తలా, నల్లటి మీసాలూ, దిట్టమైన శరీరమూ చూస్తే కాకలుతీరిన మనిషిలా, మహా పెద్ద అసాధ్యుడిలా కనిపిస్తాడు.

అతడున్న కొట్లో పనిచేసే కుర్రాళ్ళంతా అతన్ని చాటుగా "పావురాయి" పావురాయి!'' అని అంటూ వుంటారు. ఇలా అనటంలో అర్థముంది. పావురాయి పాడింట్లోగాని గూడు కట్టదు. అంచేత, ఆయనగారు అడుగుపెట్టిన చోటల్లా పాడు పాడు అయిపోతుందని వాళ్ళ ఉద్దేశం.

ఇలాంటి గోకుల్ మామగారు వచ్చీరావటంతోటే కర్మ గృహానికి కర్త అయి పోయాడు. వచ్చిన గంటలోపలే ఊళ్ళో వాళ్ళందరితోటీ పరిచయం చేసుకున్నాడు.

ఇంత కర్మదక్షుడైన మామగారిని చూసుకుని గోకుల్ మురిసిపోయాడు. అల్లుడూ కూతురూ చాలా చాలా బలవంతం చెయ్యటంవల్ల కాదనలేక దయదలిచి, వాళ్ళ వ్యవహారాలు చూసిపెట్టడానికి వచ్చాడన్నమాట చుట్టుపక్కలూ, స్నేహితులూ అందరూ విన్నారు.

రాత్రి తొమ్మిదయింది. పనివాళ్ళు సమేతా అందరి భోజనాలూ అయినవ్వి. ఇంతలో నవుకరొచ్చి, "మామగారు దయచేయమన్నారండీ!" అంటూ గోకుల్‌కు కబురందజేశాడు. గోకుల్ తొందరపడుతూ, ఎంతో వినయంగా ఆయన వద్దకు వెళ్ళాడు.

అతడి మామ "నిమాయిరాయ్" ఒక విలువైన తివాసీమీద మనమరాల్ని దగ్గరసా కూర్చుండ బెట్టుకుని, టిఫిన్ తింటున్నాడు. ముఖంమీద పడుతున్న ముసుగును అటూ యిటూ సరిచేసుకుంటూ, తివాసీ చివరిని కూచున్నది, మనోరమ. కూచుని, సవితి అత్తగార్ని గురించిన సంగతి సందర్భాలన్నీ మెల్లిమెల్లిగా తండ్రికి తెలియజెపుతున్నది.

సరిగా ఈ సమయంలో అక్కడికి వచ్చి నిలబడ్డాడు, గోకుల్.

మామగారు పాలగిన్నె ఎత్తి ఒక్కమాటుగా నోట్లో పోసేసుకుని, గిన్నె అంచుతోనే మీసాలు తుడుచుకుంటూ కళ్ళెత్తి యిలా అన్నాడు—"అల్లుడుగారూ! మిమ్మల్ని నే నొక సంగతి అడుగుతాను, దానికి సమాధానం చెప్పండి. చేతిలోంచి వదిలిన బాణం, నోటిలోంచి వచ్చినమాటా దూసుకుపోతే మళ్ళీ వెనక్కి వస్తాయా!"

ఏమిటో తెలియక తెల్లబోయాడు, గోకుల్.

"ఉహుఁ—" అన్నాడు.

నిమాయి ఒకమాటు కూతురివేపు చూసి, అభిమానంతో గంభీరంగా నవ్వాడు. నవ్వి, "అయితే మరి?" అంటూ అల్లుణ్ణి మళ్ళీ ప్రశ్నించాడు.

ఈ "అయితే మరి?" అనే ప్రశ్నకు ఎంత చించుకున్నా గోకుల్‌కి సమాధానం దొరకలేదు. అందుకని మాటాడక ఊరుకున్నాడు. ఇహ నిమాయిబాబు తన ఉపోద్ఘాతాన్ని మెల్లి మెల్లిగా ప్రారంభించాడు :

"అల్లుడుగారూ!—ఇదుగో మీరు చూడబోతే ఏమీ తెలియని పసివాళ్ళు. మీరిద్దరూ నన్ను రా రమ్మని బలవంతంచేసి, ఈ తుఫానులో చుక్కాని పట్టుకోటానికని నన్ను పిలిపించారు. ఈ చుక్కాని నేను పటుకోగలను, పట్టుకుంటాకూడా. మీరిల్లా గడబిడచేస్తే యేం కుదరదు, పని జరగదు. నువ్వు స్థైర్యంతో వుండాలి. నేనెక్కడ నించో మంటే అక్కడ నించోవాలి, ఎక్కడ కూచోమంటే అక్కడ కూచోవాలి. అలా అయితేనే నేనీ మహాసముద్రంలో చుక్కాని పట్టుకోవటం పడుతుంది.

"అంతేగాని—"నాన్న పోయినప్పుడు నేను హజారీబాగ్‌లో వున్నాను." అని.

ఒకమాట కింకోమాట పొనగకుండా కనబడ్డవాళ్ళతోటి అల్లా చెప్పకు తిరుగుతున్నాట్ట ఆయన? ఈ మాట ఆయనగారి కెవరు నేర్పి పెట్టారూ, అని?—ఇదంతా—తన కాళ్ళని తనే గొడ్డలితో నరుక్కున్నట్టేగా? ఈ మాత్రమయినా తెలియొద్దూ?—''

తండ్రిగారి ఉపన్యాసం వినేసరికి కూతురికి అపరిమితానందం కలిగింది. దానివల్ల స్వరం గాద్గదికమయింది. అటువంటి కంఠంతో గుస గుసలాడుతూ మనోరమ ఇలా అంది—

''నాన్న. అదంతా అయిపోయిందిగా?—ఇందుకోసమే నిన్ను మేం పిలిపించింది. మాకేం తెలియదు. నువ్వెంత చెబితే అంత నువ్వేం చేసుకున్నా సరే. మే మడిగేది లేదు."

తండ్రి సంతోషించాడు.

"అదే వమ్మాయీ, నాక్కావాల్సింది. దావా అంటే ఏమిటనుకున్నావ్? అది పెద్దపులి!—అందుకనేగా, విరోధుల్ని "మీ యింటో వ్యాజ్యంపుట్టా।'' అని తిడతారు. వినలే నువ్వు?—ఆ వ్యాజ్యమే ఇప్పుడు మీ యింటో పుట్టింది. నాది కాకలు తీరిన బుర్ర గనక, అవతల నాపనేమై పోయినా సరే.—ఎలా అయినా మిమ్మల్ని ఒక ఒడ్డెక్కించి వెళదామని సాహసించి వచ్చాను. అలాచేసి మరీ పోతాన్నేను. వాళ్ళ గొంతులుపట్టి, ఒక్కొక్కళ్ళనీ బయటికి గెంటించకపోతే, నాపేరు నిమాయి రాయ్ కానేకాదు!''—అంటూ, అతడు ప్రకటించిన ముఖ భంగిమ వాటర్లూ యుద్ధం జయించి వచ్చిన వెల్లింగ్టన్ ముఖంలోకూడా చూడగలమో, లేదో!—

అటు తరవాత అతడు తలుపుల్లోంచి మెడ బయటికి చాచి,—

"మనూ! నా చేతిమీదికి కాసిన్ని నీళ్ళుతెచ్చి పొయ్యమ్మాయ్!—ఇక్కడే ముఖం కడిగేసుకుంటాను. బయటికి వెళ్ళను. అలాగే నువ్వు కొంచెం గుమ్మం అవతలికి వెళ్ళి అటూ ఇటూ చూసిరా—గోడలకి చెవులుంటాయి. ఏమనుకోటానికీ వీల్లేదు. ఇది శత్రుపట్నం!—'' అన్నాడు.

తనకు చెప్పినట్టుగానే పనులన్నీ చేసుకుని, తిరిగివచ్చి, తన చోటున తనువచ్చి కూర్చుంది, మనోరమ. వెర్రిబాగుల మొహంతో గోకుల్ ఒకమాటు భార్యకేసీ, ఒక మాటు మామగారికేసీ చూస్తూ నించున్నాడు. ఇంతసేపట్నుంచీ తండ్రీ కూతుళ్ళ మధ్య జరిగిన సంభాషణలో ఒక్క అక్షరమయినా అతడికి అర్థంకాలేదు. ఇదెవరి సంగతో—పుట్టింది ఎవరింటో వ్యాజ్యమో—ఎవరిగొంతుక పట్టి ఎవరు అందర్నీ బయటికి వెళ్ళగొట్టాలను కుంటున్నారో—ఎవరికొంప మునిగిపోయిందో—ఈ మొదలైన మాట సందర్భాలకు భావం గ్రహించలేక గోకుల్ చిక్కులోపడి కొయ్య



' యిక ఫరవాలేదమ్మా! యిందాక మీరు మందు
ఇచ్చినప్పుడు యింకో పెగ్ అన్నాడు కదూ?

జారి పోయాడు.

"అల్లుడుగారేమిటి, ఇంకా నించునే వున్నారే? స్థిరంగా కూచోండి. మీతో ఒక్క రెండు మాటలు మాటాడాలి" అన్నాడు మామగారు నించున్నచోటనే ఆ మట్టున గోకుల్ చతికిలబడ్డాడు.

మామగా రిలా ప్రారంభించాడు—

"నాయనా!—ఇప్పుడు మీ కన్నివిధాలా అనుకూలమైన మాంచిసమయం. చెయ్యగలిగిందేదో ఇప్పుడే చేసెయ్యాలి. కొంపలు తీసే వ్యాజ్యం ఒహటి పడబోతూంది. అదుగో, అది నాకళ్ళకి కట్టినట్టు స్పష్టంగా కనిపిస్తూనేవుంది. పడితే పడనీండి, దావా పడనీండి! నేనేం జంకుతా ననుకున్నారా, ఈ పాటిదానికి? నే జంకననే సంగతి "హట్ కోలా" లో ఉన్న జద్దూబాబూకీ, తారిణీ ముఖార్ కీ బాగా తెలుసు. నిమాయీరాయ్ బాబు పేరు చెబితే—పెద్ద పెద్ద వకీళ్ళేకాదు, పేరు పొందిన బారిష్టర్లే కాదు—అందరూ....హ్!—తెలుసునా? నామజా!—ఇహ వీడేమో, కుర్రకుంక!—ఏవో రెండు ఇంగిలీషు ముక్కలు చదివాడేమో!——అంతమాత్రాన ఏమిస్తై పోతుంది?—"

గోకుల్ ఇహ ఉండబట్టలేకపోయాడు. ఒకపక్క భయపడుతూ, వినయంతో మామగారి నిలా అడిగాడు : "ఎవరిమాట తమరు చెప్పేదీ? ఎవరివ్యాఖ్యం అదీ?"

ఈ మాటు నిమాయ్ బాబుకి వాగ్బంధం అయిపోయింది. జవాబు ఏమీ తోచక. అల్లుడి ప్రశ్న వినగానే ఆశ్చర్యంలో మునిగిపోయాడు. గంభీరంగా అతడి ముఖం కేసి చూస్తూ కూచున్నాడు.

అప్పుడు మనోరమ వ్యాకులపడింది. అయినా, ఆవేశం కొద్దీ మాంచి జోరుగా ఇలా అనేసింది—"నే చెప్పలేదు నాన్నా!—మొదట్నించీ మొత్తుకుంటున్నవేగా? ఎవరి వ్యాఖ్యం? అని అడుగుతున్నాడు, చూశావా?—

"నీమీద ఒట్టేసుకు చెబుతున్నా, వినూ! ఇంత అమాయికపు మనిషి, భోళా మనిషి లోకంలో మరొక్కడా ఉండబోరు. అటువంటప్పుడు మరిదిగారు ఈయన్ని మోసంచేసేసి, కొంపా గోడీ అంతా కాజెయ్యటం అదోలెఖ్ఖా?—నువ్వొచ్చావు గనక, కాస్తంత నాకు గుండె నిబ్బరంగావుంది నాన్నా!—లేకపోతే నీ కూతురూ, అల్లుడూ పిల్లలూ అందరూ ముష్టి చిప్పట్టుకు వీథులంట బయల్దేరటం నీకళ్ళతో నువ్వే చూసి వుందువు!—"

ఒక్కమాటు నిట్టూర్చాడు నిమాయిబాబు. "అవునమ్మాయీ! నువ్వు చెప్పింది చూడగా అలాగే అనిపిస్తూంది. కాని, నేవచ్చి పడ్డాగా? ఇహ మరిలాంటి భయం లేదు

"కానీ,—మీ కమీషన్ కొట్లో వున్నారే—రసిక్, వసిక్? వీళ్ళకి ముందస్తిగా స్వస్తిచెప్పి వెళ్ళగొట్టా. వీళ్ళంతా ఎవళ్ళో తెలుసా, అమ్మాయ్?—నీకు బాబులు! అల్లుడుగారికి మావలున్నూ! వీళ్ళు లోపల్లోపల గూడుపుఠాణీ చేసి, వినోదుడి మేళంతో కలియకపోతే నాపేరు నిమాయ్ కానేకాదు. అరె!—మనుషుల నీడచూస్తే చాలునమ్మాయ్, నేను వాళ్ళ మనస్సు ఇట్టె చెప్పేస్తా!" అంటూ, ఆయన ఒకసారి కూతురికేసీ, ఒకసారి అల్లుడికేసీ చూడటం మొదలెట్టాడు.

తండ్రి మాట తనకి నచ్చిందన్నట్టుగా, మనోరమ—"అవున్నాన్నా!—అవును. నాకంతా తెలుసు నాన్నా!—అయితేనేం?—అంతా తెలిసే, మూగి ముఖానమ్మల్లాగా కూర్చున్నాను. వెళ్ళగొట్టేసెయ్—వాళ్ళ నిప్పుడే వెళ్ళగొట్టు. నీ కిష్టమైన వాళ్ళ నుంచు, తీసెయ్యాలనుకున్న వాళ్ళని తీసెయ్! మేమేం అనం!—నీమాటకి తిరుగు లేదు" అన్నది.

ఇంతసేపయ్యాక, ఇప్పటికి సంగతంతా తెలిసొచ్చింది, గోకుల్‌కి—తన తమ్ముడు తనమీద దావా వెయ్యటానికి వ్యూహం పన్నుతున్నాడనీ, వీళ్ళంతా ఆ వ్యూహం

తెలుసుకుని భేదించేశారనీ. కాని తనమాత్రం ఆ తమ్ముడి క్కోపం రాకుండా చెయ్య టానికిగాను వాడివెంట తిరుగుతున్నాడనీ........ఇవన్నీ.

మొట్టమొదట అతడికోపాగ్ని బ్రహ్మరథం భేదించుకు వస్తున్నదా అన్నంతగా ఎగసి మండింది. అయితే—అదంతా ఒక్క క్షణంసేపే. ఆవెంటనే అగ్ని చల్లారి పోయింది. అతడిబుద్ధీ, చూపూ, చైతన్యమూ కూడా అంధకారంలో మునిగి పోయింది. ఎందరెందరో అతడివద్దకువచ్చి, రెండు చెవుల్లోనూ "ఓయ్ గోకుల్!— నీతమ్ముడు వినోద్ నీమీద వ్యాజ్యం పడేస్తున్నాడు, తెలుసుకో!" అని ఘోషించి చెబుతున్నట్టు అనిపించింది.

అంతలో వినాయిరాయ్ ఇలా చెప్పారు: "అల్లుడుగారూ!—ఇటువంటి సమ యంలో మనం డబ్బుకి మొహం చూసుకుని, అణాపైసలు లెక్కేట్టుకుంటూ కూచుంటే పని జరగదు. సాక్షులెంతమందినో కూడదీసుకు వచ్చి, వాళ్ళని గుప్పెట్లో పెట్టు కోవాలి. వ్యాజ్యమంటే ఏమిటనుకున్నావ్? అదంతా సాక్షుల చేతుల్లోనే ఉంటుంది! తెలిసిందా?—"

గోకుల్ తలఊపి కొయ్యలాగా కూచున్నాడు. మామగారి మాట అతడికి తెలిసిందో లేదో. కాని, గోకుల్ సమాధానమేమీ లేదు. ఇంతకూ అతడి చెవికే ఎక్కలేదేమో!

అయితే—కూతురి చెవికి ఎక్కాయి. "కావలసిన ఏర్పాట్లన్నీ చేసెయ్, నాన్నా!" అని చెప్పి మనోరమ హుకుం ఇచ్చేసింది. మరే విషయమైనా అయితే, కూతురి మాట తీసుకుని పని జరపవచ్చు. కాని, సాక్షులూ వ్యవహారమున్నూ వాళ్ళకోసం రహస్యంగా రూపాయిలు ఖర్చుపెట్టాలి. ఇందుకోసం అల్లుడి హుకుం రావాలి కదా అని చూశాడు. అది ఇంకా రాకపోయేప్పటికి వినాయిబాబు ఉత్సాహం కాస్త తగ్గు మొహం పట్టింది. అప్పుడతడు ఇలా అన్నాడు—

"సరే, ఈ గొడవలన్నీ రేపటెల్లుండి సావకాశంగా ఆలోచించుకుందాం గానీ, ఇప్పటికే చాలా పొద్దోయింది, పోయి పడుకోండి. పొద్దుటినించీ ఒకే హైరాణయి పోయింది...."

మాట పూర్తికాకముందే గోకుల్ అక్కణ్ణుంచి గభీమని లేచి, మెల్లిగా బయటికి వెళ్ళిపోయాడు

వినాయిరాయ్ కూతురికేసి చూసి, "ఏం అమ్మాయ్, అల్లుడుగారేమాటా చెప్పనే లేదే! డబ్బు చూసుకుంటే దావా నడుస్తుందా? ఎదర పార్టీ మంచి సాక్ష్యం చీల దీయడమంటే మాటలా? ఒట్టిచేతులతో ఆ పని జరుగుతుందా? బాగుంది, ఖర్చవు తుందని భయపడితే ఎలా అమ్మా?" అన్నాడు.

విమాయిబాబు గడితేరినవాడు మనిషి నీడ చూసి మనస్సు చెప్పేస్తాడు కనుక ఇప్పుడు—తన అల్లుడు ఇన్ని మాటలూ విని స్తబ్ధుగా ఊరుకున్నాడంటే దానికి—డబ్బు ఖర్చయిపోతుందనే భయం తప్ప మరేంకాదని తేల్చుకోటానికి నిమిషంకూడా పట్టలేదు

అల్లాగని అభిమానపడి ఈ విషయం మనస్సుకి పట్టించుకోలేదు ఏమీ?—ఇప్పుడు కూతురికి ఘోరఎపత్తు వచ్చిపడిందాయె! అల్లుడిమీద కోపంతోనూ పట్టింపుతోనూ ఆమెను వదిలేసి దూరంగా కూర్చోగలడా?—అలా చెయ్యదలచుకోలేదాయన

పైగా—పద్దూ పరకా లేకుండా ఇష్టమొచ్చినట్టూ డబ్బు ఖర్చుపెట్టే బాధ్యత తనైతే నెత్తిమీద పెట్టుకున్నాడు గాని పరాయివాళ్ళెరు సాహసించి ముందుకొస్తారు?

అందుచేత—తనకెంత నష్టమైనా రానీ నీమతల్లేవారి కమీషన్ కొట్టు తన చెయిదాటి జారిపోతేపోనీ అయన ఒక్కడుగు కూడా వెనక్కి తగ్గటానికి వీల్లేదు తగ్గితే లోకులేమంటారు? మొహంమీద ఉమ్మెయ్యరూ?—అల్లుడు వెళ్ళిపోయాక ఇటువంటివెన్నో రాత్రి పొద్దుపోయేదాకా చెప్పి చెప్పి అపదలో వున్న కూతుర్ని ఓదారుస్తున్నాడాయన

# 10

రవ్వంత కారణముంటే చాలు గోకుల్ కళ్ళు రెండూ ఎర్రబడిపోతాయి అందులోనూ ఇవాళ రాత్తిరల్లా నిద్దరలేదు కనుక పొద్దున్నేలేచి సవిత్తల్లి గదిలోకి వెళ్ళి నించునేసరికి ఆ రుద్రస్వరూపం చూసి భవాని భయపడిపోయింది

గదిలో అతడు అడుగుపెడుతూనే మా సవితమ్మగారి సంగతి అంతా ఇవాళ తెలిసిపోయింది నాకు అన్నాడు

ఈ మధ్యనల్లా గోకుల్ రోజూరోజూ వచ్చి ఇలాంటి మాట లంటూనే వున్నాడు పైగా ఇటు చూడబోతే రకరకాల చిక్కులూ ఇతర కారణాలూ సంభవించటం మూలంగా భవానిలో స్వతస్సిద్ధంగా వుండే సహజమాధుర్యం కనిపించకుండా పోయింది

అయినప్పటికీ—ఇప్పుడేమో ఇల్లంతా చుట్టలతో పక్కాలతో నవుకర్లతో చాకర్లతో నిండి కిటకిటలాడుతూ ఉండటంచేత భవాని ఎంతో నిగ్రహం చూపి బిగబట్టుక్కూచుంది గోకుల్ అన్నమాటకు ఆమె అతి టూకీగా 'ఎలా తెలిసిందీ? ఏమయిందీ? అనడిగింది

ఎగిరిపడ్డాడు. గోకుల్—"ఏమవుతుంది? మీరంతా కలిసి ఏం చెయ్యగలరు? తమ్ముడు నామీద దావావేసి నన్నేం చేస్తాడు? ఏం చెయ్యగలడు? ఇదుగో, ఇప్పుడే చెబుతున్నా. ముందుగా—ఇక్కడున్నది ఎవరో తెలుసా?—నిమాయీరాయ్!—నిమాయీరాయ్ అంటే సామాన్యుడేం కాదు. ఈ మాటమట్టుకు తెలుసుకుని, మనస్సులో పెట్టుకోండి!—"

అంతకోపమూ మరిచిపోయింది భవాని. ఆశ్చర్యపోయింది—'వినోద్ వ్యాజ్యం వేస్తాడా నీమీదా! ఎవరు చెప్పారు నాయనా, నీతో?' అనడిగింది.

"ఎవరో యేమిటి? అంధరూ చెబుతూనే వున్నారు. వినోద్ నామీద దావా వేస్తాడన్న సంగతి ఎవరికి తెలియదు!"

"ఏమో, నాకీ సంగతి యేం తెలియదు!"

"సరేలే! తెలుసో తెలియదో మేమూ చూస్తాం." అంటూ కోపంతో వెళ్ళిపోబోయాడు గోకుల్ వెళదామనుకున్నవాడు మళ్ళీ వెనక్కి తిరిగి అక్కడే నిలబడ్డాడు. అంతలో మామగారు చెప్పినమాట అతడి నోటినుంచి బయటపడ్డది—"మీలాంటి శత్రువుల్ని ఇహ నాయింటో ఉండనివ్వలేను."

ఈమాట అంటూండగానే భయంవల్ల అతడిలో కనబడే రుద్రస్వరూపం వెలవెలబోయింది. బోయవాడు ఎక్కుపెట్టిన బాణం చూస్తే, లేడి బెదిరిపోయి దారీ తెన్నూ తెలియకుండా పారిపోయినట్టుగా, గోకుల్ ఇప్పుడు తల్లి ఎదటినుంచి పారిపోయాడు.

తనెంత కఠినమయిన మాట అన్నదీ గోకుల్‌కి తెలుసు. అంచేత ఆనాడల్లా పగలుగాని, రాత్రిగాని అతడి అలికిడి ఎవ్వరికీ వినపడలేదు. బంధువర్గానికి విందు జరుగుతున్నప్పుడుకూడా అతడు కనబడలేదు. వాళ్ళనీ వీళ్ళనీ అడిగితే, భవానితో ఇలా చెప్పారు—"ఏదో అర్జంటు వ్యవహారం పరిష్కరించుకోవాలిట, అందుకోసమని ఊరికెళ్లాడుట. ఎప్పుడు తిరిగివచ్చేదీ ఎవరితోనూ చెప్పిపోలేదు" అని.

ఇప్పుడు ఇంటి యాజమాన్యం అంతా నిమాయీరాయ్‌బాబుదే. ఆదర సత్కారాల విషయంలో పెత్తనమంతా ఆయన నెత్తిన వేసుకున్నాడు కదా. అంచేత, విందు భోజనాల ఏర్పాట్లలో ఎటువంటి లోపాలూ రాకుండా గౌరవమర్యాదలు కాపాడుకుంటూ వస్తున్నాడు.

పొరుగూళ్ళనించి వచ్చిన బంధుజనంతోపాటు వారి పంక్తిలో కూర్చుని, విశ్శబ్దంగా భోజనం చేసుకుని వెళిపోతున్నాడు, వినోదుడు.

ఇంటినిండా ఇంతెడు జనం ఉన్నప్పటికీ,—తుఫాను వచ్చేముందు ప్రకృతి యావత్తూ ఏ విధంగా స్తంభించిపోతుందో, అలాగే—ఇప్పుడీ ఇల్లు ఒకవిధమైన

అమంగళ రూపాన్ని ధరించుకుని కళావిహీనంగా కనిపిస్తూంది తగినంత కారణం ఏమీ లేకపోయినా ఇంటో నవుకర్లూ చాకర్లూ దాసదాసీజనమూ ఎందుకో భయంతో బెదురుబెదురుగా అటు ఇటు తిరుగుతున్నారు మరి రెణ్ణాళ్ళు ఈ విధంగా గడిచి పోయింది

పెద్దరోజుల శ్రాద్ధకర్మలకోసమని పొరుగూళ్ళనుంచి వచ్చిన బంధువులూ వాళ్ళూ ఒక్కొక్కళ్ళే బళ్ళెక్కుతున్నారు పిల్లల్ని వెంటబెట్టుకుని మేనత్త బర్ద్వన్ వెళ్ళిపోయింది

పొద్దుటినించీ సాయంత్రందాకా వినోద్ తన బయటిగదిలోనే కూచున్నాడు ఎవరితోనూ ఏమీ మాటాడకుండా కాలం గడుపుతున్నాడు ఇంటిలోపల భవాని ఎవరితోనూ బొత్తిగా మాటామంతీ లేకుండా మౌనముద్ర వేసుక్కూచుంది గోకుల్ ఎవరికీ అందకుండా పైపైనే ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు ఇంటోగాని బయటగాని అతని జాడే ఎవరికీ తెలియరావటం లేదు ఈ మోస్తరుగా మరో మూడు నాలుగురోజులు గడిచిపోయినై మొత్తంమీద చూడగా—ఈ యింటో ఒక్క మనోరమా ఆమె కూతురూ తప్ప మరెవ్వరూ ఉండటంలేదా అనిపిస్తూంది

* * *

కలకత్తాలో కంపెనీవాళ్ళతో తన సంబంధం వొదిలించేసుకు రావటానికని వెళ్ళాడు నిమాయీబాబు వెళ్ళిననాటి సాయంకాలమే శీఘ్రల్లేవారి కమీషన్ కొట్టుని ఒడ్డులేని సముద్రంలో తోసేశాడు ఆ వెంటనే కూతుర్ని అల్లుణ్ణి ఒక ఒడ్డు చేర్చటం కోసమని మళ్ళీ బయల్దేరి వచ్చేశాడు

ఈ మాటు ఆయనవెంబడి చిన్నకొడుక్కూడా వచ్చాడు వాడు రావటానికి కారణమేమిటో ఎవరికీ సరిగ్గా తెలియలేదు కాని ఒక్కటి—కుర్రవాడు తన అక్కనీ బావనీ చూడాలనే ఆత్రంతోమట్టుకు రాలేదని తెలిసిపోయింది

ఇక్కడికి నాలుగురోజులాయె అతి ప్రాజ్ఞుడయిన మామగారి ప్రోద్బలం ప్రోత్సాహం లేకపోవటంవల్ల గోకుల్ చచ్చిపోతున్నట్టున్నాడు గాని అతడూ మామూలుగా కనిపించటం లేదు ఇవాళ

ఇహ మనోరమ సంగతి చెప్పనే అక్కర్లే పొద్దుటినించీ సంతోషంకొద్దీ ఇల్లంతా అలంగం తిరుగుతూంది భోజనాలయినాక అందరూ మనోరమ గదిలోనే దర్బారుపెట్టి తర్జనభర్జన లారంభించారు వాదోపవాదాలు అయిన కొద్దిసేపట్లోనే విషయమంతా తేలిపోయింది స్థిరపడింది

అప్పుడందరూ కలిసి గుమాస్తా అయిన రసికచక్రవర్తిని పట్టారు అతన్ని వెళ్ళ



ప్లీడరు  యికనైనా తెలివితెచ్చుకుని మీలో మీరు రాజీపడండి
ఆసామి  మాకు అంత తెలివిఉంటే మీ దగ్గరికి ఎందుకొచ్చేవారం  ఆ కాస్తకూడా
మీ చేతిమీదనే కానివ్వండి

---

గొట్టడానికి ముందుగా విమాయిరాయ్  అతడివద్దవున్న కాగితాలూ అవ్వీ తీసుకుని, ఒక్కొక్కటే పరిశీలిస్తున్నాడు  పాపం  చక్రవర్తి అమిత విచారంలో  ఉండటం మూలంగా మనస్సు ఏం సరిగ్గా లేదు  అంచేత బెదిరిపోయి  ఏ ప్రశ్నకూ సవ్యంగా సమాధానం చెప్పలేకపోతున్నాడు

ఈ పద్దు ఫలానా  ఈ పద్దు ఫలానా  అంటూ విడమర్చి చెప్పలేకపోతున్నాడు అంతా కలగాపులగంగా ఉండడాన్ని  ఒక్కొక్క పద్దు వచ్చినప్పుడల్లా, ఉండుండి చీవాట్లు పెడుతున్నారు  కసురుతున్నారు  పైగా—తండ్రీ కొడుకూ కలిఎ యుక్తిగా ప్రశ్నలు వేసి క్రాస్ పరీక్ష చేయడంతో  ఆ  దెబ్బకు తట్టుకోలేకపోయాడు  చివరికి తనకు తనే పచ్చెపు దొంగ అయినట్టుగా విరూపించుకున్నాడు ౹—

ఆఖర్న విమాయీరాయ్ అన్నాడు  నేను  లేకపోబట్టి నువ్వింత  డబ్బు  తినే శావ్ ౹ ఇహ సాగదు  విన్ను తీసేశాం  వెళ్ళిపో ౹'' అవి

చక్రవర్తి రెండు కళ్ళనించీ అశ్రువులు రాలాయ్  కళ్ళు ఒత్తుకుంటూ  అతడిలా చెప్పాడు  ''నేను విన్నా ఇవ్వాళా  వచ్చినవాణ్నేమో  కాదండి  బాబుగారూ౹—నా సంగతి యుజమానులికి బాగా తెలుసు

తల వంచుకూర్చున్నాడు గోకుల్ రాయ్‌బాబుగారి కొడుకు మాత్రం ముఖం వెళ్ళబెట్టి అరుస్తూ ఇలా అన్నాడు— మీ యజమానిలాగా మా నాన్నగారు కూడా ఏమీ తెలియని శుద్ధ పశువనుకున్నావా యేమయ్యా! చాల్లే ఇహ నీ మాయలన్నీ కట్టిపెట్టి పో—అవతలికెళ్ళు అంటూ గద్దించాడు

గోకుల్‌కి కుర్ర బావమరిది అయిన ఈ పసవాడు ఇలా చిన్నా పెద్దా చూడకుండా తనని తిరస్కరించే సరికి మనస్సులో చాలా బాధపడ్డాడు చక్రవర్తి గుడ్లనీళ్ళు గుక్కుకున్నాడు కళ్ళు తుడుచుకుని కాస్సేపాగి గోకుల్‌ని చూసి — పెద్దబాబూ! —మరి నాలుగు నెలలజీతం ? అని అడిగాడు

అందుకు గోకుల్ అవునవును—చక్రవర్తీ!—అది యివ్వాలి ఇంకా మరే మయినా అంటూ గబగబా అనేస్తున్నాడు కాని వాక్యం పూర్తి కాలేదు

పూర్తి కానివ్వకుండానే నిమాయీబాబు కుడిచేత్తో గోకుల్‌ని వారించాడు ఉరుము వంటి కంఠస్వరంతో గంభీరంగా అల్లుడుగారూ మీరుండండి కాస్త! ' అన్నాడు

వెంటనే చక్రవర్తికేసి చూసి ఇలా అన్నాడు— ఇక్కడ యజమాని ఆయన కాదు నేనూ ఇహ ముందూ నేనే తెలిసిందా?—నేనేం చేస్తే అదే అమలు జరుగు తుంది నీ కిహ ముట్టవలసిన జీతమేం లేదు నిన్ను నేను కోర్టులో పెట్టించక పోవడమే నీ అదృష్టమనుకో! అని చెప్పాడు చక్రవర్తితో

మరి ఒక్కమాటయినా మాటాడకుండా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు చక్రవర్తి

ఇన్నిన్ని గొడవలు జరిగినా ఒక్కమాట అయినా మాటాడ్డానికి అవకాశం దొరక లేదు మనోరమకి అంచేత ఆమెకు కడుపుబ్బగా వుంది గుమాస్తా చక్రవర్తి వెళ్ళి పోగానే గంభీరముఖంతో భర్తవేపుచూసి అధికారం రంగరించిన కంఠంతో ఇలా అంది —

' నాన్నగారు మాటాడుతూవుంటే మధ్యని మీ రెందుకండీ జోక్యం కలిగించు కుంటారూ? మీకేంపనీ —ఇలా చేశారంటే మెడకి ఉరిపోసుకు ఛస్తా లేదంటే పిల్లా జెల్లానీ వెంటేసుకుని మావాళ్ళింటికయినా పోతా!

గోకుల్ మాటాడకుండా తలవంచు కూచున్నాడు తన తండ్రి ఎదటా తమ్ముడిఎదటా భర్త ఎదిరించి జవాబు చెప్పలేదు కదా అని మనోరమ గర్వంతోటీ సంతోషంతోటీ కరిగిపోయింది

సరేగాని నాన్నా —ఏదో ఒకపనిమీద తమ్ముణ్ణికూడా దుకాణంలో కూచో బెట్టరాదూ? అనడిగింది

ఈ మాటకు నిమాయీరాయ్‌బాబు ఇలా చెప్పాడు— అవునమ్మాయీ!—అందు

కనేగా నేను కుర్రాణ్ని వెంటబెట్టుకొచ్చింది? ఇక్కడ నే నట్టే రోజులుండటాని కుదరదు ఉంటే, అక్కడ నా వ్యాపారమంతా బంద్ అయిపోతుంది. అస లిప్పుడు ఇక్కడికి నేను రాగలిగే వాణ్నిటమ్మా!—మా యజమానితో ఎంతగానో పోట్లాడి బలవంతాన వచ్చానన్న మాట.

"నేను ప్రయాణం తప్పదనేప్పటికి, ఆయన కళ్ళనీళ్ళు తెచ్చుకుని, "రాయ్ బాబుగారూ! మీరెప్పుడు వస్తారో ఏమో, అంతదాకా నాకు నిద్రాహారాలుండవు. మీకోసం జపం చేస్తూ అలా ఎదురు చూస్తూండటంతప్ప నాకు మరేపనీ ఉండదని నమ్మండి. ఈ నాలుగు రోజులూ ఎలా గడుస్తాయా అని బెంగగావుంది." అంటూ ఇద్దైపోయారు. అందుకోసమే తల్లీ!—మన నందలాల్‌కి అవీ ఇవీ చెప్పేసి నేర్పించి, ఇక్కడుంచేసి నేను వెళిపోవచ్చుకదా అని....వీడు పసివాడే అనుకో. అయినా, నాకొడుకే కద!"

అందుకు మనోరమ ఇలా అంది—"అవున్నాన్నా!—నీకు తీరికెక్కడా? నువ్వు చెప్పినట్టు తమ్ముణ్ని కొట్టుమీద ఉంచేసి వెళ్ళు. ఇందుకనే నేను........"

హఠాత్తుగా మనోరమ తలమీది చీరముసుగు ముందుకు లాక్కుని, మౌనంగా ఉండిపోయింది చక్రవర్తి గదిముందుకు వచ్చి, నిలబడి, "బాబుగారూ! అమ్మ వచ్చారు!" అనేసరికి, గోకుల్ గడబిడ పడ్డాడు. ఇప్పటికి ఏడెనిమిది రోజుల్నించీ అతడు తల్లిని చూణ్ణేలేదు.

తలుపు చాటునించి భవాని, సహజమైన కంఠస్వరంతో, "గోకుల్!—" అని పిలిచింది.

మర్యాదగా లేచినించుని, గోకుల్: "ఎందుకమ్మా!—" అన్నాడు

అక్కడే నించుంది భవాని—"ఇలాంటి పిచ్చి పన్లన్నీ చెయ్యమని నీ కెవరు చెప్పారు, నాయనా! చక్రవర్తి ఎంతకాలంనించీ వుంటున్నాడో తెలుసా, మనదగ్గిర? ఎవరో చెప్పారని, అతణ్ణి తీసెయ్యడమేమిటి?—అతడు బతికున్నంతవరకూ నేనే అతణ్ణి పనిలో ఉంచుతున్నాను. కాతా బుక్కులూ, ఇనప్పెట్టె తాళంచెవులూ యిచ్చి, ఆయన్ని దుకాణానికి పంపేసెయ్!—" అన్నది.

ఆ గదిలో పిడుగుపడ్డా, ఎవరికీ ఆశ్చర్యం కలగదు—ఆ సమయం అటువంటిది! —ఒక్కక్షణం ఊరుకుంది, భవాని. మళ్ళీ ఇలా అన్నది—"మరోమాట!—మా మీద అనుగ్రహం ఉండబట్టి వియ్యంకుడుగారు యిక్కడికి వేంచేశారు. రెండుమూడు రోజులు తక్కిన బంధువుల్లాగానే మన కుటుంబంనుంచి ఆదరం, మర్యాదా పొందుతారు, అన్నీ చూస్తారు, వింటారు. అంతేకాని, మన దుకాణంలో దొంగతనం జరిగిందా

లేదా అన్న విచారం వారికేం అవసరం లేదు.—చూడండి, చక్రవర్తిగారూ!—ఆలస్యంచెయ్యక మీరు వెళ్ళండి!—ఎవరో పరాయివాడు మన దుకాణంలోకి వచ్చి కూర్చోవటం, ఆ తాళాలూ అవీ అటూ యిటూ చెయ్యడం—నా కిదంతా ఇష్టం లేదు —గోకుల్!—ముందు ఆయనకి తాళాలిచ్చెయ్. వెళతారు!" అని చెప్పింది.

ఎవరి జవాబుకీ క్షణమయినా ఎదురుచూడక, భవాని వచ్చిన దారినే వెళ్ళిపోయింది! ఆమె వెళ్ళిపోతున్న అలికిడి గదిలో అందరికీ వినవచ్చింది

ఇప్పటిదాకా స్తంభించుకుపోయిన ఆ వాతావరణంలో అందరికీ మళ్ళీ చైతన్యం వచ్చేసింది.

ఇక నప్పుడు విమాయిరాయ్ పెద్దగా బండనవ్వు నవ్వి, ఇలా అన్నాడు—"హ!—దీన్నే కాటోలు, ఇతరుల డబ్బుమీద అధికారం చెలాయించడమంటారు!—చూశారా; అల్లుడుగారూ!—ఆవిడ హుకుమ్ యిచ్చే పద్ధతి ఒక్కమాటు ఆలకించండి!—"

దీనికి అల్లుడి జవాబులేదు. కాని, ఆయనగారి పుత్రరత్నం సమాధానమిచ్చాడు:—"ఇదంతా అందరికీ తెలిసున్నదే కదా, నాన్నా!—నువ్వే యిక్కడ వుండటం జరిగితే, మళ్ళీ ఎవళ్ళకూ దొంగతనం చెయ్యటానికి వీలుండదుగా, మరి!—నీది సుగ్రీవాజ్ఞ కదూ, నాన్నా!—"

కొడుకు మాటలు సమర్థిస్తూ, విమాయీబాబు "కాదా, మరి!" అన్నాడు.

ఆ తరవాత అతడిదృష్టి చక్రవర్తిపైన పడింది. అతణ్ణి చూడగానే విమాయీ మండిపడ్డాడు, ముఖం అదోలాపెట్టాడు. "ఏం భాయీ!—ఇంకా వింటున్నావేం! ఇక వెళ్ళిపోరాదూ; విశ్వాసఘాతకుడా!—జైల్లో పెట్టించకపోవడంవల్లనే ఇలాంటి పన్లు! నా ఎదటినించి లేచి పో!—తింటే తిన్నాడు పోనీ, బ్రాహ్మడు కదా అని ఊరుకున్నానుగాని, లేకపోతేనా!....ఏం తిన్నావో తిన్నావు—సరే. పోనీ, అంతగా అహోరిస్తే యింకో అయిదో, పదో యిస్తాను, పట్టుకు పో!—కాని, మళ్ళీ యిటువంటి చేష్టలు చేశావో, ఈ మాటు నిన్ను జైల్లో వేయించక తప్పదు!—" అని హెచ్చరించాడు.

అయితే—యిప్పుడు మనోరమ, భర్త భావాన్ని కనిపెట్టేసరికి, ఏం మాటాడదామన్నా సాహసం చెయ్యలేక పోయింది. ఇదవరకెల్లా తలవంచుకు వింటూడేవాడో, గోకుల్ ఇప్పుడు కూడా కొయ్యబొమ్మలా అలా వింటునేవున్నాడు.

ఇక చక్రవర్తికూడా ఎవరికీ ఏమీ సమాధానం చెప్పలేదు. యజమాని దగ్గరికి



వెళ్ళి వినయపూర్వకంగా "అయితే పెదబాబూ! కాతా పుస్తకాలు తీసుకుని నేను దుకాణానికి వెళుతున్నాను! తాళం చెవులిప్పించండి!— అనడిగాడు

ఏమీ చెప్పకుండా చెయ్యకుండా గోకుల్ బొడ్లోంచి తాళాలగుత్తి తీసి చక్రవర్తి ముందు పడేశాడు అతడు వాటిని తీసి తన బొడ్లో దోపుకుని కాతా పుస్తకాలు చంక నెట్టుకుని నవ్వాపుకుంటూ మెల్లిగా దుకాణంమీదికి వెళ్ళాడు

అతడు ఇలా వెళ్ళటంలో గల భావం స్పష్టంగా తెలుస్తూనే వుంది దీనివల్ల— ఎవరో ఎవరినీ ఏమీ అడక్కుండానే ప్రపంచంలోని మాలిన్యమంతా తెచ్చి నిమాయీ రాయ్‌గారి నల్లటి మొహంమీద కుమ్మరించినట్టయింది!—

* * *

ఆలోచనలు సాగించే ఈ మందిరంలో అటు తరవాత ఏం జరిగిందో ఆ సంఘటన నిజానికి వర్ణించతరం కాదు

తన తండ్రికీ తమ్ముడికీ తలవని తలంపుగా జరిగిన ఈ అవమానం చూసేప్పటికి మనోరమకు మతిపోయింది! ఆమె భర్తను తిరస్కరించింది ఎంతగానో దూషించింది అవమానం చేసింది భయపెట్టింది బతిమాలుకుంది ఆఖరికి తల బాదుకుని శోకాలు పెట్టింది

ఇంతచేసినా అతడి నోటివెంబడి—తన తండ్రికి అనుకూలంగా ఒక్కమాటయినా పలక్కపోయేసరికి ఇహ ముసుగు తన్ని శవంలాగా పడుకున్నది

చెప్పలేని ఎగ్గుతోనూ మనస్సులో క్షోభతోనూ గోకుల్ నసుగుతూ ఇలా అన్నాడు —

"అమ్మ నా మీద పగబట్టి ఇలా ఆజ్ఞపెడుతుందని నాకు మాత్రం ఏం తెలుసు?—

ఇప్పుడు మామగారొక పెద్ద నిట్టూర్పువిడిచి ఇలా ప్రారంభించాడు—

"పోనీ ఇదీ మంచికే వచ్చింది బతికిపోయాను ఈ లేనిపోని జంజాటంలోంచి విముక్తి కలిగింది గండం తప్పింది అక్కడ చూడబోతే శివతుల్యుడయిన మా యజమాని ఏడుస్తూ కూచున్నాడు ఆయన్ని విడిచి నేను మరెక్కడైనా నిలవటానికి వీలుందా? అయినా కందకి లేని దురద బచ్చలికెందుకు?

"కాని అమ్మాయీ! నీకోమాట చెప్పక తప్పదు ఎప్పుడో ఒకనాడు పిల్లలతో సహా నువ్వు వీధుల్లో ముష్టెత్తుకు తిరగాల్సిన యోగం పట్టే తీరుతుందన్న సంగతి—ఇప్పుడు నా కళ్లెదట స్పష్టంగా కనిపిస్తూనే వుంది ఆ అవస్థ పట్టినప్పుడు 'అయ్యో ఒక్కమాటైనా నాన్న రాలేదే మావేపు కన్నెత్తయినా చూడలేదే! అనిమాత్రం నామీద వాదు వెయ్యబోకు లాభంలేదు కూతురేగానీ, అల్లుడేగానీ మళ్ళీ రమ్మని బతిమాలితే అలా వచ్చే ఘటం కాదిది జ్ఞాపకముంచుకో! — '

అంటూ అల్లుడిమీద ఒక తీవ్రమైన వక్ర కటాక్షాన్ని ప్రయోగించాడు దీనిమీద ఆయనకీ కొడుక్కీ తప్ప ఇంకెవరికీ ఆ ధ్యాసే లేదు

రాయ్‌బాబు వెంటనే కంఠస్వరం మరింత హెచ్చుస్థాయిలో పెట్టి ఇలా చెప్పాడు "ఇప్పటిదాకా నేను వక్రించలేదు నిమాయీరాయ్ ఒక్కసారి వక్రించాడంటే ఆ బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు వచ్చినా అతణ్ణి చలింపజెయ్యలేరు అందుకని మీరిద్దరూ ఒక్కమాటు ఏకాంతానికి పోయి బాగా ఆలోచించుకోండి!

'అబ్బాయీ నందలాల్!—చూడు ఒంటిగంటన్నర కావచ్చింది మూడున్నరకి వచ్చే బండీకి నా ప్రయాణం నా పెట్టే బేడా కాస్త సర్దెయ్ నీకు తెలియనే తెలుసుగా ప్రపంచం తలకిందులయినా మీ నాన్నమాటకి తిరుగుండదని? —ఇలా అంటూ నిమాయీరాయ్ దర్పంగా కొడుకు చెయ్యిచ్చుకున్నాడు కూతురూ అల్లుడూ ఆలోచించుకునేందుకని ఒక్క గంటసేపు టయిమిచ్చి అక్కణ్ణించి వెళిపోయాడు

అయితే అందువల్ల ప్రయోజనం ఏమీ లేకపోయింది గడిచిపోయింది కనక మామగారు ఆ పట్టు పట్టు మూడురోజులుండిపోయాడు

ఈ మూడురోజుల్లోనూ అక్కడ కూచుని ఎడతెరపిలేకుండా అల్లుడిపైన దాబు చేశాడు దర్పం చూపాడు కోపగించాడు తిట్టాడు తిమ్మాడు ఎంతచేసీకూడా గోకుల్ నోట్లోంచి ఒక్కమాటయినా బయటికి లాగలేక పోయాడు!—

తన మామగారికి కలిగిన ఈ పెద్ద అవమానం తనకే కలిగినట్టుగా భావించాడు గోకుల్ అంచేత అంతులేని సిగ్గూ, క్షోభా విచారమూ చిన్నతనమూకలిగి, వాటి వల్ల చెప్పలేనంతగా బాధపడుతున్నాడు

అయితే—తల్లి ఆజ్ఞకు ఎదురుతిరిగి అతడేం చెయ్యగలడు? ఉహుం!—ఏమీ

చెయ్యలేదు ఎంత ఆలోచించినా ఏం చెయ్యటానికీ ఎంతమాత్రం వీల్లేదు ఈ కారణంవల్ల గోకుల్ తనని ఎవరెన్ని తిట్టినా విని సహించి మౌనంగా వుంటు న్నాడు

# 11

ఇం౦కిప్పుడు—

తన ఆశలన్నీ నిరాశలై పోవడం కోరికలన్నీ నీళ్ళు కారిపోవడం ఆలోచనలన్నీ ఎందుకూ పనికిరాకుండాపోవడం వేసుకున్న పథకాలన్నీ తారుమారుకావడం— ఇలాటి ప్రతికూలాలవల్ల నిమాయిరాయ్ తలపెట్టిన కార్యక్రమమంతా తలకిందులై పోయింది

అయిపోయేసరికి ఆయన మరి ఉండబట్టలేకపోయాడు అపూర్వమైన భీకర స్వరూపంతో గోకుల్‌ని ఉద్దేశించి స్పష్టమైన పలుకులతో వికృచ్చిగా యిలా గర్జించ నారంభించాడు "ఏమండోయ్ అల్లుడుగారూ!—నా ఉద్యోగం మానిపించారు మీరు బతిమాలి ప్రాధేయపడి నన్నిక్కడికి పిలిపించారు పోనీ ఏదో మనవాడు కదా ఉద్ధ రిద్దామని నే వచ్చా వచ్చినందుకు బాగానే చేశారులెండి ఇందుకుగాను నాకు మీరు నష్టపరిహారం ఇచ్చుకోవాల్సి ఉంటుంది తెలుసుకోండి! అని బెదిరించాడు

ఈ లోగా ఆయన బెనర్జీ మేష్టార్ని లోపుచేసుకుని తనపక్షం తిప్పుకున్నాడు

ఆ మహాశయుడు వచ్చి గోకుల్‌ని ఇలా చివాట్లు పెట్టడం మొదలెట్టాడు

'ఓరి మూర్ఖుడా!—నీ అంత తెలివితక్కువవాణ్ణి నే నెక్కడా చూడలేదురా. వట్టి గుడ్డివాడివి నీ మంచిచెడ్డలు నువ్వే తెలుసుకోలేవు

ఇలా అనటంవల్ల ఏం లాభం లేకపోయింది

నువ్వు గనక నీ మామగారు చెప్పినమాట వినకపోయావో జరగబోయేదేమిటో తెలుసా?—ఆయన వెళ్ళి మీ వినోదుడితో కలుస్తాడు విన్నింకా యిరుకున పెడతాడు జాగర్త! అని సూచనగా చెప్పారు

భయంతో గోకుల్ అన్నాడు—' మేష్టారూ!— నేనేం చేసేది? మీరే చెప్పండి ఆయన ఈ యింటో ఉండటమే అమ్మకి అసలిష్టంలేదు. ఆయన్ని దుకాణంలో కాలు పెట్టనివ్వొద్దని చక్రవర్తికి ఆవిడ ఆర్డరిచ్చేసింది అన్నాడు

మేష్టారు యిలా ప్రశ్నించాడు—"అయితే గోకుల్!—ఈ కొట్టూ వ్యాపారం మేడా. తోటా దొడ్డీ—యివన్నీ నీవా లేకపోతే మీ అమ్మవా? చెప్పు పోనీగానీ ఇప్పుడు నీ నవిత్తల్లి నీ కెదురు తిరిగిందనీ శత్రుపక్షం చేరిందనీ ఎరుగుదువా?

యు వ

కొ_స్తయినా తెలుసా. నీకీ సంగతి?—''

తల ఊపాడు. గోకుల్.

తనమాట ఒప్పుకున్నట్టు అనుకోగానే మాష్టారికి మరింత ఉత్సాహం కలిగి. ఇలా అందుకున్నాడు—

తెలుసుకదా!—కనుక ఇహ ఇలాటి వెర్రిలో పడకు. నాయనా!—డబ్బూ—దస్కం. ఆస్తీ—వర్తకం. సమస్తమూ ఆ రాయ్‌బాబుగారికి అప్పగించేసెయ్. నీ మట్టుకి నువ్వు మాటాడక. తమాషా చూస్తూ కూర్చో. నా సంగతి వదిలెయ్. కాని. ఒక్కవిషయం బాగా తెలుసుకో: రాయ్‌బాబులాంటి కాకలుతీరిన ఘనుడు ఈ పరగణా అంతా గాలించినా దొరకడు నీకు!—''

''నా కిదంతా బాగా తెలుసు. మేష్టారూ!—కాని. ఒక్కమాట నేను మరిచిపోవ టానికి వీల్లేదు—''అమ్మ సలహాలేందే ఏ ఒక్కపనీ చెయ్యవద్దు'' అని నాన్నగారు చచ్చిపోయేముందు చెప్పిపోయారు.'' అన్నాడు. గోకుల్.

వెటకారంగా నవ్వాడు. బెనర్జీ మేష్టరు. ''వద్దూ అన్నారూ. నాన్నగారు? మహా గొప్పమాట చెప్పారు!—మరైతే. అమ్మ నీ కెదురుతిరిగి. శత్రుకూటంలో చేరుతుం దని ఏమన్నా తెలిపిచచ్చాడా. ఆయనగారు?—సరే. 'వద్దూ' అన్నాడు. నిజమే. అయితే నువ్వు అమ్మ చెప్పినట్టుగానే నడుచుకుని. నీ ఆస్తంతా పాడుచేసుకుంటావా? చెప్పూ.'' అన్నాడు.

ఇన్ని ప్రశ్నల్లో వేటికీ జవాబు చెప్పాల్సిన పని లేదనుకుని. గోకుల్ తల వంచుకుని మాటాడక్కూర్చున్నాడు.

ఈ మాటలన్నీ చాటునవుండి మామగారు వింటూనే ఉన్నాడు. ఇహ ఇప్పుడాయన ముందుకు వచ్చి నించున్నాడు. అతిరథ మహారథుల్లాంటి ఈ యిద్దరూ తర్కించు కోవడం చూస్తే. గోకుల్‌కి అగాధమైన నది సముద్రంలో పడ్డట్టయింది. ఎలాటి జవాబూ చెప్పకుండా అతడు తలవంచుకుని ఉండటం చూసి. వాళ్ళిద్దరికీ చాలా సంతోషమయింది. ఇద్దరూ కలిపి అతడి బుద్ధిమంతుతనాన్ని మెచ్చుకున్నారు.

బెనర్జీ మేష్టరు ఇహ ఇంటికి వెళ్ళాలని లేచాడు. సఫల మనోరథుడైన రాయ్‌బాబు ఆయనకు సాష్టాంగ ప్రణామంచేసి. పాదధూళి తీసుకుని శిరస్సున ధరించాడు. బెనర్జీ మహాశయుడు అతి అభిమానంతోను. ప్రేమతోను. వాత్సల్యంతోనూ గోకుల్‌ను వీపు తట్టి. ఇలా అన్నాడు—''నాయనా. గోకుల్!—నీ ఆస్తి యావత్తూ నువ్వు మా చేతుల్లో పెట్టేసెయ్. నీ మీద ఈగ వాలనివ్వం.—ఏమంటారు. రాయ్‌బాబుగారూ?—అవునా. కాదా?''



"నా యక్స్‌పీరియన్సు అడుగుతారా? ఓ లక్ష బామర్ కంపెనీ మేనేజర్ని చిత్తుచేశాను కూపర్ కంపెనీ కుర్రవాళ్ళని ముక్కుతో దేకించాను సివిల్ సప్లయి ఆఫీసులో పదిమందికి పెళ్ళిచేసుకొంటానని మాట యిచ్చాను"

ఆనందంతో రాయ్ మహాశయుడి స్వరం గద్గదమై పోయింది అయన యిలా చెప్పాడు 'మా అల్లుడికి దేశంలో పదిమంది పెద్దల దర్శనమూ లభిస్తుందంటే అది మీ ఆశీర్వాద బలంగాక మరేమిటి? నే నిక్కడ ఏం చేస్తానో, అంతా చూడవే చూస్తారు అయితే మనకి శత్రువన్న వాళ్ళని ఈ యింటో ఒక్కక్షణం కూడా ఉండనివ్వను సుమండీ! ముందే మీతో చెబుతున్నా మా అల్లుడుగారికి తల్లేకానీండి, తమ్ముడేకానీండి యెవరయినా సరే

ఇహ—ఆ దొంగ ఉన్నాడే చక్రవర్తి? వాణ్ణి ఈ యింటోంచి వెళ్ళగొట్టేంత దాకా పచ్చిమంచినీళ్ళు కూడా ముట్టను —ఒరే ఎవడ్రా అక్కడా! వెళ్ళి ఆ కొట్టుమీద కూర్చున్న బ్రాహ్మణ్ణి వెంటబెట్టుకురా!—ఆ దొంగవాడు చక్రవర్తినీ!—అవి, అధికారం చేతిలో దాచుకున్నట్టుగా భావించి హుకుం జారీ చేశాడు

గోకుల్ సంకోచంతో సిగ్గుపడి మృదువుగా ఇలా చెప్పాడు—ఉహుఁ—వొద్దు ఇప్పుడాయన్ని పిలవాలిసినంత అవసరం ఏమీ లేదు

అప్పుడు బెనర్జీ మాష్టరు తన చేతులు రెండూ అటూ యిటూ చాచి ఇలా చెప్పాడు— 'కాదు గోకుల్!—నువ్వు భయపడిపోయి యిలా వెనక్కి తగ్గావంటే మరి లాభంలేదు పని జరగదు అయనగార్ని అట్టె పెట్టుకోవటానికిహ ఎంతమాత్రం

వీల్లేదు మేం ఉంచం హారి మాయలవాడా!—ఎంత తలపొగరూ వాడికి? నే చెబు తున్నానుగా! వొద్దు వాడు మనకి వద్దు!—

ఇలా అన్నందుకు గోకుల్ ఏమీ కలవరపడలేదు ఇదివరకిలాగానే ఎంతో వినయంగా యిలా సమాధానమిచ్చాడు

"ఏమైనా కాపీ అతడు ఉండేతీరాలి అని అమ్మ అంటూంది ఆయన్ని ఆ జన్మాంతం అమ్మ ఉంచేఎంది కనక ఆవిడ ఉంచినవాణ్ణి తీసెయ్యటానికి ఎవళ్ళకీ అధికారంలేదు నా కటువంటి శక్తి నాన్నగా రిచ్చిపోలేదు '

అని చెప్పి గోకుల్ మళ్లీ తల వంచుకున్నాడు ఈ సమాధానం ఏవి వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు ఈ మాటలు చాలా శాంతంగా నిలకడగా దృఢంగా ఉన్నాయి గాని ఆవేశంతో తొందరపాటుగా రాలేదు అందుచేత వాళ్ళకి మరీ ఆశ్చర్యం కలిగింది మతి పోయినంత పని జరిగింది

కాస్సేపు స్థిరంగా ఉన్నమీదట బెనర్జీ మేష్టరు యిలా అడిగాడు—' అటయితే చక్రవర్తి ఇహ ఉండితీరాలిఎందేనా?"

"అవును మేష్టారూ!—ఉండాల్సిందే ఆయన మీద నాకేం అధికారం లేదు

ఇలా అనేసరికి భయంతో మేష్టరు మళ్ళీ అడిగాడు—' మరైతే రాయ్‌బాబుగా రేమై పోవాలి ?

' అలా అడగుతారేమిటీ?— ఆయన ఏమవుతారు? వాళ్ళింటి కెళ్ళిపోతారు ఆయనగా రిక్కడ ఉండటం అమ్మ కెంతమాత్రం ఇష్టంగా లేదు ఉద్యోగం పోవటం వల్ల ఏదో నష్టం కలిగిందని కూడా అన్నారాయన అమ్మ నడిగి ఆ నష్టమేదో ఆయనకి పంపంచేస్తా అని చెప్పేసి ఎవరి జవాబుకోసమూ ఎదురుచూడకుండానే గోకుల్ అక్కణ్నించి వెళ్ళిపోయాడు

ఇంతచేటు అవమానం జరిగింతరవాత నిమాయిరాయ్ ఇహ క్షణమైనా అక్క డుంటాడని ఎవరయినా అనుకోగలరా?—తక్షణమే బిచాణా కట్టేసి బయల్దేరతా డను కున్నారంతా కాని పది—పన్నెండు రోజులు గడిచినప్పటికీ ఇలా అనుకోటానికి తగిన చిన్నెలేవీ కనిపించలేదు

కూతురిమీదా అల్లుడిమీదా ఉండే ప్రేమ చేతా మమకారం చేతా ఆ పెద్దమనిషి చిన్నచిన్న చిల్లర విషయాల్ని అంతగా మనసుకి పట్టించుకొని వుండడు బహుశా అని చెప్పుకున్నారు లోకులు

వాళ్ళకేం అపకారం జరిగిపోతుందోనని అదునుకోసం రాత్రింబగళ్ళు కనిపెట్టుకు నుండి వాళ్ళకి మంచి చెయ్యడంకోసమే చూస్తున్నాడు అదే ఇప్పుడాయన చేస్తున్న

ప్రయత్నం.

అయితే—ఆయన కోరుకుంటున్న ఈ శుభాకాంక్షల ప్రభావంవల్ల ఒక పక్క అల్లుడయిన గోకుల్ క్షోభ పడిపోతున్నాడు. అలాగే ఇంకోపక్కన తల్లి భవానిక్కూడా స్థయిర్యం తగ్గిపోయి ఒక్క నిమిషమైనా ఆవిడ ఇంటో నిలవలేకుండా వుంటుంది. భోజనం చేసేటప్పుడూ, పడుకున్నప్పటూ, ఇంటో మసిలేటప్పుడూ—కోడలూ, ఆమె తండ్రీ వదిలే వాగ్బాణాలు భవాని రెండు చెవుల్లోంచీ దూసుకుపోయి, హృదయాన్ని వేధించటం మొదలెట్టాయి.

ఇహ ఒకనాడు—భవాని మరి సహించలేక, కోడల్ని పిలిచింది.

"అమ్మాయీ!—నే నీ ఇంటో ఉండటం గోకుల్ కిష్టంలేదా?" అనడిగింది.

కావాలనే జవాబు చెప్పకుండా ఊరుకుంది కోడలు. తలవంచుకుని, కాలిబొటన వేలి గోటితో నేలగీస్తూ వింటుంది. కాస్సేపుండి భవాని—"మంచిదే. ఇష్టం లేక పోతే. అతడే స్పష్టంగా ఎందుకు చెప్పకూడదూ, నాతో? నీ తమ్ముడి చేతా, నాయన చేతా ఎందుకిలా రాత్తిరనక పగలనక నన్నవమానం చేయించటం?" అని ప్రశ్నించింది.

అయితే—అసలీ సంగతి గోకుల్‌కి తెలియనే తెలియదనీ, అతనికేం తెలియనీ కుండా ఈ తండ్రీ కొడుకులే వాళ్ళ విషపుకోరలతో పీక్కు తింటున్నారనీ భవానికి కొంచెమయినా స్ఫురించలేదు కాని, కోడలు మునుపటి కోడలుకాదు. ఆవిడ వెంటనే సమాధానం చెప్పింది—

"ఏమిటండత్తయ్యా. అస్తమానం "అవమానం అవమానం" అంటూ వుంటారూ?—అవమానం ఎవరు ఎవరికి చేసిందీ ఆ సంగతి లోకంలో అందరికీ తెలుసుగా?—నాసొమ్ము పరాయిచేతుల్లో పడిపోకుండా నేను నా తండ్రినీ తమ్ముణ్ణీ తీసి తెచ్చుకుంటే, అది మీ గుండెల్లో ఎందుకమ్మా శూలంలాగా గుచ్చుకోవాలీ? ఒకళ్ళక్షేమం కోసమని మరొకాళ్ళని సర్వనాశనం చెయ్యడం మంచిపనేనా?" అనడిగింది.

తనను తను ఎంతగానో నిగ్రహించుకుంది, భవాని "అమ్మాయీ!—నేనెవరి నమ్మా, సర్వనాశనం చేసిందీ?—" అన్నది

అందుకు కోడలిల్లా బదులు చెప్పింది—"మీ రెవళ్ళకు చేశారో, వాళ్ళే మిమ్మల్ని ఇప్పుడు నిందిస్తున్నారు ఇందుకు వారేం చేస్తారు, నేనుమాత్రం ఏం చేస్తాను? దెబ్బవేసినవారు మళ్ళీ ఎదురు దెబ్బ కాచుకోవాలి కదా, ఇందుకోసమని కోపగిస్తే లాభమేముందమ్మా?"

అనేసి మనోరమ వెళ్ళిపోయింది.

స్తబ్ధురాలై, భవాని కాస్సేపటిదాకా అక్కడే నిలబడిపోయింది. తరవాత మెల్లి మెల్లిగా తనగదిలోకి వెళ్ళిపోయి పడుకుంది.

భర్త బతికున్ననాటి గోకుల్‌నూ, అతడిభార్య మనోరమనూ తలుచుకునే సరికల్లా ఎప్పుడూ లేందీ ఈనాడు ఆమె కళ్ళనించి అశ్రుధారలు ప్రవహించాయి.

"నా అంత తెలివిమాలినది లోకంలో ఎక్కడా ఉండదు. నా గొంతుక్కే కాకుండా నా కడుపునకన్న కొడుకు గొంతుక్కి కూడా ఉరిపోసేశానే!" అంటూ తలిచి తలిచి, కుమిలి కుమిలి దుఃఖించసాగింది. ఎంత ప్రయత్నిస్తే మట్టుకి ఈ పరితాపం ఆమె హృదయంవించి ఎలా తొలగిపోతుంది?

నా అంతట నేనేకోరి, బతిమలాడి, ప్రాధేయపడి, ఆస్తంతా గోకుల్‌పేర రాయించేశాను. ఆపని చెయ్యకపోతే ఇప్పుడు నాకీ దుర్దశ పట్టేదికాదుగా?—నా వినోద్ నాకడుపున ఎంత చెడబుట్టినవాడే కానీ కన్నతల్లినైన నన్నీవిధంగా అవమానించగలడా ఇంటోంచి వెళ్ళగొట్టగలడా?—ఇలా మళ్ళీ మళ్ళీ అనుకుని, తీరని బాధ పొందుతూంది భవాని

అయితే తన బతుకుతెరువుకోసం వినోద్ ఉద్యోగ ప్రయత్నం చేస్తున్న సంగతి ఎవరికీ తెలియనే తెలీదు. దైవకృపవల్ల అతడియత్నం ఫలించింది కోర్టులో ఒక ఉద్యోగం దొరికింది, బస్తీలో తనుండటానికని ఒక మూలని చిన్న ఇల్లుకూడా అద్దెకి తీసుకున్నాడు ఆరోజు సాయంకాలమే అతడింటికి వచ్చి, "అమ్మా!—నేను నా కొత్తబసకి రేపు వెళ్ళిపోతున్నా" నని తల్లికి చెప్పాడు.

భవాని, చెప్పలేని దుఃఖంతో ఇలా అన్నది—"నీతోకూడా నన్నూ తీసుకుపో, నాయనా!— ఇక్కడ జరిగే అవమానం ఇహ ఒక్కక్షణంపైనా నేను భరించలేకుండా ఉన్నాను. నువు నన్నెలా ఉండమంటే ఆలా ఉంటాను. ముందు నన్నీ కొంపలోంచి అవతలికి జేరేసే మార్గం మాత్రం చూడు. తండ్రీ!—ఈ బందిఖానా లోంచి విడుదల చేసెయ్ బాబూ!"—అని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ తరవాత వినోద్ ఒక్కొక్కటే సంగతి సందర్భాలన్నీ విని తెలుసుకున్నాడు. ఊరి బయటికి ఓమాటు పోయివద్దామని బయల్దేరేసరికి, గోకుల్ ఎదురుపడ్డాడు. గోకుల్ కొట్టుమూసేసి, ఇప్పుడే ఇంటికి వస్తున్నాడన్నమాట. ఇదివరకైతే అన్నగారెదురు పడినప్పుడు వినోద్ కనిపించకుండా తప్పించుకు పోయేవాడు. కాని ఇవ్వాళ అలాకాదు. అన్న వస్తూంటే అడ్డుగా దార్లో నిలబడ్డాడు. గోకుల్ దగ్గరికి రాగానే "అన్నయ్యా!—రేపొద్దున్నే అమ్మని తీసుకుని నేను కొత్త ఇంటికి వెళుతున్నాను"



అన్నాడు.

తెల్లబోయాడు, గోకుల్.

"కొత్త ఇంటికా!—నాకేం చెప్పకుండా చెయ్యకుండా ఇల్లు ఖుదిర్చేసు కున్నావా?—" అడిగాడు.

"ఆఁ—అవును."

"ఓహో అదా సంగతి?—అలా చెప్పు. అయితే. చదువు మానేశావన్న మాట?—"

"ఆఁ—!"

ఇలా అతడు "ఆఁ" అనటం గోకుల్ హృదయంపైన ఎంత అఘాతంగా తగిలిందో ఆ మసకచీకట్లో గోకుల్‌కి కనబడనేలేదు.

తమ్ముణ్ణి ఎం. ఏ. ప్యాస్‌చేయించాలని గోకుల్ చిన్నప్పట్నించీ కలలు గంటూ న్నాడు. తనకి తెలిసినవాళ్ళెవరైనా ఏదైనా ప్యాసయ్యారని కబురు తెలిస్తే చాలు పిలవకపోయినా గోకుల్ వెంటనే వెళ్ళి సంతోషం వెలిబుచ్చి అభినందించి వచ్చేవాడు.

చివరికి—"ఓహో, ఎం. ఏ. పరీక్షలయినాయా? ఎవరెవరు ప్యాసయ్యారు?" అంటూ తమ్ముడికి బదులు తనే ఆత్రంతో అడిగేవాడు. అతడిసంగతి తెలిసినవాళ్ళు లోపల్లోపల నవ్వుకునేవారు. ఎరగనివాళ్ళు "ఇతడి కెందుకుచెప్మా, ఎం. ఏ. ఫలితాల గొడవ!" అనుకుని మొహం చిట్లించే వాళ్ళు. అందుకతడు—తన తమ్ముడు "ఆనర్స్ గ్రాడ్యుయేట్" ఫస్టులో వచ్చాడని చెప్పేవాడు.

ప్రసంగ వశాత్తు "ఇదిగో, అతడి గోల్డ్‌మెడల్!" అంటూ ఆదమరపుగా జేబు లోంచి తీసేవాడు. అయితే—ముఖమల్ గుడ్డకట్టిన పెట్టెతోసహా ఆ మెడల్ తన జేబులోకి ఎలా వచ్చిపడుతుందో మాత్రం, కొట్టుకు చచ్చినా, కారణం తెలిసేది కాదు.

గోకుల్ మనసులో రహస్యమైన ఒకకోరిక ఉండేది—అపరూపమైన ఈ మెడల్‌ను తమ్ముడిచేత తన గడియారపు గొలుసుకి వేలాడ దీయించుకుందామని. కాని, తమ్ముడు ఇలా అనేశాడు—"నువ్విలాంటి పిచ్చిపన్లు చేశావంటే, దీన్ని పెట్టెతో సహా పట్టుకుపోయి కాలవలో పారేసివస్తా" నని బెదిరించాడు. వినోద్ ఇలా అనక పోతే, గోకుల్ కోరిక ఏనాడో తీరిపోయేది.

ఇదల్లా ఉండగా—"ఎం. ఏ. మెడల్ ఎలావుంటుందీ? తీరా ఒహవేళ వస్తే. అంత విలువయిందీ, అపరూపమైందీ అయిన ఆ వస్తువును ఇంటో ఎక్కడ దాచడం? ఎలా పదిల పరచడం? ఏవిధంగా దన్ని కాపాడటం?" అని ఈ విధమైన ఆలోచనలతో సతమతమై పోతున్నాడు.

పరిస్థితి ఇలా ఉండగా—ఇప్పుడు తమ్ముడు ఎం. ఏ. చదవడం మానేశాడన్న మాట అతడికి గుండెలో శూలంలా గుచ్చుకుంది. అయినా, ఎలాగో ప్రాణాలుగ్గ బట్టుకుని, "సరే, తమ్ముడూ!—అమ్మని కొత్త ఇంటికి తీసుకెళ్ళావ్. బాగానేవుంది. తీసుకెళ్ళి ఏం పెడతావు? చెప్పు, నాయనా! వింటానూ!" అనడిగాడు.

"ఏం పెడతానో, నువ్వే చూస్తావ్‌లే!" అంటూ వినోద్ వెళ్ళిపోయాడు తల్లి లాగానే అతడు కూడా మితభాషి. ఈ ఒక్కమాట అనేసి ఊరుకున్నాడు గాని, ఇప్పుడే తను ఇంటికిపోయి తిరిగి వస్తున్న సంగతిమాత్రం వెల్లడించలే.

గోకుల్ ఇంటో అడుగు పెట్టేసరికి ముసిలిదాసీ వచ్చింది. "అమ్మగారు ఒక్క మాటు రమ్మంటున్నా" రంది. గోకుల్ తల్లి గదిలోకి వెళ్ళాడు. ఈ దీపాలి వేళకూడా



"మీ గుండె చాలా స్ట్రాంగ్‌గావుంది అరవై సంవత్సరాలవరకూ మీకేమీ ఢోకాలేదు!"
"నాకు అరవై నిండినవండి"
"నేను చెప్పలా! చూశారా, అరవై యేళ్ళవరకూ"

---

ఆమె చైతన్యం లేనిదానిలాగా పడుకుని ఉండటం చూశాడు. అతణ్ని చూడగానే లేచింది భవాని "నే నీయింటోంచి రేప్పొద్దున్నే వెళ్ళిపోతున్నా" నని చెప్పింది.

ఇంతకుముందు తమ్ముడే చెప్పాడుగా. ఈమాట! విన్నప్పట్నించీ గోకుల్ మనస్సులో మండిపోతూనే వున్నాడు. దానికిప్పుడు తల్లి అన్నమాట తోడయింది.

"నీ కెక్కడికి వెళ్ళాలనివుంటే అక్కడికి వెళ్ళమ్మా! నీ వెక్కడికిపోతే మాకేం?—మే మెవళ్ళం నీకాళ్ళకి బందాలేసి ఉంచలేదు ఎక్కడో అక్కడ ఖులాసాగా వుంటేచాలు. నువ్వెళ్ళావో, మేం బతికిపోతాం!—" అన్నాడు. గోకుల్ ఇలా అంటూ, ముఖం ఇంత చేసుకుని, అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం—

ప్రయాణానికి సిద్ధం చేసుకుంటూవుంది, భవాని ముసిలిదాసీది దగ్గరే కూచుని సాయం చేస్తూంది. గోకుల్, తనమాట వినబడేంత దూరంలో నిల్చుని, "ముసిలీ!— ఇవ్వాళ వెళ్ళటానికి వీల్లేదని చెప్పు, ఆవిడతో!—" అన్నాడు, గట్టిగా.

తుళ్ళిపడింది దాసీది "ఏం పెదబాబూ!—ఎందుకు వీల్లేదూ?" అనడిగింది.

అందుకు గోకుల్—"ఇవాళ దశమి కాదుటే?—పిల్లా జెల్లాతో కాపరం చేస్తున్న ఇంటినుంచి ఇటువంటి రోజున బయల్దేరితే గృహస్థుకి అమంగళం కాదూ!—ఏమైనా సరే, ఇవ్వాళ ఇంటోంచి వెళ్ళనివ్వనని ఆవిడతో చెప్పు! అంతగా

కావాలంటే రేపు వెళ్లొచ్చునన్నానని చెప్పు. నేను బండీ వెనక్కి పంపేశాను."

ఇలా చెప్పేసి గోకుల్ గబగబా వెనక్కి తిరిగాడు. అంతలో మనోరమ, పంజ్ఞతో భర్తని చాటుకి పిలిచింది. ధుమ ధుమలాడుతూ ఇలా వారించింది— "ఆవిడగారు వెళ్ళిపోతానో అంటూవుంటే, మధ్యనిమీరు ఆపటం దేనికి?"

ఈ మధ్యని కొన్నాళ్ళుగా భార్య భర్తలమధ్య సఖ్యంకుదిరి, బాగానే సాగి పోతూంది కాని ఇప్పుడు గోకుల్ మొహం చిట్లించుకుని, కోపంతో కేకలెయ్యడం మొదలెట్టాడు— "అవును, వొద్దన్నాను. ఆపుతాను. నా ఇష్టం. ఆవిడ ఇంటికి యజమానురాలూ పెద్దానూ. అటువంటామె తిథీ వారం చూసుకోకుండా, విష ఘడి యల్లో ఇల్లు వొదిలివెళితే, ఆ తరవాత పిల్లా, మేకా టపీమని ఛస్తే?—"

అంటూ గోకుల్ దూకుడుగా బయటికి వెళ్ళిపోయాడు. క్రోధంతోను, ఆశ్చర్యం తోను మనోరమ మాట్లాడలేక నిలబడిపోయింది. "చూశారా, ధోరణి? ఎంత బాగుందో!" అని మాత్రం ఆమె నోటినుంచి వినబడింది!—

# 12

భవాని ప్రయాణం దశమినాడు కదా!—దశమీ, తరవాత ఏకాదశి, ఆ తరవాత ద్వాదశీకూడా వెళ్ళింది. అయినా, గోకుల్‌కు తల్లిని పంపుదామంటే తిథివార నక్షత్రా లింకా కుదరనే లేదు.

త్రయోదశినాడు వాళ్ళింటి పురోహితుడు వచ్చాడు. "అమ్మగారి ప్రయాణానికి ఈరోజు చాలా దివ్యంగా వున్నది." అని చెప్పాడు. అనేవరికల్లా గోకుల్ కళ్ళెర్ర జేశాడు: "ఏమిటయ్యా, బ్రాహ్మడా!—ఇంటో తిని ఇంటివాసాలు లెక్కపెట్టే బాపతుగా ఉన్నావే? నీ దారిని నువ్వుపోక, ఈ ప్రయాణపు గొడవలన్నీ నీకెందుకూ అంట? వేరే పనేంలేదా?—వెళ్ళు, వెళ్లు. అమ్మను నే నెక్కడికీ పంపను, పో!—" అని కసిరికొట్టాడు.

ఆనాడు మొహం వాచేట్టు చెడ చివాట్లు తిన్నదిగా, మనోరమ! అప్పట్నించీ మళ్ళీ నోరెత్తలే. ఇవాళ తండ్రిని పంపించింది భర్త దగ్గరికి. విమాయీరాయ్ వచ్చి, "అల్లుడుగారూ!—ఇదేమంత మంచిపని కాదండీ!" అని అన్నాడు.

ఎన్నడూ పేపర్ చదివే అలవాటు లేకపోయినా, గోకుల్ ఇవాళ పత్రిక చదువుతూ కూర్చున్నాడు. మామగారి ప్రశ్నకు సమాధానంగా "ఏ పనండీ?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"వియ్యపురాలుగారు తనకు తానై కొడుకింటికి వెళతానన్నప్పుడు, వద్దూ అని

అడ్డుపెట్టటానికి మనమెవళ్ళం ? అదేమంత మంచిపని కాదు." అన్నాడు రాయ్‌బాబు.

పేపరు చదువుతూ చదువుతూ వున్న గోకుల్ ఇలా చెప్పాడు· "ఈ మాటవింటే ఊళ్ళోవాళ్ళు నాకు గడ్డెట్టరుటండీ ? ఎంత అప్రతిష్ఠ !" అన్నాడు.

ఈ మాట రాయ్‌బాబుకి వింతగా తోచింది. "ఇందులో అప్రతిష్ఠ కేముందండీ అల్లుడుగారూ ? మీకెందుకు గడ్డిపెట్టాలి. ఎవరయినా ? నాకేం అర్థంకావటంలే." అన్నాడు.

ఇంతకాలంగా గోకుల్ మామగారిపట్ల ఎంతో గౌరవమర్యాదలతో మసలుకుంటూ వచ్చాడు. ఇప్పుడు ఆకస్మికంగా అతడి మతం మారిపోయింది. అగ్గి కురిపిస్తూ ఇలా అన్నాడు

"మీకు అర్థంకాకపోతే పోనీండి. బందిలేదు. అయినందువల్ల ప్రయోజనమూ లేదు. మా అమ్మను నే నెవరిదగ్గరికీ వెళ్ళనివ్వను. అంతేమాట. ఎవరేం చేసుకున్నా సరే. పోండి!"

ఇప్పుడు గోకుల్ తన నిశ్చయాన్ని వెల్లడిస్తూ. "అంతేమాట" అనడం ఆ వెంటనే వినోదుడి చెవినపడింది. రోజు రోజూ ప్రయాణానికని బండీ రప్పించటం. ఏదో సాకుచెప్పి గోకుల్ ఆ బండీని వెనక్కి తిరిగ్గొట్టేస్తూ వుండటం. తల్లిని వెళ్ళ వద్దని అడ్డుచెప్పడం—ఇదంతా వినోద్‌కేం బాగాలేదు. అతడికి మనసులో కోపం. చీకాకూ కలుగుతోంది.

"అన్నయ్యా!—ఇవ్వాళ అమ్మని నాతోకూడా తీసుకు వెళుతున్నాను. అనవసరంగా మీరూరికే ఆటంకం చెప్పకండి!" అన్నాడు. వినోద్.

ఇప్పుడు గోకుల్ మరింత శ్రద్ధగా పేపర్ చదువుతూ. "ఇవాళ వెళ్ళటానికి వీల్లే" దన్నాడు

"వీల్లేక పోవడమేమిటి? మహా బాగా వీలవుతుంది. ఇప్పుడే నే తీసుకు పోతున్నా" నని చెప్పాడు. వినోద్.

తమ్ముడి ధోరణిలో కోపం కనిపించింది. గోకుల్‌కు. చేతిలో పేపరు అవతలికి విసిరిపారేశాడు. "తీసుకెళుతున్నా అనేసరికల్లా అయిపోయిందా? నాన్నగారు పోయేటప్పుడు అమ్మని నాదగ్గర ఉండమని చెప్పిపోయారు కాని. నీకు అప్పగించి పోలేదే? నే నెక్కడికీ పంపేదిలేదు. అమ్మని " అని ఖచ్చితంగా చెప్పాడు

"అన్నయ్యా!—ఒకవేళ నిజంగానే ఆ బాధ్యత నువ్వు పైన వేసుకోదల్చుకుంటే. రాత్రనక పగలనక అమ్మ ఇలా ఎప్పుడూ తిట్లు తినేగతి ఎందుకు పడుతుందీ? అవమానం పొందేగతి ఎందుకు పడుతుందీ? ఇవన్నీ ఇకమీదట ఆవిడ

సహించలేదు —అమ్మా!— అవతల బండీ నిలబడివుంది. బయల్దేరూ!"—అంటూ తల్లిని తొందరపెట్టాడు.

ఇలా అని వినోద్ వెనక్కి తిరిగి చూసేటంతలోనే భవాని ఇంట్లోంచి ఇవతలికి వచ్చేసింది ఆమె అక్కడ చాటుగా నించునివుందన్న సంగతి గోకుల్‌కి తెలీదు. తల్లి తిన్నగా వెళ్ళి బండీ ఎక్కడం చూసి, గోకుల్ విస్తుపోయాడు! కొన్ని నిమిషాలసేపు అలానే నించుండిపోయి, చివరికి బండి దగ్గరికి వచ్చాడు—"అమ్మా. చూడు!—చెబుతున్నాగా?—వొద్దు వొద్దని బతిమాలిన కొద్దీ మానెయ్యకుండా వెళిపోతున్నావు కదా! ఇహ మీకూ మాకూ ఎటువంటి సంబంధమూ ఉండదు. చూసొ్కో!—" అన్నాడు

భవాని ఏం జవాబు చెప్పలే. వినోద్ బండీ వాడితో "పోనియ్యివోయ్!—" అన్నాడు. బండీ బయల్దేరింది గోకుల్ రుద్ధమైన కంఠస్వరంతో. "ఇలా నన్ను వొదిలేసి వెళ్ళి పోతున్నావు కదమ్మా! నేను మాత్రం నీ కొడుకుని కాదూ? నన్ను నువ్వు పెంచి పెద్దవాణ్ని చెయ్యలేదూ?" అన్నాడు.

బండి చప్పుడులో ఈ మాటలు భవాని చెవిని పడలేదుగాని. వినోద్‌కు స్పష్టంగా వినిపించాయ్ అతడు బండి ముందునించి కొంచెం తొంగి చూసేసరికి—గోకుల్ ఉత్తరీయంతో ముఖం కప్పేసుకుని, గబ గబా తమ్ముడిగదిలోకి వెళ్ళి, తలుపులు మూసుకుని పడుకోవటం కనిపించింది.

నిమాయిరాయ్ చాటున పొంచుండి ఇదంతా చూస్తూనే వున్నాడు. చూస్తే, ఆయనకి భయం పట్టుకున్నది

అయితే—కాస్సేపయ్యాక గది తలుపు తీసుకుని ఇవతలికి వచ్చేసి, మామూలు వేళకు స్నానపానాదులు, భోజనం ముగించుకుని, దుకాణానికి వెళ్లాడు ఆ వెళ్ళేటప్పుడు కన్నుల్లోగాని, ముఖంలోగాని, పనుల్లోగాని కంగారు పడాల్సిన చిహ్నాలు ఏమీ కనిపించలేదు. అంచేత "హమ్మ!—బతికాంరా బాబూ!" అంటూ ఒక్క నిట్టూర్పువిడిచి, నిమాయి బాబు నిశ్చింతగా తన పన్లు తను చూసుకుంటున్నాడు. ఇహ ఇప్పుడు—కాస్తంత స్తిమితం కుదరగానే, ఎటువంటి విఘ్నమూ లేకుండా ఈమాటు ఆయన తన మనస్సును ఒకే ఒక్క విషయంపై లగ్నం చేసుకూర్చున్నాడు.—అదేమిటంటే: తను పట్టుకున్న ఎరను పాము ఏవిధంగానైతే మెలిమెల్లిగా దిగమింగి, పొట్టలో వేసేసుకుని తృప్తిగా వుంటుందో, అలానే నిమాయిరాయ్ కూడా ఆనందంతో అల్లుణ్ణి జీర్ణం చేసేసుకోవటానికి గట్టిగా ఆలోచనలు ప్రారంభించాడు.



ఆయన ఆలోచనకి తగినట్టుగా పరిస్థితులూ, లక్షణాలూ ఎంతో అనుకూలంగానే కనిపిస్తున్నాయి.

తండ్రి పోయినప్పటినుంచీ గోకుల్‌కి కొన్ని అవలక్షణాలు పట్టుకున్నాయి— మాటాడితే కోపం రావడం, చీకాకు పడటం, చిన్న విషయానికే చిందులు తొక్కడం—ఇలాటివన్నీ

అయితే—ఏనాడు భవాని ఈ యింటోంచి కాలుకదిపి బయటికి వెళ్ళిపోయిందో, ఆరోజునించీ అతడు పూర్తిగా మారిపోయి, కొత్తమనిషే అయిపోయాడు. ఎవరేమన్నా ఇప్పుడేం కోపంలేదు, మాటకి మాట చెప్పడు. ఈ సుగుణాలు మామగారికెంతో సంతోషాన్ని కలిగించాయి.

ఈ మార్పువల్ల మామగారికైతే సంతోషంగా వుందిగాని, ఆయన కూతురు మనోరమకి మాత్రం ఏకోశానా మంచి తోచలేదు ఏమంటే— తనభర్త మనస్తత్వం ఆమెకు బాగా తెలుసు. ఇప్పుడతడు భోజనంవేళ గొడవ ఏమీ చెయ్యకుండా, పెట్టిందేదో తినేసి మాటాడక లేచిపోవడం—చూసి, మనోరమ భయపడిపోయింది. ఇందు క్కారణముంది గోకుల్ భోజనప్రియుడు. రుచులు చూస్తాడు. వంటకాలు ఎంచుతాడు. తను తినడమంటే ఎంతప్రీతివుందో, ఒకాళ్ళకి పెట్టడమంటే అంత కుతూహలం కలవాడు.

ముఖ్యంగా ఆదివారం సెలవురోజునా, ద్వాదశిలాంటి పర్వదినాలు వచ్చినా, తన

పం_క్తిని పదిమందికి భోజనం పెట్టడమంటే అతడికెంతో సరదా. అలాంటిది, ఈ ఆదివారంనాడు అటువంటిదేమీ తలపెట్టక పోయేసరికి, "ఏం, ఇవాళ ఎవర్నీ పిలివారు కారేం?" అనడిగింది.

అందుకు ఉదాసీనంగా గోకుల్ ఇలా అన్నాడు:—"ఆ(—యేమిటో!—అవన్నీ అమ్మతోటే పోయినయ్. ఇప్పుడు వండేదెవరు, పెట్టేదెవరు?"

ఈ మాటకి మనోరమ అభిమానపడి చెప్పింది:—"వాళ్ళ సమారాధనకి సత్రంలో బ్రాహ్మలే వంటచేస్తారు. ఇహ మనమాట కదా!—వాళ్ళకోసమని వండటం, పెట్టడం మీ అమ్మగా రొక్క_ర్తెకే తెలుసా? అపాటి వంటావార్పూ నాకు తెలియదు కాబోలు. ఏం విడ్డూరం మాటలండీ!"

"ఆ నేర్పంతా మీ నాన్నకూ తమ్ముడికీ వండి పెట్టుకోవటంలో చూపించు. వాకేం అక్క_ర్లేదు" అనేసి, అక్క_ణ్నించి వెళ్ళిపోయాడు.

* * *

మనోరమ తల్లి కాశీఘాట్‌నించి తిరిగి వెళుతూ, ఒకనాడు ఇక్క_డ దిగింది. కోపంమీద సవితి అ_త్తగారు ఇల్లువదిలి వెళిపోయిందని విన్నది. కూతురి సంసారాన్ని చక్క_బరచకుండా చూస్తూ ఎలా వెళ్ళేది, కనక నాలుగై_దు రోజులుండి మరీ పోదాం అనుకుంది.

ఇప్పటిదాకా మహా గందరగోళంలో మునిగిపోయిన గోకుల్ సంసారం చూస్తూ వుండగానే చక్క_బడి, కాపరం మళ్ళీ చక్క_గా సాగిపోతూవుంది. దీనికంతకీ చుక్కా_ను పట్టుకు నడిపిస్తున్నది మనోరమ తల్లి. ఈ విధంగా కాలం గడిచి పోతూంది.

మొదట్లో ఊళ్లోవాళ్ళు ఈ విషయం కలగజేసుకుని గొడవ చెయ్యటం మొదలెట్టారు కాని, ఇదంతా కలియుగ ధర్మంకదా అని సమాధానం చెప్పుకుని, మాటాడక ఊరుకున్నారు.

* * *

వినోద్ ఉంటున్న సమీపంలో మునిలిదాసీకి ఒక చిన్న ఇల్లుంది. ఏదన్నా పని మీద అది తరుచు అక్క_డికిపోయి వస్తూంటుంది. వెళ్ళినప్పుడల్లా చినబాబుని చూసి రావడం దానికిప్పుడొహ పని అయింది. వియ్యపు రాలువచ్చి ఇంటో ప్రవేశించిన సంగతి దాసీది చెప్పింది, భవానికి, భవాని విని ఊరుకుందే కానీ, ఏమీ అనలే.

కొ_త్త ఇంటో ప్రవేశించాక వినోదుడు ఏ మూడు నాలుగు రోజులో సరిగ్గా వున్నాడు. తరవాత మళ్ళీ మామూలు ఎప్పటిలాగే తయారయ్యాడు. తల్లిమాట

వినడు. రాత్రిపూట ఇంటిపట్టున ఉండడు. పొద్దున్నే ఇంటికి చేరుకుని మొహం చూపితే, సిగ్గుతోటీ, దుఃఖంతోటీ అతడికేసే చూళ్ళేక పోయేది, తల్లి.

వినోద్ ఏదో ఉద్యోగంలో అమరుకున్నాడని మొదట్లో ఆమె విన్నది. అంతే. ఆ ఉద్యోగ మేమిటో, జీతమెంతో అదేంతెలియదు ఆవిడకి. కనుక ఇప్పుడు భవాని మనస్సులో ఒక విధమైన సంతృప్తి సంతోషమూ కలిగింది—"తండ్రి ఆస్తి వీడికి దక్కకుండా చేయటంలో నేను నిమిత్త మాత్రంగా ఉండటంవల్ల కలిగిన అన్యాయమేం లేదు." అనుకుని ఊరట చెందసాగింది.

ఏమంటే—గోకుల్ ఆత్తింటివారి ప్రోద్బలంవల్లా, ప్రోత్సాహంవల్లా తమకెంత అన్యాయమయినా జరగనీ, తన భర్త కష్టార్జితం—ఆయనకి ప్రాణప్రదమయిన దుకాణాన్ని అయినా కనీసం అతడు చెదిరిపోకుండా కాపాడుకోగలడు. ఇదేకదా చచ్చి స్వర్గానవున్న తనభర్త కోరిక?—ఈ విధంగా భవాని మనశ్శాంతి పొందుతూ, కాలం వెళ్ళబుచ్చు తున్నది.

*　　　*　　　*

ఏటా వైశాఖ పున్నమినాడు భవాని బ్రహ్మాండమయిన బ్రాహ్మణ సంతర్పణ చేయించటం మామూలు. ఇవాళే ఆ పర్వదినం. అయితే—ఈయేడు తన వుద్దేశం మానుకోవలిసొచ్చింది. ఏమంటే—చూడబోతే చేతిలో డబ్బులేదు. పైగా, ఒకటి రెండుసార్లు వినోద్‌తో ఈ ప్రసంగం తెచ్చి, కదిలించి చూసింది. అతడు విని పించుకో లేదు.

తెల్లారుజామున హఠాత్తుగా ఎవరో తలుపు తట్టినట్టయింది!—తీసేవుంది.

లోపల భవాని స్నానం చేసుకుని, జపంలో కూచుంది. దాసీది "ఇంకా లేవ లేదమ్మా?" అంటూ తలుపు తోసుకు పోబోయేసరికి, గడగడలాడుతూ గోకుల్ లోపల ప్రవేశించాడు. అతడివెంట కొంతమంది నౌకర్లు—నెయ్యి—గోదుమపిండి—పప్పు—ఉప్పు—బియ్యం—మైదా—శనగపిండి, మొదలైన ఆహార ద్రవ్యాలు, మామిడిపళ్ళగంపలు—బండీలోంచి దించారు. వీటన్నింటితో ఇల్లు నిండిపోయింది.

ఇంటో అడుగు పెడుతూనే గోకుల్ ఇలా అన్నాడు! "మన ఊళ్లో బ్రాహ్మ లందర్నీ స్వయంగా పోయిపిలిచి వచ్చాను. పోయి, ఈ ఊళ్లో వాళ్ళనికూడా పిలి చొస్తాను. ఈ కోతివెధవ ఏమనుకుంటాడో అని జంకి, ఈ పని వదిలేసెయ్యలేక పోతున్నాను. అమ్మేదీ?—ఓహో, ఇంకా లేవలేదు కాబోలు!—నేను వెళ్ళి వంట వాళ్ళని ఏర్పాటుచేసి వస్తా.

"అమ్మా!—అమ్మేదీ?—తమ్ముడెంతో అమ్మా అంతే. ఎవరి అలికిడీ కనబడదు. ఎవళ్ళకీ ఈ గొడవే అక్కర్లేదు కాబోలు. అంతా నా తలమీదే వుంది. సరే. ముసిలీ! మళ్ళీ నేనో గంటన్నరలో వస్తానని చెప్పు. అమ్మతో!—" అంటూ గదబిడగా గోకుల్ వచ్చిన దారినే వెళ్ళిపోయాడు.

ఈ గడబిడంతా చూసి భవాని జపంవించి లేచివచ్చింది. చాటున వుండి అంతా చూస్తూనే వుంది. గోకుల్ అలా వెళ్ళాడనగానే ఆమె కళ్ళవెంబడి అశ్రుధారలు ప్రవహించాయి.

ఇవాళ ఆదివారం. శుక్రవారం రాత్రి వెళ్ళిపోయిన వినోద్ ఆచూకీ ఇప్పటిదాకా లేదు. పొద్దుపోయాక అతడు ఇప్పుడు హఠాత్తుగా వచ్చాడు. ఇవన్నీ చూసి. ముసిలి దాన్నడిగి అన్నీ తెలుసుకుని విస్తుపోయాడు. తల్లికి వినబడేట్టుగా. "అన్నయ్యకి కబురుచేసి ఇవన్నీ తెప్పించుకోకపోతే. నాతోనే చెబితే తీరిపోయేదిగా? ఇప్పుడు నాకెంత అవమానమో తెలుసుకున్నావా?—"

అన్నీ తెలుసు భవానికి. అయినా. మారుమాట చెప్పలేదు. మరి కాస్సేపట్లోనే గోకుల్ తిరిగి వచ్చేశాడు. వినోదుణ్ని చూసీ చూడనట్టే ఉండి. పనిగొడవలో మాటాడలేకపోయాడు. భోజనాలకి. వడ్డనలకీ ఏర్పాట్లన్నీ పురమాయిస్తూ.ఇంటినుంచి సత్రానికి. సత్రంనుంచి ఇంటికీ కాళ్ళు రోళ్ళయేట్టుగా తెగ తిరుగుతున్నాడు.

అక్కడా ఇక్కడా కూడా వంటలు పూర్తయినాయి. సత్రంలో బ్రాహ్మణ భోజనం అయిపోయాక వాళ్ళందరూ ఇంటికొచ్చి సంభావనలు పుచ్చుకున్నారు.

ఇహనేం మాటాడకుండా అక్కణ్నించి వెళదామనుకునే సరికల్లా బెనర్జీ మేష్టరు వచ్చాడు. "గోకుల్!—రావయ్యా; ఇలా వచ్చి కూచో!" అంటూ అందరి మధ్యకీ పిలిచాడు.

గోకుల్ కూర్చున్నాడు. గోకుల్ పిలుపు అందుకుని భోజనానికి వచ్చిన అతిథుల్లో మేష్టరొకాయన. గోకుల్ చేసిన ఆదరణవల్లనే చక్కా కడుపునిండా భోంచేశాడు. అతడి దయవల్లనే ఇంత సంభావన ముట్టింది.

అయితే—ఆరోజున గోకుల్ తనమాట వినకపోయాడనే అవమానం అక్కసు ఇప్పటికీ తీవ్రంగా గుండెల్లో మసులుతూనే వుంది. అందుచేత దాని కివాళ వడ్డీతోసహా ప్రతీకారం చేసితీరాలని నిశ్చయించుకున్నాడు.

ఆయన చిరకాలంగా వైకుంఠ మజుందారు సొమ్ము తిని తిని బాగా జీర్ణం చేసుకుని ఉన్నవాడు. ఆనాడు విమాయీ రాయ్‌కోసం వెళ్ళి అందరికంటే తనే ఎక్కువగా అగౌరవం పొందినట్లు భావించాడు.




కనుక, ఇప్పుడు సభవారందరి ఎదటా, వినోద్‌ని ఉద్దేశించి కళ్ళు చిట్లించు కుంటూ, "ఏం తమ్ముడూ, ఇవాళ అన్నయ్య చేసిన ఎత్తుకి అర్థం ఏమిటో ఏమన్నా కనిపెట్టగలిగావ్?—" అని ప్రశ్నించాడు.

బెనర్జీ వైఖరి కనిపెట్టి గోకుల్ చిన్నబుచ్చుకున్నాడు.

"లేదు, తెలియదు" అని బదులు చెప్పాడు వినోద్, ముక్తసరిగా.

అప్పుడు మృదువుగాను, గంభీరంగాను నవ్వి, బెనర్జీ మేష్టరిలా అన్నాడు: "బాగుందిలే వరస! ఇహ నువ్వు దావా గెలిచినట్టే! పెద్దగా బి ఏ. ప్యాసైనావుకదా, అమ్మని అరచేతిలో పెట్టుకోటానికే అన్నయ్య ఈ సంతర్పణ ఎత్తు వేశాడన్న సంగతి ఇంతమాత్రం తెలుసుకోలేకపొయ్యావే? పోనీ, అమ్మనెందుకు లొంగదీసుకో వడం అన్న విషయం గ్రహించావ్?—వ్యాజ్యమంతా అమ్మమీద నిలబడివుంది. తెలుసుకో!—అందుకనీ "

గోకుల్ మొహం నల్లబడింది.

"మేష్టారూ!—అలామాత్రం ఎన్నటికీ అనుకోకండి!" అంటూ గబగబా హడా విడిగా అక్కణ్నించి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

అప్పుడు బెనర్జీ మాష్టరు వినోద్‌తో "చూడు తమ్ముడూ!—గోకుల్‌ని మాత్రం ఇహ నిక్కడ అడుగు పెట్టనివ్వబోకేం?—నీ ఉద్యోగం కూడా ఊడగొట్టించి, నిన్ను

సర్వనాశనం చెయ్యండీ వాడు వదలడు!'' అని ఘట్టిగా హెచ్చరించాడు.

పోతూ పోతూ గోకుల్ కూడా ఈ మాటలన్నీ విన్నాడు వినోద్ సిగ్గుతో తల వంచుక్కూచున్నాడు. అన్న సంగతీ, స్వభావమూ వినోద్‌కి బాగా తెలుసు. అతడికి మనసులో ఒకటీ, పైకి ఒకటీ లేదని వినోద్ ఎరుగును. అయినా మేష్టా మాటలు కేవలం నమ్మకుండానూ ఉండలేకపొయ్యాడు ఏమైనా, అంతమంది ఎదట ఆయన తన అన్నకు చేసిన అవమానం అతన్నెంతగానో బాధిస్తూనే వుంది

భోజనానికి వచ్చిన పెద్దలంతా ఎక్కడి వాళ్ళక్కడికి వెళిపోయారు తరవాత వినోద్ లోపలికి వెళ్ళిచూసేటప్పటికి తల్లి గదితలుపు మూసివుంది భవాని పడుకుని వుంది ఇక్కడ జరిగిన మేష్టారి మాటలన్నీ అవిడ వినేవున్నదని ఎవర్నీ అడక్కుండానే వినోద్ తెలుసుకున్నాడు

* * *

దుకాణం పని ముగించుకున్నాడు గోకుల్ చీకటిపడ్డాక ఇంటికి తిరిగివస్తే, అక్కడా ఒక చిత్రమైన నాటకమొకటి జరుగుతూంది మొహం ఎలానో పెట్టుకుని మంచంమీద కూర్చుని వున్నాడు, మామగారు రాయ్‌బాబు ఆయన కూతురు కిందని నేలమీద హేముని దగ్గరెట్టుక్కూచుని, తనమొహం కూడా తండ్రి మొహంలాగే చేసుకుంటూ వుంది

గోకుల్ అడుగు పెట్టంగానే రాయ్ మహాశయుడు ఇలా ప్రశ్న వేశాడు ''ఏమండీ అల్లుడుగారూ!—మీరు ఏమీ తెలియని అమాయకుడిలాగే వుండి, ఇంత తెలివితక్కువగా మీ అమ్మచేత మాకు తీరని అవమానం చేయించారే? దీనికేమిటి ప్రతిక్రియ? చెప్పండి చప్పున చెప్పండీ!'' అంటూ తొందరపెట్టాడు

ఇవాళ గోకుల్ మనస్సు ఇలాంటి ఘర్షణలవల్ల అసలే చెడిపోయివుంది. పైగా పొద్దుటినించీ మధ్యాహ్నం దాకా ఒకేపని రాటుతో పూర్తిగా అలిసిపోయివున్నాడు. ఇప్పుడిలాంటి దబాయింపులు మరి సహించలేక ఒళ్ళు మండిపోయింది —

దీనికి తోడు—మనోరమ కూడా ఇప్పుడే ఏడుస్తూ వచ్చి, ''ఇహ మళ్ళీ మీరు అక్కడికి వెళ్ళారంటే, నే నురిపోసుకు ఛస్తా!'' నన్నది, వెక్కి వెక్కి

కూతురు మాటతో రాయ్‌బాబుకి మరింత ఉత్సాహం కలిగింది— ''ఆ దేవత ఏమయినా సజావయింవయితేగా ?'' అని గంభీరస్వరంతో ఉటంకించాడు

మరి ఉండబట్ట లేకపొయ్యాడు, గోకుల్

''చీ చీ!—నోర్ముయ్!—మా అమ్మని గురించి అలా పేలావంటే, మెడపట్టుకు బైటికి గెంటుతా!—'' అని తుపాకి పేల్చినట్టు అరిచి, తనే అక్కణ్నించి గబగబా



వెళిపోయాడు

తమమీదనే పిడుగు పడ్డట్టుగా—రాయ్‌బాబూ, కూతురూ ఒకాళ్ళ మొహా లొకాళ్ళు చూసుకుంటూ కూచున్నారు!—హారి గోకుల్!—ఇదేమిటిలా చేశాడు!—పూజ్య పాదులయిన మామగారికి ఎంత భయంకరమైన అవమానం చేసేశాడూ, అహా!!— ఎంతపని చేశాడూ!!!

# 13

ఉన్నారుగా, వినోద్‌ని అహర్నిశలూ ఆశ్రయించుకునుండే బేడిమూక?—సలహా సంఘం?—వాళ్ళందరూ అతడి చుట్టూతా పోగయి, 'వెయరా భాయ్, వెయ్‌దావా! ఇంకా చూస్తావేం, మడ్డి మృగంలాగా?—'' అంటూ ప్రోత్సహించటానికి మొదలెట్టారు.

దీనికంతా ఒక్కటే కారణం—ఒకవేళ అతడు ఓడిపోతే వాళ్ళకి పోయేదేం లేదు, గెలిచాడా అంటేమాత్రం ఇక చూస్కో, అంతా వాళ్ళకి పంటే!—అదంతా వాళ్ళకి లాభమే! ఆ వస్తువుతోవాళ్ళు చాలాకాలందాకా ఆనందిస్తూ హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు!—

ఏది ఏమయినా కానీ, దావామాత్రం పడేసేతీరాలి, వెయ్యకతప్పదు. అని ఆ సంఘంలో ఒక విధంగా నిర్ధారణయి పోయిందికూడా. ఎందుకంటే—దీనికి ఒక కారణముంది:

ఒకనాడు వినోద్ ఆంతరంగిక మిత్రుల్లో ఒకడు—తక్కిన అందరితో కూడ బలుక్కున్నాక—రాజీ మాటలకోసం గోకుల్ వద్దకువెళ్ళాడు. తీరా, మాటలు ప్రారంభించేసరికి, గోకుల్ ఇలా నోరు చేసుకున్నాడు: "అదౌర్భాగ్యుడి తరఫున వచ్చి నట్టున్నావే నువ్వు? దురాచారపు వెధవకి ఒక్కపైసాకూడా ఇవ్వను. ఫో!— మీరంతా కలిసి ఏం చేసుకుంటారో చేసుకోండి; మీ దిక్కున్నచోట చెప్పుకోండి!—" అంటూ, ఇలా అవి, వాళ్ళని ఊరిబయటివాకా తరిమి కొట్టాడు.

స్నేహితులూ వాళ్లూ ఇంతగా పోరుతున్నందుకు, వినోద్ ఈపాటికి దావా పడెయ్యవల్సిందే. కాని, ఇంతపెద్ద ఆస్తికోసం దావా చెయ్యడం మాటలుకాదు, స్టాంపు డ్యూటీకే బోలెడంత మదుపు కావాలి. కనకనే ఈ వ్యవహారం ఇలా ఆలస్యమై నీళ్ళు కారుతూంది.

* * *

వినోద్‌కి అన్నమీద ఎంతయినా కోపమే వుండొచ్చు. కాని, ఆ రోజున అంటే— వైశాఖ పున్నమి నాటినించీ అతడి పంచప్రాణాలూ విలవిల్లాడి పోతున్నాయి.

అంతమంది పెద్దల ఎదట తన అన్నగారు ఎంతటి అవమానం పొందాడు!— ఇహను అక్కడ నిమిషమైనా నిలవలేక ఎలా పరుగెత్తుకుపోయాడు, పాపం! —ఆనాటి అతడి ముఖంలోని దుఃఖవైఖరి కళ్ళకి కట్టినట్టున్నది. ఎంత మరిచిపోదామనుకున్నా వినోద్ మరిచిపోలేకుండా వున్నాడు!—

అబ్బాయీ!—అదంతా అన్యాయం, అన్యాయం, అన్యాయం! కేవలం అన్యాయం జరిగిపోయింది! లేనిపోని అపవాదు ఆ అమాయకుడి పైన కల్పించి, అతడు పారిపోయేట్టు చేశావు!—అంటూ ఎవరో తన మనస్సులో అనుక్షణమూ చెబుతున్నట్టు తోచింది, వినోద్‌కి.

సరే, తన అన్న అబద్ధాలకోరు అనీ, మోసగాడనీ నిందవేసి అతన్ని పంపించి వేశారు. ఇంత అవమానం జరిగిం తరవాత, ఇహ అతడు తన జీవితకాలంలో మళ్ళీ ఈ గడప ఎన్నడైనా తొక్కుతాడా, ఈ చాయలకయినా వస్తాడా? —రాడు, రాడు, రాడు! అని గట్టిగా నిర్ధారణ చేసుకున్నాడు

ఆ ప్రాంతంలో చదువుకున్న వాళ్ళు చాలామంది వినోదుడి స్నేహితులే. ఆ అందరికీ అతడిమీద ఎంతో సానుభూతి కూడా వుంది. అన్నదమ్ముల ఆస్తిపాస్తుల విషయంలో వాళ్ళంతా అతడి పక్షమే అనుకోవచ్చు

ఒకరోజున పొద్దున్నే వాళ్ళంతా బైటి గదిలో కూడారు. బెనర్జీ మేష్టర్ని పట్టుకు తీసుకొచ్చారు. ఆలోచనలూ, వాదోపవాదాలూ జరిగాయి. చివరికి అంతాకూడి ఒక్కచే

నిశ్చయించారు: గోకుల్‌ని లొంగదియ్యాలంటే వేరేదారిలేదు—మాటల్లో పడగొట్టడం తప్పితే.

గోకుల్ మూర్ఖుడు, అమాయకుడు, అని అందరకూ తెలుసు. అంచేత ఏదో విధంగా అతణ్ని రెచ్చగొట్టాలి, రోషం ఎక్కించాలి, తనంతట తనే ఏదో చిక్కులో పడేమాట అనేట్టు అతడి చేతనే అనిపించాలి. అప్పుడు సాక్షుల్ని సులువుగా సృష్టించవచ్చు. ఆ ఆధారంమీద సాక్ష్యం నిలబెట్టవచ్చు.

వచ్చే ఆదివారంనాడు ఉదయాన్నే పదిమంది పెద్దమనుషుల్ని పోగుచేసి ఒకచోట సమావేశ పరచడం, అందరూకలిపి గోకుల్ ఇంటికెళ్ళడం, వాక్కులనే పాశాలతో గోకుల్‌ని బంధించి వెయ్యడం—ఇదీ వాళ్ళు నిశ్చయించుకున్న కార్యక్రమం.

ఈ సందర్భంలో—ఎదటలేని గోకుల్‌ని గురించి తమాషాలూ, హాస్యాలూ, వెక్కిరింపులూ ఎన్నెన్నో కురిశాయి. అతడింటికి వెళ్ళినప్పుడు ఇందులో ఎవరు ఏం మాట అనాలి, ఎవరు ఏమి వాక్యం చెప్పాలి, అవన్నీ కంఠస్థం చేసుకుని, ముందు ఆడబోయే నాటకమంతా ఒకసారి అభినయంచేసి చూసుకున్నారు.

ఇందరూ ఇన్నివిధాల గుంజుకు పోతున్నారే కాని, వినోద్ మాత్రం పల్లెత్తుమాట అనకుండా తల వంచుకూర్చున్నాడు. ఆనందంతో తాండవిస్తున్న వాళ్ళ సందడిలో, అక్కడ కూచునివున్న వినోద్ ముఖంలో విచారరేఖలు తప్ప, ఎటువంటి సంతోషమూ లేశమాత్రమైనా లేదన్నసంగతి ఒక్కళ్ళూ గమనించనే లేదు. ఎవళ్ళకూ అతడి ధ్యాసేలేదు. ఈ విధంగా ఉత్సాహపూరితమైన ఆ సమావేశం ముగియగానే ఎవళ్ళ యిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు.

*  *  *

వినోద్ ఇవ్వాళ ఏ పనిమీదా బయటికి పోనేలేదు. భోజనాలయాక యింటోనే కూర్చుని వున్నాడు. సుమారు ఒంటిగంటకు గోకుల్ హఠాత్తుగా వంటింటోకి వచ్చి, "ఏం ముసిలీ!—భోజనాలందరివీ అయినట్టేనా?" అనడిగాడు.

ముసిల్ది గబగబలాడుతూ ఒక పీట తెచ్చివేసి, లేదు, పెదబాబూ!—ఇంకా లేదు!—" అని చెప్పింది.

ఇంకా కాలేదా? అంటూ గోకుల్, తనే ఆ పీట చేతపట్టుకు వెళ్ళి, వంటింటి ముందు వేసుకూర్చున్నాడు. "ముసిలీ!—ఒక్క చెంబుడు చల్లటి మంచి నీళ్ళియ్యమ్మా!—మధ్యాన్నమంతా పేచీలతోటే ఊరంతా తిరిగి తిరిగి హైరాణయిపోయిందీ—అమ్మేదీ? అనడిగాడు.

అప్పుడు భవాని వంటింటో ఆ పక్కనే గదిలో వుంది. ఆ రోజున బెనర్జీ

మేష్టరు గోకుల్‌కి చేసిన ఘోర పరాభవంతో తనకెక్కడ జోక్యం ఉందనుకు పోతాడో అవి, సిగ్గుపడిపోయింది. ఎదటికి రాలేకపోయింది.

వినోద్ యింటో కనబడలేదు. అంచేత పనిలోకి వెళ్లిపోయుంటాడని అనుకున్నాడు. గోకుల్. అనుకుని మనస్సు విడిచి యిలా చెప్పడం మొదలెట్టాడు,

"ముసిలీ!—అదంతా కుద్దాబద్ధం. ముసిలీ!—అంతా మోసం! కలికాలంలో ధర్మమనేది ఎక్కడేడిశింది?—నాన్న చచ్చిపోయేటప్పుడు "నాయనా, గోకుల్!—ఇదుగో, అమ్మను నీకు అప్పగించిపోతున్నా. కనిపెట్టి ఉండుసుమా!" అని చెప్పిపోయాడు నేను అమాయకుణ్ణి, వెర్రిబాగులవాణ్ణిగనక, వాడు అమ్మను బలవంతంగా తీసుకువచ్చేశాడు గానీ, లేకపోతే సాధ్యమయేపనేనా? ఏం?—వాడెందుకు అమ్మను తీసుకొచ్చేసెయ్యాలీ? నేనుమాత్రం ఆవిడ కొడుకును కానా?—కావాలంటే వాడిలాగే నేనూ అమ్మని యిక్కణ్నించి బలవంతాన తీసుకుపోలేనూ? దానికేం. ముసిలీ!—నీకు తెలుసు. నాన్నగారు రాసిన అసలు వీలునామా ఇదే! అంతేగాని, కలంతో నాలుగు పంక్తులు గిలికేస్తే అది విల్లు ఎలా అవుతుంది, ముసిలీ?" అని చెప్పుకుపోతున్నాడు.

అంతలో ముసిల్ది, తమ్ముడింటోనే ఉన్నాడన్నట్టుగా గోకుల్‌కు కంటిసంజ్ఞ చేసింది. గోకుల్ చెంబు అక్కడే వుంచేసి, సావిట్లోకి వెళ్ళి. చప్పుడు కాకుండా చెప్పులు తొడుక్కుని మెల్లిగా వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

రాత్రి సుమారు తొమ్మిది పదిగంటలకు రసిక చక్రవర్తి హఠాత్తుగా వచ్చాడు "అమ్మా! ఇంతదాకా పెదబాబు యింటికి రాలేదు. భోంచేసి యిక్కణ్నించి ఎప్పుడు వెళ్ళాడూ?" అనడిగాడు.

తుళ్ళిపడింది, భవాని. "వాడిక్కడ భోంచెయ్యనేలేదు. ఏదో పేచీలతో హైరాణ పడి వచ్చాననంటూ, ఒక్కచెంబెడు మంచినీళ్ళు మాత్రం తాగి, ఆపళంగా వెళ్ళిపోయాడు" అని చెప్పింది.

అందుకు చక్రవర్తి—"అలాగా, పాపం!—ఇవ్వాళ ఆయన పుట్టినరోజు. ఇంటో పోట్లాడివస్తూ 'నే నిక్కడ భోంచెయ్యను. వెళ్ళి, అమ్మ చేతిప్రసాదం తినివస్తాను' అని చెప్పి వచ్చాడు. అయితే, రోజల్లా ఉపవాసమే కాబోలు! పండగల్లా ఎండగయిందే!" అన్నాడు విచారంగా.

ఈ మాట వినేసరికి, భవానికి గుండె బద్దలయింది.

పక్కగదిలోనేవున్న వినోద్, చక్రవర్తి గొంతుక వినిపించగానే దగ్గిరకొచ్చి



కూచుని, తమాషాకు యిలా అడిగాడు "ఏమండీ, చక్రవర్తిగారూ!—నిమాయీ రాయ్‌గారి హయాంలో మీ గుమాస్తాగిరీ ఎలా నడుస్తూంది ?"

ఆశ్చర్యంతో చక్రవర్తి—"అరె? నిమాయీ రాయ్‌గారా?—రామరామా! ఆయనెవడు మన కొట్టులో కాలెట్టడానికి? గుండేసి కొట్టెయ్యమూ?" అన్నాడు.

"కాదులెండి అన్నయ్యమీద సర్వాధికారం చెలాయిస్తూ, వాణ్ని మింగెయడానికి చూస్తున్నాడని విన్నాడు?"

చక్రవర్తి నవ్వుతూ, భవానికేసి చేత్తో చూపించి యిలా జవాబు చెప్పాడు·

"ఈవిడ బతికున్నంతవరకూ అలా ఎన్నడూ జరగదు, చినబాబూ!—నన్ను వెళ్ళగొట్టి తను గద్దెక్కి కూచుందామని చూశాడా మామగారు కాని, అమ్మగారి నోటినుండి వచ్చిన ఒక్కమాట సుగ్రీవాజ్ఞ అయింది, దాంతో ఆయనగారి ఆటంతా కట్టేసింది. ఇప్పుడిహ మోసంచేసి నీచంగా సంపాయించుకున్న నాలుగు రాళ్ళూ తప్ప, అంతకుమించి మరేం మిగిలి చావలే. దుకాణంలో ఆయన కాలయినా పెట్టలేదు" అంటూ, ఆనాడు జరిగిన కథంతా వివరించాడు, చక్రవర్తి

ఇంకా యిలా చెప్పాడు—

"పెద్దబాబు బోళా మనిషి, శుద్ధ అమాయకుడు, జిత్తులూ, మాయలూ తెలియవు, తెలుసుకోలేడు లేకపోతేపోనీ, బందిలేదు ఆ మారాజుని ఈ తల్లీ, పైమంచి ఆ తండ్రీ కనిపెడుతూనే ఉన్నారు. తల్లీ తండ్రీ అంటే ఆయనకెంత

భక్తి! ఎంత గౌరవం! ఆయిన హృదయంలోంచి దాన్నెవరయినా తొలగించ గలరా!—

"అమ్మగారి ఆజ్ఞను రద్దుచేసే శక్తి నాకు లేదు" అని పెదబాబు ఏనాడు చెప్పాడో, అప్పట్నించీ యింటో ఏడుపులూ, పెడబొబ్బలూ, పోట్లాటలూ ఎన్నెన్నో బయల్దేరాయి.

"ఎన్ని జరిగితేమటుకి?—ఏమన్నాడు పెదబాబు? అది నాన్న ఆజ్ఞ—యిది అమ్మ ఆజ్ఞ—వీటికి విరుద్ధంగా వెళ్ళటానికి నా తరంకాదు" అని స్పష్టంగా చెబుతున్నాడుగా? ఇప్పుడు పెదబాబు వల్లిస్తున్నవి రెండే రెండు మంత్రాలు— "అది నాన్న హుకుం. ఇది అమ్మ హుకుం"—ఆస్తికి నే నెంత అధికారినో, తమ్ముడూ అంతే అధికారి!" ఇంతకుమించి మూడోమాట లేదు

"చినబాబూ!—మొట్టమొదట వ్యాపారం నా చేతిలో పెట్టినరోజున ఎలా అయితే వుందో, ఈనాడూ అదే మోస్తరుగా వుంది. ఏమీ మార్పులేదు," అన్నాడు

వినోదుడి కళ్ళు రెండూ బగబగలాడుతూ నీళ్ళతో నిండిపోయినయ్.

చక్రవర్తి ఇంకా చెప్పాడు—

"చినబాబూ!—నీ కిలాంటి అన్నగారు దొరకటం ఎంత అదృష్టం? మరెవరి కయినా లభిస్తాడా? ఎంతసేపూ మాటాడితే "నా తమ్ముడు—నా తమ్ముడు!" అనడమే గాని మరోమాట లేదుగా? ఆయన నాలికమీద ఇరవైనాలుగ్గంటలూ 'వినోద్' పేరే ఆడుతూ వుంటుంది!—

'మా వినోదుడిలాగా ఎవ్వరూ పెద్దపెద్ద పరీక్షలకి ఇంకా చదవలే. వినోదుడి లాంటి తమ్ముడు ఇంకెవ్వరికీ లేడు" అని చెప్పి పొంగిపోతుంటాడు.

"లోకులు వచ్చి 'నీ తమ్ముడు ఇలాంటివాడు, అలాంటివాడు' అని మీమీద ఎన్ని రకాల నిందలూ, అపవాదులూ వేస్తూంటే, వెంటనే ఆయన నా దగ్గరికొచ్చేసి నవ్వుతూ, "చూశారా, చక్రవర్తీ!—వెధవలు! వీళ్ళందరికీ నా తమ్ముడంటే ఓర్వ లేనితనం, వాణ్ణి హింసలపాలు చెయ్యటానికే ఇలా లేనిపోని మాటలన్నీ కల్పిస్తుంటారు. వీడు వెర్రివెంకటాయా, ఆ కబుర్లన్నీ నమ్మేస్తాడూ అనుకున్నారు కాబోలు!"

కాస్సేపుండి చక్రవర్తి మళ్ళీ చెప్పాడు—"చినబాబూ!—ఇంకో చిన్నతమాషా ఒకటి జరిగింది, విన్నారో లేదో?—కాశీనుంచి మహాపండితుడు ఒకాయన వచ్చాడు. "మీ తమ్ముడి మనస్సు బాగుచేస్తాను దీనికిగాను వెయ్యి బంగారపు తులసి ఆకులతో




పూజ జరగాలి ' అని చెప్పాడు. వెంటనే అన్నయ్య సరేనన్నారు

"వొద్దు—వొద్దు! అంతా మోసం! అంటూ నేనెన్నోవిధాల మొత్తుకున్నా. వినిపించుకుంటేగా?—అయిదువందలూ ఆయనచేతులో పోశాడు "నా తమ్ముడి మనస్సు కుదుటపడటం, వాడు ఎం.ఏ. ప్యాసవడం నాక్కావాలి. అంతే వెధవ అయిదువందలు పోతే ఒక లెక్కా!" అని సమాధానం చెప్పారు ' అన్నాడు.

వినోదుడు కళ్ళు తుడుచుకున్నాడు రుద్ధమయిన కంఠస్వరంతో ఇలా అన్నాడు. "అవునండీ, చక్రవర్తిగారూ!—నా పేరుచెప్పి ఇలా ఎంతోమంది అన్నయ్యని మోసగిస్తున్నారనీ, డబ్బు కాజేసిపోతున్నారనీ విన్నాను "

చక్రవర్తి స్వరం కాస్త తగ్గించి, ఇలా అన్నాడు. "చినబాబూ!—వీడున్నాడే. ఈ బెనర్జీ మేష్టరు!—వీడుమాత్రం ఏం తక్కువడబ్బు తిన్నాడనుకుంటున్నావా? అనర్థాలన్నింటికీ కారణం వీడే!!—"

ఆ తరవాత—

తండ్రి పోయాక గోకుల్ బెనర్జీని ఆత్మీయుడుగా ఎలా నమ్మాడో, తమ్ముణ్ణి తీసుకురమ్మని వందలకొద్దీ రూపాయిలు ఎలా ఆయనచేతిలో కుమ్మరించాడో, ఆయన గారు ఆ డబ్బంతా మింగేసి "ఇదుగో, ఇవాళ మెయిల్లోనే మా అబ్బాయిని పంపిస్తున్నా" నంటూ ఎలా కుర్రవాణ్ణి దాచేసి వంచన చేశాడో, ఈ కబుర్లన్నీ గోకుల్ ఎలా నమ్ముతూ వచ్చాడో, మొదలైన భోగట్టాలు వివరించాడు

"చివరికి—మీ అబ్బాయిని వెంటబెట్టుకుని నేనే స్వయంగా ఇవాళ బండీకి

వెళ్లాలి'' అని బయల్దేరితే, ''అయ్యొ రామా!—నీలాంటివాడు వెళ్ళాల్సిన చోటా అదీ!'' అంటూ ఏమేమో చెప్పి, డబ్బు గుంజుకున్న విషయంకూడా తెలియజెప్పాడు.

చక్రవర్తికీ వినోద్‌కీ మధ్యని ఇన్నిమాటలు జరుగుతున్నా, భవాని ఒక్క మాటయినా అందుకోలేదు. ఆమె కళ్ళనుండి వర్షధార ప్రవహిస్తూంది!—

సెలవు తీసుకుని చక్రవర్తి వెళ్ళిపోయాడు. తరవాత వినోద్ పడుకుందామని వెళ్లాడు కాని, రాత్రంతా నిద్ర పట్టలే చక్రవర్తి ముఖతా ఇవాళ అతడు జరిగిన కథలన్నీ విన్నాడు, పరిస్థితులన్నీ తెలుసుకున్నాడు

''ఎక్కడా చూడని అపరూపమైన ఈ వీలునామా ఎందుకు పుట్టింది? ఈ ఆస్తి తనక్కాకుండా ఎందుకు చేశాడు తండ్రి? ఇటువంటి అన్నగారు ఈ ఆస్తిని తనకు కొంచెమయినా పంచిపెట్టకుండా ఎందుచేత ఊరుకున్నాడు—ఈ ప్రశ్నలే రాత్రంతా మేలుకుని ఆలోచిస్తూ కూచున్నాడు.

# 14

వినోదుడి స్నేహితులందరూ ఊరుకోలేదు. గట్టి పట్టుదలతో వున్నారు. ఒక ఆదివారం ఉదయానే చాలామంది పెద్దమనుషుల్నీ ఉద్యోగస్థుల్నీ పోగుజేసుకుని గోకుల్ బసకు వెళ్ళారు. అక్కడకూడా బోలెడంతమంది జనాన్ని చేరదీసి, తమ వెంట తీసుకుపోయి, గోకుల్ ఇంటి అరుగుమీద కూర్చున్నారు.

గోకుల్ దుకాణానికి వెళ్ళబోయే ప్రయత్నంలో వున్నాడు ఒక్కుమ్మటుగా ఆకస్మికంగా ఇంతమంది పెద్దమనుషులు తన ఇంటికి రావడం చూస్తే అతడికి కంగారే పుట్టింది.

ఆ వచ్చిన జనంలో డిప్టీ కలెక్టరు, సబ్ జడ్జి, ఎన్నడూ ఎక్కడికీ రాని గిరీశబాబూ మొదలయిన ప్రముఖులంతా ఉన్నారు ఇందులో ఎవరెవర్ని ఎక్కడెక్కడ కూచోబెట్టాలి? ఎలా మర్యాదచెయ్యాలి? అనే సమస్యతో ఏమీ తోచక ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు, గోకుల్

వినోద్ అదోలా ఉన్నాడు అతడు చివ్వరికి పోయి, మాటాడక తలవంచుక్కూచుని వున్నాడు అతడి ముఖంచూస్తే, గుడికి మేకపోతుని తీసుకుపోతున్నట్టుగా తనని ఇక్కడికి వీళ్ళంతా కలిసి బలిమిని లాక్కొచ్చినట్టు బాధపడుతున్నాడా అని పిస్తూంది

బెనర్జీ మేష్టారు అక్కడనే హాజరుగా ఉన్నాడు మహాపెద్దమనుషుల్లో లెక్క కట్టవలసిన ఆ మహాశయుడు మెల్లిగా కథ ఆరంభం చేశాడు



చూస్తూ చూస్తూ ఉండగానే గోకుల్ ముక్కూ, మొహమూ ఎర్రబడ్డాయి

"ఓహో, ఇందుకోసమేనా ఇంతమందీ వచ్చారు, పాపం!—దయచెయ్యండి అవతలికి వెళ్లండి పోయి దావా వేసుకోండి ఆ దౌర్భాగ్యుడికి దమ్మిడీ కాదుగదా, ఒక్క రోలీ అయినా ఇవ్వను. వీడు వర్ధి తాగుబోతై పోయాడు!" అన్నాడు, కోపంగా

ఈ మాటలు వినగానే అందరూ గప్‌చిప్‌గా ఊరుకున్నారు

బెనర్జీ మేష్టరు మాత్రం మొహం అదోలాపెట్టి నవ్వుతూ, ఒళ్ళంతా కదిలించు కుంటూ, ఇలా అన్నాడు :

"సరే, వాడు తాగుబోతు అన్నావ్, ఒప్పుకుందాం. అయితే అయాడు కాని,

పిత్రార్జితమయిన ఆస్తిని పంచిపెట్టకపోవటానికి క్కారణ మేమిటి? అలా చెయ్యటానికి హక్కెవడవ్? నీ తండ్రి మరణకాలమందు మోసంచేసి, వంచించి, ఆయనచేత రాయించి, నువ్వు దొంగవిల్లు సృష్టించలేదనటానికి రుజువేమిటి?'' అంటూ నిలదీసి అడిగాడు.

ఇందుకు గోకుల్ అగ్గిలా మండిపడి, రంకెలువేస్తూ ఇలా చెప్పాడు ''నేను దొంగనా? మోసగాడినా? వంచన చేశానా? దొంగవిల్లు సృష్టించానా? ఆ మాట అన్న వెధవ ఎవడు?''

సభలోవున్న గిరీశబాబు వృద్ధపండు అనేక విషయాలు తెలిసిన జ్ఞాని బాగా చదువుకున్నవాడు మాంచి తపస్వి

''నాయనా, గోకుల్!—ఇలాటి విషయాల్లో ఉద్రేకం పనికిరాదు. తొందరపడకు శాంతంగా సమాధానం చెప్పు'' అని మందలించాడు, కోమలమైన స్వరంతో.

ముజుందార్ కుటుంబ విషయాలన్నీ బెనర్జీ మేష్టరుకి పూర్వకాలంనించీ బాగా తెలుసు. వాళ్ళ అమాయికత్వాలూ, పెద్దలనాటి తగాయిదాలూ అన్నీ ఎరుగును పాత పందికొక్కు!—కనక, ఇప్పుడు కళ్లు మిటకరించుకుంటూ గోకుల్‌ని ఇలా బెదిరించాడు· ''ఇహనయితే, సరి, సరి! మీ అమ్మ కోర్టులో బోనెక్కి సాక్ష్యం చెప్పాలిసే వుంటుంది, తప్పదన్నమాట?'' అన్నాడు.

ఆయన ఏ వుద్దేశంతో ఆలోచించి ఆలోచించి ఈమాట తూచివేశాడో, దానికి అనుకున్నట్టుగానే ఫలితం కనిపించింది.

గోకుల్‌కి వెర్రెత్తిపోయి ఇలా అనేశాడు—''ఏమిటీ?—మా అమ్మని కోర్టుకి లాగుతావా? బోనెక్కిస్తావా? ఛీ—ఫో!—ఆ డబ్బూ దస్కం అంతా మీరే పట్టుకుపోండి! నాకేం అక్కర్లేదు. వద్దనే వద్దు. నేనేం కోర్టుకి రాను, అమ్మ అంతకంటే రాదు. మా అమ్మని తీసుకుపోయి నేను కాశీలో వుంటా!—''

ఎదటనే వున్నాడు, నిమాయీరాయ్ ''శాస్త్ర ఆగవయ్యా, అల్లుడుగారూ!—ఎందుకొచ్చినవీ పిచ్చిపిచ్చి మాటలు? బాగానే వుందిలే!—'' అంటూ ముఖం చిట్లించి, కన్ను గిలిపాడు.

మామగారి మాటలేం వినిపించుకోలేదు, లక్ష్యపెట్టలేదు గోకుల్. సభవారి అందరి ఎదటా తన కుడికాలు ముందరికి చాచాడు. వినోదుణ్ణి చూసి, అలా వెర్రిగానే ఆవేశంతో అరుస్తూ ఇలా అన్నాడు.

''ఓరి దౌర్భాగ్యుడా! రా, ఇలా రా! ఇదుగో చూశావా, నా కాలు జాపాను. కాలిమీద చెయ్యివేసి, ''నా అన్న మోసగాడు, కుట్రదారు!'' అని చెప్పు. ఈ క్షణమందే

అ_స్తంతా పీ కిచ్చేయ్యకపోతే, నేను వైకుంఠ ముజుందార్ కొడుకునే కాదు !''
మామగారు గజగజలాడి వణికిపోయాడు.

''ఇదేం పిచ్చిపనండీ అల్లుడుగారూ!—వేసుకోమనండి అతగాణ్ణి. వ్యాజ్యం. కోర్టులో ఎలా అయితే అలా ఫయిసలవుతుంది. అంతేగాని, ఈ ఒట్లూ, తిట్లూ, ప్రమాణికాలూ, ఆఘాయిత్యాలూ—వీటన్నింటికీ అవసర మే మొచ్చిందంట ?— చాలు, చాలు, ఇంటోకి పదండి!'' అంటూ చెయ్యిచ్చుకు లాక్కుపోబోయాడు.

వినోద్ మొహమెత్తి అయినా చూళ్ళేదు. ఒక్కమాటకూ జవాబు చెప్పలేదు. ఇదివరకెల్లా కూచున్నాడో, ఇప్పుడూ అలానే కూర్చునివున్నాడు

గోకుల బలవంతాన మామగారి పట్టునించి చెయ్యిలాక్కుని తప్పించుకున్నాడు. ''ఉహుం!—రాను, రాను నేను లోపలికి రాను ఇక్కణ్ణించి ఒక్కంగుళమయినా కదలను'' అని చెప్పి భీష్మించాడు.

కొంచెం సేపటి తరవాత ఆకాశం కేసి చూస్తూ గోకుల్ ఇలా అన్నాడు —

''నాన్న వింటూనే వున్నాడు. చచ్చిపోయేటప్పుడు అదిగో, ఆయనేమన్నాడో తెలుసా?—''అరె, గోకుల్!—ఈ ఆస్తి అంతా మీ అన్నదమ్ము లిద్దరిదీను చిన్న వాడికి బుద్ధి ఎప్పుడు వస్తే అప్పుడు, వెంటనే వాడిభాగం వాడికి పంచిపెట్టెయ్''అని

''ఈ ఆస్తి అంతా నేను యక్షుడిలాగా కాపాడుకు వస్తుండటం, నాన్నగారు స్వర్గంలోంచి కనిపెడుతూనే ఉన్నారు ఎప్పుడు వాడికి బుద్ధి వస్తుందా, తమ్ముడు మళ్ళీ యింటికెప్పుడు వస్తాడా అని అహోరాత్రాలు అదేపనిగా వెయ్యి దేవుళ్ళకు మొక్కుతున్నాను అయినాకాని, వీడికంటికి నేను మోసగాణ్ణయి పోయాను

''రారా తమ్ముడూ —ముందుకి రా నా పాదంముట్టి ఈ అందరి ఎదటా చెప్పు. ''నా అన్న నన్ను దగా చేశాడూ, ఆస్తి అంతా కాజేశాడూ' అని ఈ పెద్ద లందరి ముందూ చెప్పు!—'' అన్నాడు

చుట్టపక్కాలంతాకలిసి వినోదుణ్ని నలుమూలలనించీ ముందుకి నెట్టడం ప్రారంభించారు. కాని, అతడు ఏమాత్రం కదల్లేదు.

అప్పుడు బెనర్జీ మేష్టరు అతడి చెయ్యిచ్చుకుని, ఒక్కగుంజు గుంజి, ''కాలుచ్చుకుని ఆ కాస్తమాటా చెప్పటానికి ఎందుకిలా భయపడతావ్, వినోద్ ?— చెప్పేసెయ్!—ఇంతమంచి యోగం నీ కెప్పుడు పడుతుందీ?—'' అంటూ ప్రోత్సహించి, వేగిరపడుతూ, అతణ్ణి పొడిచాడు.

లేచి నించున్నాడు, వినోద్.



"నిజమే, నిజమే! ఇంత మంచి యోగం నాకు మరెన్నడూ పట్టదు." అని రెండడుగులు ముందుకి వేశాడు.

"అన్నయ్యా!—నీ పాదంముట్టి చెప్పమన్నావు. చెబుతున్నా. నిన్ను నే నెరుగుదును. నీ గొప్పదనం నాకు తెలుసు. నిన్ను నేను బాగా అర్థంచేసుకుని చెబుతున్నాను! నీ పాదంముట్టి, నిన్ను నేను దగాకోరువని అంటినా, యిప్పుడే— యిప్పుడే, యిక్కడే నా కుడిచెయ్యి పడిపోదూ?—

"ఈ మాట నే నెన్నడూ అనను కాని, ఇవ్వాళ యిప్పుడు, నీ పాదమేముట్టి ప్రమాణంచేసి చెబుతున్నా—యిహ నేను సారాముట్టను, ముట్టను, ముట్టను!—

"ఇవ్వాళనించీ నేను ఫలానావారి తమ్ముణ్ని అని చెప్పుకునేటంత యోగ్యత నాకు కలగాలని నన్ను దీవించు. నీ పాదాలముందే నేను నీ గౌరవమర్యాదలు కాపాడుతూ జీవితం వెళ్ళబుచ్చుకునేట్టు ఆశీర్వదించు" అంటూ అన్నగారికి మోకరిల్లాడు. అన్నగారి పాదం తన నెత్తిమీద పెట్టుకున్నాడు. తన చేతులతో ముట్టిన అన్నగారి పాదాలను మరి విడిచిపెట్టలేదు, వినోద్.

—

పీళ్ళు ఆ తపనగూడా యిలా ఎంతో సేపు కొనసాగదు. అవయవాలతో బాటుగా బుద్ధిగూడా మొద్దుబారిపోతుంది క్షేత్రికి పారవేసిన తోటకూర కాడలా శరీరం నేల కంటుకపోతుంది ఒకరు చెబితే అర్థమయ్యేదిగాదు ఆ పరిస్థితి అనుభ వై కవేద్యం. అలాంటివాళ్ళని చూచి నప్పుడే మనం "అయ్యోపాపం! ఆకలి దెబ్బకు శోషిల్లిపోయినట్టున్నాడు" అను కుంటాము

ఆకాడికి వెంకటేసు ెంతో నయం! తిండికీ తనకూ వియోగం ప్రాప్తించి రెండురోజులు కావస్తున్నా అతడింకా సొమ్మసిల్లిపోలేదు చేయిసాచి దగ్గర్లో వున్న గడ్డిపరకలు పెరుక్కునేపాటి చైతన్యం ఉతడిలో యింకా మిగిలేవుంది

కానీ అతడి పేగులు నకనకలాడి పోతున్నాయి నాలుక పిడచగట్టుక పోతోంది కళ్ళు లోతుకుపోయి కొడి గట్టిన దీపాల్లా గుడ్డిగా జోగుతున్నాయి

వెంకటేసు పడుకున్నచోటికి ఒకమైలు దూరం పరిధిలో అయిదారు పల్లెటూ ళ్ళున్నాయి. కచ్చితంగా ఆరు పల్లెలని లెక్కచెప్పకుండా అయిదారనడంలో ఒక అంతర్యముంది ఆరోపల్లె వుంది చూచారూ, దానికి పేరులేదు గూడెం అంటారు ముక్తసరిగా. పేరేగాదు, గూడెంలో వీధులుగూడా లేవు చుట్టూరా పంటపొలా లుండడంవల్ల ఆ వూరి వైశాల్యం విస్తరించే అవకాశం లేదు. జనాభా సంగతి అలాకాదుగా! అందువల్ల కుండలో నారుపోసినట్టుగా ఆ వూరు వూరంతా గుడిసెలమయం పొదుపును గురించి ప్రత్యేకంగా అక్కడెవరూ పాఠాలు చెప్పవుండరు గూడెంలోని జనం ఇతరులు చెప్పకపోయినా ఉత్తమ జీవిత విధానాలను అమల్లోపెట్టే బుద్ధి మంతులు మట్టితోనే గోడలు, తాటాకు లతో పైకప్పు వెదురు తడికలతో తలు పులు గోడలకు సున్నం వుండదు. బయటినేలకు, గుడిసెలోపలి నేలకు తేడా వుండదు గూడెంలో అడుగు పెట్టగానే ముకుపుటాలకు యింపితంగాని చెమ్మ వాసన, కోళ్ళు, కుక్కలు, వంటకట్టెలు, మట్టికుండలు, గోనెసంచుల్లా మాసి పోయినగుడ్డలు, చింపిరితలలు, ఈ హంగులవల్ల పదివేలయేళ్ల మానవ నాగరికత తీవ్రమైన సవాలుకు గురికావడం ఆ పల్లెలో చూడవచ్చు శిలాయుగం నాటి మానవ జీవనాన్ని గురించి సినిమా తీయ దలచుకున్న వాళ్ళు చక్కా తమ అవుట్ డోర్ షూటింగును గూడెంలో పెట్టుకో వచ్చు. ప్రత్యేకించి సెటింగు వేయనక్కర లేదు.

వేపచెట్టు నీడక్రింద పడుకున్న వెంక టేసుడు ఎండిపోయిన పెదవులను నాలు కతో తడిచేసుకున్నాడు. ఆహారం దొరికిన సంబరమేమో, చెట్టుకొమ్మల్లో ఉడతలు రెండు కిచకిచమంటున్నాయి. ఎక్కడో ఆకాశంలో తెల్లటి చక్కలా ఎగురుతున్న



యువ




గ్రద్ద ఒకటి ఒక్క పెట్టున క్రిందికి దిగి వచ్చి కాలి వ్రేళ్ళతో ఎరను లంకించుకుని రివ్వున పైకెగిరిపోయింది దూరంగా మల్లేశ్వరుడి గుట్టపైన కడుపునిండుకూ పచ్చిక మేసిన ఆవులు మెల్లి మెల్లిగా క్రిందికి దిగివస్తున్నాయి. 'అడవిపక్షుల కెవ్వడాహారమిచ్చెను, మృగజాతికెవ్వడు మేతబెట్టె' అంటూ చిన్నప్పుడు చదువుకున్నవాడు వెంకటేసు ఇన్ని ప్రాణుల కిన్నివిధాలుగా ఆహారం సప్లయిచేస్తున్న భగవంతుడు రెండు రోజులుగా తనను మాత్రం లిస్టులోనుంచి తొలగించాడు! భగవంతుడిదాకా ఎందుకు? వెంకటేసుకు గూడెంలో ఒక గుడిసెవుంది రంగిరంగి అంటూ ఒక పెళ్ళాం వుంది. రోజుల తరబడి తానింటిముఖం చూడకపోయినా "నాన్నా, నాన్నా" అంటూ తనవెంటబడి తిరిగే ఎనిమిదేళ్ళ కుర్రకుంక ఒకడున్నాడు రంగి తప్పకుండా మధ్యానం అన్నం వండేవుంటుంది రెండుపూటలకు ఒక్కసారే చేసుకోడం గనుక తినింది పోగా కుండలో కొంత అన్నం యింకా మిగిలేవుంటుంది అన్నంగాకపోతే సంగటి. అదీగాకపోతే అంబలి ప్రాణం నిలుపుకోడానికే గదండీ తిండి! మొన్నటి వరకూ రాజభోజనం దొరికింది వెంకటేసేం వద్దన్నాడా? నిన్నటి నించీ నిప్పుచ్చరంగా వుంది అలాగని యిప్పుడు గూడా అలాంటి రాజభోజనమే కావాలని వెంకటేసుకేమైనా పట్టింపుగా వుందా? లేదు ఆకలిగా వున్నప్పుడు తనకు రంగి చేతివంట కూడా అమృతంలా ఉంటుంది. కానీ ఏ ముఖంపెట్టుకుని తనీ రోజున గూడెంవైపు వెళ్ళగలడు? గూడెంలో

అడుగు పెట్టడమంటే తనకప్పుడు తలకెట్టి మొలకేసినట్టే వుండదూ?

ఉంటుంది. అంతకంటే అవమానంగా కూడా వుంటుంది. ఎందుకుండదు? వెంకటేసు గూడెంవైపు తిరిగిచూచి మూడు నెలలైంది. ఈ మూడు మాసాలకాలంలో అతడికి గూడెం వల్లకాటి డిబ్బకు మల్లే పోరానిచోటుగా పరిణమించింది అక్కడి మనుషులు నజీవులైన నడపీనుగుల్లా కానవచ్చారు అది పెళ్లాంగాదు. తనకు చుట్టుకున్న పీడ వాడు కొడుకు కాదు. వదలకుండా తనకు తగులుకున్న జంజాటం!

మరైతే ఈ మూడు మాసాల సంధి కాలంలో ఒక మానవుడి బుద్ధి యిలా ఎందుకు మారింది?

కారణం లేకపోలేదు.

పండగ అనవచ్చు దాన్ని! "ఓట్ల పండగ" అనడం మరీ బాగుంటుంది అది పీర్ల పండగలా వచ్చింది. పోలేరమ్మ జాతరలా వచ్చింది "కాశీపట్నం చూడర బాబూ, గంగాఘట్టం చూడర బాబూ" అన్నట్టుగా చిన్న ఓటులోనుంచీ గంపెడు ఆశలు చూపెడుతూ వచ్చింది "భామనే, ఒయ్యారి సత్యభామనే" అంటూ బయల్దేరి దుమ్మెగిరేటట్టుగా రంగస్థలంలో చిందులు త్రొక్కే అర్ధవేషంలా దేశమంతా గగ్గోలయిపోయేటట్టుగా వచ్చింది. [illegible] దొరికినంత [illegible] [illegible] [illegible] [illegible] [illegible] ఎవరైనా [illegible] ఒక్కరుమాత్రమే

కూచోవాలి ఇందుకు కావలసింది ఓటర్ల బలమే! అదెలా లభ్యమౌతుంది? యోగ్యతనుబట్టి లభ్యంగావడం న్యాయం. కానీ యోగ్యత నంతగా పట్టించుకొనేవాళ్ళే లేకపోయారు ఇంతకంటే గత్యంతరం లేదని నచ్చజెపుతూ సామం బయల్దేరింది "మీవి ఓట్లు నావి నోట్లు అవసరాన్నిబట్టి వేలంపాటను పెంచేదేగానీ దించేది లేదంటూ రవితేజంతో దానం ముందుకు నడిచింది కలంపేరు, మతంపేరు చెప్పుకుంటూ భేదం విజృంభించింది. ఈ మూడు పద్ధతులూ వమ్మయిపోతే చివరకు నేనున్నాను లెమ్మని దండోపాయం హెచ్చరిక చేసింది

పింగవరంలో ఎలా వుంది బాబూ? మంగిపాడులో ఏమైంది? నూకవరం సంగతి ఏమైనా తెలిసిందా?—ఓ యాభై యేళ్ళ క్రితం గనుక యిలాంటి ప్రశ్నలు పొడసూపివుంటే ఆయావూళ్లల్లో అప్పుడు మశూచిలాంటి తీవ్రమైన జబ్బు ఏదో విశృంఖల విహారం చేస్తుందేదన్న మాట! ఇప్పుడిలాంటి ప్రశ్నలన్నీ ఆయావూళ్ళల్లో ఓట్లజాతర తాలూకు సంరంభం ఎలావుందన్న కుతూహలానికి మారువేషాలుగా పరిణమించాయి

ఓట్ల తిరణాల ఒక విధంగా వీధి నాటకం లాంటిది కూడా! నటీనటుల పట్టిక్యా కొద్దిపాటిదైనప్పటికీ [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

రంగు పూసుకునేవాళ్ళు కొందరైతే. పరిస్థితుల ప్రోద్బలంవల్ల రంగు పూయించుకొనేవాళ్ళు కొందరు. ఈ వర్గీకరణలో రెండోరకం క్రిందికే వస్తాడు వెంకటేసు.

చిలక సముద్రం చిన్న పంచాయతీ గ్రామం ఆ పేరు గలిగిన ఊరుగాకుండా గ్రామంలో వున్న పల్లెలు అయిదే. ఒకటి గుండ్లూరు అది చిలక సముద్రానికి కూత వేటు దూరంలో వున్న పల్లె పేరుకు వేరే వూరయినా అది చిలక సముద్రంలో కలిసివున్నట్టే లెక్క. మిగిలిన నాలుగింటిలోనూ మూడూళ్లు దూరంగా విసిరివేయబడ్డట్టుగా ముఖ్య గ్రామాని కొకటి రెండు మైళ్ళ దూరంలో ఉన్నాయి ఈ మూడింటిలో నాయకస్థానం బూరగపాడుది. గ్రామం ఒక త్రాసయితే దానికొకవైపున చిలకసముద్రమున్నూ మరొక వైపున బూరగపాడున్నూ! కారణం దొరకడమే ఆలస్యం, ఉభయపక్షాలు దొమ్మికి సిద్ధం. ఆ కారణం ఎంత చిన్నదైనా పరవాలేదు కోడిపుంజుల జగడాలను రాజ్యాల మధ్య యుద్ధాల స్థాయికి డెవలప్ చేసిన శౌర్యాభిలిప్స జాతిలో యింకా చచ్చిపోలేదు! ఇందుకు చిలకసముద్రం, బూరగపాడు రగడలే ప్రత్యక్ష తార్కాణం!

ఎన్నికల సందర్భంలో చిలక సముద్రం చెంచునారాయణప్పకు ప్రాణగొడ్డం లాంటి విషమసమస్య ఒకటి వచ్చిపడింది నిస్సందేహంగా మూడు వార్డులు తనవి. కానీ ప్రత్యర్థి బూరగపాడు హనుమంతప్ప గూడా యింతే బలాన్ని చేజిక్కించుకుని రంగంలో మోహరించివున్నాడు. ఇప్పుడు జయాపజయాలు రెండూ ఒక ఏదోవార్డు పైన్నే ఆధారపడి వున్నాయి. ఆ ఏడో వార్డే గూడెం!

ఒకనాటి సాయంకాలం పొందికగా తలగుడ్డ చుట్టి. మెత్తటి చెడావులు తొడిగి, విలాసంగా చేతికర్ర వూపుకుంటూ చెంచు నారాయణప్ప గూడెంలో ప్రవేశించి వేపచెట్టు క్రింద రచ్చపైన కూచున్నాడు

ఏలినవాడే పాలితులదగ్గరికి నడచి రావడమన్నది భారతీయులకింకా క్రొత్తగానే వుంది. పుట్టి భూమిపైన పడింది మొదలు గూడెంలోని జనం యిలాంటి వింతను చూచి ఎరుగరు.

చెంచు నారాయణప్పగారి హితోపదేశం నల్లేరుపైన బండిలా సాగిపోయింది.

"అబ్బాయిలూ! జాగరత్తగా యినండి! ఒరే కోటిగా! నారిగా! గురులింగం! అందరూ యినండి ఈరో జెన్నికలొచ్చాయి రే పెల్లిపోతాయి ఎల్లకాలమూ వుండేది గ్రామం దాని బాగు మనసులో పెట్టుకుని తరవాత మనం మిగిలిన విషయాల్ని గురించి ఆలోచించాలి పెద్దలొక మాటన్నారు ఏమని? పోరు నష్టమనిన్నీ, పొందు లాభమనిన్నీ! ఎంత మంచి మాటన్నారో చూశావా గవరయ్యా! ఈ రోజు ఎలక్షను పేరుసెప్పి దేశం దేశమంతా గొంతుబంటిదాకా పోటీల వూబిలో

దిగడిపోయింది. పోతే పోయింది. మన వరకు మనం కలిపి కట్టుగా వుందామంటే ఆ బూరగపాడు అనుమంతప్పేమైనా నా మాట యిన్నాడా? నువు సెప్పడమేమిటి, నే వినడమేమిటి? ఈ గ్రామానికి నువ్వెంతో, నేనూ అంతేను! పో పొమ్మన్నాడు. ఇన్నావా శీతారాముడూ?''

''ఎంతమా టెంతమాట! తమ రెక్కడ, ఆయనెక్కడ? తమరు దరమ రాజులు గదండీ....''

''అబ్బే, దరమరాజుని గాకపోవచ్చు. కానీ యమదరమరాజుని కాదు గదా! అదీ, ఆ విషయం మీరు గ్నేప్తిలో వుంచుకోవాల. అలాగని నేనేదో మీపైన జులుం చెలాయిస్తున్నా ననుకోవద్దు. మీ కందరికీ నేను తలా కొంచెం అప్పు పెట్టి వుండొచ్చు. వేమూ, మా పొలాలు లేకపోతే మీకు బ్రతుకు లేకపోవచ్చు. కానీ దీనికి దానికీ సంబంధం లేదు చిల్కా సముద్రమూ, గూడెమూ ఓటికాలంనుంచీ ఒక తల్లిబిడ్డల్లాగా వున్న సంగతి ఈ పాయకట్టులో అందరికీ తెలుసు. నేను సెప్పేదేమిటంటే యికపైనగూడా అలాగే జరిగిపోవాల. మనందరం ఒక తాటిపైన నడవాల! ఒక మాటపైన వుండాల!....''

''ఎవురికోసం వుంటామండీ బాబుగోరూ! మీ సొత్తే తిని మీకే దురోహం సేత్తామా? సేత్తే కళ్ళుంటాయా? తమరు మమ్మల్ని కంటికి రెప్పగా చూచుకునే దిన్నీ, మేము మీరు గీసేగీటు దాటేదీనా? మా బొందిలో వూపిరుండగా అలా జరగదు! ఎటువంటి ప్రెమాణకం సేయమన్నా సరే, మీ మాట జవదాటేది లేదు....''

చెంచునారాయణప్పగారు వెళ్ళిపోయిన తర్వాత ఆ రోజు రాత్రి గూడెంలోని పిన్నపెద్దలందరూ కలిసి మళ్ళీ ఒక సభ ఏర్పాటుచేశారు. అందులో వెంకటేసును తమ ఏకైక ప్రతినిధిగా ఎన్నుకున్నారు. మరేంలేదు వెంకటేసు చిన్నప్పుడు తన అమ్మమ్మగారింట్లో వుండి అయిదోతరగతి దాకా చదువుకున్నాడు కళ్ళు మూసుకుని సంతకం పెట్టేయగలడు. తోమిన దుస్తులు గనుక తొడుక్కొని, తల సుబ్బరంగా దువ్వుకుంటే మనిషి పంచాయితీ బోర్డు మెంబరనుకోడానికి తగినట్టుంటాడు.

నాం నేషన్లదాకా అంతా సవ్యంగానే గడిచిపోయింది. తీరా ఆ మరునాడు తెల్లవారేసరికి వెంకటేసు గూడెంలో లేడు చిలకసముద్రంలో లేడు, గుండ్లూరులోనైనా కానరాలేదు. తోటలు, దొడ్లూ, పొలాలూ, ఎక్కడా కానరాలేదు!

ఇక్కడ చెంచునారాయణప్పగారిలా వెంకటేసుకోసం అన్వేషణ సాగిస్తున్న సమయానికి సరిగ్గా అక్కడ వెంకటేసును తన ఎదుట కూచోబెట్టుకుని బూరగపాడు హనుమంతప్ప శుక్రనీతి బోధిస్తున్నాడు.

''ఒరే ఎంకటేసూ! గూడెం గూడెం అంటావు. గూడెం తవ్వి నీ తలకెత్తిం దేమిటో సెప్పరా? మీ ఖామందు, అదే




పిల్కాసముద్రం నారప్ప నీ తలపైన పెట్టిన కుచ్చులకుళ్ళా యెక్కడుందో చూపించరా। ఎందుకురా నీకీ లేనిపోని ఆశలు? మాకేమిత్రా నీ తలకాయ। మహామహావాళ్లు మాటకే నిలబడివున్నారా? ఎప్పుడైతే నువు నా చేతిలో పడ్డావో అప్పుడే నీ అదురుష్టం పండిందనుకో। అడ్డూ, ఆపూ లేకుండా నువ్విక్కడే వుండిపోరా ఎంకటేసూ। మస్తుగా తిను. మాయని బట్ట కట్టుకో. కంటినిండుకూ నిద్రపో. నువ్వు నాకు వేసేదల్లా ఒక ఓటు. అయిదేళ్ళపాటు నిన్ను దొరబిడ్డలా చూచుకునే పూచీనాది. ఆ తరువాతి సంగతంటావా? అప్పటికే రాజు ఏ రాజ్యమేలతాడో ఎవరు చూచారు? ఎంతగా గూడెం వాళ్ళు తన చెప్పుచేతల్లో వుండే మటుకు వుత్తుత్తి మాటలతో ఓటు కొట్టేయాలని చూస్తాడా సెంచునారణప్ప। ఏం. మనిషి మనిషి ఓకీ పదిరూపాయల నోటు పారెయ్యగూడదూ? నేనైతే అదేపని చేసేవాణ్ణి. ఏం జెయ్యమంటావు? వాళ్లు నా మాటలో లేరు. నువ్వుంటావని నాకు నమ్మకం వుంది. చూస్కో. నిన్నేం చేస్తానో....''

హనుమంతప్ప మాటలతో బాటుగా కొత్త దుస్తులు, కొత్తరకం భోజనం.

వరిక్రొత్తదైన వున్నన యివన్నీ వెంకటేసుమీద బాగా పనిచేశాయి కొత్తగా మద్యం రుచిచూచేవాడికి ఒక గ్రుక్క ప్రియంగా పడేసరికి బ్రహ్మానందం కనిపిస్తుంది. కానీ ఎంతగా అయోమయంలో వున్నప్పటికీ వెంకటేసు పూర్వాపరాలను గురించి ఆలోచించక పోలేదు చిలకసముద్రం చెంచునారాయణప్ప సంగతి తనకు బాగా తెలిసిందే! చచ్చి గీ పెట్టినా ఆయన తనపైన పైసా ఖర్చు పెట్టడు. పోగా తానిలా హనుమంతప్పవైపు రావడంలో గూడెంవాళ్ల ప్రమేయమేమీ లేదు అందువల్ల చెంచు నారాయణప్పగూడెం వాళ్లపైన అక్కసు వెళ్లగ్రక్కవలసిన పనిలేదు ఐనా ఒక రోజు గూడెం పలక్కపోతే చిలకసముద్రంలో ఎక్కడి పనులక్కడే బందు. చెంచు నారాయణప్ప దొంగకు తేలుకుట్టినటుగా వూరుకోవలసిందే! ఆయనగారి కెలాగో కావాలి! మాదర్చోద్ దేవుడికి గుడుర్చోద్ పత్రి!

ఎన్నికలు ముగిశాయి

జానపద చిత్రంలో కథానాయకుణ్ని చెరోకవైపున నిలబడి వరించే నాయిక ద్వయంలా అదృష్టం ఒకటికి రెండు చేతులతో హనుమంతప్పను వరించింది. చిలకసముద్రం పంచాయితీబోర్డుకు ప్రెసిడెంటు కావడంతో బాటుగా ఆయన సమితికి ఉపాధ్యక్షుడుగా గూడా తయారై కూర్చున్నాడు.

చిలకసముద్రం చెంచు నారాయణప్పకు గడిచిన నెలరోజుల్లో ఎదురైన పరాభవం యింతలో మరిచిపోవడానికి వీలయ్యేది కాదు "కంటికి నిద్ర వచ్చునే, సుఖం బగునే " ఇత్యాది బాధలన్నీ ఆయన అనుభవించాడు కానీ విశేషమేమిటంటే ఈ అవమానం వల్ల ఆయన బుద్ధి మొద్దు బారిపోలేదు పైపెచ్చు అదింకా చురుగ్గానే పనిచేసింది ఇందుకు నిదర్శనం రెండు నెలల దీర్ఘాలోచన తర్వాత ఆయన తీసుకున్న నిర్ణయం.

ఆకులు, వక్కలు, పసుపుకొమ్ములు, కొబ్బరికాయలు మొదలైన మంగళద్రవ్యాలను తట్టల కమరించుకుని, నలుగురుసాటి బంధువులను వెంటబెట్టుకుని, పురోహితుడు ముందు నడవగా చెంచు నారాయణప్ప హఠాత్తుగా బూరగపాడులో ప్రత్యక్షమై సూటిగా హనుమంతప్పగారి లోగిట్లోకే విజయం చేసేశాడు

వాలుకుర్చీలో సుఖాసీనుడై, పొగ చుట్ట కాల్చుకుంటూ అక్కడి పెత్తందారును పిలిచి "ఒరే చెన్నకేశవులూ! వియ్యాల వాళ్లొచ్చారని మీ అయ్యగారితో చెప్పరా ' అన్నాడు

"కయ్యాలవాళ్లు వియ్యాల వాళ్లయిందెప్పుడు?" అంటూ ముసిముసినవ్వులతో హాల్లోకి వచ్చాడు హనుమంతప్ప.

"అయ్యా, హనుమంతప్పా! కయ్యానికి మేము మీతో దీటుగాదని తేలిపోయింది. పోతే మిగిలిన విషయాల్లో

ఈ రోజు. జీతాలివ్వలేదన గానే ..
- ఇస్తున్న కాఫీ తిరిగి అలా వెనక్కి
తీసు కెళ్ళడం ఏం బావు లేదు కాంతం !




మనం మనం సరినమానమేనని నేనను కుంటున్నాను పోట్లాడుకున్నన్ని దినాలు పోట్లాడుకున్నాము కోర్టుల చుట్టూ తిరిగాము దీనివల్ల మేలుపడిందేమీలేదు ఎందుకొచ్చిన బెడద? అందువల్ల నాకొక మంచిపని చేయాలన్న బుద్ధి పుట్టింది నీ కూతుర్ని మా అబ్బాయికి అడగడాని కొచ్చాను ఇష్టమైతే ఈ పళ్లాల్నితీయించి లోపల పెట్టించు ఇష్టంలేదు ఆ మాట తేల్చిచెప్పు ?

పది పదిహేను నిమిషాల వరకు హాల్లో స్తబ్దతే రాజ్యమేలింది

ఆలోగా లోపలికి వెళ్ళి జనానావారితో సంప్రదించి వచ్చిన హనుమంతప్ప "ఒరేయ్ చెన్నకేశవులూ! తట్టలు తీసుకెళ్ళి లోపలపెట్టించరా! అలాగే చుట్టాలకు కాఫీలు పట్టుకరారా" అన్నాడు.

పైపైకి ఈ పెళ్ళిసంబంధం ఒక సవ్యమైన పరిణామంగానే గోచరించింది కానీ యిందులో లోగుట్లు కొన్ని వున్నాయి. హనుమంతప్పగారి అమ్మాయికి కాస్త చెముడుంది కాస్త కూస్త ఏమిటి. బ్రహ్మాండమైన చెముడేనని కొందరంటారు ఆ పిల్లకింతకంటే భారీ సంబంధాలు రావడం కష్టం చెంచునారాయణప్ప ఉద్దేశం వేరు. ఆడవాళ్లు ఎంత తక్కువగా వినగలిగితే అంత మంచిదని ఆయన ఉద్దేశం. ఇందువల్ల తన కుమారుడికి తానెంతో భారం తగ్గించినవాడవుతాడు. కానీ అదేమంత ముఖ్యంగాదు ఈకాలమనేదుందే. యిది గూటం గొట్టుకుని యిక్కడే స్థిరంగా వుండిపోదు. గిరువ

తిరిగిపోతుంది. వచ్చే ఎన్నికల్లో తాను అబ్బాయిని ఎన్నికల్లో నిలబెడతాడు. అప్పుడు హనుమంతప్ప తగుదునమ్మా అని అల్లుడితో ఎలా పోటీ చేస్తాడో, అదీ తన కళ్ళతో తానే చూస్తాడు.

ఆట కట్టయిపోయిన తరువాత చద రంగపు బలాన్నంతా ఒక కుప్పగాతోసి బుట్టలో పడవేశారు. ఆలా చేయడంలో వ్రేళ్లసందుల్లోనుంచీ నేలపైకి రాలిపోయిన ఒక బంటును గురించి ఎవరు పట్టించు కుంటారు?

ఆబంటే వెంకటేసు.

''ఇంక నీ జాగ్రత్తలో నువ్వుండ వచ్చురా వెంకటేసూ! నీ ఆకు బయట పడిపోయింది'' అని ఎవరో చెబితే, వాళ్ళు చెప్పేదేమిటో వెంకటేసు కర్థం కాలేదు.

పిలిచి పిలిచి భోజనం పెట్టే మర్యాద గూడా ఆనాటితో ఆఖరై పోయింది. విస్తరి చేతబట్టుకుని తనంటతానే వెళ్ళినా భోజనం పెట్టాలన్న ధ్యాస ఎవరిలోనూ కనిపించడం లేదు.

పూర్తిగా విడమరిచి చెబుతేగానీ అర్థం చేసుకోలేని మూర్ఖత్వానికి ఎవరో ఒకరు విరుగుడుమందు యివ్వవలసి వచ్చింది ఆ పనికి పూనుకున్న వ్యక్తి సక్కూ బాయమ్మ. ఆమె హనుమంతప్ప తల్లి.

''నీపనేదో నువ్వు చూచుకోగూడ దట్రా వెంకటేసూ! దంచినమ్మకు బొక్కిందే కూలీ అనుకోవాలి మరి! పోనీలే, ఈపూట భోజనం చేసేవెళ్ళు ...''

తెరతీయగానే మూలవిరాట్టు కనిపించి నట్టుగా, సక్కూబాయమ్మ వీడ్కోలు మాటతో వెంకటేసుకు అప్పటి తనస్థితీ, గతీ బాగా అవగతమైపోయింది.

మరునాటి ఉదయం తెల్లవారక మునుపే వెంకటేసు బూరగపాడు వదిలి పెట్టేశాడు. ఊతకొమ్మ పోతేపోయింది. తనకిప్పుడు పట్టుగొమ్మమాత్రం ఎక్క డుంది? బూరగపాడుకు తనతో పని తీరి పోయింది. చిలకసముద్రానికి తనను నమిలి మింగేయాలన్నంత కోపంగా వుంది. స్వంతవూరికి తాను తీరనిద్రోహం చేశాడు. తనతో ముఖమిచ్చి మాట్లాడే వాళ్ళెవరున్నారు ?

మనిషైన వాడికంటపడకుండా వుండ డంకోసం ఆ రోజంతా వెంకటేసు విశ్వ ప్రయత్నం చేశాడు. మామిడితోపుల్లోనూ, చిట్టడివిపొదల్లోనూ కాలక్షేపం చేశాడు, చీకటిపడిన తర్వాత నరసంచారంలేని ప్రదేశంలో వుండలేక చిలకసముద్రానికి దగ్గరగా వచ్చి గ్రామశక్తిదేవళం ఎదుట మండపంలో పడుకున్నాడు ఎప్పుడు నిద్రపట్టిందో ఏమిటో? మళ్ళీ తెల్లవార బోతున్నదన్న భీకరసత్యం కొరడాతో కొట్టినట్టు నిద్రలేపింది. రైతులు పొలా లకు బయల్దేరకమునుపే తాను కనుమరుగై పోవాలి. కానీ నడిచే ఓపికను తన కాళ్ళ




ప్పుడు కోల్పోయినట్టున్నాయి కాటమ రాజు గుట్టమొగదలలో వున్న వేపచెట్టు క్రిందికి రాగానే అవింకముందుకు సాగ డానికి మొరాయించాయి. పై గుడ్డ విదిలించి నేలపైన వేసుకుని అక్కడే కూలబడి పోయాడు వెంకటేసు.

ఏడుగుర్రాల రథంలో మందేదేవర ఒక్క బిర్రున పైకి వచ్చేశాడు. మహాను భావుడు; తన దొరతనం క్రింద కంత దఫ్ఫంగా తిన్నవాళ్ళెందరు, కడుపు మాడుతుండగా విలవిల లాడిపోతున్న వాళ్లెందరు అని లెక్కచూచుకోకుండా ముందుకు సాగిపోతున్నాడు పడమటి కొండమజిలీ యింకొక పది గడియల ప్రయాణంలో వుంది....

చల్లగా చెంపకేదో సోకినట్టయింది. కనురెప్పలపైనగూడా అలాంటిదే చల్లటి స్పర్శ. కళ్లతెరిచాడు వెంకటేసు. బూసులు క్రమ్ముకపోయినట్టున్న కళ్ళకు మసకా మసకగా ఏదో ఆకారం గోచరించింది.

"నేనయ్యా దొర్సామివి! ఇదేంటయ్యా యీడ తొంగున్నావు? రాయ్యా. యింటి కెళ్దాం గానీ...."

వెంకటేసు కళ్ళల్లో నీళ్ళు క్రమ్ము కున్నాయి. కుర్రవాడి భుజంపైన చేయి వేసి గాఢంగా గుండెలకు హత్తుకుంటూ "దొర్సామీ! నేనిక్కడున్నానని నీకెలా తెల్సింది?" అన్నాడు.

"ఎవురో పేడకాచ్చినోళ్లు సెప్పినారు. లగెత్తుకొచ్చేసినాను. అమ్మ యింట్లో లేదు. బల్రామయ్యగోరివి మడి కలుపు తీయడానికెళ్ళింది. చేసిపెట్టిన అన్నం కుండలో వుంది. రాయ్యా. అన్నం తిని యింట్లోనే పడుకుందువు గానీ...."

"ఒద్దురా దొర్సామీ! నేను తిన్నానురా! విన్నాదిలిపెట్టి మూడునెల్లపాటు ముక్కు

దాకా మెక్కినా(న్రా! నాకోసం నువ్వెం దుకురా ఒచ్చింది? ఒద్దు. వెళ్ళిపోరా దొర్సామీ! నే(న్రాను. రానంటే రాను. ఇక్కడే పడుంటాను....'' చెంపలపైకి జారుతున్న కన్నీరు కొడుక్కి కనిపించ కుండా ముఖం అవతలికి త్రిప్పుకుంటూ అన్నాడు వెంకటేసు.

అయిదునిమిషాలవరకూ తండ్రీ కొడుకులిద్దరూ ఒకరితో ఒకరు మాట్లా డుకోలేదు. ఒక చిన్న గుడిసె. అందులో తల్లి. ఆమె చేసిపెట్టే తిండి. అందుకోసం ఆమె చేసే కూలీ నాలీ....ఈ విషయాలు తప్పా మరేమీ తెలియని పసివాడు తల వంచుకుని నేలపైన ఏవో పిచ్చిగీతలు గీస్తున్నాడు.

తటాలున లేచి కూర్చున్నాడు వెంకటేసు.

బుగ్గలు పుణుకుతూ ''ఎళ్ళిపోరా నాన్నా! నేను గూడెంలోకి రాలే(న్రా! నీకు తెలీదు. నువ్వెళ్ళిపోమ్మా! నా బుజ్జివి గదూ....'' అన్నాడు.

''ఊఁహూ'' అడ్డంగా తలాడించాడు కుర్రవాడు. ''ఇక్కడుంటే నీకెవు రొండి పెడతారు? అమ్మ యింట్లో లేదుగా! నీ పాటుకు నువు తిని పడుకుంటే పోలా! రాయ్యా. ఎల్లిపోదాం'' గట్టిగా చెయ్యి పట్టుకుని తండ్రిని లేవదియ్య జూస్తున్నాడు దొరసామి.

తండ్రిగా తన పెద్దరికం నిల్పుకోలేని వెంకటేసు కళ్ళకు ఆ క్షణాన ఆ పదేళ్ళ కుర్రవాడు తనకంటే పెద్దవాడుగా కని పించాడు. తన తండ్రి బ్రతికుంటే తన నిలాగే పిలిచేవాడేమో! తప్పుచేసిన బిడ్డను మన్నించడం తండ్రికి మామూలే! పశ్చా త్తాప పడిన కొడుకు తండ్రి పిలవగానే లేచి వెంబడించడంగూడా రివాజే! ఇక్క డందుకు విరుద్ధంగా జరిగినట్టుగా లేదు వెంకటేసుకు—

జనమంతా పనిపాటలకు వెళ్ళిపోయా రేమో, గూడెంలో ఏమంత సందడిగా లేదు. గొళ్ళానికి చిలుకుతో కలిపి కట్టి పెట్టిన త్రాటిని విప్పేశాడు దొరసామి. వెంకటేసును లోపలికి తీసుకెళ్ళాడు. కంచం తెచ్చిపెట్టి కుండలోవున్న అన్న మంతా అందులోకి కుమ్మరించేశాడు. పిడతలోవున్న కూర నందులోకి వంచే శాడు. సత్తు గళాసులో నీళ్ళు తెచ్చి పెట్టాడు.

''తినయ్యా! ఆకిలిగా వుంటేగానీ నువ్వలా పడుకోవని నాకు తెల్సుగా! అమ్మొస్తే నేను చెబుతాన్లే....''

కొడుక్కి తా నన్నం పెట్టవలసింది పోయి వాడు తనకింత అన్నం పెడు తున్నాడు బోరుబోరున ఏడవాలనిపించింది వెంకటేసుకు.

వెంకటేసు అంతరంగానికిన్నీ, బాహ్యప్రపంచంలో వాతావరణానికిన్నీ ఏదో దగ్గరి సంబంధం వున్నట్టుగా రివ్వు రివ్వున గాలి వీచసాగింది. అతడి కడు పులో ఆకలి చల్లారేసరికి జల్లుజల్లుమంటూ




ఉబ్బచినుకులుగూడా రాలసాగాయి. వెంక టేసు వెలుపలికి చూచాడు. మబ్బులు దట్టంగా ముసరుకుంటున్నాయి. వానబలం కావచ్చు. కూలీకి వెళ్ళిన జనం తిరిగి వచ్చేస్తారేమో! రంగి కంట పడకుండా తానొక బల్లిగా మారిపోయి గోడ కంటుక పోయినా బాగుండి పోవును....

''వానొస్తోంది. అమ్మ తడిసి పోతుం దేమో! గూడ తీసికెళ్తానయ్యా........'' తాటాకు గూడ తలపైన బోర్లించుకుని విడిచిపెట్టిన బాణంలా వానలోకి దౌడు తీశాడు దొరసామి.

వచ్చేస్తుంది. రంగి వచ్చేస్తుంది. వెంకటేసు పాదాలు గుమ్మంలో నిలవ లేదు. తలుపు ఓరవాకిలిగా వేసుకుని అతడు గుడిసె వెనకవైపుకు వెళ్ళి చూరు క్రింద నిల్చున్నాడు.

పది... [illegible] తర్వాత [illegible] తెరుచుకుంటున్న [illegible]ప్పుడు

వినిపించింది.

''సమయానికి గూడ తెచ్చావుగానీ లేకుంటే తడిసి ముద్దయిపోయి వుండే దాన్ని. అప్పటికీ సగం తడిసిపోయాను. పొయిసెగన కూచుంటే ఆరిపోతుందిలే. పొయిలో నిప్పుందేమో సూడరా దొర్సామీ!''

''నిప్పున్నట్టులేదు. ఆరిపోయింది...''

''పోతేపోయిందిలే. కాసేపటికదే ఆరి పోతుంది. ఎలాగో తెల్లారిపూటే యింత వండిపడేశాను గనుక సరిపోయింది. లేకుంటే వానకూ దానికీ పొయిమండక అఘోరించేదాన్ని....''

దొరసామి కిక్కురుమనడంలేదు.

''కిర్సనాయిలు గూడా నిండుకున్న ట్టుంది. వెల్తురుండగానే తలా కొంచెం తినేస్తే పోలా. కంచాలు పెట్టరా దొర్సామీ....''

''అన్నం నేను తిన్నానమ్మా! నీకే

లేంది....''

"ఏమిరా! నువ్వు తిన్నావా!" కుండలు కదలిన చప్పుడు. "అంతన్నం నువ్వేలా తిన్నావురా దొర్సామీ! కూర కూడా లేదే!"

పట్టుబడిన నేరస్తుడిలా చిక్కి బిక్కిరిస్తున్నట్టున్నాడు దొరసామి. ఐనా వాడు తండ్రి గౌరవానికింకా పెట్టని కోటలా నిలబడాలనే చూస్తున్నాడు.

"నిజెం. నేనే తినేశానమ్మా!"

"ఊఁ హూ!" తల పంకిస్తూ వుంటుంది రంగి. ఆమె కర్థమయ్యే వుంటుంది. తనకు పెళ్ళయి యిది పన్నెండోయేడు. ఈ పది పన్నెండేళ్ళలో వట్టుగా యింటిపట్టున వుండి తాను కాలాన్ని కష్టాన్ని కుటుంబం కోసం వెచ్చించింది లేదు. ఆదినుంచీ తాను అల్లా టప్పాగా తిరగడానికే అలవాటు పడ్డాడు. చెప్పకుండా వెళ్ళిపోయి తిరిగి యింటికి వచ్చినప్పుడల్లా యిలా చాటుగా యింట్లో దూరి కుండ ఖాళీచేసేయ్యడం యిక్కడ పాత కథే!

తల్లి ఎదట పడడానికి మనసు చెల్లక తండ్రి బయటుండి పోతున్నాడని దొరసామికి తెలుసు. ఆ సంగతి తల్లికి తెలుసనని గూడా తెలుసు. ఈ పొందని, పొసగని పరిస్థితి సర్దుబాటు కావాలంటే కొంతసేపు తానెక్కడైనా వుండి రావాలని కూడా తెలుసు....

"అమ్మా! నేను భజనకూటానికి పోతున్నా...."

చూరుక్రింద నిల్చున్న వెంకటేసు హైకోర్టుకు అప్పీలుచేసి తీర్పుకోసం ఎదురుచూస్తున్న జీవిత ఖైదీలా దిగాలు పడిపోయాడు. ఇప్పుడిక ఏక్షణాన్నయినా రంగి తనపైన విరుచుకపడవచ్చు....

ప్రతిక్షణమూ ఒకయుగంలా గడవడమంటే ఏమిటో యిప్పుడు వెంకటేసుకు తెలిసివస్తోంది.

ఆకాశాన కారుమబ్బులాడుతుండడం వల్ల గూడెం గాడాంధకారంలో మునిగిపోవడాని కెంతోసేపు పట్టలేదు. పోటెత్తిన సముద్రంలో అలలహోరులా గాలి జోరు హెచ్చింది. మద్దెలలు మ్రోగినట్టుగా దూరంగా ఎక్కడో వానసవ్వడి.

తాను వానలో తడిసిపోతున్నట్టు తెలిస్తే రంగికి ప్రాణం నిలవదు. ఆ వాన కాస్తా గూడెంలోకి రాగూడదూ!

అన్‌చేసి పెట్టిన రేడియో కరెంటు రాగానే గొంతు విప్పుకున్నట్టుగా వుండి వుండి ఎప్పుడో ఒకక్షణాన గుడిసెలో నుంచీ మాటలు వెలువడ్డాయి.

"తినేందుకులేని పట్టింపు యింట్లో వుండటాని కొచ్చిందేమో! మరేం పరవా లేదు. లోపలికి రావచ్చు. చేసిన నిరవాకానికి తోడుగా ఈ బింకం ఒకటా? బొట్టూ, కాటికాపెట్టి లోపలికి పిలవాల్సిన అక్కర యిక్కడెవరికీ లేదు....''

ఇంతకు మించిన తియ్యటిస్వాగతం



యువ

వెంక చేసుకక్కర్లేకపోయింది.

"చూడు రంగీ! నాకు బుద్ధొచ్చింది. కట్టుకున్న భార్య. కన్నకొడుకు తప్పితే లోకంలో మనిషికయ్యేవా ళ్ళెవరూ లేరని తెలిసొచ్చింది వగా తగా లేని మగవాణ్ణి కట్టుకుని నువ్వేమనుభవించావు? కట్టుకున్న చీర వానకు తడిసిపోతే విప్పిపెట్టడానికి నీకు మారుచీర లేకపోయింది నా ప్రెయోజకత్వం తగలడినట్టే వుంది. నే నన్నీ పనికిమాలిన పనులే చేశాను. తల తిరిగినప్పటికీ కవళం నోటిదగ్గరికి రాక పోతుందా చెప్పు మాటాడవా రంగీ."

తాళం బిగించినట్టుగా రంగి పెదవులు విడివడడంలేదు.

"నేను చేసిన పనికి నువ్వు నన్నెలాగైనా తిట్టొచ్చు తిట్టు రంగీ! బంగారం లాంటి నిన్ను. ముత్తెంలాంటి బిడ్డను వదిలిపెట్టి మూడు నెలలుగా నా కడుపే కైలాసమనుకున్నాను ఆ భోగం శాశ్వతం కాదని తెలిశాక గానీ నా కళ్ళకు గప్పిన పొర తొలగలేదు. చెబుతున్నానుగా! ఇక మీద ఎప్పుడు మిమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళను నీపైన ఒట్టు కావలిస్తే నీ పాదాలు పట్టుకుని చెబుతాను "

"ఛాఛా దూరంగా వుండు మగాడివై వుండి ఆడదాని పాదాలు పట్టుకుంటావా! బావుందిలే వరస "

రంగి పొరుగింటికి వెళ్ళి బుడ్డీదీపం వెందుకూ కిరసనాయిలు పోయించు కొచ్చింది. పొయి ముట్టించి అన్నం వండింది కొడుకును కేకేసుకొచ్చి అన్నం పెట్టింది గోనెసంచిలో కాళ్ళు దూర్చుకుని కుర్రవాడు నిద్రాదేవత ఒడిలోకి జారిపోయాడు

"నువ్వన్నం తినలేదా రంగీ?" మళ్లీ వెంకటేసే పలకరించాడు

"లేకుంటే లేనిపాడు ఇంట్లో వున్నావుగా! కలిసే తిందాం లే. కూచో "

"సత్తెం చెబుతున్నాను రంగీ! నే నింక యిల్లు ఒదిలి పెట్టేది లేదు ఆడపనీ. మగపనీ రెండూ నువ్వే చేసుకుంటూ యింతకాలం సంసారం ఎలనీదుకొచ్చావు ఇకపైన అలా జరక్కూడదు "

అన్నం వడ్డిస్తూవున్న రంగి అలాగే భర్త ఎదుట కూర్చుని అర్థం కానట్టు సూటిగా ప్రశ్నించింది

"ఏంటయ్యా నువు చెప్పేది?"

"అదే. నువ్వెందుకు కూలీకెళ్ళాలి? ఆ పనేదో నేను సెయ్యలేనా? భేషుగా సెయ్యగలను. నువ్వు చూస్తూండు. రోజుకు రెండో మూడో తెచ్చి నీ చేతిలో పడేయకపోను "

"ఆనందమైపోయింది గానీ వూరుకో మామా! నీతులు చెప్పొచ్చాడమ్మా యింత కాలానికి మగ మారాజు! కాకపోతే నువు కూలీకెళ్తావా? అదిగాదు నువ్వా మామా ఒకరికింద చాకిరీపన్లు చేసేది? పంచాయితీ బోరుడ్డు నెంబరువై వుండి ఆమాట చెప్ప



దానికి నీకు నోరెలా వచ్చింది? చాల్లే వూరుకో! ఎవరైనా నవ్విపోయేరు ."

రాజులకాలం పోయింది. ప్రజలకాలం వచ్చింది. అందువల్ల ఈనాడు ప్రజలే రాజులు. ఆలెక్కన రంగి ఒకరాణి గాక పోదు. ఒక మహారాణిలో కనిపించవలసిన ఔద్ధత్యమున్నూ ఆత్మాభిమానమున్నూ యిప్పుడు రంగిముఖంలోనే కానవస్తున్నాయి

తల దిమ్మదిరిగి పోయినట్టుగా, తెల్లబోయి కూర్చున్న వెంకటేసును మళ్ళీ ఆవిడే స్తబ్ధతలోనుంచీ లేపవలసి వచ్చింది

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకుండా నువ్వన్నం తిను మామా! నేనున్నాను నా రెక్కల కష్టముంది నీకెందుకు? వేళకింత తిను నీపాటుకు నువ్వుండు. నీ సంపాదన నాకక్కర్లేదు పంచాయితీ బోడుద్దు నెంబరు పెళ్ళాన్నన్న కితాబొక్కటే చాలు నాకు!"




"మామయ్యా. రోజూ నీ ఆహ్వానం కోసం ఎదురుచూస్తూ విస్పృహతో కుమిలిపోతున్నాను. ప్రతి సంత్సరమూ రమ్మని ఉత్తరం రాసేవాడివి. ఈసారి, నీవు హోటల్లో తింటూకూడా ఎందుకు రాయలేదు? నీకు హోటలు తిండి ఎంత అయిష్టమో నే నెరగనా? అందుకని ఈసారి వేసవి శలవులకు పిలవకుండానే వస్తున్నాను రేపు రాత్రిబండికి

వచ్చి పడతాను. ఉప్పు పప్పూ సిద్ధంగా ఉంచు నేను వచ్చిన తరవాత మళ్ళా నీకు సావకాశం ఉండదు ఈ లోపుగానే ఇల్లంతా అల్లరిగా చెయ్యి (ఇల్లు పశువులదొడ్డికింద చెయ్యటానికి నీతరవాతే ఎవరన్నా!)

''నా పరీక్షలు రేపు సాయంకాలానికి ఆఖరు అత్తయ్య కులాసాగా తిరుగుతున్నట్టు ఉత్తరం వస్తున్నదా? ఆవిడ, పాపం, దురదృష్ట వంతురాలు. అయిదు మోతలుమోసి ఒక్క పిల్లనుకూడా చంక నెత్తుకోలేక పోయింది. నేను మొదటి నుంచీ అంటూనే ఉన్నాను. ఆవిడకు మగపిల్లవాడు పుడితేకాని బతకడు. ఆ మాట అంటే నువు నవ్వుతావని తెలుసును వట్టి నమ్మకంలేని మనిషివి పైగా, ప్రతిదాన్నీ సందేహించటం వేదాంతమంటావు. ఒక మగపిల్లవాణ్ణి కని నాకిచ్చి పెళ్ళి చెయ్యవలసిన బాధ్యత ఇంకా నీమీద ఉంది తెలుసునా?

— రాజ్యం''

ఒక్కొక్క మనిషి జీవితంలో పరిపూర్ణమయిన ఆనందమంటూ ఉండదు నన్నెరిగినవాళ్ళెవరూ తెలుసుకోలేరు గాని నేను అటువంటి మనిషిని. కించిత్తు ఆనందం కలిగించే అనుభవం ఏదైనా అందుబాటులోకి రాగానే నేను పనిపెట్టుకుని ఆ ఆనందాన్ని భంగంచేసే అంశం ఏదైనా ఆ అనుభవంవెంట ఉందా అని వెతుకుతాను. సాధారణంగా ఉంటుంది. ఏదైనా రుచ్యమైన పదార్థం తినటానికి కూర్చోగానే అది పడదేమోనని భయం. ఎవరిపైపైనా మనసు మొగ్గసాగితే మోసపోతా నేమోనని భయం.

నాలో ఉన్న ఈ జబ్బు నే నెరిగినంత వరకూ ఎవరూ కనిపెట్టలేదు. ఒక్క నా మేనకోడలు రాజ్యమే కనిపెట్టిందేమో ననిపించేది. ''నువ్వు వట్టి అపనమ్మకం మనిషివి. నీలోనే నీకు నమ్మకంలేదు. కొన్ని విషయాల్లో అపనమ్మకం ఉంచే తప్పులేదు—మరికొన్ని విషయాల్లో మరింత నమ్మకం కుదిరేటందుకు। దేన్నీ నమ్మకుండా జీవితమంతా గడిపి ఏం బావుకుంటావు?'' అని రాజ్యం నన్ను వేళాకోళం చేసేది కాని, ఈ అపనమ్మకం నాకు ఆనందంలేకుండా చేస్తున్నదని దానికి తెలుసునో తెలియదో నే నెరుగను తనే నా జీవితానికి ఒక బాధా, ఒక ఆనందమూ అయిన సంగతి రాజ్యం అసలెరిగి ఉండదు।

నా భార్య కాపరానికి వచ్చిన రెండో రోజున, నా ఇరవై ఒకటోఏట, రాజ్యం భూమిమీద పడ్డది. దానికి ఏడోఏడు వెళ్ళి ఎనిమిది వస్తుండగా మా చెల్లెలు పోయింది రాజ్యం నా మేనగోడలనీ, రక్త స్పర్శ అనీ అప్పుడే నేను మొదటిసారి సమగ్రంగా భావించ గలిగాను. అది తల్లిలేని పిల్ల అయేవరకూ దానికి నేను నా మానసిక ప్రపంచంలో ఎటువంటి స్థానమూ ఇవ్వలేదు. నేను పిలవగానే

రాజ్యం తప్పున దగ్గిరికి వచ్చి నా ఒళ్ళో కూర్చుని నన్ను చిన్నతనంనించీ ఎరిగిన దాని మోస్తరుగా మాట్లాడుతుంటే నాకు భరించరాని బాధా, పశ్చాత్తాపమూ కలిగినై

ఆ క్షణాన నాకు రాజ్యంమీద పుట్టు కొచ్చిన సహజమైన మమకారంచూసి నేనే భయపడ్డాను, తక్షణమే నేనా మమ కారాన్ని నిగ్రహించుకున్నాను నా జీవిత మంతా నిగ్రహమే అయిపోయింది ఎవ రైనా నిగ్రహం సాధ్యంకాలేదని ఏడు స్తారు—నేను నాకది సాధ్యమయిందని ఏడవదగిన దుస్థితిలో ఉన్నాను

నేను మా బావమరిదికి సలహాకూడా ఇచ్చాను ' నువు సాధ్యమైనంత త్వరలో మళ్ళీ పెళ్ళిచేసుకో, పిల్లను సవితితల్లి సరిగా చూడదనికాని, చూడలేదంటారని కాని ఏమాత్రమూ భయపడకు ముందు ముందు నీభార్య పిల్లను అలుసు చెయ్య కుండా కూడా చూడు ఇటువంటి విష యాల్లో లోకాన్ని పాటించి లాభంలేదు "

మా బావమరిది పెళ్ళిచేసుకున్నాడు రాజ్యాన్ని సవతితల్లి సరిగా చూడలేదు ఆవిడ అసూయ చూపించిందనీ, సవతి తల్లితనం ప్రకటించిందనీ అందరి మాదిరిగా నిష్ఠురంచెయ్యటం నా కిష్టం లేదు తల్లి పిల్లలను చూడటమే పెద్దకళ, సవితితల్లి సవితిపిల్లను సరిగా చూడటం మరింత క్లిష్టసాధ్యమైన కళ, ఆ కళకు అవసరమైన శిల్పచాతుర్యం మా బావ మరిది రెండో భార్యలో, పూర్తిగా లోపిం



చింది.

రాజ్యానికి జీవితం హాయిగా లేదని ఎవరన్నా చూచాయగా అన్నప్పుడు నా హృదయం చలించేది. కాని ఏదో సమాధానం చెప్పుకుంటేగాని నాకు తృప్తి కలిగేది కాదు లోకం నోరు మంచిది కాదు తల్లిపిల్లల్ని ఎంతహింసించినా ఎవరూగమనించరు. సవితితల్లి అవసరంగా కోప్పడ్డాగొల్లున గోలెత్తుతారు। రాజ్యంమాత్రం చిన్నతనంచేత అవివేకమైన పనులు చెయ్యదా? ఈవిధంగా అనుకుని ఊరుకున్నాను

పదో ఏట రాజ్యం పెళ్ళి అయింది ఆ పదోయేటనే అది వితంతువు కూడా అయింది. వైధవ్యం సంప్రాప్తించిన ఒక నెలకే రాజ్యం నాకు మొదటి ఉత్తరం రాసింది ఆ ఉత్తరం ద్వారా నేను తెలుసుకోగలిగాను రాజ్యం విషయంలో నా విద్యుక్తధర్మం నేను నెరవేర్చలేదని. కొంతకాలం పాటు దాన్ని మా ఇంట్లో వుంచుకుంటానని మా బావమరిదితో చెప్పి రాజ్యాన్ని తీసుకొచ్చేశాను

దాని భావిజీవితం గురించి స్థూల నిర్ణయం చేసేశాను దాన్ని వెంటనే ట్యూటరు కిందపెట్టి పై సంవత్సరం ఏ ఏ ఫస్టుఫారంలోనో ప్రవేశపెట్టటమూ. కాలక్రమాన దానికి పునర్వివాహంచేసి దాని జీవితం సార్థకపరచటమూ

రాజ్యం మా యింటికి వచ్చేవరకు నాకు పిల్లలమీద ఎంత వాంఛ వుండిందీ తెలిసివచ్చింది దానికోసం గుడ్డలనీ, సబ్బులనీ, సూదులనీ అవనీ ఇవనీ విచారించటం నాకు కొత్త ఆనందం ఇచ్చింది. అది కొంతకాలం పాటు మా ఇంట్లో వుండిపోతుందనే ఆలోచనే నాకెంతో సంతోషం కలిగించింది. కాని. దాని వెనకాలే వచ్చింది ఆలోచన—రాజ్యం మీద ఇంత మమకారం పెట్టుకుంటే ఈబంధం తెంచుకోవలసి వచ్చేటప్పటికి ఎంత బాధ పడతానోనని।

రాజ్యం రాకముందు నా భార్య కనబరిచిన నిర్లిప్తత చూచి నేను ఆశ్చర్యపడ్డాను అది - నాభార్య - అంటే నాకన్న చాలా ఎక్కువగా కలవరించేది పిల్లలకోసం. అటువంటిమనిషి ఇంటో ఒక పిల్ల తిరుగుతుంటే ఎందుకు పరవశమైపోమా? అంటే నాభార్య రాజ్యాన్నిచూసి మొహం మాడ్చుకుందనికాదు, రాజ్యానికి వుపచారం చెయ్యటంలో నాభార్య కనబరచదగిన వుత్సాహం కనపరచకపోయింది అంత కన్న వున్నసంగతి స్పష్టంగా చెప్పలేను.

మళ్ళీ రాజ్యమూ, నాభార్యా చాలా రాచకార్యాలు చేసుకునేవాళ్ళు కలిపి పని చేసేవాళ్ళు ఎంతో బంధం వున్నట్లుండే వాళ్ళు కాని నాతో మాట్లాడేటప్పుడు రాజ్యం గొంతుల్లో మరొకధోరణి కనిపించేది, పైకి ఏమీ అనకుండానే ఆ పసిపిల్ల నామీద తనకున్న అభిమానం యొక్క ప్రత్యేకతను ప్రకటించేది.

రాజ్యం నా పనులన్నీ తనే చెయ్య సాగింది. అందుమూలంగా తనభారం చాలా తగ్గించినందుకు నాభార్య సంతో షించింది. రాజ్యం అనేకపనులు నాభార్య కన్న బాగా చెయ్యగలిగినందుకు నేను సంతోషించాను. కాని ఈ సంతోషంతో బాటు అర్థంకాని బాధ కలిగేది

రాజ్యం మా ఇంటికొచ్చిన కొత్త లోనే ఒక కోతిపని చేశాను అపని చేసే దాక అటువంటి పని చెయ్యగలనని నే నెన్నడూ భావించలేదు ఆ తరవాతకూడా నా జీవితమంతా సింహావలోకనం చేసు కుంటే నాకర్థంకాని అనేక విషయాల్లో ఇదికూడా ఒకటి అనిపిస్తుంది అదేమి టంటే, నేను మా రాజ్యాన్ని నాభార్య చూడకుండా ముద్దుపెట్టుకున్నాను నాకు నిజంగా పిల్లల్ని ముద్దుపెట్టుకునే అల వాటు లేదు ఆపని చేసేవాళ్ళను చూస్తే రోతకూడాను. ఆపని ఎటువంటి ఉద్రే కంలో చేశానో నేనిప్పుడు చెప్పలేను నేను కుర్చీలో కూర్చుని చదువుకుంటు న్నాను రాజ్యంవచ్చి నా చదువు భంగం చెయ్యసాగింది పైకి కసబడనిచ్చేవాణ్ణి కాను గాని దాని అల్లరి నాకు చాలా యిష్టంగా వుండేది ఆ సంగతి గ్రహిం చినదానల్లేనే రాజ్యం నేను కసిరితే లక్ష్యం చేసేదికాదు ఆరోజున నేను దాన్ని కసర లేదుకూడాను పుస్తకంమీదినుంచి దాని కేసి కళ్ళు పెద్దవిచేసి చూశాను, రాజ్యం చప్పున దగ్గిరికివచ్చి నా వీపుమీద చెయ్యి వేసి "నేను పెద్దదాన్నయి నీ అంత చదువువొచ్చి ఇట్లాగే చదువుకునేటప్పుడు, నన్ను ఇట్లాగే ఏడిపిస్తావా?" అని అడి గింది — కేవలమూ పసితనంవల్ల అన్నట్టు గాని, కావాలని అన్నట్టు కాకుండా

ఆక్షణంలో నాకు చెప్పతరంగాని వుద్రే కంవచ్చేసింది అమాంతం దాన్ని అవలీలగా ఎత్తి ఒళ్ళో కూర్చోబెట్టుకుని చెంపముద్దు పెట్టుకున్నాను మరుక్షణం నా ప్రతి నరమూ ముడుచుకు పోయినట్టయి పోయింది ఏ మహాపాపం చేసినట్టుదో పశ్చాత్తాపంలో మునిగిపోయినాను ఇక రాజ్యం ఎన్నటికీ నన్ను మామూలుగా చూడదనుకున్నాను అది బతికి ఉన్నంత కాలమూ దాని మనస్సులో యిది నన్ను గురించిన కళంకంగా నిలిచి ఉంటుందను కున్నాను అది ఈ విషయం ఏ మాటల సందర్భంలోనో మొగుడితో కూడా చెప్పే స్తుంది కొద్ది కాలంలో రాజ్యం ఈ సంఘటన మరిచిపోతుందేమోనని ఒక క్షణకాలం వెర్రి ఆశ కలిగింది కాని మరు క్షణమే అది అడుగంటింది రాజ్యానికి పదివిండినై అమాయకురాలైనా కాదు.

అయితే నా కాశ్చర్యం కలిగించిన విషయం ఏమంటే, రాజ్యం నన్ను కొత్తగా చూడలేదు. వెనుకటి మోస్తరు గానే ఉంది "నువ్వు నన్ను ముద్దుపెట్టు కొన్న సంగతి నేను మరిచిపోలేదులే!" అన్నట్టయినా అది ప్రవర్తించలేదు నా గుండె కొంచెం కుదుటపడ్డది. అది మా యిద్దరి మధ్య ఒక రహస్యం ఇక దాన్ని గురించి మూడో ప్రాణికి తెలి[illegible] రాదని చేసుకున్నాను

రాజ్యం స్కూలుఫైనల్ల పాసుకాగానే



దాని పెళ్ళి విషయం ప్రయత్నిస్తానన్నాను. అది అంగీకరించలేదు. తనకు పెళ్లి వద్దంటే వద్దన్నది. చదువుకుంటానన్నది. ఏదైనా ఉద్యోగం చేస్తానన్నది.

"అయోమయంగా మాట్లాడకు. రాజ్యం సహజమైన ఆడదానికి మొగుడు లేకుండా జరగదు. నీ కిప్పటికే యీడు మించింది మొగుడక్కర్లేదంటే నువ్వు అవ్యక్తంగా ప్రవర్తించటానికి సిద్ధపడు తున్నావనుకోవలసివస్తుంది. లేదా సహజమైన ఆడదానివి కావనుకోవలసి వస్తుంది. ఏది అనుకున్నా నాకు కష్టంగానే ఉంటుంది." అన్నాను.

రాజ్యం చదువుకుంటున్న కొద్దీ దానితో గంభీర విషయాలు స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం నాకు లభించింది. ఆ ధోరణి లోనే ఇప్పుడీ విషయం కూడా ప్రస్తావించాను. రాజ్యం కోపగించలేదు. నవ్వలేదు. గంభీరంగా "నువ్వెప్పుడన్నా అవ్యక్తంగా ప్రవర్తించావా. మామయ్యా!" అని అడిగింది.

నేను కంగారుపడి, "లేదు! ఎప్పుడూ లేదు! ఎప్పుడో చిన్నతనంలో ఒకసారి —అది కూడా చెప్పుకోదగిన! విషయం కాదు. ప్రమాదం జరక్కముందే కళ్ళు తెరిచి—" అని తడువుకుంటూ ప్రారంభించాను.

రాజ్యం నా కడ్డంవచ్చి "అప్పటికి నీకు పెళ్ళి అయిందా!" అన్నది.

"నాకు చాలా చిన్నతనంలోనే అయింది పెళ్ళి. నీ మాదిరిగా కాదు—"

"అత్తయ్య కాపరానికి వచ్చిందా!"

"వచ్చే ఉంటుంది! అదికాదు నే ననేది—"

రాజ్యం ఇక మాట్లాడదగిన విషయం పూర్తి అయినట్టుగా లేచి తన పనిమీద వెళ్ళబోతూ మళ్ళీ ఆగి, "ఆ అవ్యక్తత విషయంలో ఎప్పుడన్నా మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడ్డావా!" అన్నది.

నా నోట మాట రాలేదు.

మళ్ళీ నేను రాజ్యంతో దాని పెళ్ళి విషయం ఎత్తలేదు.

ఈ నాలుగు సంవత్సరాలూ అది లేని కొరత నాకు బాగా కనిపించింది రాజ్యం కాలేజీలో ప్రవేశించటానికి వెళ్ళిపోగానే నేను మళ్ళీ మామూలు ప్రపంచంలో పడ్డట్టయింది. గృహచ్ఛిద్రాలను పరిష్కరించుకోవటమే పరమార్థంగా పెట్టుకున్న నా భార్యా నేనూ మిగిలాం. ఒక మంచి పుస్తకం చదివి పూర్తిచేసి మూసినట్ట యింది. రాజ్యం దగ్గర్నుంచి ఎప్పుడన్నా ఒక ఉత్తరంవస్తే ఆ పుస్తకం మళ్ళీ తెరిచి అక్కడక్కడా వాక్యాలు చదివి మొదటి పఠనానుభవం స్ఫురణకు తెచ్చుకున్నట్టు అయ్యేది.

కిందటిసారి శలవులకు వచ్చినప్పుడు మా సంభాషణలో ఒక కొత్త అంశం వచ్చింది. ముందుగా నేనే రాజ్యాన్ని కెలికాను—ఏమే రాజ్యం, అవ్యక్తపు మనిషి అవుతున్నావా! అసహజమైన మనిషి







వవుతున్నావా?" అన్నాను.

రాజ్యం కొద్దిగా మందహాసంచేస్తూ "నేను అసహజమైన దాన్ని కాను మామయ్యా!" అన్నది.

ఆ మాటకు నేను కంపించిపోతూ "కొంపతీసి ఏం చేస్తున్నావేమిటి!" అన్నాను రాజ్యం మాట్లాడలేదు

ఇప్పటికే మే మిద్దరమూ ఔచిత్య భంగం అయేటంత సంభాషణ చేశాం. కాని, నా ఆదుర్దా నన్ను నోరు మూసుకో నివ్వలేదు నేను బతిమాలుతూ "రాజ్యం తొందరపడి అవివేకమైన పనులు చెయ్యకు నాకు నిన్ను గురించి అది ఒకటే దిగులు." అన్నాను.

"ఏం చేస్తావు. మామయ్యా! నీ ప్రవర్తన నీ యిష్టా యిష్టాలమీదే ఆధారపడి ఉంటుందా! ఎవరో వచ్చి సోది పెట్టుకు కూర్చుంటే నువ్వేం చేస్తున్నావు. చెప్పు. "నీ సోది నాకు తలనొప్పిగా ఉంది. చాలించి నీ దారిన నీవు పో"" అనగలవా?

"అదా ఉపమానం?" అన్నాను నిర్ఘాంతపోయి

"ఎందుకు కాదూ! ఎవడోవచ్చి నా కోసం చచ్చిపోతున్నా నంటాడు నేను మొగ్గేవరకూ నన్ను విడవడు ఏమిటి చెయ్యటం?"

"నీ కోసం చస్తున్నా నన్నవాడి

మాటల్లా నమ్ముతావా?''

"నిన్ను చూసి జాలిపడుతున్నట్లు కనబడే వాళ్ళందరితోనూ పోట్లాడతావా? నిన్ను చూసి ఇతరులు జాలిపడదగిన స్థితిలో ఉండటం నీ దురదృష్టం అద తనమూ, యవ్వనమూ నా దురదృష్టం!" అన్నది రాజ్యం "అది ఒక బాధ్యత ఇతర బాధ్యతల మాదిరిగానే ఇది కూడా నిర్వర్తించటం కష్టం ఏదో ఒక పొర బాటు జరిగి తీరుతుంది అత్యద్భుతంగా నిర్వర్తించగల మనిషి నేటందుకు లేదు ''

''అట్లా మనస్సుకు సమాధాన పరుచు తుంటే నీ ఆత్మగౌరవం మాటేమిటి? నీకు నీతిలో నమ్మకంలేదా? నా కిప్పటి వాళ్ళ లేకితనాలు నచ్చవు. రాజ్యం నేను ముసలివాణ్ణి" అన్నాను.

"నేను పడుచుదాన్ని. నాకు నిజంగానే నీతిలో నమ్మకంలేదు నీతికంటే చాలా ముఖ్యమైనవి జీవితంలో ఉన్నట్టు అది వరకే నిర్ధారణ చేసుకున్నాను అయితే, నాకు ఉన్న లేకితనమూ అసహ్యమే నేను అవినీతిని ఆరాధించను ఇక ఆత్మ గౌరవమూ, పవిత్రతా అంటావా? దీర్ఘంగా ఆలోచిస్తే అవి అణిచిపెట్టిన అహంకారాతిశయాలుగాని ఇంకేమీ కావు ఏమిటాలోచిస్తున్నావు?'' అన్నది రాజ్యం

"ఏమీలేదు నిన్ని చదువులో పెట్టి పాడుచేశానా అనుకుంటున్నాను నీ కిటు వంటి విశ్వాసాలు కలగటం నాకెంత కష్టంగా ఉందో నేను ఊహించనైనా లేను. నా బాధ నిన్ను చీమతలకాయంత యినా అంటు తుందనే ఆశతో ఆ మాట అంటున్నాను ''

రాజ్యం దీనంగా నవ్వి "చీమతలకా యంత కాదు కండచీమ మోస్తరుగా పట్టు కుంటుంది నీ కటువంటి బాధ కలగ కుండా ఉండేటందుకే నిష్కల్మషంగా నా మనస్సువిప్పి చెబుతున్నాను—చేత ఋ నంతవరకు, ఒక్కటి అర్థంచేసుకో, మామయ్యా, భగవంతుడు ఒక్కొక్క మనిషిని ఒక్కొక్కవిధంగా పుట్టిస్తాడని నీకు నమ్మకం ఉందా? అయితే ఆ భగ వంతుడు నాకు నీతిగీత గియ్యకుండా పుట్టించాడు నేను భూమిమీద పడక పూర్వమే నాకు నీతితో సంబంధం లేకుండా ఏర్పాటు జగిరింది దేవతలు నాకు కావలసిన పువ్వులన్నీ పోగుచేసి ముళ్ళకంచెల మీదపెట్టి ఆ ముళ్ళకంచెల చుట్టూ ఊబి కల్పించారు అంతకన్న నే నేమీ చెప్పలేను వాటిని సంపాదించ గలిగానా ఒళ్ళంతా బురద అవుతుంది, గీసుకుపోయి రక్తం కారుతుంది, కాని జన్మ సార్థకం అవుతుంది లేదూ— నా జన్మ నిరర్థకం అవుతుంది.''

రాజ్యం మాట్లాడుతుంటే నాకేదో మైకం కమ్మినట్టు కాసాగింది. నల్లమందు పొగలు చుట్టవేసినట్టయింది. ఈ పొగ లలోనించి పుస్తకాల్లో ఉన్మాదులైన కథ కులు చిత్రించే అసహజమైన ప్రపంచం

అస్పష్టంగా కనిపిస్తున్నది. పుస్తకాలు చదివి పాడైన రాజ్యం నన్నొ మాయ ప్రపంచంలోకి తీసుకుపోవటానికి ప్రయత్నిస్తున్నది. నేను పోను. ఈ మైకాన్ని విదిల్చేస్తాను.

"నీ మాటలకు అర్థంలేదు ఏదో మాట్లాడుతున్నావు—అంతే! నీకు వెధవరికం రావటం నిజంగా అక్రమమే ననుకో. కాని, దానివల్ల బాధపడటం నీ తప్పే. నువ్వెందుకు పెళ్ళిచేసుకోవూ? ఇద్దరు పిల్లల్నికంటే ఈ పైత్యమంతా దిగిపోతుంది కాదనకు—నువు మాట్లాడేది కేవలమూ పైత్య ధోరణి."

రాజ్యం మళ్ళీ నవ్వింది. అది నన్ను చూసి నవ్వుతున్నదా అనిపించింది నాకు

"నీకు ప్రేమలో నమ్మకంలేదా?" అన్నది రాజ్యం

"ప్రేమ! ప్రేమ! షెల్లీ, కీట్సు చదివిన ప్రతిమనిషికి అన్నంకంటె అత్యవసరంగా ముందు ప్రేమకావాలి! ఎక్కడుందా ప్రేమ? దేవుడున్నాడనటం మూఢ విశ్వాసమూ. ప్రేమ ఉందనుకోవటం నాగరికతా! నాకూ కావాలి లక్షరూపాయలు ఏదీ?" అని గట్టిగా అన్నాను

రాజ్యం ఓర్పుతో, "అంటే నీకు ప్రేమలో నమ్మకం ఉన్నట్టా, లేనట్టా?" అన్నది.

"నాకు లేదు! నీకూ లేదు—యేవో కలలు కంటున్నావు నేనటువంటి కలలు కనటం మానేసి ఇరవై సంవత్సరాలైంది. నలభై ఏళ్ళు వచ్చి నేను నేర్చుకుంటున్న దేమిటంటే—మనిషి కామం తీర్చుకోవటంలో పప్పులో కాలు వెయ్యకుండా ఉంటే అదే పదివేలు! నా యీడువచ్చిన తరవాత నీకు అదే తెలుస్తుంది"

రాజ్యం నవ్వి, "మధ్య వయస్సంటూ లేకుండా నేను పసితనంనించి నడివయస్సులో పడి నీమాదిరిగా మాట్లాడగలిగితే ఎంత బాగుండేది?" అన్నది

"అయితే ప్రేమ అంటే నీకూ అంత ఘనమైన అభిప్రాయం లేదన్నమాటే!" అన్నాను

"ఉంది! లేకుండా వుంటే మనస్సుకు శాంతి వుంటుందని! ఏ పని చేస్తున్నా నీ కళ్ళయెదుట, నీ మనస్సులో, నీ గుండెలో నీ నెత్తురులో ఒక మనిషి ప్రత్యక్షమై ఉండటం ఎంత బాధ! ఆ మనిషి జ్ఞాపకం రాగానే నీ కళ్ళవెంట నీరు కారటం ఎంత యిబ్బంది! ప్రపంచంలో ఆ ఒకడేమనిషి అనిపించటం ఎంత గుడ్డితనం!"

"ఎవడది?"

"ఎవరైనాను!" అన్నది రాజ్యం నిర్లక్ష్యంగా

"వట్టి కవిత్వం!"

"కావచ్చు కవిత్వం అబద్ధమా?"

ఈ సంభాషణ పోయినకొద్దీ అన్యాయమవుతుందనిపించింది ఇదంతా ఎట్లా ఉపసంహరించాలో తెలియలేదు

"నీ ప్రేమను విడవటానికి మంచి వుపాయం చెప్పనా?" అన్నాను

"తప్పకుండా చెప్పు. ఇది దాదాపు జబ్బుగా పరిణమించింది. అన్నది రాజ్యం.

"అయితే విను. నువ్వు ప్రేమించిన మనిషిని పెళ్ళాడెయ్యి."

"అట్లా ప్రేమను చంపటానికి నాకు చేతులురావు. ఇంకేదన్నా చెప్పు."

"అయితే నువ్వు ప్రేమించిన వాడు కూడా మామూలు మనిషే అని తెలుసుకో—"

"నాకు తెలుసును."

"వాణ్ని పులి తరుముతున్నట్టు ఊహించుకో. బురదలో జారిపడి లేస్తున్నట్టు ఊహించుకో. గురకపెడుతున్నట్టు — ఎందుకల్లా నవ్వుతున్నావు?"

"నీకు సెన్సు ఆఫ్ హ్యూమరు లేదు మామయ్యా!"

"నాకా?" అన్నాను రోషంగా.

రాజ్యం మళ్ళా నవ్వులో పొర్లిపోయింది.

"మొత్తంమీద చాలామోసం జరిగింది. నువు నే నెరిగిన రాజ్యానివే కాదు ముఖ్యంగా నే నాలోచిస్తున్నదేమంటే, ముందుముందు ఆడపిల్లలందరినీ చదువవేసి నీ మాదిరిగా తయారుచేస్తే ప్రపంచం ఏమవుతుందా అని! చదువుకున్న ఆడవాళ్ళూ మగవాళ్ళూ కూర్చుని ప్రతి పిచ్చిముక్కకూ వెకవెకలాడటం అదివరకే చూశాను. కాని అది వాళ్ళలో తూకం లేక పోవటమనుకున్నాను. నువుకూడా ఆ జాతిలోకేచేరితే ఈ వెకిలితనం చదువులోనే ఉందనుకోవాలి. నీ వంటివాళ్ళు వందమంది కంటే మీ అత్తయ్య ఒకతె నయం!" అన్నాను.

రాజ్యం ఒక చెంప కళ్ళు తుడుచుకుంటూ రోషం నటిస్తూ "అంత తలవాచేటట్టు పెట్టేవాడివి ఎందుకు నవ్వించావేమిటి?" అన్నది.

"సరే అయితే చెప్పు. దేనికి నవ్వావు? నేను నిజంగా అడుగుతున్నాను సుమా!"

"నేను ప్రేమించినవాడే వచ్చి "నన్ను పెద్దపులి తరిమినట్టు ఊహించుకో!" అన్నట్టయితే ఆ మనిషిమీద నాకున్న ప్రేమ ఎట్లా విజృంభిస్తుందో ఆలోచించుకో."

"నీ ప్రేమ!' అన్నాను పళ్లు బిగబట్టి.

"మాటలు చూసి భయపడకు మరి— అందరినీ తేలిక మనుష్యుల కిందకట్టే బరువయిన మనిషివి!" అన్నది రాజ్యం కొంటెగా.

అంతటితో ఆ అయోమయపు సంభాషణ అయిపోయింది. అది అన్నట్టు నాలో సెన్సు ఆఫ్ హ్యూమరు కాకపోయినా ఏదో సెన్సు లోపించింది. జరిగిన సంభాషణకు పడదగిన పశ్చాత్తాపమంతా పడ్డ తరవాత అదికూడా ఒకవిధంగా మంచిదే అయిందని స్ఫురించింది. ఏమంటే, అంతసేపు ఉన్మాదంగా మాట్లాడినా, గంభీరంగా రంకుతనాన్నీ, అవినీతినీ సమర్థించటం మొదలుపెట్టిన




రాజ్యాన్నీ నవ్వించగలిగాను, మామూలు మనిషిని చెయ్యగలిగాను. ఈ సంగతి నా కప్పుడే ఎందుకు తట్టలేదూ?

ఇది కిందటి సంవత్సరం జరిగిన సంగతి మే మిద్దరమూ మళ్ళీ అటువంటి సంభాషణలో పడలేదు. ఇది మా ఇద్దరి మధ్యనే మిగిలిపోయిన రెండో రహస్యం.

మా మూడో రహస్యాన్ని గురించి చెప్పటానికి నాకు భాషలేదు. చిత్రించటానికి శిల్పం చాలదు. నేను మొదట్లో చెప్పిన ఉత్తరం అందిన సాయంకాలం బండిలో రాజ్యం దిగింది. అది దిగిన క్షణంనించీ ఆ రాత్రి ఆఖరయ్యేవరకూ జరిగిన సంగతులు ఈ ప్రపంచానికి సంబంధించినవిగా తోచవు. నేను, నాది అనుకునే ప్రకృతికి ఏమీ అందులో పాలు లేదు. భగవంతు డనేవాడుంటే అట్లా జరిగి ఉండదేమో!

అది నా ఆదర్శాల మధ్య పిడుగు పడ్డట్టు పడింది. చిత్రమేమిటంటే రాజ్యం కనబడిన క్షణంనించీ నా అంతరాత్మ "ఏదో జరగబోతున్నది జాగ్రత్త!" అని సూచిస్తూనే ఉంది. అసలు మే మిద్దరమూ ఈసారి ఒకరివంక ఒకరం సూటిగా చూసుకోలేక పోయినాం. దానితో మాట్లాడాలంటే నాగొంతు బిరుసెక్కినట్టయిపోసాగింది. రాజ్యం నాకు రెండడుగుల దూరంలో వస్తే ఊపిరి పూర్తిగా బిగబట్టి ఒకక్షణం ఉండి గట్టిగా విడవటం మొదలుపెట్టింది. మేమిద్దరమూ మాట్లాడుకోవటం మొదలుపెడితే ఒకప్పుడు గంటలెల్లా గడిచినయ్యో ఇప్పుడు క్షణాలంతకన్న భారంగా గడవసాగినై. నన్నెవరో ఊదర పెట్టినట్టయింది. రాజ్యంకూడా

అట్లాగె భావిస్తున్నదని నె నూహించ గలిగాను

ఈ ఊదరవించి తప్పించుకుపోవటం ఎట్లా? ఇంటో నా భార్యఅయినా లేదు "ఎందుకిట్లా అవుతున్నాను? ఇంతకాలా నికి నా కూతురితో సమానమైన రాజ్యం మీద నాకు కామోద్రేకం కలుగుతున్నదా?" అని కోపంగా ప్రశ్నించుకున్నాను ఎవరు సమాధానం చెబుతారు? అర్థంలేని ప్రవా హాన పడి కొట్టుకుపోతుంటే విమర్శించి పెట్టేవా రెవరు?

అది రాజ్యంమీద ప్రేమకాదు. నాకు ప్రేమానుభవం ఎన్నడూ కాలేదు. కాని ఇది ప్రేమకాదని గుర్తించాను. ఇది ప్రేమ అయితే ప్రతి ప్రాణీ ప్రేమించ గలదు. నాలో ఆ క్షణాన మానవత్వం ఏమీలేదు. 'నా ఉద్రేకం కట్టలు తెగి రాజ్యాన్ని నిర్మూలించటానికి చూస్తున్నది కాని పవిత్రం చెయ్యటానికి చూడటం లేదు. అటువంటి ఉద్రేకం నేను యవ్వ నంలోకూడా యెరగననిపించింది నే వింతకాలమూ అభ్యసించిన విగ్రహానికి మరోరూ మరోరూ కాకుండా రాజ్యమా బలి! ఇది నాకు ప్రకృతివేసిన శిక్షా? ఈ సంఘటనలో ఆధ్యాత్మికమైన గుణపాఠం ఉందా?

ఆ క్షణంలో రాజ్యం మనస్సు నా కర్థమైతే ఎంత బాగుండును? కాని కాలేదు. ఆ నిమిషంలో నాకు రాజ్యం తన్న దూరంగావున్నది మరేదీలేదు. నా ఊహ సరయితే నా ప్రతి కదలికలోనూ రాజ్యానికి రాక్షసత్వం కనిపించి ఉండాలి. ఆ క్షణాన అదికూడా రాక్షసి అయితే తప్పు!

రాజ్యం! నన్ను అణుమాత్రమైనా ప్రతిఘటించలేదు ఒకవేళ నాకు తెలియ లేదో! తనలోపడి కొట్టుకుపోతున్నవాడు వాలునపడి వస్తున్నాడో, ఎదురీదడానికి ప్రయత్నిస్తున్నాడో వరదకేం తెలుస్తుంది?

నన్నావేశించిన పిశాచం వదలి తుపాను సమసిపోయిన తరవాత నాస్థితి ఆలోచించు కుంటే నాకొక వింతవిషయం అవగాహన అయింది. నేను భయంకర పాపమును కుంటూ చేసిన ఈపని నా తత్వానికి సరి పోయింది ఇందులో ఆనందమూలేదు. బాధాలేదు. ఆనందమైనా బాధ అయినా నాకు అసహజమైన అనుభవాలనిపించేవి. ఈ అనుభవం తరవాత దీని ఫలితంగా ఏ వికారమూ లేదు. ఇక ఏదో వికారం నేనే పనిట్టుకొని తెచ్చుకోవాలి. నన్నిటు వంటి పనులు చెయ్యమని పుట్టించా డాభగవంతుడు! కిందటి జన్మలో రాజ్యం నాతో అన్నమాటలేవో జ్ఞాపకం వచ్చినై!

ఇకముందు రాజ్యానికి నే నేమవు తాను, అది నాకే మవుతుంది. ఈ దుష్కార్యానికి శిక్షో ప్రతిఫలమో ఏమిటి? ఇటువంటి సమస్యలన్నీ కాలక్రమాన పరిష్కారం అవుతై. వాటినిగురించి ఆలోచించే త్రాణలేదు నా ఆత్మలో. నేను రాజ్యంకేసి చూడనన్నాలేదు.

అంధకారంలో జడుడిమాదిరిగా ఉన్న నాకు వెలుతురు కిరణం సాక్షాత్కరించింది రాజ్యం నా పక్కనే వచ్చి కూర్చుని నా మెడచుట్టూ చెయ్యివేసి "చూశావా, మామయ్యా! నా క్కూడా నీతి అనేది ఉంది!" అన్నది దాదాపు పరిహాసం గొంతుతో

"నన్ను తిట్టదలిస్తే అంత నాజూగ్గా తిట్టనక్కరలేదు నువ్వు యెంత మాట అన్నప్పటికీ ఆగ్రహించడానికి అధికారం లేకుండా చేసుకున్నాను "

రాజ్యం ఆదుర్దాగా నన్ను కుదిలిస్తూ "పశ్చాత్తాపపడటం మొదలుపెట్టి నా ఆనందమంతా పాడుచెయ్యకు." అని బతిమాలింది.

మొదట నా చెవులు నేనే నమ్మలేక పోయినాను. కాని మరుక్షణమే నాకు రాజ్యం స్వర్గంలో ఉన్నదని—ఉన్నాననుకొంటున్నదని—అర్థమయింది. జీవితం పొరపాటున నాటకం మాదిరిగా అవుతుందేమోనని జీవితమల్లా భయపడిన నేను ఆ క్షణాన దేవుణ్ణి ఉద్దేశించి "చూశావురా, దేవుడా? నేను చేసినపని రాజ్యం ఆమోదిస్తున్నది!" అని వెర్రికేక వేతామనుకున్నాను.

"నేను మొదటిసారి నిన్ను చూచిన క్షణంనుంచీ నిన్ను మిగతా ప్రపంచం నుంచి ఎడంచేసి రహస్యంగా దాచిపెట్టుకున్నాను. నా జీవితం ఏ గుట్టలెక్కినా, ఏ లోయల్లో పడిపోయినా సరే నేను చెయ్యి చాచి ఏక్షణాన నిన్ను అందుకోలేకపోతే ఆ క్షణాన నా జీవితం తొర్ర పడిపోతుందనుకున్నాను. నా అభిప్రాయాలు ఎన్నో మారినై ఇది మారలేదు నేనేం చెయ్యను?

"మూడు నాలుగేళ్ళనించీ నీమీది అభిమానం అణిచిపెట్టడానికి వీల్లేని వాంఛగా మారింది నేను ఎట్లా విగ్రహించుకున్నానో తెలియదు ఏ క్షణాన నువు నన్ను కౌగలించుకున్నా నేను నీ చేతుల్లో నీరైపోయి వుందును వెనక ఒకసారి నన్ను ముద్దుపెట్టుకున్నావు మళ్ళీ ముద్దు పెట్టుకుంటావని ఈ ఎనిమిది తొమ్మిది సంవత్సరాలనించీ ఎదురుచూస్తున్నాను.

"నీ మీద పంచప్రాణాలూ పెట్టుకున్న నేను నీతిని ఎట్లా లక్ష్యం చెయ్యను? నీకేమో నీతిలో అంత నమ్మకం. నిన్ను ఆకర్షించటానికి ఎంత సిగ్గుమాలిన పని అయినా చేతామనిపించేది. కాని చెయ్య లేదు. నీ అంతట నీవే నాకు మోక్షం ఇచ్చేవరకూ నేను చెయ్యీ కాలూ కదలించదలచలేదు. ఆ నిశ్చయంమీదే ఉన్నాను. నాకు తగిన నీతి నాకుమాత్రం లేదంటావా?"

ఎంత అందమైన మాటలు—నిజమైతే!

నన్నా అపనమ్మకం వదలదు! నేను స్వర్గ నరకాలచుట్టూ వెయ్యి ప్రదక్షిణాలు చేసివచ్చినా సరే అది నా వెంట వుంటుంది. వెయ్యి మందిలో ఒకడు అనిపించుకోని మాటలు ఆడదానినోట అనిపించుకున్న

తరవాత కూడా నా అపనమ్మకం నా వెంటే వుంటుంది। ధన్యుణ్ని.

"నా వ్యక్తిత్వం సార్థకం చేసుకునే టందుకు రాజ్యాన్ని హింసించాను। దాని కోరికను తృణీకరించి నా పశ్చాత్తాప। వెలిబుచ్చాను. ఇక యిటువంటి పని ఎన్నడూ చేయనని శపథంచేశాను। వెన కటి మా పవిత్రమైన సంబంధం కళం కితమై పోయిందని వాపోయినాను।

దాని మాటలు నిజంగా అబద్ధంకాక పోతే నా మాటలు దాన్ని ఎట్లా హింసిం చేది నేను లెక్కచెయ్యలేదు. దాని ప్రాణం హింసపడటంకంటే నా అపనమ్మకమే నాకు ప్రియమైనది. దాని మాటలు నిజం కావని నిరూపించటానికి లక్షవాదాలు నా మనస్సులో పుట్టుకొచ్చినై।....

రాజ్యం మనిషి కాదు, దేవత। అది ఒకప్పుడు తన వాంఛను ఎట్లా అణగ దొక్కి పెట్టిందో యిప్పుడు తన బాధను కూడా అట్లాగే అణగదొక్కి. నా మాట లన్నీ విని తలవంచుకుని "పోనీ మామయ్యా! నువ్వెందుకు పశ్చాత్తాప పడతావు? పాపిష్ఠిదాన్ని నేనే। నా మూలం గానే నువు గోతిలో పడ్డావు. నేను సమ యానికి నివారించగలిగితే నువు మేలుకునే వాడివి. నే నిదివరకే చెడిపోయినాను కనక నాకు ఫరవాలేదు. ఇప్పటికైనా నీ మనస్సు తెగబడి ఏదన్నాకోరితే నేను ఏ విధమైన అభ్యంతరమూ చెప్పను. నీకు నావల్ల ఏంకావాలంటే అది నిశ్చింతగా తీసుకో. నా బుద్ధికి మాత్రం మన వెనకటి సంబంధం ఏమీ మారినట్టులేదు. నీ బుద్ధికి అట్లా తోచినప్పుడు మళ్ళీ వెనకటి పద్ధతికి పోదామని ప్రయత్నించకు. లాభం ఉండదు' అన్నది.

నాఅంతరాత్మ జాలిపడ్డట్టు నటించిం. దాని మనస్సుకు శాంతి కలిగించే వాడల్లే నటిస్తూ, దాని దృష్టితో రాజీపడే వాడల్లే కనిపిస్తూ దాని శరీరం మళ్లా నాస్వాధీనం లోకి తీసుకున్నాను. నా మనస్సును మార్చుకోకుండా, నా ఉన్నతాదర్శాలు సంస్కరించుకోకుండా రాజ్యం ద్వారా కామోపశమనం చేసుకోవటానికి రోజు కొక నూతన మనః పరిణామం ప్రదర్శిం చుతూ వచ్చాను. ఈ విధంగా నేను రాజ్యాన్ని మరింత హింసించి వుండాలి. కాని దాని నోటివెంట ఒక్కసాధింపు మాటరాలేదు. అందుకు నేను కృతజ్ఞత చూపలేదు. దాని నోటివెంట ఒక సంతోష కరమైన మాట కూడా రాలేదు. అదికూడా నేను గమనించలేదు. నాకిప్పుడు స్మరిం చితే అనుమానం కలుగుతున్నది — ఆ రోజుల్లో రాజ్యం నవ్వినట్టు జ్ఞాపకంలేదు.

నా భార్యకు మళ్లా ఆడపిల్ల కలిగినట్టు ఉత్తరం వచ్చింది. భారసాల విషయం అశ్రద్ధచేసినా శాంతి ఒకటి ఉంచికనక తప్పకరమ్మని రాయించింది నాభార్య. మర్నాడు పోవటానికి ప్రయాణం కట్టాను.

ఆరోజు సాయంకాలం మాయింటి




కొక కుఱ్ఱవాడు వచ్చాడు చిక్కి శల్యా కారంగా ఉన్నాడు పాపం ఎవరు కావా లన్నాను అతను సమాధానం ఏదో గొణిగి అటూ ఇటూ చూడసాగాడు ఇంతలో రాజ్యం లోపలినించివచ్చి అతన్ని చూస్తూనే పేరుపెట్టి పిలిచింది

"ఒక్కమాట మాట్లాడి వెళ్ళిపోతాను ఇక్కడ ఒక డాక్టరునుచూసి పోదామని వచ్చాను ఈబండికి పట్నం వెళ్ళి పోతున్నాను" అన్నాడు ఆకుఱ్ఱవాడు.

ఇద్దరూకలిసి దొడ్లోకి వెళ్ళారు ఆ ఇద్దరూ నా దృష్టిపథం దాటిపోగానే నాలో అసూయ అంకురించి భగ్గునమండి జ్వాలగా అయింది.

"ఇటువంటి ప్రియులు దీనికింకా ఎందరున్నారో? పాపం. తన్ను తానే మోసగించుకుంటున్నది నడివయస్సు వాడిమీద దానికి ప్రేమ ఏమిటి?"

ఒక నిమిషానికి ఇద్దరూ లోపలికి వచ్చారు కుఱ్ఱవాడు వెళ్ళిపోయినాడు. వాడి వాలకంచూస్తే మొహంలో మృత్యుదేవత తాండవిస్తున్నది ఎటువంటి ప్రియుడు! అంతకంటె నేనే లక్షరెట్లు నయం!

'ఎవరతను?"

"ఒకప్పుడు నన్ను నిర్బంధించినవాడు. అతనిలో అంత మానవత్వం ఉందనుకో లేదు." అన్నది రాజ్యం పరధ్యానంగా

"ఏం? ఏమంటాడు?'

"తనకు క్షయఉందని వైద్యులు నిర్ణయించారుట నాకు చెప్పటానికి వచ్చాడు"

"జాగర్త పడమనా?"

"ఊఁ"

వాడిస్థితిలో నేనుంటే అట్లా ప్రవర్తించేవాణ్ణా అని ప్రశ్నించుకున్నాను. ఆ

తరావి కాతరం ప్రవర్తనలో నీతి ఒక వేళ జాస్తి అవుతున్నాదేమో ననిపించింది రానురాను స్త్రీ పురుష సంబంధ అట్లా అధోగతి పోవటందేనికి? నా కాసంబంధం సరిగా అర్థంకాలేదా?

నేను మా బావమరిదిగారి ఊరుకెళ్ళి రావటానికి పదిహేనురోజులు పట్టింది. ఈ పదిహేను రోజుల్లో రాజ్యం యొక్క నగ్న సౌందర్యం పదిహేను వందలసార్లు జ్ఞాపకంవచ్చింది. స్త్రీ పురుష సంబంధమైన నీతినిగురించి నాకున్న ఖచ్చితమైన జ్ఞానం నా పురుషత్వాన్ని గురించి లేకపోవటం గ్రహించి కొంత ఆశ్చర్యపడ్డానుగాని నామనస్సు ఆత్మ పరీక్షవైపు జాస్తిగా వెళ్ళలేదు

ఆఖరుకు ఇంటికి బయలుదేరి రైలెక్కగా నే దిక్కుమాలిన ఉద్రేకం ఒకటి పుట్టుకొచ్చింది ఏ ఆదర్శం కోసమైనా సరే రాజ్యాన్ని వదిలి పెట్టటం నాక సంభమని తేల్చుకున్నాను రాజ్యం నాకు ఆత్మార్పణ కావటంలో ఉన్న గొప్పతనం నాకు అకస్మాత్తుగా అర్థమయినట్టయింది. నాలో కృతజ్ఞత మొలకెత్తింది

రెక్కలు కట్టుకుని వచ్చినవాడల్లే నేను ఇంటోవచ్చి వాలేటప్పటికి రాజ్యం సావిట్లో మంచంవేసుకుని పడుకుని ఉంది. దాని స్వరూపం చూడగానే నాకు కళ్ళు తిరిగిపోయినై. ఆనాడు ఆ కుట్టివాడి మొహాన ఏమృత్యుదేవత గోచరించిందో ఆ మృత్యుదేవత ఈనాడు రాజ్యం మొహాన తాండవిస్తున్నది.

"రాజ్యం?" అన్నాను. వణుకుతున్న గొంతుతో. మోకాళ్ళు పట్టు తప్పి పోతునై.

"పిల్లా, తల్లీ కులాసాగా ఉన్నారా?" అన్నది రాజ్యం హీనస్వరంతో.

"ఏమిటి ఇట్లా వున్నావు?" నీ కేమయింది? ఎన్నాళ్ళనించి? నీ కెవరుతోడుగా వున్నారు? చెప్పు రాజ్యం!" అన్నాడు.

"క్షయ! సందేహంలేదు చాలా ప్రమాదకరమైనదని పట్నంలో వైద్యులు చెప్పారుట ఉత్తరం రాశాడతను పాపం. జీవచ్ఛవం!"

"నీకు? నీకూ అదే? ఇంతకాలం దాగి వుండి యిప్పుడు బయటపడ్డదా?"

"లేదు. అతనిక్కడికి వచ్చినప్పుడు-"

"ఏంచేశావు? మీరు ఒక్క నిమిషం కంటే మాట్లాడినట్లు లేదే?"

రాజ్యం మొహం పక్కకు తిప్పుకుని "ముద్దు పెట్టుకున్నాను" అన్నది పొడి దగ్గు దగ్గుతూ

నా అవస్థ వర్ణనాతీతం. ఆ క్షణంలో నా ప్రపంచమంతా — సంప్రదాయసిద్ధంగానూ చదువులతోను నాకు సంక్రమించిన సంస్కారమూ, నా విశ్వాసాలూ, నేను గుర్తించిన విలవలూ — ఒక్కసారిగా తారుమారయినట్టయింది

నా నోటివెంట మాటలప్రవాహం బయలుదేరింది నా కంటివెంట నీటి ప్రవాహం కూడాను ఏమి మాట్లాడానో,

ఎట్లా మాట్లాడానో తెలియదు. దాని తాత్పర్యం ఏమంటే, నేను రాజ్యాన్ని విడిచి బతకలేను. నేను ఎనిమిదోయేట దాన్ని చూసినప్పటినించీ దాన్ని ప్రేమిస్తూనే ఉన్నాను నేను గుర్తించలేదు కాని అది మర్రిచెట్టల్లే దినదిన ప్రవర్ధమానమై నా జీవితాకాశాన్ని కప్పేస్తూ వస్తున్నది నేను జ్ఞాపకం తెచ్చుకోగలిగితే నేను రాజ్యంతో అన్న ప్రతిమాటా, దాన్నిగురించి చేసిన ప్రతి చిన్న ఆలోచనా ఆ పరిమాణామంలో సోపానాలే! నాకు నోటికి వచ్చిన భాషలో రాజ్యాన్ని క్షమాపణ వేడాను.

ఇప్పటికైనా మించిపోయిందిలేదు. దేశమంతటా తిప్పి ఎంత డబ్బయినా ఖర్చుచేసి రాజ్యాని కీవ్యాధి నయంచేస్తానన్నాను. రాజ్యం తనకేవైద్యమూ అవసరం లేదన్నది పరుషంగా.

"ఎందుకు నేను బతకటం? నాకు బతకాలనిలేదు. నా ఒంటో ప్రాణం వుండగా నే నే వైద్యానికీ ఒప్పుకోను. కావలిస్తే నా శవానికి చికిత్స చేయించు" అన్నది రాజ్యం.

"ఇంతపని ఎందుకు చేశావు, రాజ్యం? ఆ అబ్బాయి నిన్ను జాగర్తగా ఉండమని రావడ మేమిటి? నువ్వతన్ని ముద్దుపెట్టుకోవటమేమిటి? ఎందుకు చేశా వా పని?

"కృతజ్ఞత కొద్దీ! అంటువంటి దేమీ పీ కర్థం కాదా?" అన్నది రాజ్యం, బలహీనంగా నవ్వుతూ.

నా కళ్ళకు రెండంగుళాల దూరంలో మెరుపు మెరిసినట్టంది. అవును నా కర్థమయింది — మానవత్వం! నేను చప్పున రాజ్యం పడుకున్న మంచంపక్క మోకరించి దాని మొహం నా వైపుకు తిప్పుకుని వాడిపోయిన దాని మూతి దీర్ఘంగా ముద్దుపెట్టుకున్నాను

"కృతజ్ఞత కొద్దీ! తెలిసిందా?కృతజ్ఞత కొద్దీ! నేనుకూడా కృశించి నీమాదిరిగా అయేవరకూ ఇట్లాగే ముద్దు పెట్టుకుంటాను. ఇహమూ, పరమూ కూడానూ! నీ పెదిమలు ఎప్పటంత తియ్యగానూ ఉన్నై నాకేమీ తేడా కనిపించటం లేదు."

రాజ్యం మెరిసే కళ్ళతో నన్నొక్క క్షణం చూసి నా మొహం గట్టిగా తన మొహాని కద్దుకుని, "భోజనం తెప్పించు. మామయ్యా! లేచి వంటచేసే ఓపికలేదు" అన్నది దాని మొహాన తాండవించిన మృత్యుదేవత ఏమయింది? దాని గొంతులోకి అంతజీవం ఎట్లా వచ్చింది? ఆ పొడిదగ్గేమయింది!

నా ఆశ్చర్యానికి రాజ్యం సమాధానం చెప్పింది

"నే నా అబ్బాయిని ముద్దు పెట్టుకోలేదు ప్రాణంపోయినా పెట్టుకుని ఉండను. రెండుమూడు రోజులనించీ కటికలంఖణాలు చేస్తున్నాను ఉండు! అసలు దుర్వార్త అట్టే వుంది నువు నాకు అబ్బాయిని కని యివ్వలేక పోయినావు నేనిస్తే పుచ్చుకుంటావా?" అన్నది రాజ్యం.



తా ర

జూన్ నెల

# భావపరిచయపోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి. వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు

వ్యాఖ్యలు మాకు మే 5 వ తేదీలోగా చేరాలి యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును ప్రవేశరుసుములేదు




చాలా త్వరగానే అనిల్ నదిఒడ్డుకి చేరుకున్నాడు అందుకోసం అతను పొలాలమ్మట అడ్డంపడి నడవ్వలిసొచ్చింది కాళ్ళకి బాగా దుమ్మంటుకుంది బట్టలకి దొంగ ముళ్ళు అంటుకున్నాయి తీరా చేసి, స్టీమరింకా రాలేదు రావడానికింకా ఆలస్యం వుండేట్టుంది కాస్తంత నడిచి గంగ గట్టెక్కి, తూర్పువేపు కొన్ని నిమషాలు తదేకంగా చూశాడు. ఎక్కడా స్టీమరొచ్చే జాడ కన్పించలేదు కనీసం నల్లని పొగ వస్తోన్న జాడైనా లేదు

ఆకాశంలో గుంపులు గుంపులుగా ఎగురుతూన్న పక్షులు అతని దృష్టిని ఆకర్షించేయి అవి చిలకబాతులు పరీక్షగా వాటివేపే చూశాడు అనిల్, గత

---

వనపూల్

సంవత్సరం అతనిదే పక్షులు మూడు కొట్టాడు. అప్పుడు అతనివెంట ఫోరింగ్ కూడా వున్నాడు అతను వేసుకొన్న ఎర్రచారల చొక్కా ఇంకా గుర్తే! ఆ పక్షుల మాంసంలో సగానికిపైగా ఫోరింగే తినేశాడు. ఈ సంవత్సరం కూడా అతన్ని వేటకి రమ్మని ఆహ్వానించేడు అనిల్. కాని అతను రాలేదు ఇక రాలేదుకూడా. ఆనాటి వేట తర్వాత ఆర్నెల్లకి కారు ప్రమాదంలో చనిపోయేడు ఫోరింగ్ సంకోచాలెరగని మనిషి. ముక్కుకి సూటిగా పోయేరకం. రహస్యం దాచడమంటే ఏమిటో తెలీదత నికి ఫోరింగ్ గురించిన ఆలోచనలు ముప్పిరిగొంటూండగా అలాగే నిలబడి పోయేడు అనిల్

"ఎవరు అనిల్ బాబేనా? ఎంతసేపట్నించీ వున్నారిక్కడ?"

అతనివెనక ట్రెయిన్ టికెట్ కలెక్టర్ సఖీచంద్ నిలబడి వున్నాడు. ఈ విషయం అనిల్ గమనించలేదు.

"నే నిప్పుడే వచ్చా భువన్‌మామయ్య ఈ బోట్లో వస్తున్నాడు. ఆయన్ని తీసు కెళ్దామని వచ్చాను. స్టీమర్ ఇవాళ చాలాలేట్ అనుకుంటాను."

"ఆఁ అవును మీకో మావయ్య వున్నాడా? ఆ సంగతి నాకు తెలీదే ఏవూర్నించి వస్తున్నా డాయన?"

"సాహెబ్‌గంజ్‌నుంచి వస్తున్నాడు. ఆయనపేరు భువన్‌సోమ్. ఆయినతో బంధుత్వ మేంలేదుగాని రక్తబంధువుకన్నా ఆయనెక్కువ నాకు. మాకాయన చాలాకాలంనుంచీ తెలుసు "

"భువన్ సోమా? ఎవరూ? ఎ టి ఎస్ భువన్ సోమ్‌గారేనా?"

"అవును "

సఖీచంద్ కళ్ళు, ముక్కు, నోరు, నుదురు, కనొబ్బొమలు చిత్రంగా ముడిపడ్డాయి. ముఖంలో భయం పొడసూపింది. తన భావాలని అనిల్‌బాబు చూడడం ఇష్టంలేక— బలవంతంగా వాటిని అణుచుకున్నాడు సఖీచంద్

"భువన్ సోమ్‌గారు మీకు మావయ్య అవుతాడని నాకు ఇంతవరకూ తెలీదు "

"అతను చాలా స్ట్రిక్ట్ ఆఫీసరని విన్నాను నిజమేనా?" అనిల్ చిన్నగా నవ్వేడు.

"ఆహా నిజమే తన స్వంత కొడుకుని డిస్మిస్‌చేశారాయన బహుశా మీరూ వినేవుంటారు

"విన్నా లెండి" అన్నాడు అనిల్ తలూపి.

"ఆయ నెందుకొస్తున్నా రిక్కడికి?"

"చిలకబాతులు వేటాడ్డానికి."

"ఆయన మంచి వేటగాడా?"

''వేటాడ్డమంటే చాలా ఇష్టం. కాని వేటలో అంత నైపుణ్యంలేదు మహా అయితే ఒకటిరెండు బాతులు ''

''చిలకబాతులు రైల్వే ఆఫీసర్లు కావుగా. తేలిగ్గా పడేందుకు'' చేదునవ్వు ఒకటి నవ్వి పక్కకి తిరిగేడు సఖీచంద్. ''ఎంతసేపని మీరూ ఇక్కడ నిలబడ్తారు? నాతో మా ఇంటికి రండి బోటు రావడానికి ఇంకా చాలా లేటవుతుంది. ఈలోగా ఓ చదరంగం ఎత్తు వేసుకుందాం'' అన్నాడు.

''పైన్ మీ ఆవిడొచ్చిందా?''

''ఇంకా లేదు. భార్య భర్తదగ్గరికి వెళ్ళాలంటే—మా కులంలో చాలా తతంగం చేస్తారు ''

సఖీచంద్ యాదవ కులస్థుడు బీహార్‌కి చెందినవాడతను కాని బెంగాలీ బ్రహ్మాండంగా మాట్లాడ్తాడు అందరు బీహారీల్లాగా కాకుండా సఖీచంద్ కాస్తంత చదువూ సంధ్యా వున్నవాడు

సఖీచంద్ మామ నది అవతలిగట్టుకి ఏడెనిమిదిమైళ్ళ దూరంలో వున్న ఓ గ్రామంలో వుంటున్నాడు ఈ వూళ్లో అతనికి వుద్యోగం దొరకడంతో భార్య వొచ్చి తనతో కాపరం ప్రారంభిస్తుందేమోనని ఆశించాడు కాని కులపెద్దలు దానికి అడ్డు పెట్టేరు ఇంకో మూడునెలలవరకూ నవవధువు ప్రయాణించేందుకు వీలైన మరో రోజు పంచాంగంలో లేదని వారి వాదన; దానికితోడు ఈ ''భువన్‌సోమ్'' మహాశయుడు అతనిమీద పై అధికార్లకి ఫిర్యాదు చేశాడు. అయితే సఖీచంద్ చేసిందేం తక్కువా? ఈనాడు ఒకటీ పదీ మామూళ్ళకింద ఎంతమంది తీసుకోవడం లేదు? పై రాళ్ళకోసం కక్కుర్తిపడనివాడు, ఆ సంపాదన ఒదులుకొనేవాడూ ఎవడేనా వుంటాడా? మాటవరసకి ఆ బుకింగ్ ఆఫీసులోని మాల్‌బాబు ఏం తక్కువ తిన్నాడా? ఎంతెంత డబ్బు సంపాదించకపోతే అతనంత దర్జాగా వుండగలుగుతున్నాడు తనో— రెండు రూపాయిలకి మించి ఎన్నడైనా మామూలు తీసుకున్నాడా? ఇదే ఏ బ్రిటిష్ దొరో అయినట్లయితే రెండు చీవాట్లేసి వదిలేసేవాడు కాని ఈ సోమ్‌బాబు . మళ్ళీ పెద్ద బ్రిటిషర్‌లా వుంటాడు ఎన్ని పేజీల రిపోర్టో తనమీద తయారు చేశాడు అయితే ఆ రిపోర్టు ఇంకా పైకి పంపినట్టు లేదు కాని ఇవాళ కాకపోతే రేపైనా ఆ రిపోర్టు పై అధికార్లకి పంపుతాడు. దుర్మార్గుడు అందులో సందేహంలేదు.

భువన్‌సోమ్ అనిల్‌బాబుకి కాస్త దగ్గరబంధువని తెలియగానే సఖీచంద్‌లో చిన్న ఆశాలేశం చిగిర్చింది.

''నెలరోజుల కిందట సోమ్‌బాబు ఇక్కడికొచ్చేడు. అప్పుడు ఆయన మీ ఇంటి

కొచ్చారా?''

''లేదు. అప్పుడాయన డ్యూటీలో వున్నాడుగా. వేటకోసమని ఇప్పుడు సెలవు తీసుకొన్నట్టుంది భువన్‌బాబు ''

''ఆయన మీ ఇంట్లోనే బసచేస్తారా?''

''మరెక్కడనుకున్నారు? ఇంకెక్కడా వుండడం ఆయనిష్టపడరు మా నాన్నగారూ ఆయనా అన్నదమ్ముల్లా కలిసిమెలిసి వుండేవారు. నన్ను తన సొంత కొడుకులా చూస్తారు ''

సఖీచంద్ ఆశ మరి కాస్త పెద్దదైంది ''ఆయన చాలా స్ట్రిక్ట్‌గా వుంటారు అది మంచి స్వభావమో చెడు స్వభావమో నాకు తెలీదుగానీ—ఓ చిన్న విశేషం జరిగింది. ఆయన నా గురించి చాలా చెడుగా అసహ్యంగా ఓ రిపోర్టు తయారుచేశాడు అదిగాని పై అధికారుల చేతిలోగాని పడిందంటే నేను నా వుద్యోగానికి నీళ్ళు ఒదులుకోవాల్సొస్తుంది నా ఉద్యోగానికి బి ఏ బి ఎం ఏ లూ దరఖాస్తుచేసేరు మీరు కాస్త ''

అక్కడితో సఖీచంద్ ఆగిపోయాడు ఆ వాక్యం ముగించే సాహసం అతన్లో లేదు. అతని వుద్దేశ్యం ఏమిటో చెప్పకుండానే అనిల్‌బాబుకి క్షణంలో అర్థమైపోయింది.

''అమ్మ బాబోయ్ అలాంటిదేం నేను చెయ్యలేను ఏమేనా చేసినా—అది కాస్తా ఎదురు తిరుగుతుంది రికమెండేషన్లు గట్రా అతనిదగ్గర పనిచెయ్యవు ''

''నిజమేనా?'' సఖీచంద్ వినయంగా గొణిగాడు మనస్సులో 'గాడిద' అనుకున్నాడు.

ఆ తర్వాత ప్రయాణం నిశ్శబ్దంగా గడిచింది కాస్త దూరంలోనే సఖీచంద్ ఇల్లుంది ఎర్రటి ఇటుకగోడతో—గడ్డికప్పుతో వుందది ముందు అరుగుమీద సూర్యకాంతి పడుతోంది

''బయట వరండాలో కూర్చుందామా? వాతావరణం చల్లగా వుంది ఏం?''

''అవునవును. ఎండ వుంటేగాని లాభంలేదు '' ఇంట్లో ఓ మూలగా వున్న చిన్న బల్ల తెచ్చి వరాండాలో వేశాడు సఖీచంద్. మళ్ళీ వెళ్ళి రెండు తీగకుర్చీలు తెచ్చాడు. తెచ్చి మళ్ళీ గదిలోకి నడిచేడు లోపల్నించి ఏదో చప్పుడు విన్పించింది అతనికి మళ్ళీ మళ్ళీ విన్పించింది

''అనిల్‌బాబూ, ఓసారిలా రండి '' అంటూ లోపల్నించి కేకేసాడు సఖీచంద్.

అనిల్ లోపలికి వెళ్ళేడు ఓ టేబుల్ డ్రాయర్లో కుస్తీ పడ్తున్నాడు సఖీచంద్.

''రావడంలేదిది దీం తస్సాదియ్యా. మీరోపట్టు పట్టండి. నాకన్నా మీరు బల




చంతులు. దీనికోసం సప్లన్‌బజారుకి బోలెడు డబ్బిచ్చేను. చూద్దురూ. ఈలాంటి డ్రాయర్‌ని మా ఆవిడ లాగగలదా ''

''దానికోసం ఎందుకు శ్రమ? చదరంగం ఆడదాం రండి'' అన్నాడు అనిల్.

''పావులు అందులోనే వున్నాయిగా.''

''ఓహో అదా సంగతి ''

అనిల్ డ్రాయర్‌ని చేత్తో పట్టుకుని లాగబోయేడు కాని, రాలేదు.

''ఇది మామిడిచెక్కతో చేసిన టేబిలు అందుకే ఇలా బిగుసుకుపోయింది. ఓపని చెయ్యండి. మీరు టేబుల్ని గట్టిగా పట్టుకోండి. నేను డ్రాయర్ని లాగుతాను చూద్దాం. ఎందుకు రాదో!''

నిజానికి అనిల్‌బాబు బలవంతుడే. మొదటి ప్రయత్నంలోనే డ్రాయర్ వూడి వచ్చింది. కాని సఖీచంద్ మాత్రం ఆ వూపుకి వెనక్కి తూలి గోడకి గుద్దుకున్నాడు. తల గోడమీదున్న ఫోటోకి తగిలింది. ఫోటోకున్న అద్దం బద్దలై వాటి ముక్కలు భళ్ళున చప్పుడుచేస్తూ నేలమీద పడ్డాయి.

''అయ్యో అయ్యో ఏం చేశాను! ఎంతపని చేసాను? అదుగో అదుగో '' అంటూ ఆశ్చర్యంతోనూ ఉద్వేగంతోనూ అరిచేడు సఖీచంద్.

''తలకేమైనా దెబ్బ తగిలిందా?'' అనిల్ సానునయంగా అడిగాడు.

''తలకేమి కాలేదు గానీ, నా హృదయానికి గాయమైంది. ఈ ఫోటో ఎవరిదో మీకు తెలుసా? ఓసారి బాగా చూడండి '' అంటూ ఆ ఫోటోని అనిల్ చేతికిచ్చాడు. ఫోటోలో నవ్వుతోన్న ఓ అమ్మాయి బొమ్మ వుంది. బొమ్మకింద శ్రీమతి వైదేహీ జాదవ్ అన్న అక్షరాలున్నాయి.

"నా భార్య." అంటూ విశదంచేసేడు సఖీచంద్. "శాస్త్ర చదువుతున్నదే".

"ఆమెకూడా మీలాగే బెంగాలీ బాగా మాట్లాడ్తుందా?"

"నాలాగే ఏమిటి? నాకన్నా బాగా మాట్లాడ్తుంది. వాళ్ళమ్మావాళ్ళు పాకూర్‌లో వుండేవారు. వాళ్ళందరికీ బెంగాలీ బ్రహ్మాండంగా వచ్చు."

"ఈ ఫోటో ఎవరు తీశారు?"

"మా బావమరిది. పెళ్ళిలో కానుకగా ఓ కెమెరాని వాళ్ళత్తవారిచ్చేరు. వూసుపోనప్పుడల్లా ఫొటోలు తీసేస్తుంటాడు. మా ఫోటోలుకూడా తీసేడు. అదిలా యివ్వండి. దాన్ని మళ్ళీ ఫ్రేము కట్టించాలి. ఆలస్యం అయితే పాడయిపోతుంది. ఇవాళే పంపిస్తాను—"

సఖీచంద్ ఓ కాగితం తీసుకుని దాన్ని జాగ్రత్తగా ఫోటో కిందామీదా మడిచేడు. మడిచేక ఒక ట్వయన్‌దారంతో దాన్ని కట్టేడు. అనక ఓ రేకుపెట్టెలో దాన్ని భద్రంగా దాచేడు.

"రండి. ఇక ఆట మొదలెడదాం."

ఇద్దరు గది బైటికొచ్చి కుర్చీల్లో కూర్చుని ఆట మొదలెట్టేరు.

## 2

స్టీమరు మెల్లిగా సాగుతోంది. మొదటి తరగతి కేబిన్‌కి ఎదరుగా వున్న డెక్‌మీద ఫోల్డింగ్ ఛెయిర్ వేసుకొని విశ్రాంతిగా వెనక్కి చేరబడ్డాడు భువన్‌సోమ్. తన గురించీ జీవితం గురించీ ఆలోచించసాగేడు. ఎప్పుడేనా ఒంటరితనం ఎదురైతే ప్రస్తుతాన్ని మరిచి గతంలోకి జారుకుంటాడతను. గాఢంగా ఆలోచిస్తూ వుండుండి పైపు పీల్చసాగేడు

భువన్‌సోమ్ వయస్సు అరవై యేళ్ళు. చక్కటి ఆరోగ్యవంతుడు. చూడ్డానికి ఇంకా తక్కువ వయస్సున్నవాడిలా కనిపిస్తాడు. నుదుటి పై భాగాన జుత్తు బాగా పలచబడింది. చెంపలదగ్గర అక్కడక్కడా నెరిసింది రెండు మూడు దంతాలుకూడా వూడిపోయాయి. ఆఫీస్ రికార్డ్సు ప్రకారం అతని వయస్సు ఏభైనాలుగేళ్ళు. ఇంకొక సంవత్సరం తిరిగేసరికి రిటైరైపోతాడు. తన ఉద్యోగాన్ని ఇంకా మరికొన్ని ఏళ్ళు పొడిగించడంగాని—లేదా—మరో ఉద్యోగాన్నివ్వడంగాని జరుగుతుందని అతను ఊహించటంలేదు. అలా జరగడం అసామాన్యమేమీ కూడా కాదు. అతని సర్వీస్ రికార్డ్ అద్భుతమయినది. ఎక్కడా మచ్చ అన్నది లేదు. అయినా అతనంటే చాలామంది పై అధికారులకి ఇష్టంలేదు. పొగడ్తలన్నా—ఆశ్రితపక్షపాతం అన్నా

భువన్‌సోమ్‌కి విపరీతమైన చిరాకు. జీవితమంతా, ముక్కుకి సూటిగా వుండేందుకు ఎన్నో యుద్ధాలు చేయాల్సివచ్చింది. ఏనాడూ ఎవరికీ తల వంచలేదు.

అప్పటి బ్రిటిషు అధికారులు భువన్‌బాబు విబ్బరప్రవర్తనని—స్వతంత్ర భావాల్నీ ఎంతగానో మెచ్చుకునేవారు. వారి హయాంలోనే సాధారణ గుమాస్తానుంచి—అసిస్టెంట్ ట్రాఫిక్ సూపరింటెండెంట్‌వరకూ హోదా పెరిగింది. అల్లాంటి పని ఈ రోజుల్లో సాధ్యమయ్యేదేనా? అతని సర్వీస్ రికార్డ్‌కన్నా ఇప్పుడు అతని కులం చాలా ముఖ్యమైన విషయంగా తయారైంది. ఏ ఆఫీసర్‌కైనా మంత్రివర్గంలో పలుకుబడి వుంటే ఇహ చెప్పనే అక్కర్లేదు. భువన్‌సోమ్‌కి, పాపం, ఇల్లాంటి అర్హతలేమీ లేవు. అతని సేవను పొడిగించడంలాంటి పనులేవీ జరగవని అతనికి బాగా తెలుసు.

ఒకొకప్పుడు భువన్‌సోమ్ చాలా ఒంటరిగా ఫీలయ్యేవాడు. ఏ ఆఫ్రికా అడవుల్లో పుట్టినా బాగుండేది అనుకునేవాడు వేడి నిట్టూర్పు విడుస్తూ. అటు ఉద్యోగ జీవితంలో గాని, ఇటు సంసారిక జీవితంలోగాని ఎవరూ కూడా అతన్ని గుర్తించేవారు కారు.

తండ్రి చనిపోయేనాటికి భువన్‌సోమ్ పదహారేళ్ళవాడు ఊపిరి పీల్చడం మానేసిన ఆఖరిక్షణంవరకూ భగవంతుని నామోచ్చాటన మానలేదా వృద్ధుడు ..అతను చనిపోగానే భువన్‌సోమ్‌కి—తండ్రి చేసిన అప్పులూ, పైగా—అసంఖ్యాకమైన బంధువులూ, సోదరులూ, చెల్లెళ్ళూ చుట్టుముట్టారు. ఆనాటి పరిస్థితులు తలుచుకుంటే భువన్‌సోమ్‌కి ఈ నాటికీ చిన్నవణుకు పుట్టుకొస్తుంది. ఇంట్లో చిల్లిగవ్వలేదు. కొట్లవాళ్ళు అరువు ఇవ్వడం మానేశారు. ఎటుచూసినా చీకటి. దారీతెన్నూలేని గాఢాంధకారం! ప్రపంచంలో ఎక్కడ ఏమూల ఏమవుతుందో తెలీని—తెలుసుకోలేని విషమపరిస్థితుల్లో చిక్కుకున్నాడు.

అకస్మాత్తుగా రెండు చేతులూ పైకెత్తి నుదుటిని నొక్కుకున్నాడు భువన్‌సోమ్. జోగిన్ హజారా గురించి ఎప్పుడు తలుచుకున్నా అతని చేతులు అప్రయత్నంగా నుదుటిమీదికి పోతాయి. జోగిన్ హజారా అతని తండ్రికి ప్రాణస్నేహితుడు. తమ కుటుంబంలోని పరిస్థితులు అర్థంచేసుకున్నాడు. హజారా దయార్ద్రహృదయుడు చాలా మంచివాడు. డిప్యూటీ ట్రాఫిక్ సూపరింటెండెంట్ ఆఫీసులో పని చేస్తూండేవాడు. డిటిఎస్ కి హజారా అంటే ఎంతో గురి. భువన్‌సోమ్ గురించి ఆయన్తో చిన్నమాట చెప్పారు హజారా. అంతే. భువన్‌సోమ్‌కి ఉద్యోగం అయింది. అప్పటికే హజారా కుమారుడు పరీక్ష పాసై ఉద్యోగానికి సిద్ధంగా వున్నాడు. అయినా హజారా భువన్ సోమ్‌కే ప్రాముఖ్యత ఇచ్చాడు.

ఈ రోజుల్లో అట్లాంటివి సాధ్యమా?

స్వాతంత్ర్యం వచ్చిన దేశం చాలా మారిపోయింది. ప్రజలు మారారు. వారి ఆలోచనా విధానమూ మారింది. దొంగతనం సోమరితనం పెరిగింది. టికెట్లు కొనకుండా ప్రయాణాలు మొదలెట్టారు. రైల్వే గార్డులూ టికెట్ కలెక్టర్లూ వాళ్ళని వదిలేస్తున్నారు. పెద్దపెద్ద కట్టలు బ్రేకువానుల్లోంచి డబ్బు ఖర్చులేకుండా రవాణా అయిపోతున్నై. ఇంకా ఎన్నెన్ని దొంగతనాలో!

దొంగల్ని పట్టుకుని రిపోర్టులు తయారుచేసినా మాత్రం ఏముంది ఫలితం? వాళ్ళ బంధువులకో—ఉన్నతాధికార్లకో ఎవరికో ఒకరికి ఏదో ఓ మినిష్టరు తెలిసివుంటాడు. ఆ మినిష్టరుగారి మాటతో రిపోర్టూ—శిక్ష వగైరాలన్నీ హూష్ కాకీ అని ఎగిరి పోతాయి! ఇదీ స్వాతంత్ర్యం అంటే? దోచుకోడానికి సాతంత్ర్యం! ముక్కుకిసూటిగా పోదామనుకునేవాళ్ళకి మాత్రం అది మహా నాశనకారి!

పైప్‌ని గాఢంగా పీల్చి మెల్లిగా పొగను వదిలేడు భువన్‌సోమ్ గడచిన రోజుల కథ తలుచుకుని కాళ్ళు ఆడించేడు. అతని జీవితంలో ఎన్నడూ విరామం అనే పదం ప్రవేశించలేదు. అహర్నిశలూ ఘోరయుద్ధమే చేసాడు అతని తల్లి బతికివున్న ఆఖరిక్షణంవరకూ అతన్ని హింసించింది. ఒక్క చిన్న తప్పు కనిపిస్తే చాలు . విడవకుండా అతడిని సాధించేది ఆమెని సంతృప్తి పరచడానికి ఏమేం చెయ్యాలో అంతా చేశాడు భువన్‌సోమ్ కాని, ప్రయోజనం లేకపోయింది

తన కూతుళ్ళకి సరైన సంబంధాలు తేలేదని ఆమె ఎప్పుడూ వాపోతూ వుండేది తన భర్త గనుక బతికివున్నట్లు అయితే వాళ్ళు మహారాజాల కోటల్లో పడివుండే వారని సాధించేది.

తన చెల్లెళ్ళకి చక్కటి సంబంధాలు చెయ్యడంకోసం భువన్‌సోమ్ చేసిన కృషి యింతంత మాత్రంకాదు వాళ్ళ పెళ్ళిళ్ళకోసం అయిదువేలు అప్పు కూడా చేశాడు. చెల్లెళ్ళు కూడా తక్కువ తిన్నవాళ్ళేం కాదు పల్లెటూళ్ళన్నా—అక్కడి మురిగ్గుంట లన్నా విపరీతమైన భయం వాళ్ళకి. అక్కడ పాములూ దోమలూ వుంటాయి .. మేం వెళ్ళం బాబూ! అని భర్తల వద్దకి కాపురానికి వెళ్ళడానికి నిరాకరించేరు. తల్లి దానికి వత్తాసు. దాంతో బావ మరుదులే భువన్‌సోమ్ పీకమీదికి తయారయ్యేరు. అసలే ఇల్లంతా జన సందోహంతో ఇరుకు అయింది. వీళ్ళ రాకతో మరిక చెప్పే దేముంది! ఆ రెండు కుటుంబాల బాధ్యత కూడా భువన్‌సోమ్ భుజస్కంధాలపైనే పడింది. మేనల్లుళ్ళూ, మేనగోడళ్ళూ, పుట్టుకురాసాగేరు. వాళ్ళ చదువులు .ఎంతో ప్రయాసపడి ఇద్దరు బావమరుదులకీ ఉద్యోగాలు సంపాదించిపెట్టేడు. అయినప్పటికీ వాళ్ళ భార్యల్తో యిల్లు కదిలితేనా? తల్లికి చెప్పినా వినిపించుకోదు. ఇంటి ఖర్చంతా




భువన్‌సోమే భరించేవాడు. తమ జీతాల్లోంచి ఒకపైసా కూడా ఇంటికోసం ఖర్చు పెట్టేవారు కాదు. వాళ్ళ డబ్బంతా ఖరీదైన పౌడర్లు క్రీములూ సెంట్లూ కొనడానికి సరిపోయేవి. ఇంకా ఏమన్నా మిగిలితే దాంతో మిఠాయిలు కొనుక్కొని రహస్యంగా గదుల్లో దూరి తినేసేవారు తమ పోషణ భారం అంతా భువన్‌సోమ్‌దే అన్నట్టు నిర్లక్ష్యంగా ప్రవర్తించేవారు. ఇంటి మొత్తంమీద అనతికాలంలో 14 గురు పిల్ల కాయలు తలలెత్తేరు. వాళ్ల పరుగులూ ఉరుకులూ ఇంటినో రణరంగంగా మార్చేవి. రాత్రనిగాని పగలనిగానీ లేకుండా విధీవిరామం లేకుండా—కేకల్తో—అరుపుల్తో—చప్పట్లతో—చప్పుళ్ళతో ఇల్లంతా మారుమ్రోగిపోయేది. ఓ నిద్రపోయేందుకుగాని—కాసింతసేపు విశ్రాంతికిగాని ఒక్క నిసరు అవకాశం వుండేదికాదు.

విశ్రాంతి సంగతి దేవుడెరుగు. ఇక భోజనంకూడా అంతంత మాత్రమే. కడుపు నిండా భోజనం చేసింది లేదు. ఆ తిన్నదికూడా ఇంత అన్నం—పప్పు—కాసిని మజ్జిగనీళ్ళు. ఒకోఅప్పుడు నీళ్ళల్లోని అన్నం కంచంముందు ప్రత్యక్షమయ్యేది. అయినా పల్లెత్తు మాటాడకుండా తిని లేచేవాడు. అట్లాంటి భోజనానికి బాగా అలవాటు పడి అతని నాలిక మొద్దుబారిపోయింది. ఇంకోరకమైన భోజనం, అదెంత మంచి దైనా రుచికరమైనదైనాసరే, అతని గొంతు దిగేదికాదు. ఒకోసారి విందులకీ—పార్టీలకీ వెళ్ళాల్సి వచ్చేది. ఆ భోజనాన్ని అందరూ ఆప్యాయంగా తింటూ వుంటే తనమాత్రం మొఖం చాటుచేసుకొనేవాడు.

ఇంట్లో ఓ ఆవుండేది. రోజూ రెండు మూడు శేర్లపాలు యిచ్చేది. ఓనాడుకూడా

ఓ చుక్క పాలు తాగి ఎరగడు భువన్‌సోమ్. ఆవిచ్చిన పాల్లో కొంతభాగం ముసలితల్లి తాగేది. ఆవిడకి నల్లమందు అలవాటు వుండడంచేత పాలు ఆవిడకి అత్యంత అవసరం. మిగతా పాలు నీళ్ళతో కలపబడి పిల్లలకి ఆహారంగా వుపయోగపడేది. పాలే ఆహారంగా వుండే పిల్లలు ఇద్దరు ముగ్గురు చొప్పున ఎప్పుడూ వుండేవారు. పాలు తాగుదామని మనసు పుట్టినప్పుడల్లా భువన్‌సోమ్‌కి వీళ్ళే గుర్తుకి వచ్చేవారు. వాళ్ళకెట్లా అన్యాయం చేస్తాడు?

ఓరోజు ఆఫీసునుంచి ఇంటికి వస్తూవుండగా విపర్తుగా వున్నట్టనిపించింది. ఇంటికి రాగానే చప్పున మంచంమీద పడ్డాడు. కాసేపట్లో డాక్టర్ చందన్ వచ్చేడు.

అతని బ్లడ్‌ప్రెషర్ తక్కువగా వుందనీ, మంచి తిండి తినాలనీ సలహాయిచ్చేడు డాక్టర్ చందన్. చేపలు, మాంసం, గుడ్లు, పాలు తీసుకోమన్నాడు రోజూ చక్కని భోజనం లేకపోతే ఆరోగ్యం కాపాడుకోవడమెట్లా? ఎక్కడైనా అప్పుచేయమని సలహా యిచ్చింది తల్లి. ఆమెకేం పోయింది. ఆ అప్పు తీర్చేది తనేగా? కొన్నాళ్ళు వంటగ్గావస్థలో కొట్టుమిట్టాడి ఎట్టకేలకి మళ్ళీ డాక్టర్ చందన్‌ని సందర్శించేడు భువన్‌సోమ్. నీరసం పోవడానికి ఏదైనా మంచి టానిక్ రాసి ఇమ్మన్నాడు. "మీరు చెప్పినట్టుగా అంత సుష్టుఅయిన భోజనం నేనొక్కడినీ చేయడం నావల్ల కాదు పోనీ అని— వాళ్ళందరికీ కూడా అట్లాంటి భోజనమే ఏర్పాటుచేయడం నా తలకుమించిన పని. అంచేతే—ఓ టానిక్ రాసి ఇస్తే ఏ బాధా వుండదు."

డాక్టర్ చందన్‌కి ఇవన్నీ తెలుసు. కనుకనే మారు మాట్లాడకుండా ఓ టానిక్ రాసిచ్చేడు. అదేదో విదేశీ టానిక్కు. దాని పేరిప్పుడతనికి గుర్తురావటం లేదు. అందులో చికెన్ ఎక్స్‌ట్రాక్టు, కాడ్‌లివరాయిలూ మున్నగు బలవర్ధమైన ఔషధాలున్నాయి. ఓ బాటిలు కొనగానే దాని ధర తెలిసొచ్చింది. అంతే. మళ్ళీ మరో సీసా కొన్లేదు.

ఫోల్డింగ్ ఛెయిర్ వెనక్కి తోసేస్తూ లేచి నిల్చున్నాడు భువన్ సోమ్. గాలి చాలా పదునుగా చల్లగా వీస్తోంది. హేండ్‌బేగ్‌లో వున్న టోపీని తీసి ధరించేడు ఇప్పుడు కాస్త వెచ్చగావుంది ఆ టోపీ అతని పెద్దకోడలు స్వయంగా తయారుచేసింది. ఆమెకి వంటమాట తప్ప మిగతా ప్రాపంచిక విషయాల్లో సరదా జాస్తి. ఇలాంటి వాళ్ళకోసమే డబ్బాల్లో తిండిపదార్థాలు అమ్మకానికి పెడ్తున్నారు కామోసు అనుకుంటాడు భువన్ సోమ్.

కాస్త దూరంగా ఒడ్డు కనిపిస్తోంది. ఆ ఒడ్డుకేసి నిశితంగా చూశాడు కాసేపు. ఎక్కడా ఆకాశంలో మచ్చుకైనా ఒక పక్షి జాడకూడా లేదు. ఏమైనాయి ఈ

వశులన్నీ: ఇక్కడ బోలెడన్ని వశులున్నాయని అనిల్ చెప్పాడే!

ఏవీ ??

"సర్. మీ కుర్చీని లోపల పెట్టేదా? ఇక్కడగాలి చాలా తీవ్రంగా వుంది."

పరధ్యానంగా వున్న భువన్‌సోమ్ అకస్మాత్తుగా వినవచ్చిన ఆ మాటలికి ఒక్కసారి తృళ్ళిపడ్డాడు. వెనుదిరిగి చూస్తే, అక్కడ స్టీమర్‌కి సంబంధించిన టి.టి.ఎస్. నిలబడివున్నాడు.

"దానిగురించి నువ్వేమి బాధపడకు. ఆ పని నేను చేసుకోగలను లే. నీ డ్యూటీ నువ్వు చూసుకో."

ఆ యువకోద్యోగి విభ్రమంగా అతనికేసి చూశాడు. వెనుదిరగబోయేడు.

"ఇదుగో—అబ్బాయ్!"

అతను భువన్‌సోమ్ వేపు చూశాడు.

"నీ పేరేమిటి?"

"వికాసేందు గుప్త."

"నువ్వు నీ తప్పుడు అభిప్రాయం మార్చుకోవాలి. ఇట్లాంటి పన్లుచేసి నా అభిమానం సంపాదించడం అసంభవం! నేను పాతకాలపువాణ్ణి. కర్తవ్యం ముందు. స్వార్థం తర్వాత. అది నన్ను సంతోష పరుస్తుంది. నీ విద్యుక్త ధర్మాలు మరిచి, నమస్కారాల్తో మెడ ఎన్ని వంకర్లు తిప్పినా ప్రయోజనంలేదు. అర్థమైందా?"

"అయింది సర్!"

"సరే. ఇక నువ్వు వెళ్లొచ్చు!"

తల వినయంగా వంచి ఆ యువకుడు వెనుదిరిగేడు. అతన్నే పరీక్షగా చూస్తూ చాలాసేపు అలాగే వుండిపోయాడు భువన్‌సోమ్. అకస్మాత్తుగా—ఈ కుర్రాడంటే ఎంచేతో అభిమానం ఏర్పడింది. జేబులోంచి నోట్‌బుక్ తీసి దానిమీద ఆ కుర్రాడి పేరు రాశాడు. అవకాశం ఏదైనా వస్తే ఇతన్ని రికమెండ్ చెయ్యాలి! పైపులో పొగాకు దట్టించేడు. చేతిలో పైప్‌పట్టుకుని చాలాసేపు నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

దూరంగా నీళ్ళల్లో ఏదో చేప తపతప కొట్టుకుంటున్నది. దాన్నిచూస్తూ మళ్ళీ వూహాలోకంలో మునిగిపోయాడు భువన్‌బాబు.

చెల్లెళ్ళిద్దరూ అతన్నెంత ఇక్కట్టపాలు చేసేరో దానికి రెండురెట్లు బాధించేరు తమ్ముళ్లు. ఇద్దరికీ చదువు అంటే అశ్రద్ధే. ప్రతి ఏడాదీ ఫెయిలయిపోతూ వుండడమే! మూడు నాలుగుసార్లు తప్పితేగాని పెట్టు [illegible]డు. నాలుగోక్లాసు చదివేసరికి ఇద్దరికీ మీసాలు వచ్చేశాయి. వాళ్ళ చదువులకోసమని భువన్‌సోమ్ ఎంతగానో తాపత్రయ

పడాడు. కాని హెడ్‌మాస్టర్ మహాదేవబాబు మాత్రం రవంతైనా జాలి చూపించలేదు. ఇద్దరిపేర్లు కొట్టేసి స్కూల్లోంచి బయటికి పంపించేశాడు. ఇద్దరూ స్కూల్లోని మిగతా విద్యార్థులకి సిగరెట్లు మొదలైన దురభ్యాసాలకి లోను చేస్తున్నారనీ. వాళ్ళని మరింకా ఈ స్కూల్లో వుంచే అవకాశంలేదనీ మహదేవబాబు ఖండితంగా చెప్పేశాడు. వాళ్ళ చదువు అక్కడితో ఆఖరైంది.

వాళ్ళ చదువులు కలకత్తాలో పెడితే బాగుండేదేమో అని సూచించింది తల్లి. అది భువన్‌సోమ్ తలకి మించినపని. చాలాకాలం ఆ విషయమై తల్లి భువన్‌సోమ్‌ని శతపోరింది. చదువుల్లో శ్రద్ధ ఇలా ఏడ్చింది కాని కొన్ని కొన్ని ఇతర కార్య క్రమాల్లో కుర్రాళ్ళిద్దరూ అఖండులు. స్థానిక నాటకాల్లో బిపోన్ ఆడవేషాలేస్తూ చురుగ్గా పాల్గొనేవాడు. ఖొక్నొ మంచి ఫుట్‌బాల్ ఆటగాడు. కనీసం ఏదో ఒక విషయంలోనే నా శ్రద్ధ వున్నందుకు భువన్‌సోమ్ సంతోషించేడు ఇద్దరూ కొన్నాళ్ళకి మంచి వుద్యోగాలే సంపాదించేరు. సీతవేషంలో ప్రేక్షకులందర్నీ శోకరసంలో ముంచిన బిపోన్‌కి ఓ హెడ్‌గుమాస్తాగారు ఉద్యోగమిచ్చి పుణ్యం కట్టుకున్నాడు. అలాగే ఖొక్నొ కూడా। అతని ఫుట్‌బాల్ ఆటని చూసిన ఓ ఆఫీసర్‌గారు ముగ్ధుడై మర్నాడే అతనికో వుద్యోగం ఇచ్చేడు.

హఠాత్తుగా భువన్‌సోమ్ లేచి నిలబడ్డాడు, వందలకొద్దీ చిలకబాతులు గాల్లో ఎగుర్తున్నాయి, వుండుండి నదిఒడ్డునున్న బురదమట్టిమీద వాల్తున్నాయి. వాటివేపు కుతూహలంగా చూశాడు అనిల్ చెప్పిన జాగా ఎక్కడుందో.? తనకోసం అనిల్ ఏమేమి ఏర్పాట్లు చేశాడో। ఎగిరిపోతూన్న చిలకబాతుల్ని కనుచూపుమేరదాటే వరకూ అలాగే చూశాడు.

వేట ఒకటే తనకిపుడు సరదా. అదే కాస్త మానసిక విశ్రాంతిని ప్రసాదిస్తుంది. భువన్‌సోమ్‌కి వేట ఒక ఆటవిడుపు. ప్రాపంచిక విషయాల్నుంచి తప్పుకోడానికిదో మంచి అవకాశం. కుటుంబ వ్యవహారాల్నుంచి బాదరబందీల్నుంచీ తప్పుకోడానికి మొదట్లో ఎన్నో మార్గాల్ని అన్వేషించేడతను. ఏదికూడా అతనికి సంతృప్తి కరంగా అన్పించలేదు. కొన్నాళ్ళు పెయింటింగ్ చేసేడు బ్రౌన్ అనే ఒక ఏంగ్లో ఇండియన్ రెయిల్వేగార్డ్ అతనికి నీటిరంగులు ఎలా వాడడమో నేర్పేడు. తాగనప్పుడూ—తాగినప్పుడూ కూడా అగార్డు చలాకీగా మాట్లాడేవాడు. అతని స్నేహప్రభావాన భువన్ సోమ్‌కూడా ఒకటి రెండుసార్లు మత్తుపానీయాలు తాగేడు—నీటికీ బ్రాందీకి ఏమీతేడా వున్నట్టు మాటాడేవాడు కాదు బ్రౌన్. తేడా అల్లా మన చూపుల్లోనే అనేవాడు. అంతే కాక ధరల్లో కూడావుంది అని నవ్వేవాడు




పెయింట్ చేసే విధానం భువన్‌సోమ్‌కి బ్రౌన్ నేర్పేడు. వాటర్ కలర్స్‌తో బొమ్మలువేసే ప్రయత్నాలు చాలా చేశాడు సోమ్. అతనికున్న శలవురోజల్లా ఒక్క-ఆదివారమే. అన్నిరకాల పన్లూ ఆ నాటికి సిద్ధంగా వుండేవి. సోమ్ ప్రాణాలమీదకి. ఇంటికోసం బియ్యం తేవాలి. పప్పు కొనాలి. చాకలాడెందుకు రాలేదో బట్టలు ఎందుకు తేలేదో కనుక్కోవాలి పిల్లగాళ్ళ కొలతలు తీసుకునేందుకు దర్జీని వెంటపెట్టుకు రావాలి. ఇహ పెయింట్స్‌తోనే బ్రష్‌లతోనే కూర్చోవాలంటే ఎట్లా వీలౌతుంది? ఇంట్లో ఈ పనులు చేయడానికి పెద్దవాళ్ళు లేక కాదు. మహామహాలే వున్నారు. అతని ఖర్చుమీద—అతని ఇంట్లో వుండికూడా చిన్నమెత్తు పనిచెయ్యని బడుద్ధాయిలు వుంటే మాత్రమేం లాభం? ఒకవేళ ఎవరేనా చేస్తామని ముందుకి వచ్చినా, తల్లి అడ్డుకునేది. "మీకేం తెలీదు. సోమ్‌కి నాణ్యం తెలుసు. వాడే తెస్తాడ్లే" అనేసేది. మరేం చేస్తాడతను. తప్పుతుందా? అన్నీ చేశాక—పెయింట్లూ, బ్రష్లూ ముందేసుకు కూచునేవాడు. ఆసరికి ఇంట్లో అందరూ భోజనాలు ముగించి మధ్యాహ్నం నిద్రలో వుండేవారు. పెయింట్ చేసే భువన్‌సోమ్ చుట్టూ, వర్షాకాలంలో దీపం ముందు పురుగుల్లా, పిల్లలు మూగేవారు. మూగినవాళ్ళు తిన్నగా వుండరాదూ? ఉహూఁ. ఒకడు అది లాగడం . ఇంకోడు ఇది లాగడం ...ఇవి అది అనిలేదు. అన్నిటిమీదా వాళ్ళ చెయ్యి పడాల్సిందే? ఓసారి అతని చెల్లెలికొడుకు రంగులన్నీ నేలమీద ఒలకబోశాడు. బ్రష్‌ల్ని పీకి నానా కంగాళీ చేసేడు. ఇంతచేసినా వాళ్ళని ఏమన్లేక పోయేవాడు భువన్‌సోమ్. ఓసారి ఆఫీసునుంచి ఇంటికి రాగానే—తను వేస్తూ సగం ఆపిన

బొమ్మమీద ఇంత రంగు పులిమి వుంది—వికృతంగా కన్పించింది. ఇదేమని భార్యని పిల్చి అడిగేరు. నిందుకుండలా తొణకలేదామె. "వేరే నన్నడగడమెందుకూ? మీ సుపుత్రుల ఘనకార్యమై వుంటుంది. వాళ్ళకీ మీలాగే బొమ్మవెయ్యాలని సరదా. పిల్లలు పెద్దాళ్ళని చూసేగా నేర్చుకునేది. వాళ్ళననాల్సిన పనేంలేదు. నిన్న 'బిలూ' మీలాగే సిగరెట్టు నోట్లోపెట్టి వెలిగించేడు" అందామె. రెండు కాళ్ళూ చేతిలోకి తీసుకుని గిరగిరా తిప్పి నేలకేసి కొడ్దామా అన్నంత కోపంవచ్చింది భువన్‌సోమ్‌కి కొన్నాళ్ళు పోయేక ఓ ఖరీదైన బ్రష్ కన్పించడం మానేసింది.

"బ్రషా?! ఏ ఎలకో ఎత్తుకుపోయి వుంటుంది. ఈ ఎలకల బాధ భరించలేక ఛస్తున్నానని మీతో ఎన్నిసార్లు మొరపెట్టేను. విన్నారా? బ్రష్‌దేముంది ... వెధవ ఎలకలు లక్ష్మీదేవి దగ్గరున్న తివాచీని పాడుచేసేయి" అందామె నిష్ఠూరంగా.

వెంటనే భువన్‌సోమ్ ఒక ఎలకలబోను కొన్నాడు. చిన్న మేనల్లుడొకడు తిన్నగా వుండకుండా అందులో వేలుపెట్టి దెబ్బ తగిలించుకున్నాడు .ఇక దాంతో—డాక్టర్లు ఇంజెక్షన్లు . మందులు చెప్పనే అక్ఖర్లేదు. దెబ్బతో పదిహేనురూపాయిలు వొది లేయి మచ్చుకి ఒక్క ఎలకైనా బోనులో పడ్లేదు. అది వేరే సంగతి!

అతని జీవితమంతా అలాగే గడిచింది.

ఇంట్లో ఎవరూ అతని సరదాకి ప్రోత్సాహం అందివ్వలేదు. చిత్రలేఖనం ఎలాగేనా మాన్పించాలని భార్య ఒకటే బలవంతం ఆట్లాంటి అననుకూల వాతావరణంలో ఎవరుమాత్రం సాగగలరు? తల్లి ఓ రకంగా భువన్‌సోమ్‌కి చాలా సహాయంచేసింది. ఆమె బతికున్నన్నాళ్లూ కోడల్ని మహాకట్టడిలో వుంచింది. అత్తగారు బతికివున్నంత కాలం అతని భార్య నోట్లోంచి ఒక్క మాటకూడా వూడిపడేది కాదు. ముసలి అత్త గారు ఇహలోకంనుంచి నిష్క్రమించగానే ఆడసింహంలా జూలు దులిపి ఆవు లించింది

పరధ్యానంగా నోట్లోవున్న పైప్‌ని తీసి చేత్తో పట్టుకున్నాడు లేచి నెమ్మదిగా కాసేపు డెక్‌మీద పచార్లు చేయుడం ప్రారంభించాడు. తర్వాత మళ్ళీ కుర్చీలో కూర్చు న్నాడు. చిత్రలేఖనంమీద అతని శ్రద్ధ తగ్గిపోవడానికి కారణం ఇంకొకటుంది. బ్రౌన్ మరణవార్త చిత్రాలమీది అనక్తిని పూర్తిగా తగ్గించేసింది. మొత్తానికి ఎలాగైతేనేం చిత్రాలు వెయ్యాలనే సరదా అతన్లో అంతరించింది.

చాలాకాలంవరకూ ఏమీ చెయ్యకుండానే రోజులు గడిపాడు. ఏ పనీలేకుండా ఆది వారాలు శలవు రోజులు గడపడమంటే చాలా చికాకనిపించేది. కొన్నాళ్ళు పోయాక వంటలమీదికి అతనిదృష్టి మళ్ళింది. విదేశీ పుస్తకాలు తెప్పించి వాటిల్లో రాసినట్టు




చట్నీలు, ఊర్కా వంటలు, జామ్, జెల్లీలు తయారుచేద్దామని ప్రయత్నించేడు. అందు కోసం చాలా డబ్బు కూడా తగలేశాడు ఇంతకుముందులాగే, ఈ సరదా కూడా ఇంట్లోవాళ్ళు సాగనివ్వలేదు అదీ మానుకోవలసి వచ్చింది.

ఆరిపోయిన పైప్‌ని మళ్ళీ వెలిగించి గట్టిగా పీల్చేడు. అకస్మాత్తుగా అతనికి గాంధీ గుర్తుకి వచ్చేడు గాంధీ అంటే భువన్‌షోమ్‌కి విపరీతమైన భక్తీ గౌరవం. కాని, గాంధీలో ఒకరకమైన విచిత్ర ప్రవృత్తి దాగివుందని అతని నమ్మకం.

గాంధీ పేరు స్ఫురణకి రాగానే కొన్నాళ్ళ కిందటి సంఘటన అతనికి స్మృతి పథంలో మెదిలింది అప్పటికి ఎం కె. గాంధీ ఇంకా మహాత్మాగాంధీ అవలేదు. భువన్‌సోమ్ కూడా అప్పటికి ఎ. టి. ఎస్ అవలేదు అప్పటికింకా అతను ఎల్.డి.సీ. గానే పని చేస్తుండేవాడు మూడో తరగతి పాస్‌తోనే ప్రయాణం చేసేవాడు.

బర్హరోవా స్టేషన్‌లో జనంతో విపరీతంగా కిక్కిరిసివున్న ఓ మూడో తరగతి పెట్టెలోకి భువన్‌షోమ్ ఎక్కేడు. ఓ మూలగా కూర్చుని వార్తాపత్రిక చదువుకుంటూన్న వ్యక్తి అతనిదృష్టిని ఆకర్షించేడు. అతను చాలా పీలగా, బక్కగావున్నాడు. తలకి పెద్ద తలపాగా చుట్టుకుని వున్నాడు. అతని పక్కనే బారెడు గడ్డంతో వున్న ఒక ముసలి కూర్చుని వున్నాడు. వాళ్ళిద్దరూ ఎవరో! రకరకాల వ్యక్తులు ఎదురవుతూంటారు ప్రయాణాల్లో! వాళ్ళిద్దరి మీదనుంచీ దృష్టి మరల్చిన భువన్‌సోమ్ మరు

నిముషంలోనే తల అటు తిప్పాల్సి వచ్చింది. గడ్డంతో వున్న ముదుసలి వ్యక్తి దగ్గడం ప్రారంభించాడు దగ్గడం అయ్యేక, కిటికీలోంచి బయట ఉమ్మడానికి బదులు పెట్టెలోనే ఉమ్మేడు. తలపాగా వ్యక్తి న్యూస్ పేపర్లోంచి తలయెత్తి ముదుసలివంక చూశాడు. "మీరిప్పుడు చేసిన పని మంచిది కాదు ఇలా పెట్టెలోనే ఉమ్మేబదులు కిటికీలోంచి బయట ఉమ్మవచ్చునుగదా?" అన్నాడు. అతని మాటాడే తీరూ విధానం అందరికీ వచ్చింది. ముసలాడు మాత్రం బహు దుర్మార్గుడిలా వున్నాడు. తలపాగా వ్యక్తి మాటలు విని నిశ్శబ్దంగా కూర్చున్నాడు. కొద్దిగా ఆయాసపడ్తున్నట్టుంది. ఆయాసం తగ్గేక గొంతుక తడి చేసుకుని తనకి పడిశం జలుబూ పెట్టేయనీ. కిటికీలో తల పెడ్తే మళ్ళీ యెక్కువ అవుతుందేమోననీ సమాధానం చెప్పాడు నేలమీద అల్లా ఉమ్మడానికి కారణం అదేనని కూడా అన్నాడు అంటే దానర్థం. అతను దగ్గుతో బాధపడ్తున్నంతసేపూ అట్లా కంపార్టుమెంటులో వుమ్ముతూనే వుంటాడు. ఇష్టంలేని వాళ్ళు పెట్టివదలి మరోదాంట్లోకి పోవాలి.

భువన్‌సోమ్‌కి కోపంతో ఒళ్ళు మండుకుపోయింది కానీ ఏ మనకుండా వూరుకున్నాడు ఇతరుల విషయాల్లో తల దూర్చడం అన్నంత తెలివితక్కువపని ఇంకేదీ లేదని అనికి తెలుసు. అంచేతే మాట్లాడకుండా వూరుకున్నాడు. కాని అంతలో. తలపాగా పెట్టుకునివున్న వ్యక్తి ఒక ఆశ్చర్యకరమైనపని చేశాడు.

చదువుతూన్న న్యూస్ పేపర్లోంచి చిన్న కాగితంముక్క చింపాడు ముసలాయన కాళ్ళదగ్గరున్న ఉమ్మిని దాంతో తుడిచి కిటికీలోంచి బైటికి విసిరేశాడు. ముసలాయన రెండు క్షణాలపాటు అతనివేపు కోపంగా చూశాడు. కాని పల్లెత్తుమాట అనలేదు ముసలాయన దగ్గు మళ్ళీ ప్రారంభమైంది. దగ్గుతో అతని ఛాతీ పొంగుతోంది ఇంతెంతేసి కఫాన్ని పెద్ద చప్పుడుచేస్తూ నేలమీద ఉమ్మసాగేడు ఇంతకుముందులాగే తలపాగా వ్యక్తి న్యూస్ పేపర్తో కఫాన్ని ఎత్తి కిటికీలోంచి బయిట పారవేశాడు.

ఈ చర్య కంపార్ట్‌మెంట్లోవున్న జనాన్నంతటినీ ఆకర్షించింది. ముసలి మనిషి భయంకరంగా దగ్గి ఇంతింతేసి కఫాన్ని మళ్లీ నేలమీద ఉమ్మేడు. తలపాగా వ్యక్తి మరోసారి న్యూస్ పేపర్తో ఆ ఉమ్మిని తుడిచి బయిటికి విసిరాడు అతనివేపు కళ్లింతలుచేసి కాసేపు ఆశ్చర్యంగా చూశాడు ముసలాడు తర్వాత "ఎందుకలా చేస్తున్నారు?" అన్నాడు. బక్కపలచని వ్యక్తి ఏం సమాధాన మివ్వలేదు ముఖం మీదికి మాత్రం చిన్న నవ్వు పరుచుకుంది. ఆ నవ్వులో ఒక అద్భుతమైన తియ్యదనముంది. అట్లాంటి మందహాసాన్ని భువన్‌సోమ్ ఇదివరకెన్నడూ చూసివుండలేదు.

కంపార్ట్‌మెంట్లో వాళ్ళందరూ ముసలాయన దగ్గుకోసం ఊపిరి బిగపట్టుకొని ఎదురు చూస్తున్నారు. ఫుట్‌బాల్ ఆటని ఉత్కంఠగా చూసే ప్రేక్షకుల్లా ఉన్నారందరూ. దగ్గు మళ్ళీ మొదలైంది. ముసలాడు ఈసారి నేలమీద ఉమ్మలేదు నెమ్మదిగా పక్కకి తిరిగి కిటికీలోకి తలదూర్చి బయట కఫాన్ని ఉమ్మేడు. జనం నవ్వుకున్నారు. కొద్దిసేపట్లో బండి ఏదో స్టేషన్లో ఆగింది చేతుల్లో పూలదండలు పట్టుకొని చాలా మంది పెద్దమనుష్యులు ప్లాట్‌ఫారంమీద ఎవరికోసమో చూస్తున్నారు. తలపాగా ధరించిన బక్కపలచని వ్యక్తి ట్రెయిన్ దిగగానే వాళ్ళందరూ అతన్ని వినయ విధేయతల్తో సమీపించేరు ఆ తలపాగా వ్యక్తి దక్షిణాఫ్రికానుంచి వచ్చిన ఒక బారిష్టరు. పేరు ఎం కె గాంధీ. పెద్ద సమస్య విడినట్టన్పించింది సోమ్‌కి.

నెమ్మదిగా కాళ్ళు కదుపుతూ పైప్‌ని గాఢంగా పీల్చసాగేడు.

చిత్రలేఖనం, వంటలు ఈ రెండు హాబీలూ అంతరించిపోగానే అతని దృష్టి వేటమీదికి మళ్ళింది. మొదట్లో ఎవరినైనా తోడు తీసుకుని వేటకి బయల్దేరేవాడు. రానురాను ఇంకొకరి సామీప్యం చాలా కారణాలవలన అతడికి భరించరానిదైంది. అప్పట్నుంచీ ఒంటరిగానే అడవుల్లోకి వెళ్ళి వేటాడేవాడు ఒంటరిగా వేటాడ్డం అతనెంతో ఇష్టపడేవాడు ఎవరి అభ్యంతరాలూ, అనవసర సలహాలూ, పోసుకోలు కబుర్లూ వుండవు. పైనపరుచుకున్న అనంత నీలాకాశం, చల్లటి మట్టి, అడవులూ, పొలాలూ, లోయలూ, నదులూ, కాలవలూ, పొదలూ, పక్షులు ఇవే అతనికితోడు. వెక్కిరింతకిగాని వేళాకోళానికిగాని తావెక్కడాలేదు. తనిష్టం వచ్చినట్టు చేసుకోవచ్చు. ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లు తుపాకీ పేల్చుకోవచ్చు ఇష్టంవచ్చిన పక్షుల్ని కొట్టవచ్చు. దెబ్బ తగలడం పక్షులు నేలరాలడం అవి వేరే సంగతి। మొదట్లో కని పించిన ప్రతి పక్షినీ నేల రాల్చాలనిపించేది. వాటి మాంసం తినేందుకు కూడా జనం ఉండేవారు ఇప్పుడొక్క పక్షయితే చాలు ఒక్కదాన్ని కొట్టినాచాలు, ఇప్పుడిక తినేవాళ్ళెవరూ లేరు।

అవును, ఎవ్వరూ లేరు ఈ కఠినమైన ఆలోచన ఆకస్మాత్తుగా అతని గుండెలో జొరబడింది చాలా సంవత్సరాల కిందట అతని భార్య చనిపోయింది అన్నదమ్ము లిద్దర్లో ఒకరు కలకత్తాలోనూ, ఇంకొకరు అహమ్మదాబాద్‌లోనూ వున్నారు. బికించి జగన్నాథ్ లిద్దరూ కూడా చనిపోయేరు అతని చెల్లెలు ఛవీ ఇప్పుడు విధవరాలై తన కుమాళ్ళవద్ద వుంటోంది అతని పెద్దకొడుకు బిలూ పాశ్చాత్యునిలా మారేడు. మామ గారి ప్రోద్బలంతో విదేశాల్లో చదువుకుని వచ్చి ఇప్పుడు న్యూఢిల్లీలోనూ రెండో కొడుకు విపూ మొన్నమొన్నటివరకూ సోమ్ వద్దే వుండేవాడు. తండ్రిలాగే అతనూ చదు

వయ్యాక రైల్వేలో ప్రవేశించాడు. కాని అతిత్వరలోనే అది మానుకున్నాడు.

విహూలో ఏదో మార్పు వచ్చిందని అతనెరుగును గాని అదేమిటో ఎట్లాగో ఎందుకో ఏమి అర్థం కాలేదు. ఆ మార్పు సంగతి కూడా అనుకోకుండా అకస్మాత్తుగా గ్రహించాడు.

ఓసారి వేటకివెళ్ళి 20, 25 పక్షుల్ని కొట్టి వాటిని ఇంటికి తీసుకొచ్చాడు. అయిదారింటిని వుంచేసి మిగతా పక్షుల్ని అడిగినవాళ్ళకి అడగనివాళ్ళకీ కూడా దానం చేశాడు. విహూ వండితే తిందాంగదా అని మిగతా పక్షుల్ని జాగ్రత్త చేసేడు. సోమ్ ఇంట్లో విధవరాలైన అతని దూరపు బంధువు ఒకామె వంట చేస్తూండేది. ఆమె మాంసం అన్నా చేపలన్నా తినదు ముట్టుకోదు. అందుకని ఆమెని బలవంతం చేసేవాడు కాదు సోమ్. ఇంట్లో అడుగు పెట్టగానే—తన చేతిలోవున్న పక్షుల్ని చూసి ఆమె ఆశ్చర్యపోతూ "మళ్ళీ తెచ్చావా? విహూ వాటిని తాకనైనా తాకడు అవి నువ్వే వండుకోబాబు!" అంది. భువన్‌సోమ్ నివ్వెరబోయాడు.

పక్షుల్ని విహూ ఎందుకు తాకడు? ఇంత అకస్మాత్తుగా ఏం జరిగింది? దానికామె సమాధానం కూడా చెప్పింది. జోటా బాబా దగ్గర విహూ శిష్యరికం చేస్తున్నాడట. ఈ మధ్య మాంసాహారం ముట్టడం మానేసి శాకాహారమే తింటున్నాడట. సూర్యనమస్కారాలు చేసేందుగ్గానూ ప్రతిరోజూ ఉదయాన్నే లేస్తున్నాడట. అట్లాగే జపం తపం .

చేసేదిలేక తప్పనిసరై తనే పక్షుల్ని ముందుపెట్టుకుని వంట ప్రారంభించేడు.

కాసేపట్లో విహూ వచ్చాడు.

"నువ్వు శాకాహారిగా మారిపోయేవని విన్నాను ఏమిటి సంగతి?' అని ప్రశ్నించేడు.

"మా గురువుగారు నన్ను మాంసాహారం ముట్టుకోవద్దన్నారు. నాకూ అది మంచి దన్పించింది "

వెంటనే భువన్‌సోమ్ పసికుర్రాడిని కేకేసాడు. దగ్గర్లోనే వున్న తాటాకులు రెండు తెమ్మని పురమాయించేడు. అవి రాగానే వాటిని చేత్తో పట్టుకుని విహూ వేపు తిరిగాడు భువన్‌సోమ్ "చూడు. మీ గురువుగారు చెప్పిన మంత్రాన్ని ఈ తాటాకుమీద రాయి. రాసేక గంగానదిలో దాన్ని ఒదిలెయ్యి. ఏం ఆ తర్వాత వచ్చి శుభ్రంగా బాతు మాంసాన్ని కూరని అన్నంలో తిను, బుద్ధిగా! ఇలాంటి గమ్మత్తులేం చెయ్యకు!" అన్నాడు కొడుకుతో.

విహూ ఏమి మాట్లాడలేదు. ముఖం నల్లబడింది నెమ్మదిగా వెనక్కు తిరిగి బయటికి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత కొడుకుచేత మాంసం తినిపిద్దామని ఎన్నిసార్లో ప్రయ




శ్నించేడు భువన్‌సోమ్. ఓరోజున నిపూ హరాత్తుగా మాయమయ్యేడూ ఎవరికీ చెప్పకుండా సోము అతని గురించి భోగట్టా చెయ్యడం ప్రారంభించేడు. ఆఫీసు కూ్కడ వెళ్ళడంలేదు, అలాగని శలవు తీసుకోనూలేదు, కొన్నాళ్ళకి గాని అత వేమయ్యాడో తెలిసిరాలేదు ఆఫీసుకి శలవూ గిలవూ పెట్టకుండా ఎగ్గొట్టి తన గురువు గారి జన్మదినోత్సవాల్లో పాల్గోడానికి కాశీ వెళ్ళాడు నిపూ సోమ్ తన కొడుకు నిర్ల క్ష్యాన్ని అలక్ష్యం చెయ్యలేదు, అతను చేసింది చాలా పెద్ద తప్పు. పైగా తన కుమా రుడు. అయినాసరే వెంటనే అతన్ని ఉద్యోగంలోంచి బర్తరఫ్ చేశాడు ఆ కుర్రా డిప్పుడు తన గురువుగారి ఆశ్రమంలో. బ్రహ్మచర్య వ్రతాన్ని తన శిష్యులికి ఉప దేశిస్తూవున్నారు. వేలెడులేని కుర్రకుంక। బ్రహ్మచర్యం గురించి ఉపన్యాసాలిస్తు న్నాడు।। ఇంటర్మీడియట్ పరీక్ష మూదోక్లాసులో పాసయ్యేడు. అదీ రెండుసార్లు పెయిలయ్యాక।

ఒక తెలివితక్కువ పనిని చెయ్యనందుకు తన్నుతాను అభినందించుకున్నాడు సోమ్. తనే గనుక తొందరపడి నిపూకి పెళ్ళి చేసేస్తే ఏమయ్యేది? నయమే।

ఇప్పుడు భువన్‌సోమ్ లంకంతకొంపలో ఏకాకిగా మిగిలేడు తనతోవున్న ఆ దూరపు బంధువు ఒకామె తప్పితే ఇంకెవ్వరూలేరు. అతనిప్పుడు వుంటున్న ఇల్లు కట్ట డానికి ఎంత శ్రమపడ్డాడు!! ఎందరిసహాయం అడిగేడు। ఎంతెంత మొత్తం అప్పు చేసేడు? ఆ అప్పులు వాటి వడ్డీలూ తీర్చడానికి ఎన్ని బాధలు—ఎన్ని చిరాకులు పడ్డాడు? ఇంత కష్టపడికట్టించిన ఇంట్లో ఇపుడెవ్వరూ లేరు। ఇంటినిండా బూజు

పడుతోంది. సాలీళ్ళు గూళ్ళు కట్టున్నాయి. ఈ ఇంటిగురించి ఇంకెవ్వరూ శ్రద్ధ తీసు కోరు. తను గనుక కన్నుమూస్తే—కొన్నాళ్ళకి యిల్లు రాళ్ళగుట్టగా మారుతుందేమో!

భువన్‌సోమ్ నెమ్మదిగా కళ్ళుమూసి—పైప్ పీల్చసాగేడు. ఇప్పుడతనికి పక్షుల్ని వేటాడాలని మనసులో ఏకోశానాలేదు. ఇంతదూరం ఇక్కడికి వచ్చింది. పక్షుల వేటకి గాదు. నగరంలోని రణగొణధ్వనుల్ని—ఆ కృత్రిమజీవితాన్ని తప్పించుకుందామని ఇక్కడికి వచ్చాడు. కొంతసేపు నిర్జనారణ్యంలో నిలబడి—విశాలాకాశాన్ని అవలోకిస్తే—ఆ ఒంటరితనంలో ఎంతైనా మనశ్శాంతిని అందుకోగలడు అదే అతని కిప్పుడు కావాలి! కాని, తన గౌరవం కాపాడుకోవడంకోసమైనా ఒకటో రెండో పిట్టల్ని కొట్టాలి. అనిల్‌భట్టాకి వాటిని గర్వంగా చూపించాలి. కావాలంటే ఇప్పుడు కూడా వేటాదేశక్తి వుందని ఋజువు చెయ్యాలి. వేటలో చాలా పక్షులు తప్పించుకు పోతాయి. దానికి పైబడుతోన్న వయస్సు—వణికేవేళ్లూ కారణం? అయినప్పటికీ కావాలనుకుంటే ఒకటో రెండో పక్షుల్ని నేలకూల్చగలడు. బహుశః వేటకి తనతో బాటు వస్తానంటాడేమో అనిల్ ఊహూ! ఒంటరిగానే వెళ్ళాలి.. !

భువన్‌సోమ్ కుర్చీ వెనక్కి చేరబడ్డాడు.

స్టీమర్ నెమ్మదిగా ముందుకు సాగుతోంది ..

దూరాన నది ఒడ్డు కన్పిస్తోంది.

## 3

మెల్లిగా స్టీమరు ఒడ్డుకి చేరుకుంది. అప్పటికే స్టేషన్లో ట్రెయిన్ వచ్చి ఆగి వున్నది. అంతవరకూ నిర్జనంగా వున్న నది ఒడ్డు ఒక్కసారి జనసందోహంతో నిండిపోయింది. దేశంలోని జనం అంతా అక్కడే వున్నారా అన్పించేట్టుంది ఆ ప్రదేశం. ప్రయాణీకుల పిలుపులు, కూలీల కేకలు, వర్తకుల గోల, ముష్టివాళ్ళ అరుపులు, వీటన్నిటి రణగొణధ్వనుల్తోను ఆ ప్రాంతం అంతా దద్దరిల్ల సాగింది.

ఒడ్డుకి కాస్త దూరంగా ఎత్తయిన ప్రదేశంలో నిలబడి, స్టీమరునుంచి దిగుతోన్న ప్రయాణీకుల్ని గమనిస్తున్నాడు అనిల్ అతను మొదట భువన్‌సోమ్ సోలార్‌హేట్‌ని ముందు గమనించేడు. ఆనక నోట్లో వెలుగుతోన్న సిగార్‌ని చూశాడు. గబగబ ముందుకి వెళ్ళి భువన్‌సోమ్‌కి పాదాభివందనం చేశాడు.

"చాల్లే లే!" అన్నాడు.

అతని ప్రవర్తనని గమనించి భువన్‌సోమ్ చాలా సంతోషించేడు. ఇవాళా రేపు కుర్రాళ్ళు చాలా మంది పెద్దవాళ్ళకి పాదాభివందనం చెయ్యడం లేదు. అనిల్ అలా కాదు. మంచి కుటుంబానికి చెందిన కుర్రాడిలో మంచి అలవాట్లుకాక చెడు అలవాట్లు ఎలా వుంటాయి?

"ఏమిటది?"

అనిల్ చేతిలో ఓ పొట్లం వుంది

"కొలాయ్‌ధాల్. మీకోసం కొన్నాను. హరివంశ్‌షాప్‌లో పప్పు చాలా బాగుంటుంది "

"ఇ ట్లో ఇంగువ వుందా?"

"వుంది."

"కూరల్లో కొ_త్త కొ_త్త వెయ్యమని చెప్పు అన్నట్టు నీ భార్య బాగుందా?"

"ఆఁ. బాగానే వుంది. అయితే ఇప్పుడు ఇక్కడ్లేదు. వాళ్ళ వ ళ్ళింటికి వెళ్ళింది."

"మరి. వంటెవరు చేస్తున్నారు?"

"ఓ బ్రాహ్మణ వంటవాడున్నాడుగా."

"ఎవరూ? మైథిలీయేనా? ఏమేనా బాగా చేస్తాడా వంట?"

"బ్రహ్మాండంగా చేస్తాడు "

"సరే. ట్రెయినెక్కుదాం పద. కూలీ ఏడీ? కూలీ .ఏయ్ కూలీ .ఈ సామాన్లు పట్టుకురా "

భువన్‌సోమ్ స్టేషన్‌వేపు నడిచేడు. అనిల్ అతన్ని అనుసరించసాగేడు. ప్లాట్‌ఫారంమీద జనం అట్టేలేరు. ఖాళీగావున్న సెకండ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కేడు. కిటికీపక్కనున్న సీట్లో కూర్చొని సిగార్ వెలిగించేడు.

"ఈసారి మంచి తూటాలు తెచ్చేను అనిల్! మామూలువి కావు. విదేశీ తూటాలు!" అంటూ చిన్నన‌వ్వు నవ్వేడు. "గతసారి జరిగింది నీకు గుర్తుందిగా. అట్లాంటి వెధవ పని మరిక చెయ్యకూడదని నిశ్చయించుకున్నాను."

అనిల్ నిశ్శబ్దంగా నవ్వేడు. గత సంవత్సరం ఇలాగే భువన్‌సోమ్ వేటకి వచ్చేడు. తుపాకీలో తనే స్వయంగా తయారుచేసిన తూటాలు పట్టించేడు. చూడ్డానికి ఆ తూటాలు బాగానే కన్పించేయి పేలిస్తే శబ్దంకూడా బ్రహ్మాండంగా వచ్చింది. లోపల మల్లా—గుళ్లు రెండు గజాలకన్నా ఎక్కువ ఎత్తుకి పోలేదు.

ఒక పక్షీ చిక్కలేదు

"ఊఁ ...ఏమేం ఏర్పాట్లు చేసేవు ..అసలు చిలకబాతులు వచ్చేయా?"

"బోలెడన్ని. నదిఒడ్డున చెట్లనిండా అవే."

"అక్కడికెళ్ళడం ఎలా? "

"నేనో బండీ ఏర్పాటుచేశాను నాటే. ఉదయానికి కిసన్‌పూర్ వెళ్ళిపోవాలి. అయితే, ఆక్కడనుంచి కాస్త దూరం నడవ్వలిసొస్తుంది. అక్కడ చెప్పలేనన్ని చిలకబాతులున్నాయి. ఎన్నోరకాలు నేనోసారి అక్కడికి వెళ్ళి చూసేనుకూడా. మీరు రమ్మంటే మళ్ళీ వస్తాను "

"అఖ్ఖర్లే. నే నొక్కడ్నే వెళ్తా.'

అనిల్‌కి కావల్సిందీ అదే ఎలా వెళ్ళాలో ఏమిటో చెప్దామని నోరు తెరిచేలోగా నఖీచంద్ ఎదురుగా ప్రత్యక్షమయ్యేడు. అతని చేతిలో ఒక సరికొత్త 'వాటర్‌పైప్' వుంది. వస్తూనే, రెండుచేతులూ జోడించి సోమ్‌కి వినయంగా వంగి నమస్కరించాడు.

"చిన్నసైజు వాటర్‌పైపులు ఎక్కడా దొరకలేదు అనిల్‌బాబూ. చిన్న రాధానాధ బాబు దీన్ని కొన్నాడట. ఆయన్నడిగి ఖరీదిచ్చి తీసుకున్నాను." అంటూ ఆ పైప్‌నీ, ఓ అర్ధరూపాయి కాసునీ అనిల్‌చేతిలో పెట్టేడు. మళ్ళీ మరోసారి భువన్‌సోమ్‌కి నమస్కరించి పెట్టె దిగి వెళ్ళిపోయాడు.

నఖీచంద్ తాలూకు ఈ వింత చర్య భువన్‌సోమ్‌కి ఏదో విషయాన్ని గుర్తు చేసింది, ఇతనిమీదే గదూ తను రిపోర్టు తయారుచేసింది! అదింకా పై అధికారులకి పంపనేలేదు! శెలవయిపోయా. మళ్ళీ ఆఫీసుకి వెళ్ళిన వెంటనే అది టైప్‌చేయించి పంపెయ్యాలి. రోజురోజుకీ మతిమరుపు ఎక్కువ అవుతోంది. వయసు పైబడడమేనా ఇందుకు కారణం?

"ఎవరికోసం తెప్పించేవది?" అనడిగేడు

"మీకోసమే! కటిహార్లో ఓ పైప్ కొన్నాను. కాని అది విరిగిపోయింది. అందుకని నఖీచంద్‌కి డబ్బిచ్చి మరో పైప్ కొని తెమ్మన్నాను. ఈ వూళ్ళో మంచి పైపులు దొరకవు!"

"ఆ పైప్ ఇచ్చెయ్యి. నేను తాగను దాంతో."

"ఏం అలా? మీకోసం మంచి పొగాకుకూడా తెప్పించి వుంచానే !"

"అయినా సరే ఈ పైప్ నాకొద్దు తీసెయ్ "

మారు మాట్లాడకుండా అతను చెప్పినట్టే చేశాడు అనిల్.

ట్రెయిన్ కదిలింది.

ఇద్దరూ ఇంటికి చేరేసరికి గంట పట్టింది. భువన్‌సోమ్ స్నానాలు కానిచ్చి




భోజనం చేశాడు వంటబ్రాహ్మడి వంట బ్రహ్మాండంగా వుంది.

"ఆడదానికన్నా బాగా చేశాడయ్యా మీ వంటవాడు! ఇలాంటి వంటవాళ్ళు దొరకడం మహాకష్టం. 'బేటా'ని జాగ్రత్తగా చూడు!" అన్నాడు ఎవరేనా తనకి సంతోషం కలిగించే పని చేస్తే వాళ్ళని బేటా అనడం సోమ్‌కి అలవాటు.

లోపలి గదిలో అతనికోసం మంచంమీద పరుపువేసి పక్క సిద్ధం చేయసాగేడు అనిల్. తనలో తను మాట్లాడుకోవడం ఈ మధ్య అలవాటయినట్టుంది సోమ్ మావయ్యకి అనుకుని నవ్వుకున్నాడు.

"సోమ్ మావయ్యా, పక్క సిద్ధంగావుంది. కాసేపు రెస్టు తీసుకోండి!" అని కేకేశాడు.

"నాకు పగటినిద్ర అలవాటు లేదబ్బాయ్. నాకసలు నిద్రపట్టదు పగలు ఎలాగూ ఆఫీసు వుంటుంది. సెలవురోజుల్లో మధ్యాహ్నంపూట వేటకో-చేపలు పట్టుకోడానికో బయల్దేర్తాను. అయినా, కాసేపు నడుం వాలుస్తాలే!"

మంచంమీద నెమ్మదిగా నడుం వాల్చేడు భువన్‌సోమ్ చేతుల్లోకి ఓ అంగ్ల నవ లని తీసుకున్నాడు. దాన్ని తను ఏదో రెయిల్వేస్టేషన్లోని బుక్‌స్టాల్లో కొన్నాడు. మొదటపేజీ చదివేసరికి అతనికి కాస్త చిరాకేసింది. మొదటి రెండు పేరాల్లోనే___ రెండు హత్యలు జరిగేయి. ఓ అమ్మాయీ, ఆమె మేనత్తా దారుణంగాచంపబడ్డారు. ఆ హత్యా స్థలంలో మూడు తుపాకులు కన్పించాయి. గొప్ప విషమసమస్య ...పెద్దగా చప్పుడు చేస్తూ పుస్తకం మూశాడు భువన్‌సోమ్.

కాసేపు కళ్ళు మూసుకొని నిద్రపోదామని ప్రయత్నించేడు. ఉహూఁ నిద్ర పడితేగా! కళ్ళు తెరిచి గోడకి తగిలించివున్న అనిల్ తండ్రి ఫోటోకేసి చూశాడు నువ్వు అదృష్టవంతుడివి అన్నయ్యా. అన్నిట్ని దాటేశావు. నువ్వు మంచితనంతో బతికావు నువ్వంత మంచివాడవు కాబట్టి—ఈ కుళ్ళుతోనిండిన లోకాన్ని త్వరగా విడిచిపెట్టేశావు.... అని తనలో తనే గొణుక్కున్నాడు

లేచి తలుపు తీశాడు. పక్కగదిలో ఎవరూ లేరు. ఎక్కడికి వెళ్ళిపోయాడు చెప్మా ఈ అనిల్? నాలుగడుగులు వేయబోయి చటుక్కున ఆగిపోయాడు సోమ్. ఎవరో సిగరెట్ కాలుస్తున్న వాసన. ఇంకెవరు? అనిల్ అయ్యుంటాడు. రహస్యంగా ఎవరికంటా పడకుండా సిగరెట్ కాలుస్తున్నాడన్నమాట. బావుంది. తమకన్నా వయసులోనూ అనుభవంలోనూ పెద్దలైన వాళ్ళ ముఖాల మీదికి పొగవదిలే ఈనాటి కుర్రాళ్ళకీ అనిల్‌కీ ఎంత తేడావుంది? వుండకేం చేస్తుంది? ఆ తండ్రికి తగ్గ కొడుకేగా అనిల్! సంతృప్తిగా నవ్వుకున్నాడు తనలో.

షర్టు వేసుకుని కాళ్ళు చెప్పుల్లోకి దూర్చాడు నెమ్మదిగా మెట్లుదిగి కిందకి వెళ్ళాడు. చాలాకాలంనుంచీ ఈ ప్రశాంతమైన పల్లెవాతావరణం లో ఒక చిన్నఇల్లు కట్టుకుని స్థిరపడదామను కుంటున్నాడు భువన్‌సోమ్. ఆ ఉద్దేశంతోనే కావల్సిన స్థలంకూడా ఖరీదు చెయ్యడం జరిగింది. పునాదులు కూడా వేసేశారు. ఇదంతా అనిల్ తండ్రి ప్రోద్బలం మీదేజరిగింది....

సగం పునాదులు లేచిన తన స్థలంచుట్టూ కంచె వేయబడివుంది. మనసారా దాన్ని చూసి వెనక్కి మళ్ళేడు భువన్‌సోమ్. వెనక్కి తిరిగివస్తుంటే అతని మనస్సులో గతకాలపు జ్ఞాపకాలెన్నో ముప్పిరిగొన్నాయి.

"ఎక్కడికి వెళ్ళేరు సోమ్ మావయ్యా? మీకోసం కాఫీ రెడీగా వుంది!" అన్నాడు అనిల్ అప్పుడే ఇంట్లోకి అడుగెట్టిన సోమ్‌నిచూసి

"కాఫీయా? నువ్వు కాఫీ త్రాగడం ఎప్పట్నించీ మొదలెట్టేవు?"

"అబ్బే. నేను తాగను. మీకోసం కాఫీగుండ కటిహార్‌నుంచి ఇంతకుముందే తెప్పించి వుంచాను. మధ్యాహ్నంపూట కాఫీ తాగడం మీకిష్టమని నాకు తెలుసుగా!"

కొద్దిసేపు అనిల్ ముఖంలోకి చూశాడు భువన్‌సోమ్. "సరే. పడవలసిన శ్రమ ఎలాగో పడ్డావు గనుక, తాగుతాను. కానీ నువ్వింత శ్రమపడివుండకపోవలసింది."

"పడితే, ఏం?"

"ఏముందీ! నన్ను పరాయిమనిషిలా చూస్తున్నావన్నమాట? మీ కుటుంబసభ్యుణ్ణి. మువ్వేదితాగితే అది తాగుతాను. ఏదితింటే అదే తింటాను. అదే నాకు సంతోషంగా

వుంటుంది. ఏవేనా ప్రత్యేకమైన ఏర్పాట్లు నువ్వు నాకోసం చేస్తూవుంటే నాకు ఇబ్బందిగా వుంటుంది.''

''అదేమిటి సోమ్‌మావయ్యా. అలా అంటారు? మా నాన్నగార్కి మీరేం చేసేవారు? ఆయనకోసం మీరే ఎన్నో తెచ్చేవారుకాదూ? గయలో దొరికే పొగాకంటే ఆయన కిష్టం వేయించిన పెసరపప్పు ఇష్టం. ఆవుచెయ్యి ఆయనకిష్టమని చెప్పి ప్రత్యేకంగా కలకత్తానుంచి తెప్పించేవారుకాదు మీరు?''

''నువ్వు నన్ను సరిగ్గా అర్థంచేసుకోవడం లేదబ్బాయ్. అదంతా మర్చిపో. సరే గానీ—ఎంతసేపైంది కాఫీ తయారయి?''

"ఎదీ ఇంకా మూణ్ణిమషాలుకూడా కాలేదు.''

''అయితే, కాసేపు చల్లారనియ్యి "

తర్వాత ఇద్దరూ ఇంట్లోకి నడిచారు కాఫీ అదీ తాగడం మరో పావుగంటలో ముగిసింది.

''సరేగాని. అనిల్ మనం ఎప్పుడు బయల్దేరాలంటావు?"

"రాత్రి రెండుగంటలకి లేచి రెడీ అవ్వాలి. మూడుకల్లా స్నానం పానంచేసి బట్టలు వేసుకోవాలి. వెంటనే బండి ఎక్కి బయల్దేరిపోవడమే। తెల్లారేలోగా గమ్యాన్ని చేరుకుంటాము. బండివాణ్ని ఈ రాత్రికి ఇక్కడే నిద్రపోమన్నాను ''

''బండీకూడా ఇక్కడే వుందా?''

"ఆఁ అన్నట్టు ఆ బండీ నాదే. ఈ ఏడాది రెండు దున్నపోతుల్నికొన్నాను.''

"అదేమిటి? నీ దగ్గర ఇంతకుముందు ఎద్దులుండేవిగదూ ? పోతుల్నెందుకు కొన్నావు? వెధవదున్నలు త్వరగా నడిచిచావవు. మందకొడి పశువులవి.''

"ఏంచేసేది మరి? ఈ వర్షాకాలంలో దున్నాలంటే పోతుల్తో తప్ప ఎద్దుల్తో పని అవదు. రోడ్లన్నీ వర్షానికి ఛండాలంగా తయారవుతాయి. ఒకటే బురద ఎద్దులు బండిని లాగలేవు. త్వరలోనే పక్కారోడ్డు వేస్తారని విన్నాన్నేను. కేంద్రప్రభుత్వం దానికి డబ్బు మంజూరు చేస్తుందట।''

"అది నేనూ విన్నాన్లే. కాని నాకేం నమ్మకంలేదు. ఈ రాజకీయనాయకులున్నారు చూడు, వాళ్ళు భలే నటులు. వేదికలమీద బ్రహ్మాండంగా వుపన్యాసాలు దంచుతారు. ఆ మాటలు వింటుంటే ఆకాశంలోని చందమామని నీ పెరట్లో వేలాడదీస్తారేమో నన్నంత భ్రమ రేకెత్తిస్తారు. మిగతావాళ్ళు దొంగలు। పచ్చి బందిపోట్లుకూడాను. ప్రభుత్వం డబ్బు ఖర్చుపెడ్తోంది. కాని దేనికి? అదంతా ఈ దొంగలు పంచుకుంటారు. రోడ్డు సంగతి మరదక్కు।''

కుర్చీ వెనక్కి చేరబడి సోమ్ ఒక సిగార్ వెలిగించేడు. విశ్రబ్ధంగా కాసేపు సిగార్ పీలుస్తూ కూర్చుండిపోయేడు. "సాయంకాలం కాస్త త్వరగానే భోజనంచేసి నిద్ర పోతాను. ఎలాగూ మళ్ళీ చీకట్నే లేవాలిగా!" అన్నాడు.

"అట్లు చేయద్దామనుకుంటున్నాను. మీకవి ఇష్టమేగా?"

"మీ వంటబ్రాహ్మడు చెయ్యగలడా?"

"ఎందుకు చెయ్యలేడు? ఎట్లాంటి వంటకాలైనా చేస్తాడు. రేపు మధ్యాహ్నానికి అక్కడ మీకు తినడానికి ఏదేనా వుండాలిగా అందుకవి! మీతోపాటు వాటివి తీసుకెళ్ళండి."

"బావుంది. నిజమే అడవిమధ్యలో ఆకలివేస్తే మూట విప్పుకువి తినేస్తాను "

"అక్కడకి దగ్గర్లోనే చిన్న వూరుంది. అక్కడ కావాలంటే పాలు దొరుకుతాయి "

"పాలెవరిక్కాలి? నేను తాగలేను."

# 4

చీకట్నే మూడు గంటలప్పుడు దుర్గవి మనస్సులో ధ్యానించి పోతులబండి ఎక్కేడు భువన్‌సోమ్. లోపల చిన్న పక్కలాంటిది ఏర్పాటుచేశాడు అవిల్. పరుపు మెత్తగా వుంది. అదిగాక ఓ తలగడా, దుప్పటీ, రొజాయీ వున్నాయి.

"సోమ్ మావయ్యా, నడుంవాల్చి విశ్రాంతి తీసుకోండి. రొజాయిని కప్పుకోండి. మీరక్కడికి వెళ్ళేసరికి మరింక చీకటి వుండదు మీకా ప్రదేశమేమో కొత్త. అదీగాక ఇంతకు మునుపెప్పుడూ మీరక్కడికి వెళ్ళివుండలేదు పోనీ, నన్ను రమ్మన్నారా?"

"అహ అఖ్ఖర్లేదు. ఇఖ నువ్వు లోపలికిపోయి పండుకో బయట నిలబడకు. మంచు కురుస్తోంది, లేకపోతే మళ్ళీ జలుబు చేయగలదు "

బండి కదిలింది. కాసేపయ్యేక ఒక విషయం గ్రహించాడు భువన్‌సోమ్ పోతులు జోరుగా నడుస్తున్నాయి ఇదేరీతిగా ప్రయాణమంతా సాగితే నిద్రపట్టడం అసంభవం అనుకున్నాడు. అంతేకాదు శరీరంలో ఏకీలు కాకీలు వూడిపోయే ప్రమాదంకూడా వున్నది

"నీ పేరేమిటి?" అనడిగేడు బండివాడిని.

"ఛుట్టా."

"కాస్త నెమ్మదిగా పోనీ, ఏం?"

"అలాగే హుజూర్."




కొంతసేపు బండి నెమ్మదిగానే నడిచింది. రొజాయితో శరీరం కప్పుకుని నెమ్మదిగా వెనక్కి చేరబడ్డాడు. ఇప్పుడు కాస్త హాయిగా వుంది పక్కకింద గడ్డీ అదీ వెయ్యడంవల్ల మెత్తగా వుంది. నెమ్మదిగా అతని కళ్లు మూతలుపడ్డాయి అంతటి కమ్మని నిద్రనీ వెధవపోతులు హఠాత్తుగా చెదరగొట్టేయి పోతులు మళ్ళీ పరుగు మొదలెట్టేయి. నెమ్మదిగా లేచి కూర్చుని బండిగూడులోంచి ముందుకివంగి చూశాడు. ఆకాశంలో మెరుగుపెట్టిన వెండి కొడవలిలా మెరుస్తున్నాడు చంద్రుడు కాని వెలుగుమాత్రం అంతంతమాత్రంగనే వుంది చాలీచాలని వెలుగులో తను చూసిన చర్య సోమ్‌ని ఒక్కసారిగా భయభ్రాంతుడిని చేసింది పోతులకి అతను చేస్తున్న పని గనుక ఏనుగులకి చేస్తే—అవి ప్రాణాలకోసం పదామడలు పరుగెత్తాయి. భట్టా తన రెండుకాళ్ళనీ వెడల్పుగా చాచి పోతుల వెనకకాళ్ళ మధ్యగా పెట్టి వాటి కడుపుల్ని కాలిబొటనవేళ్ళతో కితకితలు పెడుతున్నాడు. పాపం, ఆ నోరులేని పోతుల్ని చూస్తే సోమ్‌కి జాలేసింది అంతింతేసి కొమ్ములుండీ మాత్రం ఏం ప్రయోజనం? ఏం చేయగలవవి?

"అబ్బే—భట్టా!"

"ఏం హుజూర్."

"నీ కాళ్ళని అలా ఆడించకు. మఠం వేసుక్కూర్చో."

భుట్టా సోమ్‌వేపు ఆశ్చర్యంగా చూశాడు. ఆ పెద్దమనిషి తనని ఏం చెయ్యమంటున్నాడో అర్థంకాలేదు.

"ఏమిటీ? ఏం చెయ్యమంటున్నారండీ అయ్యగారూ?" అన్నాడు.

భుట్టా మొహంలో వ్యాపించిన ఆశ్చర్యాన్ని చీకటిమూలంగా చూడలేకపోయాడు సోమ్ కాని, తనన్నది అతనికి అర్థం కాలేదన్న సంగతిమాత్రం గ్రహించేడు. సోమ్‌కి హిందీ అంత బాగా రాదు. నేర్చుకుందామనికూడా ఎన్నడూ ప్రయత్నించలేదు. బీహారీలతో మాట్లాడే అవసరమొస్తే ఏ ఇంగ్లీషునో బెంగాలీనో శరణు వేడుతాడు. పోతులు పరుగుని మరీ ఎక్కువ చేస్తున్నాయి. "ఎంతపని చేశాడు అనిల్? నన్ను ఒక పిచ్చివాడిచేతిలో వదిలిపెట్టిపోయాడు" అనుకున్నాడు తన కాళ్ళని ఆ పశువులకాళ్ళ మధ్యగా పెట్టి కితకితలు పెట్టడం ఇంకా మానలేదు భుట్టా ఆ బాధ పడలేక బండి ఏదన్నా గుంటలోకి తోసేస్తాయేమో ఈ పోతులు ఈ వయసులో ఎముకలు విరిగితే త్వరగా నయమవుతుందా?

"ఇదుగో భుట్టా. కాళ్ళ సందుల్లో అలా చెయ్యకు. కాళ్లు ముడుచుకొని కూర్చో."

"మరేం చెయ్యడం బాబూ, అలా చేస్తేగాని వెధవగొడ్లు నడవ్వు."

"వాటి కలా కితకితలు పెట్టకు."

"ఏం చేసేది?"

"ఏమీ చెయ్యకు. పశువుల్నలా తొందరపెట్టి పరుగెత్తించకు."

"మనం తెల్లారకముందే అక్కడికి చేరుకోవాలని అనిల్‌బాబు చెప్పేడు. ఈ లెక్కని ఈ గొడ్లు నడిస్తే కష్టం బాబయ్యా. ఇంకా చాలా దూరముంది."

"అయినా, సరే! మెల్లగా పోనీ."

"మెల్లిగా పోనిస్తే ఎలా బాబూ? అక్కడికి వెళ్ళేసరికి సూర్యోదయమైపోతుంది. వెలుగు రాగానే చిలకబాతులు మరింక కన్పించవు.

భుట్టా చెప్పింది అతికష్టంమీద గ్రహించగలిగాడు భువన్‌సోమ్. విపరీతమైన ఉద్రేకం రాసాగింది.

"అయినా ఫర్వాలేదు. నెమ్మదిగా పోనీ, నేను చెప్తున్నాగా!"

భువన్‌సోమ్ మాటలు భుట్టా విన్పించుకోలేదు పక్కనేవున్న బెత్తం అందుకుని పోతులదిక్కుని తిరిగేడు.

"నడవండర్రా, మీరూ మీ పెళ్ళినడకలూ చాలించండి. ఊఁ ఎవరయినా యిల్లాగా నడచేది" అంటూ అదిలిస్తూ, వాటి వీపులమీద బెత్తంతో కొట్టసాగేడు.

"అబ్బా. ఒరే భుట్టా. కాస్త నెమ్మదిగా పోనీ నాయనా! నువ్విలా బండిపోనిస్తే

నేను బతకలేను ..."

"ఏం భయం లేదయ్యగారూ, నేనన్నాగా కూర్చోడమెందుకూ, పడుంచేరేపి విశ్రమించండి."

అలా అంటూ రెండు చేతుల్లోనీ పశువుల రెండుతోకల్నీ మెలిపెడ్తూ నాలికతో గమ్మత్తుగా చప్పుడు చేయసాగేడు

"ట్రర్ర్ర్ర!"

"హేయ్. ట్ర్ర్ర్ర్ర్రా!"

ఇక లాభం లేదని నిరాశ చేసుకున్నాడు భువన్‌సోమ్. తనకా భాష రాదు. వచ్చినా సరిగా రాదు. తన బాధ వాడికి వివరించనూలేడు. అవిల్ వాడి యజమాని. యజమాని మాటలు అతను చెప్పినట్టూ చేయవలిసిందే! ఇక వాడు తనమాటవినడు?-

ఈ బండీ ఇదేప్రకారంగా వురుకులు పరుగులు పెడ్తే శరీరంలోని కీళ్ళన్నీ కదుల్తాయేమో! కీళ్ళన్నీ వదులయ్యేక తుపాకీని అసలు తను ఎత్తగలడా! ఇలా కాదని మరో ప్రయత్నం చేద్దామనుకున్నాడు భువనసోమ్ పోతుల నుంచివాడి దృష్టి కాస్త మరలిస్తే—నడకలోని వేగం మందగిస్తుందేమో. అలా చెయ్యాలంటే వాడిని నెమ్మదిగా మాటల్లో పెట్టాలి. ఏం మాట్లాడాలి? ఎట్లాంటి విషయాలు మాట్లాడితే వాడికి కుతూహలంగా వుంటుంది? వాడికి రాజకీయాలు అర్థం కావు. రైల్వే శాఖలోని అవకతవకలు వాడికి అంతకన్నా అయోమయం. ఇంగ్లీషు నవలల గురించి ఇహ అడగనే అక్కర్లేదు ఏవైనా వ్యవసాయ విషయాలు అడిగితే వాడి నోరు పెగుల్తుంది. కాని అవేమిటో తనకే తెలీదే! లాభం లేదనుకొని మరో ప్రయత్నం చేశాడు భువన్ సోమ్.

"భుట్టా .మంచిపేరే సుమీనీది! ఎవరు పెట్టేరా పేర్నీకు?"

"మా పిన్ని."

"నీతల్లి చెల్లెలేనా? చాలా బాగుంది!"

దాంతో భుట్టా తన గొడవ చెప్పడం ప్రారంభించేడు. జొన్న చేలో తను పుట్టడం ఆ వెంటనే తల్లి మరణించడం, పినతల్లి దత్తు తీసుకోవడం వగైరా అంతా కళ్ళకి కట్టినట్టు చెప్తూంటే భువన్‌సోమ్ ఆశ్చర్యపోసాగేడు. కాసేపట్లో అతని కథ పూర్త యింది. పశువుల నడక మందగించింది. అది గమనించిన భుట్టా బెత్తం మళ్ళీ చేత పుచ్చుకుని వాటిని బాదడం మొదలుపెట్టాడు. నోటితోనూ నాలుకతోనూ అదావుడిగా చప్పుడు చేస్తూ గొడ్లను బెదరగొట్టసాగేడు. వాటి తోక్క సందులో కాళ్ళు పెడ్తూ కడుపుల్ని గోళ్ళతో గీరడం, తోకల్ని చేతుల్తో మెలిపెట్టడం ప్రారంభించేడు.

ప్రాణాలమీద భయంతో ఆ నోరులేని పశువులు వెర్రిగా ముందుకు ఉరకసాగేయి.

"మెల్లగా. మెల్లగా. మెల్లిగా పోనీ."

భుట్టా వెనక్కి తిరిగి చిన్న నవ్వు చిందిస్తూ భువన్‌సోమ్‌ని చూశాడు. భయపడ్డ పిల్లల్ని సముదాయించే పెద్దల అనువయం వుంది అందులో. కోపంతో సోమ్ శరీరం ఉడుకెత్తసాగింది. కాని కోపం చూపించే సమయం ఇది కాదని తగ్గిపోయాడు.

హఠాత్తుగా తిండిమీద సంభాషణ ఎత్తుకున్నాడు భువన్‌సోమ్. భుట్టాకి ఏయే పదార్థాలు ఎట్లా వండితే ఇష్టమో కనుక్కున్నడు. దాంతో మరికొన్ని నిమిషాలు సంభాషణలో పడ్డాడు భుట్టా. అంతసేపూ పశువుల నడక సంగతి చూసుకోలేదు. సంభాషణ ఇలా పూర్తి అయిందో లేదో—మళ్లీ బెత్తం పుచ్చుకొని గొడ్లని బెదర గొట్టడం ప్రారంభించేడు.

నిస్సహాయంగా వెనక్కి చేరబడ్డాడు భువన్‌సోమ్. కొత్త కొత్త వెలుగొస్తోంది. ఆ వెల్తుర్లో పెద్ద పెద్ద చెట్లూ, పేరుతెలీని పక్షులూ, ఎర్రబడ్తూన్న తూర్పుదిక్కూ అతని దృష్టిని ఆకర్షించాయి. అసంతా చూస్తూంటే భువన్‌సోమ్‌కి ఇంద్రజాలంలా కనిపించసాగింది. ఫాక్టరీ రణగొణ ధ్వనులూ, కార్ల గోలలూ, ఇతరేతర ధ్వనులూ కలిసి యుద్ధ రంగంలా వుండే నగర వాతావరణం ఎక్కడ? ఈ ప్రశాంత ప్రకృతి ఎక్కడ? ఒకరకమయిన తన్మయత్వంలో మునిగిపోసాగేడు.

"హోహ ఒహ్హో . అయ్యో!" అంటూ పెద్దగా కేకలేస్తో భుట్టా ఒక్కసారిగా బండినుంచి నేలమీదకి దుమికాడు! రెండు పోతుల్లోనూ ఒకటి కట్లు తెంచుకుని బండి నుంచి విడిపోయి పరుగెత్తడం ప్రారంభించింది. దాంతో బండి పక్కకి ఒరిగిపోయింది. పారిపోతూన్న పోతుని భుట్టా ఆపలేకపోయాడు. అది శివమెత్తినట్లు కనిపించిన దిక్కుకి వెర్రిగా పరుగెత్తోంది. ఇది చూసి భువన్‌సోమ్‌కి మతిపోయింది. ఇక—బండికి వున్న మరో పోతు కూడా తన కట్లు తెంచుకోడానికి ప్రయత్నంచేస్తూ మెడని అటూ యిటూ ఊపసాగింది.

"అమ్మ బాబోయ్! దున్న . దున్నపోతు!!" అంటూ భుట్టా ఓ వెర్రికేక వేశాడు.

"దున్నా .దున్నంటే?" అని ఏమో అడగబోయాడు భువన్‌షోమ్.

"దున్నబాబా, దున్నపోతు . బండి దిగిపోండి బాబూ. దిగండి త్వరగా."

బండిలోంచి కిందికి దిగేడు భువన్‌సోమ్. ఏమైందో ఏమిటో అతనికి అర్థంకాలేదు.

నేలమీద కాలూనిన వెంటనే సంగతి గ్రహించాడు. కొత్త దూరంగా పొలంలో ఓ పెద్ద దున్నపోతు వుంది. కొమ్ములకి బురద. శరీరం అంతా దుమ్ము పేరుకుపుంది. తల తాటిస్తూ కోపంగా బుసలుకొడుతూ మీదిమీదికి రాసాగింది.




దగ్గర్లోనే ఒక పెద్ద పత్తిచెట్టుంది. భుట్టాదాన్ని చూపించి భువన్‌సోమ్‌కి ఎక్కమని సంజ్ఞ చేశాడు

"వేగరం ఎక్కిపోండి బాబూ" అంటూ పరుగు పరుగున దగ్గరగా వచ్చి— భువన్‌సోమ్‌ని చేతుల్తో చెట్టుదగ్గరకు లాక్కుపోయాడు "ఆ కొమ్మపట్టుకొని ఎక్కిపోండి, బాబూ.' వెనక దున్న. దీనిపని చెప్తానుండండి, అంటూ భువన్ సోమ్‌ని చెట్టెక్కించేశాడు. చెట్టెక్కినాక కింద జరుగుతున్న తతంగం చూడ సాగేడు

బండికి వున్న పోతు ఎంత ప్రయత్నించినా కట్లు విప్పుకోలేక పోయింది. పరుగు పరుగున వచ్చిన దున్నపోతు, దాన్ని గట్టిగా ఢీ కొట్టింది. ఇంతలో భుట్టా రెండు వెదురుకర్రలు పట్టుకొచ్చి దాంతోపాటు దున్నపోతువేపు తిరిగాడు ఇక వీళ్లిద్దరియుద్ధం ప్రారంభమయింది ఈలోగా బండికివున్న దున్న కట్టు తెంచుకోడంలో కృతకృత్యురాలై కాలికి బుద్ధిచెప్పింది. తన ఇద్దరు శత్రువులూ కంటికి కానరాకుండా పారిపోవడంతో దున్నపోతు కాస్త శాంతించింది. మరింక అక్కడ పనేముంది దానికి? అంచేత వచ్చిన దారంటే వెనక్కి మళ్ళింది. తన సరిహద్దుల్లోకి ఎవర్నీ రానియ్యకుండా కాపలా కాయడం దాని పనన్నమాట! ఈ వివరాలన్నీ భుట్టా వివరంగా చెప్పాడు. సాధారణంగా ప్రతివూళ్ళోనూ అట్లాంటి దున్నపోతు ఒకటి వుంటుందట. దాని రాజ్యంలోకి మరో మగదాన్ని రానివ్వదట తప్పి జారి ఏదైనా ప్రవేశించిందో ప్రారంభిస్తుంది యుద్ధం. ఆ ప్రయత్నంలో ఎదటిదాన్ని

చంపనై నా చంపుతుంది. లేదా తనేనా చచ్చిపోతుంది.

చెట్టు కొమ్మమీది ఈ భీషణ యుద్ధమంతా గమనించిన భువన్‌సోమ్, ఆ మూడూ యుద్ధరంగాన్ని వదిలిపెట్టగానే దీర్ఘంగా నిట్టూర్చాడు. అంతలోనే తృళ్ళిపడ్డాడు. మరో ప్రమాదం అతనికి అనతిదూరంలోనే వుంది. చెట్టునిండా ఎర్రచీమలు గుంపులు గుంపులుగా ప్రాకుతున్నాయి. "ఏం చెయ్యడమా?" అని ఆలోచించసాగేడు భువన్ సోమ్.

ఇంతలో భుట్టా చెట్టుకిందకి వచ్చి "అంతా అయిపోయింది హుజూర్." అన్నాడు.

భుట్టా బాగా అలిసిపోయాడు. ఆ దున్నపోతు అలా హఠాత్తుగా ప్రత్యక్షమయి నందుకు ఎంతగానో నొచ్చుకుంటున్నాడు అతని కుడిచేతివేలికి చిన్న దెబ్బకూడా తగిలింది.

చీమల్ని చూశాక ఇంకేం పాలుపోలేదు భువన్‌సోమ్‌కి భుట్టా సహాయంకోసమేనా ఎదురుమాడకుండా గభీమని చెట్టుమీంచి కిందకి ఉరికాడు.

ఇక ఆ తర్వాత ఏం చేసేట్టు??

బండియేమో మరింక ముందుకి సాగదు. కాలినడకని పోవడంవల్ల ఏమన్నా ప్రయోజనం వుందా? ఒకవేళ ఆ దున్నపోతు మళ్ళీవాస్తే ..ఇంకేమన్నా వుందా?

భుట్టా మెల్లిగా తన బుర్రలోవున్న ఆలోచనని బయటపెట్టాడు. అక్కడికి కాస్త దగ్గర్లోనే మహేంద్రసింగు పొలం వుంది. పొలంలోనే అతనో చిన్న కుటీరంలాంటిది కట్టుకొని వుంటున్నాడు. బహుశః అతనిదగ్గర బండి దొరకవచ్చు. అనిల్‌బాబంటే మహేంద్రసింగ్‌కి ఎంతో గౌరవం వుంది. అంచేత పని జరగొచ్చు అన్న ఆశ వెలి బుచ్చేడు భుట్టా.

భువన్‌సోమ్‌కి ఈ పద్ధతి బాగానే వున్నట్టనిపించింది. అంతకన్నా మరింక వేరే గత్యంతరంకూడా ఏమీలేదు. అంచేత మరి అంగీకరించక తప్పలేదు. ఇంకానయమే. ఆ దున్నపోతు బండి జోలికి పోలేదు. అతని సామాను అంతా అందులోనే వుండి పోయింది. బండిలోవున్న ఓవర్‌కోటు ధరించి తుపాకిని చేత్తో అందుకున్నాడు తూటాల్ని జేబులో పెట్టుకున్నాడు. టోపీతలమీద వేశాడు. మెల్లిగా భుట్టా వెనుకగా నడవడం ప్రారంభించేడు. అనిల్ మధ్యాహ్నభోజనానికిగాను తయారు చేయించిన వంటకాలు ఓ టిఫిన్ కేరియర్లో వున్నాయి. తాగేనీరు ఫ్లాస్కులో పోసి వుంది. ఈ రెండూ భుట్టా చేతపుచ్చుకుని నడవసాగేడు.

వీళ్ళిద్దరూ వెళ్ళేటప్పటికి మహేంద్రసింగ్ పొలంలో ఎవరూ లేరు. పొలంలో

ఒకమూలగా మట్టిగోడల్తో చిన్న ఇల్లుంది. పైన గడ్డిపరిచి వున్నది. దానికి తూర్పుగా ఓ కొయ్యమంచం వుంది. మరికాస్త దూరంగా బావి వుంది. అక్కడికి ఫర్లాంగు దూరంలో ఓ కుర్రాడు గడ్డిని కత్తితోకోస్తూ కన్పించాడు. చేతిలోని టిఫిన్‌కారియర్‌ని బల్ల మంచంమీద పెట్టి ఆ కుర్రాడిదెసగా నడిచేడు భుట్టా. మంచంమీద కూర్చుని తన పైప్ వెలిగించుకున్నాడు భువన్‌సోమ్.

కొద్దిక్షణాల్లోనే భుట్టా తిరిగి వచ్చాడు. మహేంద్రసింగ్ లేడట అక్కడికింకా ఇరవైనాలుగు మైళ్ళదూరంలో వున్న మరో వూళ్లో అతని బంధువులింట ఎవరిదో వివాహం జరుగుతోంది. అందుకని బండి తీసుకుని మహేంద్రసింగ్ అక్కడికి వెళ్ళిపోయాడు. ఇంతత్వరగా తిరిగివస్తాడన్న నమ్మకం కూడా లేదట. ఇదంతా విని భువన్‌సోమ్ విస్తుపోయాడు. భుట్టా ఇంకో సంగతికూడా చెప్పాడు. ఈరోజు ఉదయమే ఎక్కణ్నించో నలుగురైదుగురు వేటగాళ్లు తుపాకుల్తో వచ్చేరట ఈ మాట వినగానే భువన్‌సోమ్ చాలా నిరుత్సాహపడిపోయాడు. వాళ్ళొస్తే—చప్పుళ్ళకి పక్షుల్ని బెదరగొట్టేస్తే తనింక చేసేదేముందిక్కడ? పవిత్రగంగకి నమస్కారం అర్పించి వెనుదిరిగిపోదామా అన్పించిందతనికి. కాని పోతులో? అవిలేందే బండీ ఎలా కదుల్తుంది?

''భుట్టా, పారిపోయిన పశువుల్ని వెతికి పట్టుకుని రావడానికి ఎంతసేపపడ్తుంది నీకు?'' అన్నాడు.

''ఎవరు చెప్పగలరు బాబూ? అవి ఎక్కడికిపోయేయో ఏమో! వాటికోసం వెతకాలిగా—''

''సరే—వాటిని వీలైనంత తొందరగా ఇక్కడికి తీసుకుని రా. నేనిక్కడ కూర్చొని ఎదురుచూస్తూ వుంటాను. నువ్వు వచ్చేలోగా పక్షులేమేనా కన్పిస్తాయేమో చూస్తాను ''

భుట్టా మంచి కుర్రాడు, ఆ సంగతి భువన్‌సోమ్‌కి తెలుసు.

భుట్టా పోబోయేముందు తను తెచ్చిన టిఫిన్ కేరియర్ని తెరిచి చూశాడు. అందులోని పదార్థాలు చూసి ఆశ్చర్యపోయేడు. ఆమ్లెట్లూ—మామిడి పచ్చడీ! రెండూ కూడా ప్రయాణంలో భోజనానికి పనికిరానివే. అంతగా ఆకలి అన్పించకపోయినా—టిఫిన్ కేరియర్‌ని మోసే బెడద తప్పించుకోడానికని అవి తినేసి దాన్ని ఖాళీ చేసాడు ... భుట్టా టిఫిన్ కేరియర్ని కడిగి, ప్లాస్కులో తాజా మంచినీరు పోశాడు ప్లాస్కుకూడా అనవసరమే అన్పించింది భువన్‌సోమ్‌కి. వాతావరణం చల్లగావుంది. బహుశః అంతగా

దాహంవెయ్యదు కూడాను. అంతగా దాహంవేస్తే పక్కని నదే వుందిగా. కేరియర్నీ ఫ్లాస్కునీ భుట్టాకి ఇచ్చేశాడు.

భువన్‌సోమ్ పైప్ వెలిగించేడు. భుట్టా దగ్గర్నుంచి కలవు పుచ్చుకున్నాడు. తూర్పుదిక్కున ఆకాశంలో రక రకాల రంగులు వ్యాపిస్తున్నాయి. ఒకదానిపై ఒక టిగా మేఘాలు పరుగులెత్తున్నాయి. భువన్ అలాగే నిశ్శబ్దంగా పైప్ పీలుస్తూ వాటిని అవలోకించ సాగేడు.

ఒక్కసారి తృళ్ళిపడ్డాడు భువన్. ఎక్కడో పిడుగుపాటులా పేలింది ఒక తుపాకీ. మళ్ళీ మరోసారి.

"అయ్యయ్యో.... ఈ దెబ్బకి పక్షులన్నీ ఎగిరిపోతాయి గామోసు!"

తన తుపాకీని భుజానవేసుకుని లేచాడు భువన్. కాస్త ముందుకి పక్క పొలంలో వున్న భగియా వద్దకివెళ్ళేడు. ఆ కుర్రాడు భువన్‌ని తలెత్తి అయినా చూడలేదు. మౌనంగా కత్తితో గడ్డి కోస్తున్నాడు.

ఆతన్ని బతిమాలి బామాలి నదికి దారెటో తెలుసుకున్నాడు. చురుకుమంటున్న ఉదయపు ఎండలో పొలాలకి అడ్డంపడి నడవడం మొదలెట్టేడు. నదికి అవతలే గదూ బోలెడన్ని పీటికాకులూ చిలకబాతులూ వుంటాయని అపిల్ చెప్పింది!

అతికష్టంమీద ఎన్నో అడ్డంకులకి ఎదుర్కొని గంగని చేరుకున్నాడు భువన్. ఇక ఇది దాటిపోవాలి అదృష్టవశాత్తూ అప్పుడే ఓ చిన్న పడవ వచ్చింది. అందులో ఇద్దరు ముగ్గురు జాలర్లున్నారు. వాళ్లు భువన్‌ని పడవలో ఎక్కించుకొన్నారు. ప్రయాణం జరుగుతున్నంతసేపూ తనని తాను తిట్టుకున్నాడు భువన్. ఇవాళ నిజంగా చాలా దురదృష్టకరమైన రోజు. లేకపోతే ఏమిటీ అడ్డంకులు?

మొత్తానికి ఒడ్డు చేరుకున్నాడు. భువన్‌ని దించేసి వాళ్ళు మళ్ళీ పడవని తీసుకు పోయారు.

ఓసారి ఒళ్ళు విరుచుకొని భువన్‌సోమ్ నడక ప్రారంభించేడు.

# 5

తానెంత దూరం నడిచాడో ఇంకా ఎంతదూరం నడవాలో కూడా అర్థంకాలేదు భువన్‌సోమ్‌కి. నది ఒడ్డునుంచి పోసాగేడు. ఆతనిచుట్టూ యిసుక గుట్టలు గుట్టలుగా వుంది. ఒకోచోట అవి చిన్నపాటి కొండల్లా వున్నాయి. నడుస్తూంటే చాలా హాయిగా వుంది. ఎన్నోఏళ్ళ వయస్సు ఎవరో తీసేసినట్టుగా వుంది. చకచకా యిసుక గుట్టల్ని దాటుకుంటూ పోసాగేడు. ఏవేనా పక్షులున్నాయేమోనని ఆకాశంకేసి తలెత్తి చూశాడు.




ఒక్కటీ కనిపించలేదు. కనీసం పక్షుల అరుపులు కూడా వినిపించలేదు. అయినాసరే నడక మానలేదు భువన్‌సోమ్.

దార్లో అక్కడక్కడ కొంగలు మైనాలు పావురాలు కనిపించేయి. అంచేత మరి కొంత దూరం నడిస్తే, ఇక శ్రమ ఫలించినట్టేనని అనుకున్నాడు. అలా అనుకుంటూ వాచీ తీసి చూసుకున్నాడు. దగ్గర దగ్గరగా ఎనిమిది కావస్తోంది. బారెడు పొద్దెక్కిందంటే ఇక చిలక బాతులు మరి కనిపించవు. దానికితోడు ఇంతకుముందు వచ్చిన వేటగాళ్ళు వున్న పక్షులన్నిట్నీ బెదరగొట్టి ఎగరగొట్టేసి వుంటారు. అయితే అవి మరి కాసేపటికైనా వచ్చి తీర్తాయి. ఎంతసేపని అవిమాత్రం గాల్లో వుండగలవు? కృతనిశ్చయుడై తలవంచి మరింత జోరుగా నడవసాగేడు భువన్‌సోమ్.

కొంత దూరాన విరిగిన కుండపెంకులు పాడైన నులకమంచం కన్పించేయి. మరి కొంత దగ్గరగా వెళ్ళాడు. చెల్లాచెదురుగా పడివున్న బొగ్గుముక్కలు కన్పించేయి. ఈ మధ్యే ఇక్కడ ఎవరిదో దహనక్రియ జరిగిందన్నమాట.

హఠాత్తుగా అతనికి తన తండ్రి మరణం గుర్తుకొచ్చింది. భార్య మరణం, మేనల్లుళ్ళ మరణాలు కూడా గుర్తొచ్చేయి. వారందరి అవశేషాలూ తనే పవిత్ర గంగా నదిలో ఐక్యం చేశాడు. ఎక్కడా ఏ విషయంలోనూ కూడా లోటన్నది రానివ్వలేదు.

ఇపుడు తనా పరిస్థితిని సమీపిస్తున్నాడు. ఏ నిముషంలో నైనా చావు తనని కబళించక మానదు. తన అవశేషాల్ని గంగలో ఎవరు కలుపుతారు? తను మృత్యువు చేతుల్లో గిలగిలలాడే సమయానికి తన వాళ్లెవరూ ఎదురుగా వుండరు పక్కింటి శ్రీదమ్‌గాని, ఎదురింటి హరేన్‌గాని దహనక్రియలకి ఏర్పాట్లు చేస్తారు. విపూ వస్తాడా? అతనీ ప్రపంచాన్నే మరచిపోయాడు. బంధాలన్నీ తెంపుకొని సన్యాసి కూడా అయ్యేడుగా. బిలూ సంగతి సరేసరి. అసలు రాడు. అతనిప్పుడు విదేశాల్లో పీకలమొయ్యా పనుల వత్తిడిలో మునిగివున్నాడు. రాడు. ఈ కొడుకు లిద్దరూ రాకండానే తన ప్రాణవాయువులు ఈ అనంత విశ్వంలో విలీనమైపోతాయి. ఈ జన్మలో ఆ భాగ్యం లేదు. కనీసం వచ్చే జన్మకైనా ఈ భాగ్యం వుంటే చాలు. మనసులో చాలాసేపు ఏమేమో గొణుక్కున్నాడు భువన్‌సోమ్

నడుస్తున్నవాడల్లా ఒక్కసారి ఆగిపోయాడు. ఇలా ఎంతదూరమని నడవడం? అంతకన్నా చేసేదిమాత్రం ఏముంది? ఓ బాతునైనా కొట్టందే తను వెనక్కి వెళ్ళ లేదు. చెల్లాచెదురైన పక్షులు మళ్ళీ గూళ్లు వెతుక్కుంటూ రాకపోవు. ఒకదాన్ని అయినా కనీసం తను తీసుకెళ్ళాలి.

మళ్ళీ నడక ప్రారంభించేడు. కాళ్ళు కొద్దిగా నెప్పి పుట్టనారంభించాయి. అయినా నడక ఆపదల్చుకోలేదు. ఎదురుగా పెద్ద ఇసుకతిన్నె కన్పిస్తోంది ఆ వెనక ఏముందో అర్థం కావటంలేదు. కష్టపడి ఆ తిన్నె ఎక్కి అటుకేసి ఏముందో చూశాడు. నది ఒడ్డున ఒక వ్యక్తి చేపలు పడ్తూ కూర్చున్నాడు. అతను చాలా దగ్గర్లోనే వున్నాడు. గబగబ అటు నడిచేడు.

"ఇక్కడెక్కడేనా చిలకబాతులు వుండగా చూశారా? అవెక్కడ కన్పిస్తాయో కాస్త చెబుతారా?" అంటూ వచ్చీరాని హిందీలో అతన్ని అడిగేడు భువన్‌సోమ్.

ఒంచిన తలని ఎత్తేడతను. ముఖం చాలా ప్రశాంతంగా దయగా వుంది సోమ్ ప్రశ్నకి అతను బెంగాలీలో ఇచ్చిన సమాధానం భువన్‌సోమ్‌ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

"మరికొంచెం దూరం నడిస్తే మీకో చిన్నపల్లెటూరు ఎదురౌతుంది. ఆ వూరి పక్కనుంచి గంగానది పాయపోతుంది. అక్కడ బోల్డన్ని రకాల పక్షులున్నాయి? ఇంతకుముందు ఇప్పుడే నేను చూశాను"

"మీరు బెంగాలీయా?"

"అవును. మా వూరు సెయాఖలా, హూగ్లీ జిల్లాలో వుంది. మా తాత చాలాకాలం కిందట బీర్‌భమ్‌కి వలస వచ్చేశాడు. ప్రస్తుతం దుబ్రజ్‌పూర్‌లో వుంటున్నాం."

"మీరిక్కడేం పనిచేస్తున్నారు?"

"ఇక్కడ నేను టీచర్‌గా పని చేస్తున్నాను. వాతావరణం చాలా బాగా వుంటుం దిక్కడ. అంచేతే ఈ వూళ్లోనే స్థిరపడిపోయాను."

"ఇదేనా దారి?"

"అవును. తిన్నగా వెళ్ళండి. వూరు దగ్గర్లోనే వుంది. వూరివాళ్లు కూడా చాలా మంచివాళ్లు." అని సమాధాన మిచ్చేరు.

మరిక, భువన్‌సోమ్ కాలం వృధా చెయ్యలేదు పక్షులవార్త అతన్లోని ఆశకీ ఉత్సాహానికీ ప్రాణం పోసింది. వూరు దగ్గరపడేవరకూ గబగబ నడిచేరు. వూరేమంత పెద్దదికాదు. అయిదో ఆరో పూరిళ్లు వున్నాయి. అక్కడక్కడా ఇళ్లల్లోంచి పొగ వస్తోంది. ఓ అమ్మాయి ఆవుపేడ ఏరుతోంది, అంతలో భువన్ నడకవేగాన్ని తగ్గించాల్సి వచ్చింది. ఆవులూ గేదెలూ ఆ ప్రాంతంలో అటూ ఇటూ తిరుగుతున్నాయి. వాటిని తప్పుకుని నడవడం అంత కష్టంగా తోచలేదు.

ఇంతసేపూ అలసట అన్పించలేదు. ఇప్పుడిప్పుడే దాని ప్రభావం సోమ్‌మీద పని చేయసాగింది. కాసేపు విశ్రమిస్తే బాగుణ్ణు అనుకున్నాడు.

అంతలో ఎవరో, "పరుగెత్తు బాబూ పరుగెత్తు! త్వరగా!!" అని అరిచేరు. తృళ్ళిపడి ఒక గంతేశాడు భువన్‌సోమ్!

వెనక్కి తిరిగిచూశాడు.

ఎనుబోతు!

ఇందాక, తనబండిని లాక్కొచ్చిన పశువుల్లో, అదరగొట్టిన ఎనుబోతు! తలని అటూ ఇటూ ఆడిస్తూ బుసలు కొడ్తోంది. కాని సత్తువ కొద్దీ పెద్ద పెద్ద అంగలు వేశాడు. అంతలో ఆవు పేడతో వున్న బుట్టని చంకనెట్టుకున్న అమ్మాయి, "ఏయ్ మబోధ్, అగు!" అని కేకేసింది, భువన్‌సోమ్ మీదికి వెళ్ళబోతున్న ఎనుబోతుకి అమె మాటలు మంత్రోచ్చాటనలా విన్పించేయిగావును. రక్కున ఆగిపోయింది.

భువన్‌సోమ్ ఆయాసంతో రొప్పటం మొదలెట్టేడు. ఆ అమ్మాయి ఎనుబోతుని సమీపించింది. దాని చెవిని దొరకపుచ్చుకొని తిట్టటం ప్రారభించింది. "ఛీ ..నీకు సిగ్గులేదూ? ఇందాకే గదూ నీ వీపునే చిట్ల గొట్టిందీ? అంతలోనే మరిచి పోయావా?" అంటూ.

ఆ ఎనుబోతు మెడకాయ వొంచి అమె తిటన్నీ వింది. తర్వాత తలెత్తి భువన్‌సోమ్ వేపు ఓ వంక చూపు పారేసింది. దాని తలకి, సరిగ్గా కొమ్ముల దిగువభాగాన ఓ కట్టు వుంది. ఇంతకుముందు అదిలేదు. ఆదేసమయంలో ఆ అమ్మాయి మాట్లా

టింది బెంగాలీలోనని స్ఫురణకి వచ్చింది. ఇందాక కన్పించిన స్కూల్ మాస్టర్‌గారి కూతురు కాదుగద!

ఎనుబోతు మళ్ళీ భువన్‌సోమ్‌వేపు ఉరకబోయింది "సుబోధ్, ఆగుతావా లేదా!" అని కేకేసిందామె. "ఇక చాలించు నీవేషం!"

తోకాడిస్తూ వూరుకుంది ఎనుము.

"ఇలారా. నీకు తాడుకట్టి ఓమూల పడుకోబెడ్తేగాని బుద్ధిరాదు. నువ్వు రోజు రోజుకీ అల్లరి పిల్లాడివై పోతున్నావ్ బాబూ. పద నీపని చెప్తా" అంటూ ఆమె చటుక్కున ఎనుబోతు వీపుమీద ఎక్కి కూర్చుంది. చేతులు రెండూ దాని మెడ చుట్టూ వేసింది. ఎనుబోతు మెల్లగా వూరివేపు నడవసాగింది.

భువన్‌సోమ్ మళ్ళీ నడక ప్రారభించాడు కాసేపట్లో వూరిమధ్యకి వచ్చి ఒక వడివయస్కుడి దగ్గర నిలబడ్డాడు.

"మీ పేరేమిటి?"

"చతుర్భుజ్ గోప్"

"నేను వేటకోసం వచ్చేను. ఇక్కడ చాలా చిలకబాతులూ అవీ వుంటాయని విన్నాను."

"అవును. కాని"

"కానీ___"

"నలిసోన్ పొలందాటి పోవాలి. తూర్పువేపు తిన్నగా." అంటూ చేయి ఎత్తి చూపించేడు

భువన్‌సోమ్ అటుతిరిగాడు. కాసేపు తన ఇంట్లో విశ్రాంతి తీసుకొమ్మని అర్థించేడు గోప్. కాని సోమ్ ఆగదల్చుకోలేదు. కృతజ్ఞతలు అర్పించి ముందుకి సాగేడు. కాసింతదూరం వెళ్ళగానే పక్షుల అరుపులు విన్పించేయి. కొంగలు కాకులు నీటి కాకులు చిలకబాతులు ఇంకేవో పేరు తెలీని పక్షులు అరుచుకుంటున్నాయి. అబ్బ ఎన్ని పక్షులో... వంద..వందకి పైనే వుంటాయి జాగ్రత్తగా ముందుకి నడిచేడు. తుపాకీ రెండు బేరల్స్‌లోకి తూటాల్ని దట్టించేడు. మోకాళ్ళమీద కూర్చొని రెండు సార్లు తుపాకి పేల్చేడు పెద్దగా అరిచి పక్షులన్నీ గుంపుగా ఆకాశంలోకి ఎగిరి పోయాయి. వాటిని జాగ్రత్తగా చూస్తో నిలబడ్డాడు భువన్‌సోమ్. ఒక్క పక్షీ నేల రాల్లేదు. ఒక్కసారి నిరుత్సాహం ఆవరించిందతన్ని. ఎవరో వెనక నిలబడి గట్టిగా నవ్వేరు. భువన్‌సోమ్ అటు చూశాడు. ఇందాక ఎనుబోతు ఎక్కివెళ్ళిన అమ్మాయి కడుపు చెక్కలయ్యేట్టు నవ్వుతోంది. చీర చెంగుని నోటికి అడ్డం పెట్టుకుని ఒకచే




నవ్వు. ఆ నవ్వుని చూసి. లాగి లెంపకాయ కొట్టామా అన్నంత కోపం వచ్చింది భువన్‌సోమ్‌కి. దగ్గర్లోనే వున్న పొదదగ్గరికి నడిచేడు. ఇక్కడ కూర్చొని కాపేపు ఎదురుచూస్తే మళ్లీ పక్షులన్నీ వస్తాయి. మళ్ళీ చెట్లమీద గూళ్ళల్లో వద్దుకుంటాయి. మరోసారి ప్రయత్నిస్తే—ఒక్కటైనా దొరక్కపోదు. ఒక బాతుని చంపకుండా వెనక్కి ఎలా వెళ్ళడం?

"ఏమండీ ..''

అటుకేసి చూశాడు ఆ అమ్మాయి తనవేపే వస్తోంది.

''ఏం?'' అన్నాడు.

''ఎందుకి పక్షుల్ని వేటాడుతున్నారు? అవి మీకేం అపకారం చేశాయి?

ఎంత నిస్సంకోచంగా అడుగుతూందో?

పైగా మొహాన నవ్వొకటి.

''నువ్వు మాంసం తినవా?''

''ఊఁహూఁ''

''కాయగూరలో?''

''తింటాను.''

''సరే—మరి. ఆ కాయగూరలు నీకేం అపకారం చేసేయని పాపం వాటిని మొక్కలనుంచి వేరుచేసి. తరిగి. పొయ్యిమీద పెడ్తున్నావు? కాయగూరలు కూడా జీవ పదార్థాలే? వాటిని నువ్వు కోసేటప్పుడు అవి బాధపడ్తాయి . ''

"నిజంగానా? ఆ సంగతి నాకు తెలీదు. కాయగూరలూ, పక్షులూ రెండూ, ఒకటేనా?" ఆమె చీర కొంగుని వేలికి చుట్టుకోసాగింది. ''కాయగూరల్ని చెట్టునుంచి

కోస్తే రక్తం రాదే....మమ్మల్ని కోసేస్తున్నావని అవి ఏడవ్వు కూడా. మరి పక్షులు అలాక్కాదే. పాపం. రక్తం వస్తుంది. ఎంతో బాధగా విలవిల తన్నుకుంటూ ఏడుస్తాయి."

పై పెదవి కింది పెదవిమీద నొక్కిపెట్టి ఘనకార్యం సాధించినదానిలా నవ్వ సాగింది.

"ఎంత సాహసురాలు!" అనుకున్నాడు సోమ్ మనసులో.

"మీకు బాతు మాంసం చాలా యిష్టమనుకుంటాను ఏం?" అమ్మాయి మరో ప్రశ్న వేసింది.

"ఒకానొకప్పుడు నాకు చాలా యిష్టంగా వుండేది. ఇప్పుడిక—మరి తినను."

"మరలాంటప్పుడు, పాపం, వాటినెందుకు వేటాడ్తున్నారు?"

ఆమె వేసిన ప్రశ్నకి సరైన సమాధానం భువన్‌సోమ్ దగ్గర సిద్ధంగా లేదు. మాట్లాడకుండా లేచి నిల్చున్నాడు. కాని ఆ అమ్మాయి వదిలేలా కనిపించడం లేదు. ఆతన్ని మెల్లిగా అనుసరించ సాగింది.

"మీరు వాటివి తిననప్పుడు, మరింక వాటినెందుకూ చంపడం? వాటి మానాన వాటిని ఒదిలెయ్యండి."

"ఇవాళ నేను కనీసం ఒక్క పక్షినైనా కొట్టలేకపోతే నేను పందెం ఓడిపోతాను."

"ఓహో! కొడ్తానని పందెం కాసేరా? ఏం?"

ఇది ఆమెకి సరైన కారణంలా కన్పించినట్టుంది. చాలా సేపటివరకూ మాట్లాడ లేదు.

"మీ రిలా—వేటాడ్తే మీకు ఒక్క పక్షి కూడా దొరకదు. మీరు పందెం ఓడిపోతారు!"

భువన్‌సోమ్‌కి కూడా ఆమె చెప్పింది నిజమేనేమోననిపించింది.

"మరేం చెయ్యమన్నావ్? చెప్పు!"

"నేను చెప్పినట్టుగా చేస్తారా?"

"చెప్పు మరీ?"

"అయితే నాతోరండి?"

ఆమెతో వెళ్ళాలా మానాలా అన్న సందేహంలో పడ్డాడు భువన్‌సోమ్. వేట గురించి ఆమెకేం తెలుసని?

"రండి మరీ"

ఆ అమ్మాయి పట్టు వదల్లేదు. తను వెళ్ళాల్సిందే! ఊళ్ళోకి ఆమె ముందుగా దారి తీసింది. వెనుకగా భువన్‌సోమ్ నడక ప్రారంభించాడు.

"నీ తండ్రి పేరేమిటి?"

"చతుర్భుజ్‌గోప్ "

"నువ్వు బెంగాలీ ఎలా నేర్చుకున్నావ్?"

"మా మావయ్య పాకూర్‌లో వుంటున్నాడు. నేనక్కడే పెరిగాను. ఇక్కడి కొచ్చిన తర్వాత కూడా ఇక్కడి స్కూలు మాస్టారుగారు నాకు నేర్పేరు."

భువన్‌సోమ్‌కి ఆ అమ్మాయి ఎవరో తెలీదు. తను ఏ సబీచంద్ మీద పెద్ద రిపోర్ట్ పంపనున్నాడో—ఆయనగారి భార్యామణి వైదేహి అన్న సంగతి అతనికెట్లా తెలుస్తుంది?

"నువ్వుగాని అక్కడ లేకపోతే, ఆ ఎనుబోతు యివాళ నా ఒళ్ళు హూనం చేసేది. నువ్వంటే దానికి భయమనుకుంటున్నాను. నిన్ను చూడగానే ఆగిపోయింది."

"అవును. చిన్నప్పట్నుంచీ దాన్ని నేనే పెంచాను. చిన్నప్పుడు అది వట్టి బడుద్దాయిలా ఎప్పుడూ ఓ మూల నిద్రపోతూ వుండేది. పెద్దయ్యే కొద్దీ ఇలా భయంకరంగా తయారైంది. ఇవాళ ఉదయాన్నే ఎవర్తోనో యుద్ధం చేసినట్టుంది. దాని నుదురు బాగా చిట్లి రక్తం చిమ్మింది దానికి అయిడీను వేసి కట్టు కట్టేను."

దాని తలమీది దెబ్బకి భుట్టా చేతి కర్ర కారణమన్న సంగతి భువన్‌సోమ్‌కి గుర్తొచ్చింది. కాని, ఏం మాటాళ్ళేదు.

"టించర్ అయొడీన్ బాగా పనిచేస్తుంది గదండీ?"

ఈలోగా ఇల్లు వచ్చింది. తండ్రి కోసమని ఓ గిన్నెలో అన్నం కట్టింది. ఏవేవో చిల్లర మల్లర పనులన్నీ పూర్తి చేసింది. అనక జొన్న పిండిని చిన్న చిన్న వుండలు చుట్టసాగింది.

"అదెవరికి?"

"శారీకి. నేనిక్కడ్నుంచి వెళ్ళిపోతే శారీని ఎవరు చూస్తారోనని బెంగగావుంది."

"శారీ ఎవరు? నీ చెల్లెలా?"

"కాదు. నేను పెంచుతూన్న మైనా."

"ఏకీ?"

"పొలాలమీదికి వెళ్ళి వుంటూంది. ఇంకాసేపట్లో వచ్చేస్తుంది. తిండి రెడీగా ఉండకపోతే ముందు, అరిచి గోల చేస్తుంది."

అంటూ విదియా ఓ ఖాళీ పంజరం తెచ్చింది. మైనా ఆహారాన్ని పంజరంలో వుంచింది.

ఇంతలో భువన్‌షోమ్ దృష్టిని ఒక ఫొటో ఆకర్షించింది. ఫొటోలోని వ్యక్తి బాగా తెలిసినవాడిలాగ కనిపిస్తున్నాడు. చేతిలోకి తీసుకుని జాగ్రత్తగా చూశాడు. ఇంకెవరు? మహానుభావుడు సఖీచంద్ జాదవ్ ఫొటో అది! ఆ దొంగ రాస్కెల్ ఫొటో యిక్కడెందుకుంది? అదే అడిగేడామెను.

విదియా సిగ్గుపడి ముఖం పక్కకి తిప్పుకుంది.

"ఎవరిదీ కాదు." అంది నవ్వుతూ.

"ఎవరిదో ఒకరిది అయివుంటుంది. పోనీ ఆ వ్యక్తి నీకు బంధువా?" అని అడిగేడు.

"మా ఆయన!"

ఈ అమాయకురాలి భర్తా సఖీచంద్? ఎంత ఆశ్చర్యం?

ఈ లోగా కాకీ వచ్చి, గదిలో కొత్త ముఖం చూసి మళ్ళీ పారిపోయింది.

"నీ భర్త సఖీచంద్ జాదవ్ నాకు తెలుసు" అన్నాడతను మెల్లిగా.

"మీకు తెలుసా?"

"తెలుసు. చాలా దుర్మార్గుడు."

"అవును, చాలా రోజులై ఉత్తరాలు రాయటంలేదు. పైగా నేను రాయటంలేదని కోపిస్తాడు. రోజూ ఉత్తరం రాసే అవకాశం నాకు ఎక్కడుంది చెప్పండి. పోస్టాఫీసేమో యిక్కడికి చాలా దూరం!"

"అలాగా" అని తలూపేడు భువన్‌సోమ్.

"అతన్ని మీరెలా ఎరుగుదురు? మీకెలా తెలుసు?" అంది.

"నేనూ రైల్వేలోనే పని చేస్తున్నానుగా."

"ఓహో, అలాగా? మీకు సోమ్ సాహెబ్ తెలుసునా? రైల్వేలో సోమ్‌సాహెబ్ అనే ఆయన ఆఫీసర్‌గా పని చేస్తున్నాడని విన్నాను. అందరిమీదా రిపోర్టులు రాయడమే అతని పనిట. మీమీదగాని ఏం రిపోర్టు చేశాడా? తనమీద ఉన్నవీ లేనివీ కల్పించి పెద్ద రిపోర్ట్ రాశాడని మా ఆయన నాకు ఉత్తరంలో రాశాడు"

భువన్‌సోమ్ వర్ణనాతీతమైన పరిస్థితిలో వున్నాడు.

"ఈ సోమ్‌సాహెబ్ వట్టి పిచ్చివాడని మా ఆయన అంటాడు. అతనటా తన సొంత కొడుకునే కోపమొచ్చి డిస్మిస్ చేయించేశాట్ట....మా ఎనుబోతే నయం అను కుంటాము....అతనికన్నా? మా ఎనుబోతూ అంతే—కవ్వించిన ప్రతివాళ్ళనీ పొడిచే




స్తుంది" అంటూ బిడియా నవ్వింది.

"అతను చాలా ఖచ్చితమైన మనిషి. పఖీచంద్ లంచం "

"ఆగండాగండి. లంచం అనేమాట వాడడమెందుకూ?" ఆదషలిలా లేచింది బిడియా. "అలా అనకండి అది మామూలు. బాధల్లో వున్న ప్రయాణికులికి మా ఆయన సహాయం చేస్తాడు అందుకు వాళ్లూ తృణమో పణమో ఇచ్చి కృతజ్ఞత చెప్పుకుంటారు వాళ్ళిచ్చేది—మహా అయితే ఒకరూపాయో—రెండు రూపాయలో—అంతే! అందులో తప్పేముంది? ఇంకొకళ్ళ అదృష్టం చూస్తే సోమ్ సాహెబ్‌గారికి తన్ను కుట్టుంది గాబోలు అందుకే మా ఆయనమీద రిపోర్ట్ చేసాడు "

మాట్లాడకుండా వుండడం వుత్తమం అనుకున్నాడు భువన్‌సోమ్.

"అన్నట్టు మీకు భువన్‌సోమ్ తెలుసా?"

"తెలుసు."

"ఆయన్తో—చెప్పండీ నా పరిస్థితి అతనుగాని మా ఆయనమీద రిపోర్టు రాస్తే—ఉద్యోగం పోతుంది. ఉద్యోగం సద్యోగం లేకుండా వుంటే నన్ను మా వాళ్ళు కాపరానికని అతనిదగ్గరికి పంపరు "

"అలాగే అతన్తో చెప్తాను "

భువన్‌షోమ్ మనస్సులోనే గట్టి నిర్ణయం చేసుకున్నాడు తన విధ్యుక్తధర్మాన్ని మరచిపోకూడదు. రిపోర్ట్ వెంటనే పంపించెయ్యాలి అవును. అంతే.

బిదియా ఏవో బట్టలు తీసుకొచ్చి భువన్‌సోమ్‌కి ఇచ్చింది. "ఆ బట్టలు తీసేసి— ఇవి వేసుకోండి" అంది.

"ఏం."

"ఈ బట్టల్లో వెళ్తే పక్షులు మిమ్మల్ని గుర్తుపట్టి పారిపోతాయి. ఈ బట్టలు వేసు కుంటే—ఏ పొలంలో పనిచేసే రైతో అనుకొని నిర్లక్ష్యంగా వుంటాయి.... నేను కూడా మీతో వస్తాను."

బాగా మాసిన పంచె....కట్టుకున్నాడు. నల్లగా తయారై మురికిపోడుతున్న బనీను తొడుక్కున్నాడు తలకి పెద్ద తలపాగా చుట్టుకున్నాడు....ఇద్దరూ బయల్దేరి నదిఒడ్డుకి వచ్చేరు.

పెద్ద ఇసుకగుట్ట వెనక తుపాకీతో దాక్కున్నాడు భువన్‌సోమ్. వెనగ్గా బిదియా వుంది. ఇసుకగుట్టకి దగ్గర్లోనే బోలెడన్ని పక్షులు నేలమీద గుంపులు గుంపులుగా వున్నాయి. కొంగలు, కాకులు, పావురాలు, చిలకబాతులు....ఎన్నో!!!

వాటికేసి చాలాసేపు దీక్షగా చూశాడు సోమ్. కాసేపయ్యాక తుపాకీ తీసుకొని, గురిచేసి వరసగా రెండుసార్లు పేల్చేడు.

పెద్దగా గోలచేస్తూ పక్షులన్నీ గాల్లోకి ఎగిరేయి. బిదియా పరుగెత్తుకుంటూ అటు వెళ్ళింది.

ఒక్క పక్షిఅయినా నేల రాలలేదు!

# 6

దాదాపు ఒకగంట గడిచింది. గంగ ఒడ్డున భువన్‌సోమ్ ఒంటరిగా కూర్చుని వున్నాడు. అతని తలమీదవున్న తలపాగా మాసిపోయింది మిగతా బట్టలకికూడా మురికీ బురదా అంటుకున్నాయి. ఇసక తలకీ ఒంటికీ మీసాలమీదా వుంది. వీపుమీద కూడా వుండి గరగరమంటూంది. ఇసక, ఎటుచూసినా ఇసకే, బిదియా చెట్టుకొమ్మలు తీసుకురావడానికి వెళ్ళింది. ఒంటిని చెట్టుకొమ్మల్తోనో ఆకులతోనో కప్పుకొని కాసేపు ఎదురుచూస్తే బాతులు మళ్ళీ తప్పకుండా వస్తాయంటుంది. బిదియా చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు. బాతులు మళ్ళీ వొస్తాయి. అంతలో అతని మనస్సులో ఏదో ఆలోచన దేవినట్టయింది. అకస్మాత్తుగా అతని కళ్ళనుంచి నీళ్ళు కారసాగినై. జీవితంలో ఎట్టి విపత్కర పరిస్థితుల్లోనూ అతని కళ్ళు చెమ్మగిల్లలేదు. తండ్రి చని పోయినప్పుడు ఒక్క కన్నీటి చుక్కయినా కార్చలేదతను. తల్లిగానీ భార్యగానీ

పోయినప్పుడుకూడా ఏడవలేదు. తన అప్పుకిందా, వడ్డీకిందా పిత్రార్జితమైన ఇంటిని బిసవ్‌దాస్ చెల్లు వేసుకున్నపుడుకూడా కళ్ళు తడి కాలేదు. కాని, ఏమైందివాళ? ఒక్క చిలకబాతునైనా సరే కొట్టకపోతే ఏం? తనిప్పుడు ముసలివాడు. ఇంతకు ముందులా తన చెయ్యి తుపాకీని పట్టుకోలేకపోతూంది. పిట్ట గురి తప్పిందంటే—అందులో ఆశ్చర్యం ఏముంది? ఈ ఆలోచనతో చిన్నపిల్లాడిలా ఏడవసాగేడు. ఎందుకని బిదియా అడిగితే కళ్ళల్లో నలక పడిందని అబద్ధమాడేడు. కాని, అది అబద్ధమని గ్రహించలేనంత అమాయకురాలా ఆమె? నోరు తెరుచుకుని కొద్ది క్షణాలపాటు అతని ముఖంలోకి చూసింది. మనస్సులో ఏదో నెమ్మదిగా గొణుక్కుని అక్కడ్నించి వెళ్ళిపోయింది. కాస్త దూరం వెళ్ళి "మీరిక్కడే వుండండి. నేను కొన్ని కొమ్మలూ అవి తీసుకువస్తాను. పక్షులుకూడా మళ్ళీ వొస్తాయి. ఈసారి మీకొకటైనా దొరక్కపోదు." అంది.

తప్పదు ఒక్క పక్షయినా కొట్టందీ తను వెనక్కి మళ్ళలేడు.

ఎదురుగావున్న పచ్చని ఇసుకతిన్నెల్ని చూశాడు. తన జీవితంలాగే ఓ ఎడారిలా వుందా ప్రాంతం. ఒక్క ప్రాణికూడా అక్కడ తిరుగాడటంలేదు. ఒక్క ఒయాసిస్సూ లేని ఎడారి; కనీసం ఎండమావి అయినా కానరాని ఇసుకదారి తనది! ప్చ్. ఫర్వాలేదు. ఒచ్చే జన్మకైనా ఆ భాగ్యం దక్కితే చాలు

అంతలో చెట్టుకొమ్మల్తో సహా బిదియా వచ్చేసింది. పరుగెత్తినట్టుంది. వూరికే ఆయాసపడిపోతూంది

"అల్లక్కడ రెండు చిలకబాతులు చూశాను. త్వరగా కానీండి. త్వరగా."

ఆ మాటలంటూనే ఆమె ఆ కొమ్మల్ని—భువన్‌సోమ్ తలకీ చేతులకీ కాళ్ళకీ—తాళ్ళతో కట్టెయ్యసాగింది. "మీ తుపాకీని పైకి కన్పించకుండా కొమ్మల్లో దాచెయ్యండి. దాంట్లో మళ్ళీ గుళ్ళు దట్టించేరా?" అంది.

"వూఁ"

"అటూ ఇటూ కదలకుండా నిశ్చలంగా నిలబడండి. బాతులు ఇటే వస్తున్నాయి. కదలొద్దు నేనల్లా పొలంలో దాక్కుంటాను."

భువన్‌సోమ్ ఆమె చెప్పినట్టే నిలబడ్డాడు. అతనిచుట్టూ కొమ్మలున్నాయి. అయిదు నిమషాలు, పది నిమషాలు, పదిహేను నిమషాలు గడిచాయి. తల కాస్తయినా కదల్చకుండా రిస్ట్‌వాచ్‌కేసి చూశాడు. మరో అయిదు నిమషాలు దొర్లిపోయాయి. అలాగే కదలకుండా నిలబడ్డాడు, అని వొచ్చి తీర్తాయి. బిదియా చెప్పినట్టు అవి ఇటు రాకతప్పదు.

“కకకా....ఆ....ఆ....”

ఆ అదుగో. అతని శరీరంలో ఉత్సుకత మెరుపులా పాకింది....అయ్యో.... పక్షులు కేకెయ్యడం ఆపేశాయేం? మళ్ళీ ఎక్కడికి పోయాయి చెప్మా? తల తిప్పి వాటిని చూద్దామను కున్నాడు. కాని. బిదియా ఏం చెప్పింది? అంచేత తల తిప్ప డానికి సాహసించ లేకపోయాడు. తనని ఆ పొలంలో దాక్కున్న బిదియా గమ నిస్తూనే వుంటుంది.

“కా....ఆ....ఆఁ....”

ఎన్నున్నాయవి? చాలా పక్షులే వున్నట్టున్నాయి. వూపిరి బిగపట్టి విన్నాడు.

“కా....ఆ....ఆ....క....ఆ....ఆ”

సరిగా అతని ముందే రెండు చిలకబాతులు నేలమీద వాలేయి. చాలా దగ్గరగా. కాసేపు ఆగేడు సోమ్. ఒకటి రెండు నిమషాలు వరకూ తుపాకీ పేల్చకూడదు. మరి కాసేపాగి తుపాకీ తీసేడు. రెండుక్షణాల తర్వాత ట్రిగ్గర్ లాగేడు.

హఠాత్తుగా రెండు పక్షులూ గాల్లోకి ఎగిరాయి.

స్థాణువులా నిలబడిపోయాడు భువన్ సోమ్.

“ఆఁ....రాలింది. ఒకటి పడింది” అంటూ కేకలేస్తూ పరుగెత్తింది బిదియా.

“పడిందా? ఎక్కడ? ఎక్కడ?”

రెండు పక్షులూ గాల్లోకి ఎగరడం చూశాడు తను. మరి. ఒకటి రాలింది అంటోం దేమిటి బిదియా? అసలు బిదియా ఏదీ? కనిపించటం లేదేం?

అదిగో....బిదియా వస్తోంది. ఆమె చేతుల్లో తప తప కొట్టుకుంటున్న చిలక బాతుంది.

“ఇదుగో తీసుకోండి. దీనికాలికి చిన్నదెబ్బ తగిలింది. భయంతో నేలమీద పడి పోయింది. అంతే. బతికేవుంది. చూశారా. మీ పందెమూ నెగ్గింది. పక్షిచావలేదు? దీన్ని పెంచండి మీరు. మీకు తెలుసుగా....ఏం? ఏం?” అందామె గల గలా.

ఏం మాట్లాడానికీ భువన్‌సోమ్‌కి తోచలేదు.

ఇంతలో పక్కనున్న పొలంలోంచి ఇద్దరు మనుషులు వచ్చేరు. ఒకతను పక్షి కాళ్ళు దారుతో కట్టేశాడు. చేత్తో పట్టుకుందికి వీలుగా చిన్న దారుకట్టేడు.

అనక భువన్‌సోమ్ చతుర్భుజ్ గోప్ ఇంటికి దారితీసేడు. చేతులో పక్షి వేళ్ళాడు తోంది.

బిదియా అతన్ని అనుసరించింది.

“మీరిప్పుడే వెళ్ళిపోవాలా?”




"ఆవును, రెండయిందిప్పుడు. వెళ్ళిపోవాలి"

"ఏమన్నా తింటారా?"

"ఊహూఁ వొద్దు"

మఖ్బూర్ బట్టల్నివిడిచి తన దుస్తులు ధరించేడు. ఒంటినిండా ఇసకే. సందేహిస్తూనే జేబులోని పర్సుతీసి అందులోంచి ఓ అయిదు రూపాయల నోటుతీశాడు భువన్‌షోమ్

"నీకోసం—ఏమైనా కొనుక్కోదీన్తో" అన్నాడు.

"బాబ్బా మీ దగ్గర్నుంచి డబ్బు తీసుకోవడమా?"

"తీసుకో ఫర్వాలేదు"

"మా యింటికొచ్చిన అతిథుల దగ్గర్నుంచి అలా డబ్బు తీసుకోం. అలా ఇవ్వొద్దు మీరు" అందామె దృఢంగా

మరింకే మనగలడు అతను? ఏం చేయాలో తోచక కొన్ని నిమిషాలు అలాగే నిలబడి పోయాడు. తర్వాత తుపాకిని భుజానికి ఆన్చి ఇలా అన్నాడు—"సరే—నేనికపోతాను మీవాళ్లు ఇద్దరు ఈ చుట్టలు కావాలన్నారు. వాళ్ళకివి ఇచ్చెయ్యి. నీకెంతో కృతజ్ఞుడిని. నువ్వెప్పుడూ గుర్తుంటావు నాకు!"

పక్షిని కూడా చేతిలోకి తీసుకున్నాడు.

"గుడ్‌బై ..వెళ్ళొస్తానూ!!"

బిదియా అతనికి పాదాభివందనం చేసింది. లేచి, "మళ్ళీ ఇటువేపు రండి " అంది.

"అలాగే .."

భువన్‌సోమ్ అడుగెయ్య బోయాడు

"చూడండి "

సోమ్ ఆగేడు.

"మీకు సోమ్‌సాహెబ్ కన్పిస్తే మా ఆయన గురించి కాస్త చెప్పండి అతని ఉద్యోగం పోకుండా చూడండి "

"అలాగే చేస్తా కాని మీ ఆయన లంచం తీసుకున్నట్టు బుజువైతే మాత్రం సోమ్‌బాబు మాత్రం ఏం చేస్తాడు? ఆయనకి ఒక ఉద్యోగం వుందిగా "

భువన్‌సోమ్ గంగ గట్టుమీద వున్నాడు భుజంమీద తుపాకీ వుంది. చేతిలో దెబ్బ తిన్న పక్షి వుంది

బిదియా గంగ రాకముందే ఆగిపోయి....నడుస్తూన్న భువన్‌ని చూడసాగింది.

బాగా అలసిపోయాడు భువన్. తనెటు వెళ్తున్నాడో—ఎలా వెళ్ళాలో అన్న ఆలోచనేనా లేకుండా అనాసక్తంగా నడవసాగేడు.

"కా ఆ ఆఁ "

ఉలిక్కిపడ్డాడు భువన్‌సోమ్

అతని తలమీద ఓ చిలకబాతు ఆకాశంలో ఎగురుతూంది. బహుశా తన చేతిలో వున్న పక్షికి జతపక్షి కాదుగదా! నడక ప్రారంభించేడు

"కా ఆ ఆ ఆ! కా ఆ ఆ ఆ! క్వా ఆ ఆ ఆ "

తనముందు—తలమీదుగా ఎగుర్తోంది. చేతిలోవున్న పక్షిని నేలమీద పెట్టి తుపాకీని లోడ్ చేశాడు. దీన్ని కూడా కొట్టాలి. గురిచేసి తుపాకీ పేల్చేడు గురి తప్పింది. అయినాసరే పక్షి అక్కడ సున్నాలు చుట్టూ ఎగురుతోంది మళ్ళీ తుపాకీ పేల్చేడు ఈసారి కూడా గుండు తగల్లేదు

"పోనీ—" అనుకుంటూ నేలమీది పక్షిని చేతిలోకి తీసుకుని, తుపాకీని భుజాన పెట్టుకుని, మళ్ళీ నడక ప్రారంభించాడు. నాలుగడుగులు అయినా పూర్తిగా వెయ్యలేదు మళ్ళీ

"కా ఆ ఆ ఆ క్వ ఆ ఆ ఆ "

చేతిలోవున్న పక్షి కట్లిప్పుకోడానికి ఓసారి ప్రయత్నించింది భువన్‌సోమ్ పెద్ద పెద్ద అంగలు వేయసాగేడు పరుగెత్తినట్టే నడవసాగాడు. దగ్గరే ఓ ఎత్తయిన గట్టుంటే అక్కడ కాసేపు కూర్చుందామనిపించి కూర్చున్నాడు.




"కా. కా ఆ . ఆ . కా ఆ ఆ"

సోమ్ జేబులో చెయ్యిపెట్టి తడిమేడు ఇంకా గుళ్ళున్నాయి కాని ఎంచేతో ఈ పక్షిని చంపాలనిపించటల్లేదు. అది ఊరకే అతని తలమీదుగా ఆకాశంలో గింగిరాలు తిరుగుతూ వెర్రిగా అరుస్తోంది.

"కా కా క్ ఆ ఆ"

కాస్తదూరంలో నది ఒడ్డున బఖన్‌గోప్ పడవని చూశాడు కాని అక్కడెవరూ లేరు నడవడానికే నిశ్చయించుకున్నాడు. లేచి, మళ్ళీ నడక ప్రారంభించేడు.

"క్ ఆ ఆ . కా కా ఆ ఆ ఆ."

ఆకాశంలో పక్షి కూడా అతన్తోటాటే వస్తోంది. ఇలా యింటివరకూ కూడా వస్తుందా ఏం ఇది? ఏం న్యూసెన్స్? తలెత్తి చూడకుండా నడవసాగేడు పక్షి కూడా అతన్నే అనుసరించ సాగింది.

"క్ ఆ ఆ కా ...కా ఆ ఆ ఆ"

అలా ఓ గంట గడిచింది ఆ పక్షి అలా అతన్నే అంటిపెట్టుకుని వస్తోంది.

మెరుపులా ఓ ఆలోచన అతని బుర్రలో మెరిసింది.

భువన్‌సోమ్ కవీకాదు, భావుకుడూకాదు కాని ఆ ఆలోచన అంత చక్కగా స్ఫురించడం అతనికే ఆశ్చర్యకరంగా ఉంది. తన చేతిలో దెబ్బతిని పడివున్న పక్షి సకీచంద్ లాగానూ, తనని అనుసరించి ఆకాశంలో ఎగురుకుంటూ వస్తోన్న పక్షి బిడియాలాగానూ అనిపించింది.

"కా....అ .అ కా అ...అ....అ...."

ఆ పక్షి తన దయకోసం వేడుకుంటున్నట్టుంది. "అతన్నొదిలెయ్" "అతన్నొదిలెయ్" అని ప్రార్థిస్తున్నట్టుంది. అంతలో అతనికి వైదేహి అన్న మాటలు గుర్తొచ్చేయి. "అతనికీ ఉద్యోగంపోతే—నన్ను మా వాళ్ళు కాపరానికి పంపరు...!"

తాళ్ళతో కట్టివేయబడిన పక్షి పూరికే గింజుకుంటోంది. భువన్‌సోమ్ చేతుల్లోంచి ఎగిరిపోదామని ప్రయత్నం చేస్తోంది.

కాసేపు దీర్ఘంగా ఆలోచించేడు భువన్‌సోమ్ దగ్గర్లో గడ్డి కోసుకుంటోన్న కుర్రాడిని రమ్మని కేకేశాడు. అతని వద్దనున్న కత్తితో తనచేతిలోని పక్షికున్న తాళ్ళని కోసేయించి దాన్ని ఆకాశంలోకి ఎగరేశాడు. క్షణంలో ఈ పక్షి ఆకాశంలో ఎగురుతోన్న పక్షిని కలుసుకుంది రెండూ ఆనందంగా కేకలేస్తో ఎగురుకుంటూ పోయాయి.

అవి కనుమరుగయ్యేవరకూ వాటినే చూస్తూ నిలుచున్నాడు భువన్‌సోమ్.

# 7

బోటు ఇవాళకూడా ఆలస్యమే!

బంకింబాబు రాసిన నవలని చదువుకుంటూ కూర్చున్నాడు సఖీచంద్. ఆ నవల దుర్గేశనందిని తన భార్య వైదేహిని నవల్లోని ఆయేషా, తిలోత్తమల్లో ఎవరితో పోల్చడమా అని ఆలోచిస్తున్నాడు సఖీచంద్.

"సఖీచంద్ బాబూ, అయ్యగారొస్తున్నారు " పాయింట్స్‌మన్ వాసుదేవ్ కేక అతని పగటికలల్ని భగ్నంచేసింది.

"అయ్యగారా ఏ అయ్యగారు?"

ఈలోగా రానేవచ్చాడు భువన్‌సోమ్. వస్తూనే వాసుదేవ్‌వంక తిరిగి, వెళ్ళిపొమ్మని సైగచేశాడు

వాసుదేవ్ వెళ్ళిపోగానే "నీ ఇంట్లో తులసిమొక్క వుందా?" అని ప్రశ్నించేడు భువన్‌సోమ్.

"తులసిమొక్కా? లేదు, సార్."

"నాక్కొన్ని ఆకులు కావాలి."

"బోసుబాబుగారింట తులసిమొక్క వున్నట్టుంది. తెమ్మన్నారా?"

"ఊఁ"

సఖీచంద్ పరుగెత్తేడు. భువన్‌సోమ్ కుర్చీలో కూర్చొని తాపీగా కాళ్ళాడింప సాగేడు. మరికొన్ని నిమిషాల్లో చేతిలో తులసిదళాల్తో సఖీచంద్ వచ్చాడు.

"కాగితంలో కట్టమన్నారా?"

"వద్దు. ఆ కుండలో నీరు ఏ నీరు?"

"గంగానది నీరు, సార్."

"ఆ గ్లాసులో కొన్ని నీళ్లు పొయ్యి."

సఖీచంద్ ఆశ్చర్యం ఎక్కువ కాసాగింది. కాని, ప్రశ్నించే ధైర్యం చెయ్యలేక పోయాడు. ఓ గ్లాసులో ఆ పవిత్రజలాన్ని ఒంపాడు.

"ఆ తులసిదళాలుకూడా ఆ నీళ్లలో వెయ్యి. ఇదుగో ఈ రాగినాణెంకూడా?" అంటూ జేబులోని రాగినాణెం తీసిచ్చేడు

"చూడు. ఆ పవిత్ర గంగాజలం వున్న నీటిమీద చెయ్యివేసి ప్రమాణం చెయ్యి. మరింక ఎన్నడూ లంచం అనేది పుచ్చుకోనని ఒట్టు వెయ్యి. ఏంటలా చూస్తావ్? ఆ కానీ! నేను చెప్పినట్టు చెయ్యి ప్రమాణం చెయ్. సరిగ్గా మూడుసార్లు చెప్పు. 'మరింక ఎప్పుడూ లంచం తీసుకోను!' కమాన్, మాటాడు."

అతను చెప్పినట్టు చెయ్యక తప్పలేదు సఖీచంద్‌కి.

"ప్రమాణం విషయం బాగా గుర్తుపెట్టుకో. ఈసారికి, పోనీ అని నిన్ను వదిలేస్తున్నాను ఇంకో పనికూడా చెయ్యాలి నువ్వు నేనీ స్టీమర్లో వెళ్ళిపోతున్నానని ఆవిల్‌బాబుకి చెప్పు ఇవాళ రాత్రిలోగా అతనికి ఈ కబురెళ్ళాలి ఏం?"

"అలాగే సార్, నా డ్యూటీ అయిపోగానే వెళ్ళి చెప్తాను"

"ఆ—నేనో చిలకబాతుని కొట్టేనని అతనికి చెప్పు."

"అలాగే సర్!"

భువన్‌సోమ్ లేచి బయటికి నడిచేడు. లాంతర్‌ని పట్టుకొని అతని వెనకే వెళ్ళబోయేడు సఖీచంద్. అతన్ని వారిస్తూ "అక్కర్లేదు. నేనిలా పోగల్ను" అని జెట్టీవేపు నడక ప్రారంభించేడు.

పదిహేనురోజుల తర్వాత పోస్టుమేన్ జుకూ ఓ ఉత్తరంగు కవర్ని శ్రీమతి వైదేహీ జాదవ్‌కి యిచ్చాడు. ఆ ఉత్తరంలోని విషయాలన్నీ ఇక్కడ ఉటంకించడం సాధ్యంకాదు. అది ఆరుపేజీల ఉత్తరం.

ఈ కధకి సంబంధించిన ఓ చిన్న భాగంమాత్రం ఇక్కడ ఉదహరించబడుతున్నది.

"వేవీ, నీకో శుభవార్త. నామీద రాసిన రిపోర్ట్‌ని భువన్‌సోమ్ పైకి పంపలేదు. నా కిప్పుడు సాహెబ్‌గంజ్ ట్రాన్స్‌ఫర్ చేశారు. బ్రహ్మాండమయిన స్టేషన్లే అది! మామూళ్ల సంగతింక మరి అడక్కు రెండు చేతులా ."

---

# మే నెల భావపరిచయ పోటీ




## బహుమతి పొందిన వ్యాఖ్య

తే॥గీ॥ సఖియచేఁ గాచెఁ దన్నులు సత్యప్రియుఁడు
సిగ్గుపడలేదు గంగను శివుడు మోయ
సరకులను మోయ సిగ్గేల సర్వమెరిగి
సిగ్గుపడుటయె మరిసిగ్గు చిన్నబోకు.

—మరడాన నారన్నాయుడు. పెదపెంకి.

వీరికి రూ 10/- పంపబడును

# ప్రశంసించదగిన వ్యాఖ్యలు

ఆ॥వె॥ నగలమోజుతోడ నడివీధి నిలిచిన
ఆమె తలపు తెలిసి అతడు క్రుంగె
అణుయుగాన కూడ అతివలు మారరా?
తరుణి నగలపిచ్చి తగ్గుటెపుడు

—కొమ్మూరి నారాయణరావు, చింతపల్లి.

కం॥ హరి భరియించెను రొమ్మున
హరుడో తనువిచ్చె సగము, అజుడున్ జిహ్వం
దరుణిని దాల్చెను విధిగా
"భరియించెడు వాడు భర్తవాచ్యండగుటన్"

—వి. సత్యనారాయణ, జిన్నూరు

ఆ॥వె॥ కట్నమిచ్చి కొన్న కాంతుడు కాబోలు
ఆజ్ఞ మీరలేని అధముడయ్యె
యింట బయట కూడ యింతికి సేవలు
సలుపుచుండు నట్టి సాధుజీవి?

—ఇందబాల, కర్నూలు

ఆ॥వె॥ తళుకుబెళుకు చూచి తబ్బిబ్బు పడిపోయి
భార్య దాసుడైన భర్త బ్రతుకు
ఆడుదాని వెనుక గాడిదమోతరా,
విశ్వదాభిరామ వినురవేమ'

—ఎ వి. రమణ. బి. ఎ. పిఠాపురం

కం॥ ఇమ్ముగ దాచిన పైకము
గమ్మత్తుగ నాతిచేత ఖర్చయిపోవ—
దిమ్మెక్కెను తల, లోఖే
దమ్మ. బయట సరకుమోత, దాపురమయ్యెన్.

—బద్దెపూడి రాధాకృష్ణమూర్తి. గుంటూరు.

వీరికి మే నెల యువ సంచిక పంపబడును.

# [illegible]

విజయ

ఆ బిడ్స్ అంతా మనుషులతో, కార్లు, బస్‌లు ఆటోలతో హడావిడిగా ఉంది. అది స్కూళ్ళకు ఆఫీసులకు పోయే సమయం అని కాబోలు బస్‌లన్నీ పిల్లలతో, కాలేజీలకు పోయే విద్యార్థులతో ఆఫీసులకు పోయే వ్యక్తులతో క్రిక్కిరిసి ఉన్నాయి. బషీర్‌బాగ్‌నుంచి శ్రీరాం కారును ఆబిడ్స్ గుండా పోనిచ్చాడు. కారు స్లో చేసి టాయిస్ ఎంపోరియం ముందు కారాపాడు కారు లాక్ చేసి చుట్టూ పరికిస్తూ లోపలికి పోయాడు. టాయిస్ ఎంపోరియంలో రకరకాల సైజుల్లోని బొమ్మలు ఆకర్షణీయమైన రంగుల్లో మెరుస్తూ పిల్లల్నే కాకుండా పెద్ద మనుషుల్ని ఆకట్టుకున్నాయి. శ్రీరాంను చూడగానే ఖరీదయిన మనిషని పసిగట్టిన షాపు యజమాని అతన్ని మర్యాదగా లోపలికి ఆహ్వానించాడు. చుట్టూ చూస్తున్న శ్రీరాం దృష్టి గోడలకున్న పెయింటింగ్‌లపై పడింది. అందులో ఒకటి ఏదో ప్రత్యేకత చూపిస్తోంది. సంధ్యా సమయంలో ఏటివడ్డున చెట్టు క్రింద బిందె పట్టుకొని సంధ్యారుణ కాంతులతో లీనమైన మేనిరంగున్న అందమైన యువతి కూర్చుని పరధ్యానంగా ఆలోచిస్తూంది. చెక్కిట చేయి చేర్చిన ఆ భంగిమ ఆలోచనా భారంతో సోలిపోయిన విశాలనయనాలు. తీర్చిదిద్దిన ఆ అవయవ సొంపు చాలా బాగున్నాయి. ఆమె అంతే. పరధ్యానంగా ఉన్నప్పుడు ఇలాగే ఉండేది. ఆమె కూడా పెయింటర్. మనుషుల బొమ్మల్ని గీయక పోయినా ప్రకృతి దృశ్యాలు ఆమె సన్నటి వేళ్ళ స్పర్శతో జీవకళను సంతరించుకునేవి.

"సార్! ఆ పెయింటింగ్ కావాలా?" తదేకంగా ఆ పెయింటింగ్‌ను చూస్తున్న శ్రీరాం అనాలోచితంగా తలూపి అడిగాడు "ఎంత?"

"దాని వెల నూట ఇరవై సార్."

శ్రీరాం మాట్లాడకపోవడం చూసి "అది నిర్మల్ పెయింటింగ్ సార్. అందుకే.. "

"పాక్‌చేయి" అంటూ జేబులోంచి

పర్స్ తీసి నూట ఇరవై లెక్కపెట్టి యిచ్చాడు. సాధారణంగా లాయర్ శ్రీరాం బేరమాడందే ఏ వస్తువూ కొనడు. అది అతని స్వభావం కాని ఈ రోజు అతనికి బేరమాడాలని లేదు త్వరగా దాన్ని తీసుకునిపోయి తన గదిలో తగిలించి దానికెదురుగా కూర్చుని తదేకంగా చూస్తూ ఆలోచించాలనిపించింది. షాపు వాడికి డబ్బిచ్చి బయటపడ్డాడు.

శ్రీరాం ఇల్లు చేరగానే "అంకుల్, అంకుల్" అంటూ పదేళ్ళ రఘు పరుగున వచ్చి శ్రీరాం చేతిలోని ప్యాకెట్ లాక్కుని పాకేజి తీసి చూశాడు. అ వెనకే వచ్చిన తులసి రఘు చేతిలోని పెయింటింగ్ చూసి తెల్లబోయింది.

"ఇదేమిటి అంకుల్ నేను ట్రైన్ తెమ్మంటే ఇవా తెచ్చారు." ఏడుపు మొహం వేశాడు రఘు సోఫాలో కూర్చున్న శ్రీరాం ఉలిక్కి పడ్డాడు

"అరె! అవును. నీకు ట్రైన్ తెస్తామని వెళ్ళాను ఆ సంగతే మరిచి పోయాను"

"రాం! ఈ వయసుకే నీకు మతిమరుపు ఎక్కువవుతోంది" తులసి మందలింపుగా అంది

"లేదక్కా! షాప్‌కు పోగానే ఈ పెయింటింగ్ చూశాను. వెంటనే కొనేసి చక్కావచ్చాను రఘు విషయమే మర్చి పోయాను" నవ్వేశాడు శ్రీరాం పెయింటింగ్ చేతిలోకి తీసుకొని ఏదో పోగొట్టుకున్న వాడిలా ఆతురతతో అతని చూపులు అందులోకి పరుగులిడాయి.

తులసి విసుక్కుని వెళ్ళిపోయింది.

"అంకుల్ ట్రైన్ కావాలి!" ఏడుపు మొదలెట్టాడు రఘు. ఆ రోజు రఘు పుట్టినరోజవడం మూలాన స్కూలుకు పోలేదు

"ఓ కె రఘూ. నడు షాప్‌కు పోదాం నీకేదికావాలో అది తీసుకుందువు గాని నీవెళ్ళి కారులో కూర్చో నేను డబ్బు తెస్తాను" అంటూ మేడమీదికి వెళ్ళాడు శ్రీరాం రఘు ఏడుపు మరచి ఆనందంగా పరుగెత్తాడు.

బీరువాలోంచి డబ్బుతీసి జేబులో పెట్టుకొని యధాలాపంగా బీరువాకున్న అద్దంలోకి చూశాడు "ఈ వయసుకే నీకు మతిమరుపు ఎక్కువవుతోంది" అన్న తులసి మాటలు అతని చెవిలో ప్రతిధ్వనించినట్లనిపించింది చెవులదగ్గర ఒకటీ రెండు వెండి వెంట్రుకలు మెరుస్తున్నాయి

"అక్కయ్య తన్నింకా బాలాకుమారుడనుకొంది కాని నలభై ఐదేళ్ళ వ్యక్తిగా గుర్తించదేం? తలమీద వెంట్రుకలు పలుచపడ్డాయి, మనిషి కాస్త లావయినా వంటిరంగేం మారలేదు అయినా అక్కయ్యకెపుడూ తను చిన్న పిల్లాడిలా కనిపిస్తాడు కాబోలు" నన్నటి చిరునవ్వు అతని పెదాలమీద మెరిసి మాయమయింది. త్వరగా క్రిందకు వచ్చికారు స్టార్ట్‌చేసి



యువ




ఆబిడ్స్ కేసి మళ్ళించాడు. ఐదు నిమిషాల్లో షాపింగ్ ముగించుకుని బయటపడి కారు వేగంగా నడపసాగాడు రఘుతో మాట్లాడుతూ పరధ్యానంగా ఉన్న శ్రీరాం సడన్‌గా బ్రేక్ వేశాడు కీచుమన్న శబ్దంతోపాటు ఒకమ్మాయి కెవ్వుమనడం విని త్వరగా కారు తలుపు తీసి దిగాడు. అది చిన్న సందు అవడంమూలాన మనుషులు అంతగా లేరు కారుక్రింద పడలేదు కాని కారు వేగం విసురుకు ప్రక్కగాపడి రాయి చేతికి గీచుకుపోవడంతో చర్మం లేచిపోయి మోచేయిమీద రక్తం కారుతోంది. ఐదేళ్ళ ఆ పాప భయంతో ఏడుస్తోంది. ఏమయిందో అని హడలిపోయిన అతని మనసు అంతగా దెబ్బ తగలని పాపను చూసి తేలికపడింది

"అరెరె! దెబ్బ తగిలిందా పాపా!"

పెద్ద దెబ్బ తగలని పాపను ఎత్తుకొని కార్లో కూర్చోపెట్టి నలుగురూ రాకముందే ఇంటికి దారితీశాడు.

కారులో పాప ఏడవకుండా చాక్‌లెట్స్ కొనిపెట్టి వాళ్ళ ఫామిలీ డాక్టర్ దగ్గరికి తీసుకునిపోయి డ్రస్సింగ్ చేయించి ఇంటికి వచ్చాడు పాప ఏడుపు మానేసి చాక్‌లెట్స్ చేతిలో పట్టుకుని కొత్త వాతావరణాన్ని పరికిస్తోంది. జరిగినదంతా అక్కయ్యతో చెప్పి పాలు పళ్ళు స్వయంగా తీసుకు వచ్చి కూర్చున్నాడు శ్రీరాం.

చారడేసి కళ్ళతో భయంగా చూస్తున్న పాప శ్రీరాంను చూడగానే "ఇంటికి పోతా" అంది.

"పోదాం అవి తినమ్మా "

"ఉహుం! పరాయివాళ్ళు ఏమిచ్చినా

తీసుకోకూడదని బామ్మ చెప్పింది" ముద్దుగా చెప్తోన్న పాప మాటలకు శ్రీరాం నవ్వాడు.

"నేను పరాయివాడిని కానమ్మా. అంకుల్‌ని కదా తిను" అంటూ నచ్చ చెప్పడంతో ఆ పాప ఆ్టే బెట్టు చేయ కుండా స్వీట్స్ తిని పాలు తాగింది.

"నేను స్కూలుకు పోవాలి" భయంగా అంది పాప.

"ఏ స్కూలమ్మా?"

"రోజరీ కాన్వెంట్" ముద్దుగా చెప్పింది.

"ఇవాళ స్కూలుకు వెళ్ళద్దులే దెబ్బ తగిలిందికదూ! మా ఇంట్లో రఘు ఉన్నాడుగా ఆడుకో. సాయంత్రం మీ ఇంటికి తీసుకుపోతాను"

"ఊహూఁ! బామ్మ స్కూలుకుపోకుంటే కోప్పడుతుంది ఒకరోజు నేను స్కూలుకు పోనని ఏడిస్తే అమ్మ కొట్టింది. బామ్మ ఏమో బజారుకు తీసుకునిపోయి స్వీట్స్ కొనిచ్చి బొమ్మలిచ్చి మా స్కూల్లో వదిలి పెట్టింది."

పరవాలేదు. కల్చర్డ్ బామ్మ ఉంది నీకు అనుకుని నవ్వుకున్నాడు శ్రీరాం.

"మీ అమ్మ ఏమీ అనదా?"

"మమ్మీ ఉండదుగా ఆఫీసుకు పోతుంది."

"మీ బామ్మ ఏమీ అనదులే. నేను మీ ఇంటికి వచ్చి చెప్తాను. నీవు ఆడుకో పాపా!" అంటూ శ్రీరాం కోర్టుకు టైమ్ అవడంతో బయల్దేరాడు.

శ్రీరాం ఇంటికి వచ్చేసరికి పాప నిద్ర పోతోంది. అప్పటికి సాయంత్రం అవ డంతో పాపను లేపాడు. మరీ ఆలస్యం అయితే పాప అమ్మా, నాన్న గాభరా పడతారని త్వరగా పాపను తీసుకు వెళ్ళాడు. దారిలో స్వీట్స్ కొనిచ్చాడు. అతనికి మనసులో గాభరాగా ఉంది వాళ్ళే మంటారో అని. దాష్ అయిన చోట కారాపి పాపనడిగాడు "మీ ఇల్లెక్కడ పాపా?" అని.

"అదిగో ఆ పచ్చమేడ పక్కన" సంతోషంగా చెప్పింది.

"థాంక్‌గాడ్! గుర్తుపట్టింది" అను కుని శ్రీరాం ఆ ఇంటి బయట కారాపాడు. చుట్టూ వున్న పూలచెట్లలో మునిగి పోయింది. తోటమీద ఎంత ఆసక్తి!! అనుకున్నాడు

పాప వస్తువులతో దిగి లోపలికి పరు గెత్తింది "బామ్మా! "బామ్మా" అంటూ.

'భగవంతుడా జరిగింది విని ఆ ముస లావిడ ఎన్ని తిడ్తుందో?" అనుకున్నాడు

"లోపలికి రండి బాబూ! చిన్నమ్మగారి కోసం అమ్మగారు, బాబుగారు ఇస్కూ లుకు పోయింద్రు" పనివాడొకడు వచ్చి చెప్పాడు. ఐదు నిముషాలనంతరం పాప ఎవరో్నా లాక్కురావడంతో శ్రీరాం లేచి నిలబడ్డాడు.

"బామ్మా! ఈయనే బామ్మా. నాకు మందువేయించి, వాళ్ళింటికి తీసుకెళ్ళారు"

పాప మాటలతో ఆమె అతనికేసిచూసింది. అతను నమస్కారం పెట్టి ఆగిపోయాడు. పీలిరంగు వాయిల్‌చీర అదేరంగు జాకెట్టు చెవులమీదుగా వదులుగా జారిన జుట్టు విర్లిప్తంగా ఉన్న సోగకనులు నవ్వీనవ్వని పెదాలతో అతి సాధారణంగా ఉంది. అయినా ఆమెచుట్టూ ఆకర్షణ వుంది. ఆమెకూడా కళ్ళప్పగించింది.

"మీరా!" మొదటిమాట అతనే అన గలిగాడు అమక్షణం వూహల్లో మెదిలే వ్యక్తి ఒక్కసారి ప్రత్యేకమైతే అతను చేతగానివాడిలా నిలబడ్డాడు. ఆమె బొమ్మలా నిలబడింది. అంతలోనే తేరు కుని దగ్గరగా వచ్చి నెమ్మదిగా "కూర్చోండి" అంది శ్రీరాం మంత్ర ముగ్ధుడిలా కూర్చున్నాడు.

"పాప స్కూల్‌నుంచి రాకుంటే వాళ్ళ పేరెంట్స్ స్కూల్‌కు ఫోన్‌చేసారు. పాప స్కూలుకు రాలేదని తెలుసుకుని గాభరాగా కారేసుకుని వెళ్ళారు మీరిలా వచ్చారు ఇంతకీ ఏమయింది?" ఆమె అతి సామాన్యంగా అడుగుతోంది. శ్రీరాం వళ్ళు మండిపోయినట్టనిపించింది. ఇరవై సంవత్సరాలనంతరం కన్పిస్తే ఈమె ఇలాగేనా మాట్లాడేది? ఇప్పుడు పాప సంగతి ఎందుకూ? అన్పించినా నోరు విప్పాడు. జరిగింది టూకీగా చెప్పాడు.

"బామ్మా మరే వాళ్ళబాబు చాలా మంచివాడు మేము బాగా ఆడుకున్నాం." అని పాప మధ్యలో అడ్డొచ్చింది. బాబు పేరు వినగానే ఆమె మొహం ముడుచుకు పోయింది.

"ఈమేనా పాప బామ్మ!! అదిరి పోయాడు శ్రీరాం. ఆమె తలలో ఒక్క తెల్ల వెంట్రుకలేదు. మొహంలో ముడు తలు లేవు. ఇరవై ఏళ్ళ క్రితం కానారా ధించిన సత్యలో ఏమార్పూ లేదు. తన ప్రేమలాగే ఆమె నిశ్చలంగా ఉంది. ఆమెకు నలభై ఏళ్ళంటే ఎవరూ నమ్మరు! కాని తను భరించలేనిది ఆమె బామ్మ కావడం. తనెవరికీ తాతకాలేదు. అసలు ఎవరికీ భర్తేకాలేదు. కాని తనముందే ఆమె మరొకరి సొత్తవుతుందని తన కెందుకు తట్టలేదు? తన మనసెందుకిలా జెలసీతో మండిపోతోంది. ఈమెనెందుకు తన మనసులోంచి చెరుపుకోలేకపోతు న్నాడు? ఎంత నిర్లక్ష్యంగా వుంది. అవును భర్త గొప్పవాడేమో అందుకే మొహం ముడుచుకుని కూర్చుంది తనెప్పుడు పోతాడా అని. ఆ వూహ రాగానే శ్రీరాం చటుక్కున లేచినిలబడి "నేపోతాను" అన్నాడు.

ఆమె నన్నగా నవ్వింది "మీ శ్రీమతి కోప్పడుతుందా? జస్ట్ టెన్‌మినిట్ కూర్చోండి కాఫీ తెస్తాను" అంటూ లోపలి కెళ్ళిపోయింది

శ్రీరాం దవడలు బిగుసుకున్నాయి. "సత్యా! నేను నీ అంత నమ్మకద్రోహిని కాను." అనుకుని కూర్చున్నాడు. ఆమె కాఫీ ఇవ్వగానే అందుకుంటూ "అనవన

రంగా శ్రమపడ్డారు" అన్నాడు. ఆమె అతని కళ్ళల్లోకి సూటిగాచూసి పూరుకుంది.

"చాలారోజులకి కన్పించారు" శ్రీరాం కంఠం కొంచెం వణికింది.

"అసలు మిమ్మల్ని చూస్తాననుకోలేదు."

శ్రీరాంమొహం ఎర్రబడింది. అవును తనెందుకు గుర్తుంటాడు? ఆమె తన సంసార సాగరంలో మునిగిఉంది ఇప్పటివరకూ ఆమెను మనసులో నిల్పుకుని ఆమె నిరీక్షణలో కాలం గడుపుకున్నాడని తెలిస్తే హేళనగా నవ్వుతుంది కాబోలు.

"కాఫీ తాగండి" ఆమె గుర్తు చేసేసరికి వద్దనలేక శ్రీరాం తాగాడు. తెల్లటి మొహానికి వెడల్పాటి కుంకుమ వన్నె తెస్తోంది. ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. మెడలో మంగళసూత్రం గొలుసుకాబోలు తళుక్కు మంటోంది. అతని చూపులతో కలిసిన ఆమెచూపులు క్రిందకు వాలిపోయాయి. అదిగ్రహించిన శ్రీరాం సర్దుకున్నాడు.

"మీ అన్నయ్య వాళ్ళంతా ఎక్కడున్నారు?" అని ప్రశ్నించాడు.

"అన్నయ్యవాళ్ళు రాజమండ్రిలో ఉన్నారు" అని ఆమె ఇంకా అతనేమయినా ప్రశ్నిస్తాడేమో జవాబివ్వాలన్నట్లు శ్రీరాం మొహంలోకి చూస్తోంది.

"ఇంట్లో ఎవరూ లేనట్లుంది?" అన్నాడు. మనసులో అడగాలనుకున్నది ఉండిపోయింది.

"ఉహుం! బయటికెళ్ళారంతా మీరుండేది ఎక్కడ?"

"ఇక్కడే సెటిల్ అయ్యాం. ఇది గొండి నా అడ్రస్" శ్రీరాం అడ్రస్ రాసిచ్చాడు ఆమె దాన్ని చూడకుండానే ప్రక్కకు పెట్టింది. అతను మనసులో ఉడుక్కున్నాడు. ఇంతలో పాపవచ్చింది. "బామ్మా! మమ్మీ ఎప్పుడొస్తుంది?"

'కాసేపట్లో వస్తుంది. నీవెళ్ళి ఆడుకోమ్మా.'' అని బుజ్జగించింది.

"మీరు చాలా త్వరగా బామ్మయిపోయారే?"

శ్రీరాం ప్రశ్న ఆమెకు వెక్కిరింతగా తోచింది. "ఏం మీరింకా తాతకాలేదా?" అని ఎదురు ప్రశ్నవేసింది. శ్రీరాం నవ్వాడు. ఆనవ్వులో ఏదో వెలితి కనబడుతోంది.

"ఆ అదృష్టం నాకు పట్టలేదు." శ్రీరాం ఉన్నట్టుండి లేచాడు.

"సరె నే వెళ్తాను."

"ఎప్పుడయినా మీ శ్రీమతిని తీసుకుని రండి" ఆమె చాలా నెమ్మదిగా అడిగింది. శ్రీరాం పకపకానవ్వాడు. "ఆ అదృష్టములేదు. ఆవిడకు ఘోషా." అంటూ బయటికి నడిచాడు. వెళ్తూ వెనుదిరిగి ఆమెకు నమస్కారంచేసి "ఎప్పుడయినా మీ శ్రీవారితో మా గృహం పావనం చేయండి" అంటూ వెళ్ళిపోయాడు.




శ్రీరాం అతని కారు వెళ్ళిపోయిన ఐదు నిముషాలవరకూ ఆమె కిటికీదగ్గరే నిల బడింది గాలి తీవ్రంగా వీస్తోంది. సత్యా దేవి రోడ్డుకేసి చూస్తోంది అది కంటికి కనిపించి నంతమేర చాలా పొడవుంది. తన జీవితంలాగే తన జీవిత గమ్యంలో తను మూడు వంతులభాగాన్ని అధిగ మించింది ఉన్న కాస్త కాలం తనకు విసుగు పుట్టిస్తోంది ఎందుకీ నిరీక్షణ? ఎవరికోసం? తన నిరీక్షణ ఎంత వ్యర్థ మైనదో తనకు తెలుసు కాని తన మనసును తానే వంచించుకుంది. శ్రీరాం తనకోసం వేచియున్నాడనే నమ్మకం లేకున్నా తన మనసు చంపుకోలేక పోయింది. తనకు తెల్సు ఏనాడో తన జీవితంలో శ్రీరాం తటస్థ పడతాడని తను వంటరిగా మిగిలిపోతుందని!! కాని తను అతనికోసం పిచ్చిదానిలా జీవితాన్ని మోడు చేసుకుంది ఈ సత్యం ఒకనాడు తను తెలుసుకుంటుందని బాధ పడ్తుందని ముందే తెలుసు. తెలిసీ మళ్ళీ ఎదలో ఏదోమూల జెలసీ ముల్లులా గుచ్చుతోంది. అతనికోసం నీ జీవితం పాడు చేసు కున్నావు. నీకోసం ఎవరూ ఏ త్యాగం చేయలేదు నీకెందుకీ తపన? అని మనసు గద్దిస్తుంటే కన్నీరు కార్చటం తప్ప తనేం చేయగలదు?

సత్యాదేవి కిటికీమూసి దాన్ని ఆను కుని కళ్లు మూసుకుంది ఆమె మనసులో ఏదో అలజడి మొదలయింది. తన

హృదయంలో ఎవరూ ఆక్రమించని స్థానాన్ని శ్రీరాం అధిష్టించాడు. అక్కడ్నించి అతన్ని తీసివేయలేక పోతోంది. ఇది తన బలహీనతా? అన్నయ్య స్నేహితుడిగా పరిచయం అయి జీవితంలో మరువలేని వ్యక్తి గా నిలచిపోయాడు. సత్యాదేవి ఆలోచిస్తూ పడుకొంది. ఆమె మెదడులో గతం గిర్రున తిరుగుతోంది.

సత్యాదేవి వాళ్ళ కుటుంబం మరీ సాంప్రదాయ కుటుంబం కాదు. అందరూ చదువుకునే వాళ్ళుండి కాబోలు ఆడపిల్లలకు కూడా స్వేచ్ఛా స్వాతంత్ర్యము ఉండేవి. సత్యకడుపు ఇరవై ఏళ్ళు నిండలేదు. బి. ఏ ప్యాసయి ఇంట్లో కూర్చుని ఉండేది. ఉబుసుపోక పెయింటింగ్ నేర్చుకుని బొమ్మలు వేస్తూ వంటరితనాన్ని మరచిపోయేది. ఆరోజుల్లోనే శ్రీరాంతో పరిచయం కలిగిందామెకు. శ్రీరాం లా కాలేజిలో చదువుతుండేవాడు. సత్య అన్న చంద్రంకు క్లాస్‌మేట్ అవడంతో ప్రతి రోజూ సాయంత్రం హాస్టల్‌నుంచి సత్య వాళ్ళింటికి వచ్చేవాడు. చంద్రం అతను కలిపి ఒక్కోరోజు కార్డ్స్ ఆడేవారు లేదా షికారెళ్ళేవారు. శ్రీరాంకు సత్యను పరిచయం చేసాడొకరోజు చంద్రం.

ఒకరోజు మామూలుగా శ్రీరాం వచ్చే టైముకి చంద్రంలేడు. సత్యముందు గదిలో కూర్చునిపెయింట్ చేస్తోంది. వెనకనుంచి ఆమెను చూసిన శ్రీరాం గుమ్మంలోనే ఆగిపోయాడు. నైపుణ్యం కల శిల్పిచెక్కిన శిల్పంలాగుంది ఆమె గుమ్మం దగ్గర అలికిడి విన్న సత్య తల తిప్పి చూసింది. శ్రీరాం రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు. జీవం పోసుకున్న పాలరాతి బొమ్మలా ఉంది సత్య

"అరె! అక్కడే నిలబడి ఉన్నారే. లోపలికి రండి" అంది బ్రష్‌ను పక్కకు పెడ్తూ.

"అక్కడ నిలబడి ఏమిటి దీక్షగా చూస్తున్నారు."

"చక్కటి శిల్పాన్ని!"

సత్య అందమైన పలువరస ఆమె నవ్వులో తళుక్కుమంది.

"ఇది పెయింటింగ్ శిల్పంకాదు!" తప్పు సరిదిద్దింది.

"కాదు! నే చూసేది బ్రహ్మచేసిన సజీవశిల్పాన్ని"

సత్య ఉలిక్కిపడి తలెత్తి కళ్ళు పెద్దవిచేసి చూసింది. అతన్ని అంత దగ్గరగా చూడ్డం ఆమెకు అదే ప్రథమం. తీక్షణంగా చూసే కళ్ళు, నవ్వినట్టుండే పెదాలు, చామనఛాయలో ఉన్నా అతనిలో చాలా ఆకర్షణ ఉంది.

"నిజం! ఈ వాళ మీరు చాలా అందంగా వున్నారు" శ్రీరాం మళ్ళీ చెప్పాడు. సత్య తలదించుకుంది. ఇంత ధైర్యంగా ఆమెనెవరూ ప్రశంసించలేదు. ఆమె మనసు ఏదో తెలీని అనుభూతికి లోనయింది. అంతలో సర్దుకుని చటుక్కున లేచి "ఉండండి! కాఫీ తెస్తాను"



అంటూ లోనికెళ్ళిపోయింది.

ఆమె తెచ్చిన కాఫీ నందుకుని ఆమె కళ్ళల్లోకి చూసాడు శ్రీరాం అతని చూపులకు చిక్కకుండా ఆమె కళ్ళు వాల్చుకుంది.

''చంద్రం ఎక్కడికిపోయాడు'' కాఫీ పూర్తిచేసి క్రిందపెట్టి యధాలాపంగా అడిగాడు శ్రీరాం.

''ఏమండి బయటికి వెళ్లాడు'' అంది పెయింటింగ్ చేతిలోకి తీసుకుని.

''మీరు చాలా బాగా పెయింట్ చేస్తారే?''

''ఏదో ఈమధ్యే నేర్చుకున్నాను'' ముక్తసరిగా జవాబిచ్చింది. ఆ తరువాత సత్య ఏమీ మాట్లాడకుండా పెయింట్ చేయడంలో మునిగిపోయింది. శ్రీరాం కాసేపుండి వెళ్ళిపోయాడు శ్రీరాం ఆ తరువాత వారం రోజులవరకూ రాలేదు.

సత్య మనసులోని ఆలోచనల్లో తరచూ శ్రీరాం వస్తున్నాడు. ఒకరోజు చంద్రం శ్రీరాంను లాక్కురావడం చూసి సత్య ఆశ్చర్యంగా లేచింది.

"చూసావా సత్యా. ఈ మధ్య వీడెంత సోమరవుతున్నాడో. మనింటికి రాక వారం అవుతోంది. ఎందుకని అడిగితే ఏవో సాకులు చెప్పి తప్పుకుంటున్నాడు" అంటూ చంద్రం ఫిర్యాదు చేసాడు.

శ్రీరాం తలదించుకున్నాడు. శ్రీరాంను పరీక్షగా చూస్తూ సత్య చిన్నగా నవ్వింది.

"సత్యా! నేను స్నానం చేసివస్తాకానీ నీవు వీడిని కనిపెట్టుకుని ఉండు. అజాగ్రత్తగా వుంటే పారిపోయేటట్లు ఉంది వీడి వాలకం" చంద్రం తమాషాగా నవ్వి లోపలికి పోయాడు. సత్య కాఫీ తెచ్చి శ్రీరాం కిచ్చింది. ఇద్దరి చూపులు క్షణం కలుసుకున్నాయి. శ్రీరాం చూపులు తిప్పుకున్నాడు.

"మీరెందుకు అన్నయ్యను తప్పించుకు తిరుగుతున్నారు. మీరు మా ఇంటికి రాకూడనంత నేరం మేమేం చేసాం?" సూటిగా వున్న సత్యప్రశ్న అతన్ని కలవర పెట్టినట్లు ఉంది.

"సత్యాదేవి పొరపడ్తున్నారు. నేను రాకపోవడానికి కారణం మీకు తెల్సు. ఆ రోజు మిమ్మల్ని మీ అందాన్ని అభినందించి మీకు బాధ కల్గించినట్లుతోచింది. అందుకే రావడం మానేసాను"

"అలాంటప్పుడు కష్టం కలిగించే పనులు చేయకండి" సత్య చిఱునవ్వుతో అంది. శ్రీరాం క్షణం ఆశ్చర్యంగా చూసాడు "ఉహుఁ! నావల్లకాదు. అందం ఎందులో ఉన్నా అభినందించడం నా పని ఇది నాకు తెలీకుండానే ఒక్కోసారి జరుగుతుంది" అతని మాటలకు సత్య కళ్ళప్పగించింది అతని కళ్ళల్లో నైర్మల్యం తొణికిసలాడుతోంది తన భావన ఎంతసూటిగా చెప్తాడు? సత్య మనసులో ఏదో భావం మెదలగా ఆమె మొహం ఎర్రబడ్డది

"అయితే మేమేం చేయాలి?"

"నా బలహీనత అర్థం చేసుకుని క్షమిస్తుండాలి"

సత్య పకపకా నవ్వేసింది ఆమె కళ్ళల్లో మెరుపులు. ఆ పలువరసలో తళుకులు ఆమెలోని వన్నెలు చూస్తుండిపోయాడు శ్రీరాం.

"సరే! క్షమిస్తుంటాంకానీ మీరెప్పుడూ మా ఇంటికి రావడం మరచిపోకండి" అంది నవ్వాపుకుని. చంద్రం రావడంతో సత్య లోనికెళ్ళింది.

అప్పట్నుంచీ సత్యా. శ్రీరాం తరచూ మాట్లాడుకునేవాళ్ళు. అతనెప్పుడూ ఆమె చిత్రకళను ప్రశంశిస్తూ అవసరమైన సూచనలిస్తూ ఆమె కళను ప్రోత్సహించేవాడే తప్ప మరో అధికప్రసంగం చేసేవాడు కాదు సత్యకు రానురాను అతనంటె ఆసక్తి పెరిగింది. అతను రానిరోజు ఆమెకు తోచేది కాదు

అతడు గంటల తరబడి ఏ విషయం మీదయినాసరే చక్కగా మాట్లాడేవాడు. చంద్రంతో అతను చెప్పే ఖబుర్లన్నీ సత్యా వినేది.

సంవత్సరం గడిచేసరికి చంద్రం లా చదివి ఉద్యోగరీత్యా మెడ్రాస్ వెళ్ళిపోయాడు. అలవాటు ప్రకారం శ్రీరాం రోజూకాకున్నా వారానికొకమారయినా సత్యవాళ్ళింటికి వెళ్ళి పదినిముషా లుండి వెళ్ళిపోయేవాడు. పూర్వపు చనువుతో ఇంట్లోవాళ్ళు అతన్ని అభ్యంతర పెట్టేవాళ్ళు కారు. ఈ మధ్యకాలంలోనే సత్య ఆశలు మొగ్గలు వేయసాగాయి. శ్రీరాం ఆమె పెయింటింగ్స్ పరధ్యానంగా ఆమెను నిశితంగా చూసేవాడు. చురుగ్గా బాకు కంటె పదునుగా ఉండే అతని చూపులు ఆమెను ఇబ్బందిలో పడేసేవి. ఆమె అంతరంగంలో ఎక్కడో తీయని భావం మెదిలేది. ఇన్నాళ్లూ ఆమె ఎరిగిన అతని వ్యక్తిత్వం సత్య మనసులో నిలిచిపోయింది. "తనంటే అతనికి ఇష్టముందా? ఉంటే దాన్నెందుకు చెప్పడు? అతనికి మొహమాటం లేదే!" అని తనలో తాను తర్జన భర్జన పడేది.

శ్రీరాం సత్యవాళ్ళింటికి రావడం పూర్తిగా మానేసాడు. దానిక్కారణం సత్య వాళ్ళక్క పుట్టింటికి రావడం శ్రీరాంతో ఆమె ఒకరోజు మాట్లాడుతూ ప్రస్తుతం చంద్రం లేడుకదా, మరి నీవీ ఇంటికి ఇలా మాటి మాటికీ రావడం బాగులేదు" అనే అర్థం స్ఫురించేటట్లు డొంకతిరుగుడుగా మాట్లాడింది. అంతే శ్రీరాం రావడం మానేసాడు. ఈ సంగతి సత్యకు తెలీదు.

బి. ఎల్. ఫైనల్ ఎగ్జామ్స్ అయిపోయినా శ్రీరాం రాకపోవడంలో సత్య మనసెందుకో కలతబారింది. తనెన్ని వూహించుకుంది. అవన్నీ కల్లలేనా? తన మీద శ్రీరాంకు ఏ అభిప్రాయం లేకుంటే అతని చేష్టలకర్థం ఏమని చెప్పుకోవాలి? అతను రాకుంటే తను వూహించిందంతా పచ్చి అబద్ధం అనే సత్యాన్ని అనుకోడానికే భయపడింది సత్య. మనసులోని భారం తగ్గించుకునేందుకు వూరిమధ్యన విశాలంగా వెలిసిన గుడికెళ్ళింది. కొబ్బరికాయ కొట్టేసి బయటికివచ్చి నిలబడిపోయింది సత్య. ఆమెకెదురుగా మాసిన గడ్డంతో మసిగుడ్డలోని మాణిక్యంలా నిలబడ్డ శ్రీరాం పలకరింపుగా నవ్వాడు. సత్య ఆత్రంగా అతనిదగ్గరికి వచ్చింది.

"ఎగ్జామ్స్ ఎట్లా వ్రాసారు? మా ఇంటికి రాలేదేం?" నిష్ఠూరత ధ్వనించింది సత్య కంఠంలో. శ్రీరాం నవ్వాడు చిన్నగా "అలా తోటలోకి పోదాంరండి" అన్నాడు.

ఇద్దరూ కలిసి తోటలోకూర్చున్నారు. సత్య మనసులో ఉడికిపోతోంది.

"ఇప్పుడు పోట్లాట కానీయండి"

సత్య చురుగ్గా చూపింది కాని అతని వెన్నెలకురిపే నేత్రాలతో పోటీపడని

ఆమె చూపులు వాలిపోయాయి. "పోట్లాట వేసుకునే అవసరం ఏముంది. మీరు పెద్దవాళ్ళయి పోయారు. మీకు మేమెందుకు గుర్తుంటాము?"

"అదేంకాదు మీ అక్కయ్య నన్ను మీ ఇంటికి రావద్దన్నారు."

"ఇంతకుముందు మా అక్కయ్యకు మాటిచ్చారా మా ఇంటికి వస్తానని?"

"లేదు కానీ చంద్రంకోసం వచ్చేవాడిని వాడిక్కడలేదు. మీ అక్కయ్య చెప్పినదాట్లో కూడా కారణం ఉందని తెలిసి మీ ఇంటికి రావడం మానేసాను"

"ఓ! మీకు చాలా దూరదృష్టిఉంది సంతోషం ఇక ఎప్పుడూ మా ఇంటికి రాకండి" సత్యలేచింది.

"సత్యా!" చివాలున సత్యచేయి పట్టుకుని ఆపాడు శ్రీరాం. అతని స్పర్శ ఆమె ఎదలో ఝల్లు మనిపించింది కోటివీణలు మ్రోగినట్టనిపించింది. శ్రీరాం ఆమెను కూర్చోబెట్టాడు

"మీరు కోపంలో చాలా అందంగా ఉంటారు" కొంటెగా నవ్వుతున్న శ్రీరాం కేసి రుసరుసలాడుతూ చూసింది సత్య

"పొగడ్డం మాత్రం వచ్చు. ఏమంటే నా అభిప్రాయం వెల్లడి చేయకూడదా అంటారు మీతో మాట్లాడ్డం కష్టం."

"పోనీ మాట్లాడకండి. మీకేనష్టం. నేను నెక్స్ట్‌వీక్ వూరికెళ్తున్నాను. మీ యింటికి రావాలనే ఉన్నా మీరు గుడికి వెళ్ళడం చూసి మీతో మాట్లాడుదామని ఇలా వచ్చాను. వింటున్నారా?"

సత్య కళ్ళెత్తి చూసింది వింటున్నానన్నట్లుగా

"సత్యా మీకు నా మీద ఏ అభిప్రాయం ఉంది?"

సత్య ఉలిక్కిపడింది. సమయం ఆసన్నమయింది అనుకుంది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి

"మిమ్మల్నే నా మీద మీ కెటువంటి అభిప్రాయం వుంది?" అంటూ రెట్టించాడు. సూటిగా అడగటానికి ఎందుకింత బిడియపడ్తాడు? అనుకుని పైకి తేలిగ్గా నవ్వేస్తూ "ఏం ఎవరయినా కాండక్ట్ సర్టిఫికెట్ అమ్మాయిదగ్గర తీసుకురమ్మన్నారా?" అంది

"నేను సీరియస్‌గా అడుగుతుంటే మీరు జోక్‌గా తీసుకుంటున్నారు" గంభీరంగా చెప్పాడు శ్రీరాం

"మా అన్నయ్య ఫ్రెండ్‌గా మీకు నేను చాలా గౌరవిస్తాను చాలా." అంది

శ్రీరాం మొహంమీద చిరునవ్వు కనిపించింది అంతలోనే సీరియస్ అయిపోయాడు రెండు చేతులు వెనక్కి ఆనించి జారగిలబడ్డాడు అతని కళ్ళు సూటిగా సత్యకేసి చూస్తున్నాయి

"సత్యా! ఇన్నాళ్ళూ ఈ సమయం దొరకలేదు. నేను చెప్పేది శ్రద్ధగా విను ఆలోచించు. నన్నపార్థం మటుకు చేసుకోకు. నిన్ను చూసినప్పటినుంచి నాలో




ఏదో మార్పు వచ్చింది. ఎన్నాళ్ళనుంచో నేను పోగొట్టుకున్న వ్యక్తి నీవనిపించింది నీ కోసమే ఇన్నాళ్ళూ నిరీక్షిస్తున్నాననిపించింది సత్యా ఐ లైక్ యు వెరీమచ్ నీకేం అభ్యంతరం లేకుంటే మనం పెళ్ళి చేసుకుందాం.''

సత్య తలెత్తి మధురంగా నవ్వింది. ''అభ్యంతరం ఉంటే?''

''అబద్ధం. నే కోరిన జవాబు నీ కళ్ళల్లో మెరుస్తోంది మేడమ్'' అంటూ ప్రేమగా సత్యను చేతిలోకి తీసుకున్నాడు ఆమె దేహంలో విద్యుత్తు ప్రవహించి నట్టయింది

ఈ నాజూకైన పెయింట్ చూస్తుంటే నాకు తాకాలనిపించేది ''

''పూ(:'' నవ్వింది సత్య.

ఒక్కసారి శ్రీరాం సత్యను దగ్గరగా లాక్కున్నాడు ''సత్యా ఈ క్షణంకోసం నే నెన్ని కలలుకన్నాను నీ సాన్నిధ్యంలో నా కేసి వద్దనిపించేవి. రోజూకోసారన్నా నిన్ను చూడకుండా ఉండలేక పోయే వాడిని మీ అక్క చెప్పినపుడు నేనెంత బాధపడ్డాను సత్యా నే నంటే నీకు ఇష్టమేనా?''

''రాం: అలా అడగొద్దని చెప్పలేదు. ఈ మధుర క్షణంకోసం ఎంత తపించాను'' అతని షర్టుపైన సత్య ఆనంద భాష్పాలు పడి అతని హృదయంలోకి యింకిపోయాయి. ఎక్కడో అలికిడి అవడంతో సత్య దూరంగా జరిగి కూర్చుంది. పలుచటి చీకటితెర లోకాల్ని కమ్మేసింది.

''సత్యా. నేను నాలుగురోజుల్లో పూరెళ్తున్నాను ఎందుకో తెల్సా నిన్ను శాశ్వతంగా మా ఇంట్లో ఉంచుకునే

ప్రయత్నంకోసం. ఇంటికి వెళ్ళి అమ్మా వాళ్ళను వప్పించాలి. ఆ విషయంలో కొంచెం ఆలస్యం జరిగినా దిగులుపడకు నే వెళ్ళగానే నీకు ఉత్తరం వ్రాస్తాను ''

''ఆలస్యం అవుతుందని ఎందుకను కుంటున్నారు?''

''నాకు పెళ్ళి కావలసిన చెల్లెలుంది ముందా అమ్మాయి పెళ్ళి చేయాలి కదా! మేమా సామాన్య గృహస్థులం నాకు ప్రస్తుతం ఉద్యోగంలేదు ముందు నేను ప్రాక్టీస్ చేయాలి. తరవాతే మన పెళ్ళి వీటన్నిటికీ కొంతకాలం పడ్తుంది మీ యింట్లో నీకే ప్రయత్నాలు చేయకుండా మన సంగతి చెప్పు అదీ వీలుకాకుంటే నాకు వెంటనే లెటర్‌రాయి'' మౌనంగా తలూపింది సత్య

''చీకటిపడింది వెళ్దాం పదండి'' అంటూ సత్య లేవడంతో ఆమె చేతిని అనరాగా తీసుకుని శ్రీరాం లేచాడు

''సత్యాదేవీ! ఒక పొరపాటు జరిగింది ఆవేశంలో నిన్ను అని ఏకవచనంలో పిలిచాను. అభ్యంతరమా?''

''ఊఁ!'' అని చిలిపిగా నవ్వింది సత్య

''అరె సత్యభామాదేవిగారూ!''

''వద్దు. సత్య చాలు '' ఇద్దరూ నవ్వు కున్నారు గుడి ఆవరణదాటి రోడ్డుమీదకు వచ్చారిద్దరూ

అక్కడ్నించి శ్రీరాం సత్యను ఇంటి వరకూ దిగబెట్టి వెళ్ళిపోయాడు. ఆ తరువాత మూడురోజులు ఆమెతో గడి పాడు ఆ మూడుదినాలలో సత్య శ్రీరాంకు అతి సన్నిహితంగా వచ్చింది. ఆరోజు సాయంత్రం ఇద్దరూ గుడికివెళ్లి తిరిగి వస్తున్నారు. ఇద్దరూ విడిపోయేటప్పుడు సత్య కళ్ళల్లో పలుచటి నీటితెర శ్రీరాంకు కన్పించింది

''మీరు త్వరగా అన్నిపనులు పూర్తి చేసుకోండి ఎప్పటికప్పుడు నాకు లెటర్ రాయండి ''

''తప్పకుండా. నిన్నువదిలి నేనెలా ఉండగలను సత్యా నీకో రహస్యం చెప్పనా?'

సత్య ఆశ్చర్యంగా చూసింది.

''నీకోసం మీ అన్నయ్యసాకుతో వచ్చేవాడిని కానీ నేనింత అదృష్టవం తుడినని తెలీదు.''

ప్రేమ పూరితమైన అతనికన్నుల్లోకి చూసిన సత్య బుగ్గలు ఎర్రబడ్డాయి.

''సత్యా! ఇంకోమాట నేను వారం రోజుల్లో తిరిగి వచ్చేస్తాను వచ్చి మీ ఇంట్లో మనసంగతి చెప్తాను నీకై నీవు అడగద్దు ఏమంటావు?''

''అలాగే!'' అంది సత్య ''ఒకవేళ మీరు వారంలోపల రాలేకుంటే ?'' అని ప్రశ్నించిన సత్య చేతిని తన చేతి లోకి తీసుకుని శ్రీరాం నవ్వాడు.

''వచ్చి తీరుతాను. రాలేకుంటే నా మీద నమ్మకం పోగొట్టుకోకు. నీవు లేకుండా నేను బ్రతుకలేను సత్యా. ఇది




విజం యు ప్లీజ్ వెయిట్ ఫర్ మి'' ఆమె చేయినొక్కి ధృఢంగా చెప్పి సత్య ఇల్లురాగానే అతను శెలవు తీసుకున్నాడు గుమ్మందగ్గరే విలబడిపోయి శ్రీరాం వెళ్ళినవంక చూస్తున్న సత్య చెవిలో పదే పదే "నీవు లేకుండా నేను బ్రతుకలేను సత్యా. యు ప్లీజ్ వెయిట్ ఫర్ మి'' అన్న వాక్యాలు విన్పిస్తున్నాయి ఆమె తన్మయత్వంలో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

శ్రీరాం వెళ్ళి వారమవుతున్నా అతని దగ్గర్నించి ఉత్తరం రాలేదు ఏదో రోజు అతని దగ్గర్నించి ఉత్తరం వస్తుందని ఎదురుచూచిన సత్య నిరాశ చెందింది నెలరోజులు గడిచిపోయాయి దినమొక యుగంగా గడుపుతున్న సత్య వాళ్ళ నాన్నకు బదిలీ కావడంలో హడలిపోయింది. గోరుచుట్టుమీద రోకలిపోటులా అయింది ఆమెపని వాళ్ల వూరుమార్చి రెండు నెలలయినా శ్రీరాం దగ్గర్నించి ఉత్తరంకానీ, ఏ సమాచారం కానీ తెలీదు. శ్రీరాంకు ఏమయింది? ఎందుకని ఉత్తరం రాయలేదు? అనే ఆలోచన ఆమె మనసును పురుగులా తొలిచేసేది. ఏదో బలీయమైన కారణం వల్ల అతనివద్దనుండి ఉత్తరం రాలేదు అనుకుని మనసుని సమాధాన పరిచేది "అతని తల్లిదండ్రులు వివాహానికి సమ్మతించలేదేమో? అటు వాళ్ళ మనసు నొప్పించే ధైర్యంలేక తనకు ఉత్తరం వ్రాయలేదేమో'' అనుకున్నపుడు ఆమె మనసు జలదరించేది. సంవత్సరం గడి

చింది. ఆమెకేదో అర్థం అయినా దానిలో విర్లిప్తత అలవరుచుకుంది.

సత్య తల్లిదండ్రులు ఆమెకు పెండ్లి చేయదలచి ఎన్నో సంబంధాలు తెచ్చారు సత్య ఏదీ వప్పుకోలేదు. సంవత్సరం పాటు ఆమె ఆలోచనలు ఆమెనే బాధించేవి. మనోవ్యాధితో జబ్బుపడి మరో ఆర్నెల్లకు కానీ తేరుకోలేక పోయింది. తల్లి ఆమెలోని మార్పుకు కారణమేమని నిలదీసి అడిగినా సత్య జవాబు చెప్పలేదు ఎం. ఎ లో చేరతానంది. అట్టే బలవంతపెట్టకుండా సత్య తల్లిదండ్రులు ఆమెను ఎం. ఎ లో చేర్పించారు. చదువు పూర్తికాగానే సత్య లెక్చరర్ ఉద్యోగంలో చేరింది.

* *

బాగా తెల్లవారిపోయినా బెడ్ మీద నుంచి లేవలేదు శ్రీరాం. ఇరవై ఏళ్ళ తర్వాత సత్యను తను చూసాడు వయసు ఆమెలో పెద్దగా మార్పుతేలేదు. ఆమెను తన జీవితంలో మళ్ళీ చూస్తా దనుకోలేదు. ఎక్కడున్నా ఆమె అయినా సుఖపడితే చాలు అనుకున్నాడు తను కోరినట్టే ఆమె సుఖంగా ఉన్నట్టుంది. శ్రీరాం మనసెందుకో కలుక్కుమంది. "మీ శ్రీమతితో మాఇంటికిరండి" అన్న సత్యమాటలు అతని మనసులో మెదిలి శుష్కంగా నవ్వుకున్నాడు. "నా జీవితంలో నీకుతప్ప అంతటిస్థానం మరెవ్వరికీ లేదు సత్యా!" అనుకున్నాడు.

శ్రీరాం ఏదో గుర్తుకు వచ్చినవాడిలా లేచి బీరువాతెరిచి లాకర్‌తీసి లోపల్నించి ఏదో కవరుతీసి కిటికి దగ్గరనిలబడి చదువుతున్నాడు. పాతపడ్డ ఆ కవర్‌లోని కాగితాలను జాగ్రత్తగా పట్టుకున్నాడు. అది శ్రీరాం తన ఫ్రెండ్‌కు రాసిన ఉత్తరానికి సమాధానం.

"డియర్ రాం!

నీ లెటర్ అందింది. సారీ నీ చెల్లెలు పోయిందని రాసావు. నాకు చాలా బాధవేసింది. చెల్లెలుపెళ్ళికి చాలా తొందరపడేవాడివి. కాని దేవుడు ఇలా చేసాగు కద!

నీవు చంద్రం వాళ్ళ ఫామిలీగురించి అడిగావు. వాళ్లు ట్రాన్స్‌ఫర్ అయిపోయారంట. ఏవూరో కనుక్కుని నీకు రాసేందుకు లేట్ అయిపోయింది. నా ఫ్రెండ్ ఒకడిద్వారా తెలుసుకున్నాను. వాడికి సత్య వాళ్ళు బాగాతెలుసు. ఆమెకు పెండ్లి అయిపోయిందని అత్తగారింటికి వెళ్ళిపోయిందని నాకు చెప్పాడు. ఎంత ప్రయత్నించినా నేను ఇంతకంటె ఎక్కువగా తెలుసుకోలేక పోయాను. సత్యకు ఇక్కడ్నించి ట్రాన్స్‌ఫర్ అయిపోయిన నెలకే పెళ్ళయిందని వాడు విన్నాడుట. ఇదీ సంగతి. త్వరగా లెటర్‌వ్రాయి.

నీ ప్రియమిత్రుడు
రఘు"

ఆ ఉత్తరం అతనిలోని జ్ఞాపకాలను రేపింది. "శెలవులకు వూరెళ్ళాడుతను.




సత్య విషయం ఇంట్లో చెప్పాలని వాళ్ళ అనుమతిపొంది సత్యను పెళ్ళాడాలని కలలు కన్నాడు. పోగానే వూర్లో అప్పటికే బాగా వ్యాపించిన ఫ్లూ అతన్నికూడా పలుకరించింది. ఫ్లూ రావడంతో తను నెలరోజులవరకూ లేవలేకపోయాడు ఏదో తెలీని నీరసం ఆవరించి సత్యకు ఉత్తరం రాసే స్థితిలోకూడా లేడుతను ఇంతలో తనచెల్లెలు వేణికి సంబంధాలు రావడం, వాటి బాగోగులు విచారించడంతో మరోవారం గడచిపోయింది. ఇంతలో తను కొంచెం తేరుకున్నాడు ఆ వెంటనే సత్యకు ఉత్తరం వ్రాసాడు. దానికి జవాబురాలేదు ఇంతలో వేణికి ఒక సంబంధం సెటిల్‌కాగానే సత్య సంగతి ఇంట్లోతెల్పి వాళ్ళ ఆమోదం పొందాడు. ఆ శుభవార్త వెంటనే సత్యకు రాసి తన అడ్రసుకూడా రాసాడు రిప్లై ఇవ్వమని దానికి రిప్లైలేదు! వెంటనే తను వూరికి పోవడానికన్నీ సర్దుకున్నాడు అంతకుముందు మూడు రోజుల్నించీ కడుపునొప్పితో బాధపడ్తూ మందు తీసుకుంటున్న వేణి తన చిన్నారి చెల్లెలు. తనంటె అత్యంత అభిమానంచూపి ఒక్కగానొక్క చెల్లెలు ఆరాత్రి ఎవరూ వూహించనట్లు చనిపోయింది ఒక్కసారి అతివేగంగా దూకే జలపాతం ఆగినట్లు స్థంభించి పోయారు ఇంట్లో వాళ్ళంతా! తను ఆ సంఘటనతో పిచ్చివాడయ్యాడు. తిరిగి ఎన్నాళ్ళకి మామూలు మనిషయ్యాడో తనకే తెలీదు. ఆవెంటనే సత్యకోసం వూరెళ్ళి వాళ్ళు ట్రాన్స్‌ఫర్ అయిపోయారని ఊరువదలి మూడ్నెల్లయిందని తెలుసుకుని నిరాశతో వెనక్కివచ్చి తన స్నేహితుడు, చంద్రం వాళ్ళ ఫామిలీతో పరిచయంఉన్న రఘుకు సత్య వాళ్ళు ఎక్కడికి వెళ్ళిందీ, వాళ్ళగురించి రాయమని ఉత్తరం రాసాడు దానికి జవాబుగా ఈ ఉత్తరం పంపాడు. ఇదిచూచి

తనలా చలించిపోయాడు. సత్య తనను ఇలా మోసం చేస్తుందనుకోలేదని కొన్నాళ్ళు ఫీలయాడు. కానీ ఆలోచించగా ఆలోచించగా ఆమె తప్పేమీ లేదని పించింది. వెళ్ళగానే ఉత్తరం రాస్తానన్న మనిషి నెలవరకూ రాయకపోయేసరికి అనుమానపడి ఉంటుంది. ఈ లోపల వాళ్లు ట్రాన్స్‌ఫర్ అవడంతో తను వ్రాసిన ఉత్తరాలు వాళ్ళకి అందలేదు. అందుకే సత్య తనను మరచిపోయి ఇంకొకర్ని చేసుకుంది. ఇక సత్య తన కేమీ కాదు అనుకున్నాడు. గుండె రాయి చేసుకున్నాడు. కాని సత్యను తనెందుకు మరువలేకున్నాడు? ఇది జవాబుదొరకని ప్రశ్న. తను జీవితంలో సత్యను మనసారా కోరుకున్నాడు. మరెవర్నీ తన జీవితంలోకి ఆహ్వానించలేదు. నిత్యం మనసులో సజీవంగా మెదిలే సత్య ఎక్కడున్నా కట్టేసి దగ్గరికి తెచ్చుకుందామనే కోరిక ప్రగాఢంగా కలిగేది ఒక్కోసారి. కాని బలవంతంగా ఆకోరికనణిచేసుకున్నాడు. అప్పట్నించీ మోడులా బ్రతకడం నేర్చుకున్నాడు. ఇంట్లో అక్కయ్యవాళ్లు పెళ్ళి చేసుకోమంటూ ఎంతపోరినా పట్టినట్టు ఉండి పోయేవాడు.

"అంకుల్" శ్రీరాం ఆలోచనలు ఆగిపోయాయి. వెనక్కి తిరిగిన శ్రీరాంకు అరటిపండు తింటూన్న రఘు కన్పించాడు.

"అంకుల్! అమ్మ పిలుస్తూంది. కాఫీకి రావాలంట" అని చెప్పేసి వెళ్లిపోయాడు. శ్రీరాం దీర్ఘంగా నిట్టూర్చి ఉత్తరం భద్రంగా యథాస్థానంలో పెట్టేసి క్రిందకు వెళ్ళాడు.

* *

రోజులు చక చకా గడిచిపోతున్నాయి. శ్రీరాం మనసులో సత్యాదేవిని చూసినప్పటినుంచి ఆమెను మరోసారికలిసి మాట్లాడాలనే కాంక్ష రోజు రోజుకూ ఎక్కువవుతోంది. సందర్భం, సమయం కలసిరాక, మళ్ళీ వాళ్ళింటికి తనకై తను వెళ్ళేధైర్యం లేక వూరుకుండి పోయాడు.

రఘు పుట్టినరోజు చాలా గ్రాండ్‌గా చేయాలని వాళ్ళమ్మ తులసి నిశ్చయించింది. భర్తపై చదువులకోసం ఫారిన్‌లో ఉన్నాడు రఘు పుట్టినరోజుకు అందరితో పాటు సత్యాదేవికి ఇన్విటేషన్ పంపాడు. పార్టీ ఎంత గ్రాండ్‌గా గడచినా శ్రీరాంకు తృప్తి కలగలేదు. సత్యాదేవి పార్టీకి రాలేదు.

మరునటిరోజు కోర్టునుంచి ఆలస్యముగా వచ్చిన శ్రీరాంకు లోపల్నించి చిరపరిచితమైన నవ్వు విన్పించింది. తులసి కారుచప్పుడు విని కాబోలు లోపల్నించి వచ్చింది. శ్రీరాం సోఫాలో కూర్చోగానే కాఫీ తెచ్చిఇచ్చింది.

"నీకోసం సత్యాదేవి వచ్చింది" అంది. శ్రీరాం ఉలిక్కిపడిలేచి "ఏది?" అనడిగాడు.

"పైన నీగదిలో కూర్చోబెట్టాను"

అంది లోపలకెళ్తూ. శ్రీరాం కాఫీకప్పు వదిలేసి పైకి వెళ్ళాడు తెల్లటిచీర, అదే రంగు జాకెట్టు చక్కటిముడి అందులో మల్లెలమాల పెట్టుకుని కూర్చున్న సత్యాదేవి అలికిడికి వెనుదిరిగి చూసిలేచింది. ఆమెకళ్ళు చాలా తేజోవంతంగా మెరుస్తున్నాయి

"అరె! నిలబడ్డారేం. కూర్చోండి చాలా థాంక్స్ మరచిపోకుండా వచ్చారు నిన్న రాలేదేం" శ్రీరాం అడిగాడు!

"మిమ్మల్ని మరచినరోజు నాకు నేనే గుర్తుండను" అనుకుందామె మనసులో పైకి నవ్వింది

"ఎవరూ రాలేదేం నిన్న మీ వారు, మీరు కనీసం మీ అబ్బాయన్నా రాలేదు?" అనడిగాడు ఆమెకెదురుగా కూర్చుంటూ.

"వాళ్లెవరూ ఇంట్లోలేరు" ఆమె కళ్ళెత్తి అతనికళ్ళల్లోకి సూటిగా చూపింది. ఆమె పెదవులు చిన్నగా కంపిస్తున్నాయి మొహం కాంతివంతంగా వెలుగుతోంది

"ఏమిటలా చూస్తున్నారు?"

ఆమె నవ్వింది మునుపటి అందం ఏమాత్రం తగ్గలేదు ఆనవ్వులో

"మీ భార్యను చూపించి పరిచయం చేయలేదేం?" కొంటెతనం ఆమె కళ్ళల్లో చూపిన శ్రీరాం దాన్ని ఎగతాళిగా అర్థం చేసుకున్నాడు.

శ్రీరాం నిర్జీవంగా నవ్వాడు. "నాభార్య గురించి తెల్పేముందు మీకోకథ చెప్తా వినండి. ఒకవూర్లో ఒక దౌర్భాగ్యుడుండే వాడు వాడో మంచి అమ్మాయిని ప్రేమించాడు. తన ఆశలసౌధాలన్నిటిని ఆమె నాధారంచేసుకుని కట్టాడు. ఆమెకు తన ప్రేమ తెలియపరిచి ఆమె అభిమానం పొందాడు కథల్లో చదివినా, సినిమాలో చూసినా ప్రేమఅంటే పిచ్చి అనుకున్న వాడు అది అనుభవంలోకి వచ్చేసరికి అది ఎంత మహోన్నతమైనదో అర్థం చేసుకున్నాడు ఆ అమ్మాయికి తన ప్రేమనంతా వెళ్ళబోసుకుని ఒకవిధంగా ప్రేమ భిక్షను యాచించాడు. ఆ అమ్మాయి ఏమనుకుందో వప్పుకుంది కానీ అతన్ని నమ్మలేకపోయింది సుందరస్వప్నాలను చూపించినట్టే చూపించి తనదారి తాను వెళ్ళిపోయింది. అతన్ని నిరాదరణ చేసి మరో ఉన్నతుడిని పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే అతనెలా కుమిలిపోతాడో ఆమె వూహించి ఉండదు ఒక్కగానొక్క చెల్లెలు మరణంతో మానసికంగా కుమిలి క్రుంగిపోయిన అతడు ఆమె నిష్క్రమణతో పిచ్చివాడయ్యాడు. అశోహతుడయిన అతడు తనజీవితంలో మరొకర్ని వూహించుకోలేక ఆమెనే జపిస్తూ ఉండిపోయాడు. జీవితంలో తటస్తపడదని అనుకున్న ఆమె మరోసారి కనపడినా అన్నీ మరచినట్టే నటించింది ఎందుకో తెలుసా? వచ్చిన తన సంసారంలో నిప్పులు పోస్తాడేమో అనుకుంది కానీ ఆమెకోసం ఏక్షణంలో అయినా ప్రాణం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడని ఆమెకు

తెలీదు. ఇదీ అతనిబాధ." శ్రీరాం మనసులోని బరువంతా దింపుకున్నట్టు వూపిరి పీల్చాడు. ఇంతలో వెక్కి వెక్కి ఏడుస్తున్న ధ్వనివిని సడన్‌గా వెనుదిరిగి చూసాడు.

సత్యాదేవి మోకాలుమీద తలవంచుకుని ఏడుస్తోంది. ఆమె మనసంతా కలచినంత బాధగా ఏడుస్తోంది. భగవాన్! నాకెందుకు మరణం ప్రసాదించవు? ఇతనికోసం కాదూ తను ఇన్నాళ్ళూ బ్రతికింది. ఎక్కడిదీ ప్రేమబంధం. అది ఎందుకు తన్నిలా కట్టిపడేసింది? ఇతనిలో తన పట్ల ఇంత ప్రేమ నిక్షిప్తమయిందా? ఆనందం దుఃఖ పెనవేసుకుని భాష్పాలు రాలుస్తున్నాయి ఎందుకీ ఉద్వేగం? భారమైన మనసుకరిగి ప్రవహిస్తోంది తనింత అపార్ధం చేసుకుంది కాని తన నిరీక్షణ ఎన్నాళ్ళకు ఫలించింది.

శ్రీరాం ఆమెను ఏడవవద్దనలేదు ఐదు నిముషాలనంతరం ఆమె దుఃఖం ఆగిపోయింది. కళ్ళు తుడుచుకుంది. వర్షించిన మేఘాలంత నిర్మలంగా ఉన్నాయి. ఆమె కనులు.

"క్షమించండి పెళ్ళయిపోయి ఎన్నేళ్ళకో కలుసుకున్న మిమ్మల్ని బాధ పెట్టాను."

"రాం!" ఆమె బాధగా కోపంగా పిలిచినా అతని గుండె చలించింది ఆ పిలుపుకు.

"ఆ మాట అనకండి. ఆమెకు అన్ని విషయాలు తెలియకపోయినా అతని పట్ల ఆమె అభిప్రాయం ఏనాటికీ మారదు." ఆమె నిశ్చలంగా చెప్పింది

శ్రీరాం ఏదో గుర్తుకచ్చిన వాడిలా లేచి తాను కొన్న పెయింటింగ్ ఇచ్చాడు.

"ఇది మీ మారేజి ప్రెజెంటేషన్ ప్లీజ్ కాదనకండి"

సత్య నవ్వింది. దాన్నిచూసి టేబుల్ మీద పెట్టి "మీదగ్గరే ఉంచండి" అంది.

"నాలాగే అదీ చేదయిందా?" శ్రీరాం చిన్నబోయిన మొహంతో అడిగాడు. సత్యాదేవి రెప్పవాల్చకుండా అతనికేసి చూసి కళ్ళుదించుకుంది "మీరు చేదని నే నేనాడూ అనలేదే? అయినా ఇదేమిటి ఇంటికి పిల్చిపోట్లాట వేసుకున్నారే?"

"సత్యా! నాలో ఆవేదన ఎవరికి చెప్పుకోను ఈ గుండెలు నిశ్యం ఎలా రగులుతాయో నీకర్థంకాదు. నామనసులో నిలిచిపోయిన నీవు నీచుట్టూ ఆకర్షణ అనే భయంకరజ్వాలలు నన్ను దహించి వేస్తుంటాయి. నీవు నన్ను మోసగాడి వనుకున్నావేమోనని ఒకవైపు. నామీద నమ్మకం ఉంచకపోయావే అని మరోవైపు ఆలోచనలు పీడించి పిప్పిచేస్తున్నాయి. ఒక్కసారయినా నన్ను గుర్తు తెచ్చుకున్నావా సత్యా. నన్ను క్షమించు. ఈ కాసేపు నిన్ను అనే సంభోదించినందుకు."

సత్య శూన్యంలోకి చూస్తూ నిలబడింది. ఆమె మెదడులో ఆలోచనలు




వలయాలుగా తిరుగుతున్నాయి. "రాం! నిన్ను మర్చిపోలేకదా గుర్తు తెచ్చుకునేందుకు! ఆరోజు నీ ఉత్తరంకోసం ఎదురు చూసిన కళ్ళు నేటివరకూ నీకొరకు ఎదురుచూస్తూనే ఉన్నాయి కోటి కోర్కెలతో మనసు నింపుకున్నాను వంటరిగా నేనెలా కుళ్ళి ఏడ్చానో నీకెలా అర్థం అవుతుంది? రాం. చాలు. ఇకనన్ను మాటలతో చిత్రవధచేయకు. ప్లీజ్ ఇది నేను భరించలేను." సత్యాదేవి నిలబడలేని దానిలా చప్పున శ్రీరాం హృదయం పైన వాలిపోయింది. ఆమెకు తెలీయకుండానే కన్నీరు అతని షర్టును తడిపేస్తోంది. శ్రీ రాం నిర్ఘాంతపోయినా ఆమెను దూరం చేయలేకపోయాడు. రెండు నిముషాలు గడిచిపోయాయి హఠాత్తుగా సత్యాదేవి శ్రీరాం కౌగిలి నుంచి జారిపోయి విపరీతమైన బాధతో మెలితిరగసాగింది.

"సత్యా! ఏమయింది?" కంగారుగా శ్రీరాం ఆమెను మంచంమీదికి చేర్చాడు. ఆమె కనుకొలుకుల్లోంచి కన్నీళ్లు కారుతున్నాయి మాట్లాడకుండా బాధపడ్తోంది. బలవంతాన కళ్ళు తెరిచి చెప్పింది "నాకు గుండెనొప్పి వస్తుంది. నన్ను ఇంటికి చేర్చండి" అంది ఆయాసపడ్తూ.

శ్రీరాం క్రిందకు వేగంగా పోయి ఫోన్ చేసాడు డాక్టరుకు తులసిని తీసుకుని పైకి వచ్చాడు. సత్య వాళ్ళింటికి కూడా ఫోన్‌చేసి వాళ్ళను రమ్మని చెప్పాడు.

ఇంతలో డాక్టర్‌వచ్చి పరీక్ష అదీ చేశాక ఆమెను కదలనీయకూడ

దని వారంరోజులు రెస్ట్ తీసుకోవాలని చెప్పి వెళ్ళాడు. కాసేపటికి ఇరవై రెండేళ్ళ వ్యక్తి వచ్చాడు.

"మీరు " అంటూ ఆగిపోయాడు శ్రీరాం సందిగ్ధంగా.

"సత్యాదేవిగారికోసం వచ్చానండి."

"ఓ! మీ మదర్ పైన ఉన్నారు పదండి" అన్నాడు శ్రీరాం

"నో. నో! ఆవిడ మా మదర్ కాదు. మా పిన్ని" అన్నాడా వ్యక్తి

"సారీ! నేను సత్యాదేవి కొడుకు మీరే అనుకున్నాను "

ఆ వ్యక్తి చిన్నగానవ్వి "మా పిన్నికి పెళ్ళికాలేదు" అంటూ చెప్పి ఆతుతర తతో పైకి వెళ్ళిపోయాడు

శ్రీరాం పిడుగుపాటు తిన్నవాడిలా నిలబడిపోయాడు. ఆమె ఎందుకు పెళ్ళి చేసుకోలేదు. తనకోసం వేచివుందా? శ్రీరాం మనసు దూదిపింజంలా తేలి కయింది. క్షణంలో అతనికంతా అర్థం అయింది. త్వరత్వరగా పైకి వెళ్ళిన శ్రీరాంకు కళ్ళుమూసుకుని పడుకున్న సత్య కన్పించింది. సత్యాదేవి అక్క కొడుకు వంగి ఆమెతో ఏదో మాట్లాడు తున్నాడు. శ్రీరాం బయట నిలబడి పోయాడు. కాసేపట్లో ఆ అబ్బాయి బయటికి వచ్చాడు.

"మా పిన్నిని ఇంటికి తీసుకుపోతు న్నాను డాక్టర్‌గారు వారందాకా కదల నివ్వకూడదన్నారని తెలిసి అంబులెన్స్ వాళ్ళను తీసుకువచ్చాను పిన్నిని ఇంటికి తీసుకుపోతాను" అన్నాడు శ్రీరాంతో.

"వద్దు మరేం పరవాలేదు. మీ చిన మామయ్య చంద్రం నేను క్లోజ్ ఫ్రెండ్స్‌ము సత్యాదేవి నాకు బాగా తెలుసు. మీ కభ్యంతరం లేకుంటే ఇక్కడే ఉండనివ్వండి వారంవరకూ ఆ తరువాత తీసుకెళ్ళవచ్చు."

"సారీ! మా పిన్ని ఇంటికి వెళ్దా మంటోంది" శ్రీరాం దిగాలుపడ్డట్టు చూసి మరే విధమైన వత్తిడి చేయలేక "సరె! మీ ఇష్టం" అన్నాడు

* * *

వారం రోజులు గిర్రున తిరిగి పోయాయి. శ్రీరాం మనసు మునుపటి కంటె తేలిగ్గా ఉంది అతనికి మధ్య కేసులు ఎక్కువయి బొత్తిగా తీరికలేకుండా పోయింది ఎప్పటికప్పుడు సత్యాదేవి ఇంటికి పోవాలనుకునేవాడు మూడు రోజుల క్రితం సత్యాదేవి ఇంటికి ఫోన్ చేసి ఆమె ఒంట్లో బాగానే ఉందని తెలుసు కున్నాడు

ఆరాత్రి శ్రీరాం రెండు దినాలక్రితం నాటి పోస్ట్ చూసుకుంటున్నాడు నీలి రంగు కవర్ కనబడగానే దాన్ని ఆశ్చ ర్యంగా దాన్ని విప్పాడు అది రాసి రెండు మూడు రోజు లయుంటుంది. గులాబీరంగు కాగితంమీద నల్లటిముత్యా ల్లాంటి అక్షరాలతో చివర "సత్య" అని ఉండడం చూసి చకచకా చదవసాగాడు

"ప్రియమైన శ్రీరాంగారికి.

సత్య ఇలా మీకు ఉత్తరంరాస్తుందని మీ రూహించకపోవచ్చు. కానీ మీకు దురభిప్రాయం పోగొట్టేందు కింతకంటె మార్గంలేదు. మీరు చెప్పిన కథలో హీరోయిన్ పాత్రపోషణ సరిగ్గాలేదు. ఆమెను క్రూరంగా చిత్రించారు. నిజజీవితంలో ఆ పాత్రను పోషిస్తున్న నేనంత దుర్మార్గురాల్ని కాను. మీరానాడు నన్ను ఇంటి దగ్గర దిగబెడ్తూ చెప్పినమాటలు నా హృదయంలో పటిష్టంగా నిలచిపోయాయి. మీకోసమే నిరీక్షిస్తూండిపోయాను. ఎక్కడికిపోయినా ఏ వ్యక్తిని చూసినా మీరే కన్పిస్తారేమో అని వెదుకుతాను. ఇలా కొన్నాళ్ళు మీకోసం పిచ్చిదాన్నయ్యాను. మాకు ట్రాన్స్‌ఫర్ అయ్యాక ఇంట్లో నాకు పెళ్ళిసంబంధాలు చూడ్డం ఆరంభించారు. నా మనసులో మీకై ఒకటే తపన. ఇంట్లో ఏమని చెప్పను ప్రేమించానంటే వూరుకుండిపోతారా? మీ దగ్గర్నుంచి ఒక్క ఉత్తరం కూడా రాకుండా దినాలు గడిచిపోతుంటే నా మనసెలా నలిగిపోయిందో మీకెలా చెప్పను? ఒక్కసారి మా ఇంట్లో వాళ్ళు బలవంతంగా పెళ్ళి చేస్తారేమో అన్పించేది. చదువుసాకుతో ముప్పైఏళ్ళు పెళ్ళి చేసుకోకుండా గడిపేసాను. ఆ తరవాత పెళ్ళిచేసుకోమని ఇంట్లో వత్తిడి ఎక్కువయింది. భగవంతుడా! నేనేం చేయను? ఇన్నేళ్ళూ నేనతన్ని ఆరాధించడం అబద్ధం అనుకుని వేరే వ్యక్తిని నాజీవితంలోకి ఆహ్వానించనా? అక్కయ్యా నన్నెన్నో మాటలంది పెళ్ళి చేసుకోనందుకు. ఎవరికీ ఏ జవాబు చెప్పలేకపోయాను. మీరేదయినా బలవత్తర పరిస్థితుల్లో చిక్కుకుపోయారేమో అన్పించేదొకోసారి. మీకు ఉత్తరం రాయడానికయినా మీ అడ్రసు నాదగ్గర లేకపోయింది.

కష్టాలు పెట్టే భగవంతుడే అప్పుడప్పుడూ కొన్ని మంచిపనులు చేస్తుంటాడు. ముప్పై అయిదేళ్ళకు నాకు గుండెనొప్పి వచ్చింది. అది మొదలూ తరచూ ఆవేశం, ఉద్రేకం, మితిమీరిన ఆనందం కలిగితే నొప్పి వచ్చేది. ఈ సాకు నాకు చాలా వుపయోగపడింది. ఎవరైనా పెళ్ళిచేసుకోలేదేమంటే ఇదే సాకు చెప్పేదాన్ని. "మీవార్ని తీసుకుని మా గృహం పావనం చేయండి" అని చెప్పి వెళ్ళారు మీరు. నాకు ఎవరూ లేరు! కాదు.... అందరూ ఉన్నా నేను వంటరినే. ఎందుకో తెలుసా? మీరు నన్ను ఒక కోరిక కోరారు. గుర్తుందా! "యూ వెయిట్ ఫర్ మి" అన్నారు. అందుకే మీకోసం నేను నా ముప్పైఐదేళ్ళ వరకూ నిరీక్షించాను. ఆ తరువాత మీకోసం నిరీక్షించలేదు. మీ కాపాటికి పెళ్ళయిందని, పిల్లలతో కళకళలాడుతుంటారని వూహించుకునేదాన్ని. ముందలా అనుకున్నందుకు బాధ అన్పించినా క్రమంగా

అది అలవాటయిపోయింది. నాకేదయినా కోరిక వుంటే అది నేను మరణించేలోగా మిమ్మల్నొకసారి చూడాలని వుండేది.

మీ ఇంటికి నేను ఎందుకు వచ్చానో మీకు తెలీదు. మీ ఫామిలీని చూద్దామని వచ్చిన నేను జరిగినదంతా మీ అక్కయ్య ద్వారా విని విభ్రాంతపోయాను. మీ రెందుకు పెళ్ళి చేసుకోలేదో విన్నాక (మీ కథ ద్వారా) నా బలహీనపు గుండెలు సంభ్రమాశ్చర్యాలతో స్పందించాయి మాటలతో వర్ణించలేని సంచలనం నాలో కలిగింది. దాని ఫలితమే మళ్ళీ గుండె నొప్పి వచ్చింది.

రాం! మీ కోసం నేనెలా పిలయ్యానో అలాగే మీరు పిలవడం నా కళ్ళారా చూశాక నా కెంత తృప్తి కలిగిందని. మనది నిజాయితీ అయిన ప్రేమ కదూ! ఒకేమాట కిద్దరం కట్టుపడ్డాం. ఒకరినొకరు అభిమానిస్తూనే అనుమానపడ్డాం. ఈర్ష్య పడ్డాం. ఈవాళ నా మనసెంత తేలిగ్గా ఉంది. మీ కౌగిలిలోనే నా ప్రాణాలు పోయుంటే బాగుండుననుకున్నాను అంత అదృష్టవంతురాల్ని కాలేకపోయాను. రాం. మిమ్మల్నొక్కసారి చూడాలనుంది రాగలరా? మీ కేనాడూ మనస్సులో సంతోషం కలిగించలేకపోయాను ఇప్పుడు మీ వళ్ళో తల పెట్టుకుని నిదురించాలని ఉంది. ఈ నిరీక్షణలో ఇంత ఆనందం ఉందని నాకు తెలీలేదు ఇన్నాళ్లూ. మీరు వస్తారు కదూ!

మీ రాకకోసం నిరీక్షిస్తూ
మీ
సత్య ''

"సత్యా!" శ్రీరాం పెదవులు పదేపదే ఆ పదాన్ని ఉచ్చరించాయి. చటుక్కున లేచి బట్టలు మార్చుకున్నాడు. క్రిందకు దిగి వచ్చాడు. లోపల్నించి తులసి పాల గ్లాసుతో వచ్చింది.

"ఇప్పుడెక్కడికి బయల్దేరావు. రెస్ట్ తీసుకో రాం!" అంది.

శ్రీరాం చిన్నగా నవ్వి "అక్కయ్యా! నే నెక్కడికి పోతున్నానో తెలుసా? నీ మరదలును తీసుకురావడానికి.''

తులసి తెల్లబోయి చూపింది ''మర దలా?''

''అదేనక్కా. సత్యను తీసుకురావ డానికి కాదు చూడ్డానికి'' శ్రీరాం పాలు తాగేసి గ్లాసు క్రింద పెట్టేసి ''వస్తా నక్కా!'' మనస్ఫూర్తిగా నవ్వేసి వెళ్ళి పోయాడు చాలా రోజుల తరవాత తమ్ముని మొహంలో విరిసిన కళను చూస్తూ నిలిచిపోయింది తులసి.

శ్రీరాం కారు సత్యాదేవి యింటిముం దాగింది శ్రీరాం హృదయంలో ఆనందం పురివిప్పిన నెమలిలా నృత్యం చేస్తోంది. కారు దిగిన శ్రీరాం దగ్గరికి మాలి పరు గెత్తుకుంటూ వచ్చి ''ఇంట్లో ఎవరూ లేరు బాబూ! పెద్దమ్మగారు ఆస్పత్రిలో ఉన్నారు. ఆమెను చూడ్డానికి పోయారు'' అన్నాడు.

''పెద్దమ్మగారికేమయింది? ఆస్పత్రిలో



యువ

ఎందుకుంది?" గాభరాగా అడిగాడు శ్రీరాం మనసేదో కీడు శంకిస్తుండగా.

"గుండెనొప్పి బాబూ! రాత్రే చేర్చి నారు అమ్మగారు సానా మంచిమనిషి" అంటూ కళ్ళొత్తుకున్నాడు వాడు.

శ్రీరాం తడబడే అడుగులతో కారెక్కాడు. రెండు నిమిషాల్లో కారు హాస్పిటల్ చేరుకుంది. శ్రీరాం దిగి లోపలికి పోతుండగా ఇంతలో అతన్నిరాచుకుంటూ ఆత్రంగా ఒక లావాటి మనిషిపోతూ వెనక్కి తిరిగి 'సారీ!" అంటూ చటుక్కున నిలబడి, "రాం! అన్నాడు సుపరిచితమైన కంఠస్వరం. "చంద్ర" అంటూ ఒక్కసారి ఆలింగనం చేసుకున్నాడు శ్రీరాం. "నీ విక్కడ వున్నావా? సరే! అవన్నీ తరవాత, నడు. నీకు నా చెల్లెలు సత్య గుర్తుందా. దానికి హార్ట్ ఎటాక్ వచ్చి రాత్రి సీరియస్ అయి యిక్కడ చేర్చి నాకు టెలిగ్రాం యిచ్చారు. ముందే మా మదర్ వచ్చేసింది దాని కండిషన్ ఏం బాగలేదురా" చంద్రం కళ్ళు దుఃఖ వేతకాటోలు ఎర్రబడ్డాయి.

"పద. సత్యను చూద్దాం" శ్రీరాం గొంతులోని వణుకు, ఆవేదన చంద్రం గుర్తించలేదు సత్య స్పృహలో లేదు. అంతా హడావిడిగా ఏమేమో మాట్లాడుకుంటున్నారు. సత్య అమ్మ మూలగా కూర్చుని ఏడుస్తోంది. చంద్రం సత్య మంచంమీద కూర్చుని తల నిమురుతూ కన్నీరు కారుస్తున్నాడు. అందరూ పైకి ఏడుస్తుంటే శ్రీరాం దూరంగా తలుపు దగ్గర నిలబడి మనసులో ఏడుస్తున్నాడు. అతని మనసు చిన్నాభిన్నమయిపోతోంది. "సత్యా! ఒక్కసారి కళ్ళుతెరు. నీకోసం. నీ కోరిక తీర్చడంకోసం నే వచ్చా సత్యా నిన్ను నా దానిగా చేసుకుందామని ఎంతో ఆశతోవచ్చా సత్యా కాని ఐయామ్ టూ లేట్! నా కళ్ళముందే నీవు నన్ను దూరంచేసి పోతావా? ఇంతమందిలో నీ తల ఒళ్ళో పెట్టుకునే అధికారం నాకు లేదు. నే నెంత దురదృష్టవంతుడిని! అతని కళ్ళు వర్షించసాగాయి కళ్ళనుండి వెచ్చని కన్నీరు కారిపోతోంటే ఆమె కెదురుగా స్థంభంలా నిలబడ్డాడు. అతని మనోవేదన గుర్తించిందా అన్నట్టు మరో నిముషానికి సత్య కళ్ళు తెరిచింది. ఆమె కన్నీళ్ళు నిండిన చూపులు ఎవరికోసమో వెదకి శ్రీరాంను చూడగానే జలజలా రాలిపోయాయి ఆమె కళ్ళు కొడికట్టే దీపంలా దేదీప్యమానంగా వెలిగాయి. ఇద్దరి చూపులు క్షణం కలుసుకున్నాయి ఆక్షణం విలువ కట్టలేనిది! చిరునవ్వు ఆమె పెదాలపై నిలిచింది. సంతృప్తిగా కన్ను మూసింది! ఒక్కసారి ఆ గదిలో ఏడ్పులు మింటినంటాయి.

శ్రీరాం అక్కడ ఉండలేక బయటికి వచ్చాడు. సత్యను కడసారిగా చూడగలిగాడు. చాలు! కన్నీరు తుడుచుకుని పైకి చూశాడు. ఆకాశంలో ఒక తార కొత్త కాంతులతో తళుక్కుమంటోంది. దాన్ని చూస్తూ అనుకున్నాడు. "సత్యా! వెయిట్ ఫర్ మీ!!"




త్రన భార్యకూ, చెల్లెలికీ మనస్పర్థ రావటం శ్యామసుందరుని మనస్సుకి, చాలా కష్టం వేసింది. అదే సర్దుకుపోతుం దిలే అని, అతను కొంతవరకు ఉపేక్షించి వూరుకొన్నాడు. కాని వారిద్దరిమధ్యా స్పర్థ క్రమక్రమేణా పెరిగింది. తన చెల్లెలి కుమార్తె వివాహంనాటికి అది బ్రద్దలై అతని మనస్సును వికలపరి చింది, తన చెల్లెలు కుమార్తె వివాహానికి ఆహ్వానించటానికై వొకరోజు తన ఇంటికి వచ్చింది తన భార్య ''ఎందుకీ పై పై పిలుపు? మీకు మనస్సులో మేం రావాలని లేదు రాము మేము రాకపోతే

మీ పిల్ల పెళ్ళి ఆగుతుందా?" అన్నది దానికి అనేక కారణాలు చెప్పింది ఈ మధ్య శ్యామసుందరుని అత్తగారు మరణించింది ఆమె కర్మకి వూళ్ళోకి వచ్చి కూడా తన చెల్లెలు రాకపోయింది ఇది మొదటికారణం ఇక రెండవకారణం ఈ వివాహానికి తానువున్న వూళ్ళోనే ముహూర్తం పెట్టుకున్నారు ఆరోజు ఎవరెవర్నో పిలిచారు తన్నుమాత్రం పిలువలేదు. ఆ రోజు నిజంగా తనభార్యకు చాలా కష్టం వేసింది "ఇంత అవమాన పరుస్తారా?" అని కంట నీరు పెట్టింది ఇవన్నీ అడిగింది తన భార్య అడిగి, "ఆనాడు అక్కర లేనివాళ్ళం ఈనాడు ఎందుకు కావలసివొచ్చాం?" అన్నది

దీనికి తన చెల్లెలు ఏమేమో చెప్పింది తన కుటుంబానికి చేసిన సహాయాన్ని ఏకరువుపెట్టింది తనకు, తన అన్న మీదవున్న ప్రేమను వెళ్ళబుచ్చింది కాని లాభం లేకపోయింది తన భార్య "నేను రాను పిల్లలు రారు నీ కంత ప్రేమ వుంటే మీ అన్నగారిని తీసుకువెళ్ళు" అన్నది

"ఏం అన్నయ్యా!" అని అడిగింది చెల్లెలు నిజంగా చాలా జాలిగా అడిగింది శ్యామసుందరుడు సందిగ్ధావస్థలో పడ్డాడు తనకు వొక్కగాని వొక్క చెల్లెలు చిన్న తనంలోనే తల్లిపోవటంవల్ల ఇద్దరూ అనేక కష్టాలకు లోనై పెరిగారు ఆతనికి ఆ రోజులు జ్ఞాపకం వచ్చినై ఆ రోజుల్లో వాళ్ళిద్దరూ ఈ విశాల ప్రపంచంలో ఏకాకులుగా వుండేవారు అలాగే ప్రతికారు నిజమే కావి, తన భార్యపడేబాధకు కారణం లేకపోలేదు మొదట్లో తన భార్యకు తన చెల్లెలంటే చాలా యిష్టం. ఎంతో ఆదరంగా చూసేది తన చెల్లెలు కూడా అలాగే వుండేది పుట్టినప్పటి నుంచీ తన కొడుక్కి అన్నకూతుర్నితప్ప ఎవ్వరినీ చేసుకోను అనేది తన అన్నకి ఏ కష్టం వచ్చినా తనకు వొచ్చినట్లే భావించుకొనేది కాని నెమ్మది నెమ్మదిగా పరిస్థితులు మారినై ఎవ్వరి పరిస్థితులు వారికి తెలియకుండానే మారినై ఎవరికివారు మారిన మనస్తత్వాలకు అనుగుణంగా ప్రవర్తించటం మొదలు పెట్టారు చివరికి రాకపోకలే సన్నగిల్లినై పోనుపోనూ తనను, తన చెల్లెలు చిన్నచూపు చూస్తూ వుందేమో అనే అనుమానంకూడా కలిగింది ఇవన్నీ జ్ఞాపకం వొచ్చినై అతనికి, తన చెల్లెల్లో వచ్చిన మార్పుకి తన భార్య ఎంతయాతన అనుభవించిందీ ఆతనికి తెలుసు తను ఆర్థికంగా ఇబ్బందులు పడటమే దీనికి కారణమేమో అనే సంశయం కలిగినప్పుడు నిజంగా అతని మనస్సు ఉడికిపోయేది తన భార్యా పిల్లలూ ఇతరుల చిన్న చూపుకి లోనవటానికి తన అసమర్థతే కారణం గదా అనుకున్నప్పుడు, అతని మనస్సు జాలితో నిండిపోయేది ఎంత స్వార్థత్యాగానికి పూనుకొని అయినాసరే,

తన భార్యను సుఖపెట్టటమే తన పరమా వధి అనుకొనేవాడు ఆమె లోకుల బాధలను మోయలేక కన్నీరుకాలుస్తూ నిలబడివున్న భూదేవిలాగు కనుపించేది ఆక్షణం—అతనీ ఆలోచనలలో వుండగా

"ఏం అన్నయ్యా?" అని అడిగింది చెల్లెలు

' నేను రానమ్మా" అన్నాడు శ్యామ సుందర్

"అన్నయ్యా!"

"అవునమ్మా! నేను రాను "

"నేనేం చేశానని?"

"నేనురాను "

"రావా అన్నయ్యా"

"రాను "

శ్యామసుందరుని చెల్లెలు తన చెవు లను తానే నమ్మలేక పోయింది వొదిన ఏమన్నా తన సహోదరుడు తన కుమా రుని వివాహానికి రానని అనే అవకాశం వుందని ఆమె ఎన్నడూ ఊహించుకో నైనా ఊహించుకోలేదు ఒక్క నిముషం అలాగే నిలబడిపోయింది ఆ నిముషంలో ఆమె మనస్సులో చిన్ననాటి స్మృతులెన్ని తిరిగినయ్యో! కన్నులు నీటితో నిండు కున్నవి ఇక ఆమె పెదవులు కదల్లేదు నెమ్మదిగా అడుగులో అడుగు వేసు కుంటూ వెళ్ళిపోయింది ఆ ఇంటిలో నిశ్శబ్దం రాజ్యంచేసింది అతిభయంకర మైన నిశ్శబ్దం

శ్యామసుందరుని భార్య ఏమను కున్నదో ఏమో! కాసేపు మౌనంగానే వుండి చివరికి "మీరు వెళ్ళకపోతే బాగుండదు మీరు వెళ్ళండి అన్నది

శ్యామసుందరుడు ఆలోచించాడు తన భార్య రాక తాను వెళ్తే "మా అన్నయ్య మంచివాడే, అన్నీ చెరిపేది మా వొదినే" అని అనుకుంటుంది తన చెల్లెలు. ఎన్న యినా ఊహిస్తారు తన భార్య రాకుండా తాను వెళ్ళటంలో అర్థంలేదు తన భార్య రాదు అందులో సందేహంలేదు ఇక తాను వెళ్ళటం జరగదు

"నేను వెళ్ళను" అన్నాను "వాళ్లె వరినైనా అవమానపరిస్తే నన్ను అవ మాన పరిచారు నీవు వెళ్ళదలచందీ నన్ను అవమానపరిచారనే, ఇక నేను వెళ్ళటం అనే ప్రశ్న ఎలా ఉదయిస్తుంది? మనం వెళ్ళకపోయినందువల్ల వాళ్ళకి దిగబడేది ఏమీ వుండదులే" అన్నాడు

శ్యామసుందరుడు వివాహానికి వెళ్ళ లేదు కాని అతని మనస్సుకి శాంతిలేదు. మానవుడు చిన్న చిన్న విషయాలను పట్టించుకొని, మనస్సును చీకాకుపరచు కొని ద్వేషాన్ని పెంచుకొని, తన్ను ఇంకొకరికి కాకుండా చేసుకోటానికి ఎందుకు సిద్ధపడతాడో అతనికి అర్థం కాలేదు తనుపట్టుకు తనూ ఈ విధం గానే ప్రవర్తించె! ఈ చిన్న విషయా లను ఎందుకు పట్టించుకోవటం అనుకో లేకపోయె! పోనీ తన చెల్లెలుమాత్రం తమ మనస్సులు నొచ్చేటట్టు ప్రవర్తించటం

ఎందుకు? ఇటు తన భార్య పట్టించుకోకుండా ఊరుకుంటే పోయేదికాదూ? ముహూర్తానికి పిలిస్తేం. పిలవకపోతేం? కర్మకు వస్తేం. రాకపోతేం? కాని అలా జరగదు ఇటువంటి విషయాలు మానవుల మనస్సులను విరగదీస్తూ వుంటై మానవుల మనస్సుల్లో విషబీజాలు నాటుతూ వుంటై

అతని మనస్సు ఈ రకం ఆలోచనలతో, వికలం అయింది అతనికి అక్కడికి వందమైళ్ళ దూరంలో వాకతోట వుంది ఆ తోటలో చిన్న బంగళా వుంది కొన్నిరోజులు అక్కడ గడిపివద్దామనే సంకల్పం కలిగింది భార్యతో చెప్పి అక్కడికి మరునాడే బయలుదేరాడు.

శ్యామసుందరుని తోట మామిడితోట అది రాకపోకల సౌకర్యానికి పెడగావున్న ఒక బస్తీని ఆనుకొనివుంది అది అతని తండ్రి నాటించిన తోట అతని తండ్రి ఆ చుట్టుపక్కల బాగా పేరుమోసిన ప్లీడరు ఆయన సెలవల్లో విశ్రాంతికోసం ఈ తోట వేయించాడు ప్రతి సెలవల్లోనూ కుటుంబముతోసహా అక్కడకు వెళ్ళి కులాసాగా కాలం గడుపుతూ వుండేవాడు కాని శ్యామసుందరుడు పెద్దవాడైన తర్వాత తన తండ్రితో కలిసి అక్కడకు వెళ్ళటం మానివేశాడు దీనికి ప్రత్యేక కారణం ఏమీలేదు చదువుసంధ్యల్లో పడి అతనిదృష్టి ఈ రకమైన ప్రశాంత జీవితాన్నుంచి వేరువైపుకి మళ్ళింది పైగా తన తండ్రితో ముఖాముఖి కలిసివుండటానికి అతను ఇబ్బందిపడటం మొదలుపెట్టేవాడు అందుకని ఈ తోటకు రాకుండా



ఏదో వొక నెపంతో తప్పుకు తిరిగేవాడు. తనతండ్రి కాలంచేసింతర్వాత ఈ తోటకు రావటం అతనికి ఇదే మొదటిసారి....

అతని గుర్రపుబండి తోటముందు ఆగీ ఆగగానే అతని మనస్సుకొక అనిర్వచనీయమైన ప్రశాంతత చేకూరింది. ఏనాడో విడచిన ఆప్తుణ్ణి కష్టకాలంలో అకస్మాత్తుగా చూచినట్లనిపించింది. అంతలో తోటమాలి రామయ్య ఆదరాబాదరా పరుగెత్తుకుంటూ వచ్చాడు. తన చిన్నదొర బండిదిగటం చూసేటప్పటికి, అతనికి ప్రాణాలు లేచివచ్చినై.

"దొర వొచ్చాడే! సుందరందొర వొచ్చాడే....రావే" అని తన భార్యని పిలిచాడు. చీకటిలో అతని భార్యా పిల్లలూ బిరబిరా వొచ్చి, బండిదిగిన శ్యామసుందరుని చుట్టుముట్టారు

"బాగున్నావా రామయ్యా!" అడిగాడు శ్యామసుందరుడు.

"తమరు చల్లగావుంటే మాకేం కొదవ బాబయ్యా!" అన్నాడు రామయ్య. తాను స్టేషన్లో కొనుక్కొచ్చిన బిస్కట్లు రామయ్య పిల్లలకు పంచిపెట్టాడు శ్యామసుందరుడు.

"వీళ్ళకు ఎందుకు బాబూ ఇయ్యన్నీ!" అన్నాడు రామయ్య

"అన్నిటికీ ఎగబడతారు చచ్చినోళ్లు" అన్నది రామయ్య భార్య.

రామయ్య కొంత సామానూ రామయ్య భార్య కొంత సామానూ ఎత్తుకున్నారు. శ్యామసుందరుడు బండివాడికి డబ్బిచ్చి పంపివేశాడు. అంతా లోపలకు నడిచారు.

హోటల్‌నుంచి, రామయ్య టిఫిన్ క్యారియర్‌తో భోజనం తెచ్చాడు. శ్యామసుందరుడు భోజనం ముగించాడు. అంతలో రైతులు కొందరు అతన్ని చూడటానికి వొచ్చారు. వాళ్ళంతా తన తండ్రిగారిని బాగా ఎరిగినవాళ్ళు. ఆయన వల్ల అంతో ఇంతో సహాయం పొందినవారు. వాళ్ళు అనేక విషయాలు అడిగారు శ్యామసుందరుని. అతడు తనకు తెలిసినంతమట్టుకు జవాబులు చెప్పాడు. భూమికి గరిష్ఠ పరిమితి, సేద్యం చేసుకొనే రైతుకి నష్టంలేకుండా మొత్తం దేశంయొక్క అభ్యున్నతికి అనుకూలంగా, జరుగుతుందని చెప్పాడు. సహకార సేద్యంవల్ల వచ్చే లాభాలను విశదీకరించాడు అదైనా రైతుల ఇష్టంమీద జరిగే పనేగాని బలాత్కారంగా ప్రవేశపెట్టటం జరుగదు అని విపులీకరించాడు "ప్రతి భారతీయుడూ తన స్వార్థదృష్టితో కాక, దేశాభ్యుదయ దృష్టితో ప్రవర్తించవలసిన తరుణం ఇది" అని ఉద్బోధించాడు.

ఈ విధంగా కాసేపు కష్టసుఖాలు మాట్లాడుకున్న తరువాత రైతులు, వొకరి వెనుక వొకరు సెలవు తీసుకొని తమ తమ పనులమీద వెళ్ళిపోయారు

శ్యామసుందరుడు వొక్క నిట్టూర్పు విడిచాడు. ఏకాంతవాసం, ఈ కొత్త

వాతావరణం అతని మనస్సును ఉల్లాస పరచినై. అతను కవి కాదు. కాని మనస్సు ఉల్లాసంగా వున్నప్పుడు ఏవో గేయాలు గిలకటం అతనికి అలవాటు. అదే అలవాటుచొప్పున పరధ్యానంగా కాగితం, కలం తీసుకున్నాడు. అంతలో గడపదగ్గర అడుగుల సవ్వడి వినిపించింది. ఎవ్వరో గదిలోకి వస్తున్నట్లు అనిపించింది. తిరిగి చూశాడు. ఎవరది? ఎవరా స్త్రీమూర్తి? అతని మనస్సు;

ఎవరది?

శరత్కాలపు మేఘమాలికయా?

భువికి దిగిన దివ్యాంగనయా?

పసిపాప చిరునవ్వు వెలుగుల దొంతరయా?

ఎవరది?

అని తన్ను తానే ప్రశ్నించుకుంది అతని మనస్సు—ప్రశ్నకు ఆ స్త్రీమూర్తే జవాబు చెప్పింది. "నాది ఈ వూరే. మీరు వచ్చారని తెలిసి చూచిపోదామని వచ్చాను."

శ్యామసుందరునికి ఏమి జవాబు చెప్పాలో తెలియలేదు. ఏం చెయ్యాలో తోచలేదు. తికమకపడుతూ, కూర్చున్నాడు ఆమె గ్రహించిందో ఏమో, తనే అందుకుంది...." మే మిక్కడ కుంటివాళ్ళకీ, గుడ్డివాళ్ళకీ వొక శరణాలయం నడుపుతున్నాం. మీకు వీలుంటే వొకసారి వొచ్చి చూడాలని ప్రార్థిస్తున్నాను" అన్నది.

"తప్పకుండా" అన్నాడు శ్యామసుందరుడు. అంతే మళ్ళీ మాటలు సాగలేదు. ఆమెకూడా వొక్కక్షణం అలాగే నిలబడింది. చివరికి "రేపు ఉదయం మా ఇంటికి భోజనానికి రాగలరా?" అని అడిగింది.

"వస్తాను" అన్నాడు శ్యామసుందరుడు.

"రామయ్యకు మా ఇల్లు తెలుసు" అన్నది ఆమె

"అలాగే" అన్నాడు శ్యామసుందరుడు.

"మరి శెలవు" అన్నది. అతను అప్రయత్నంగా లేచాడు. ఆమె వెళ్ళిపోతుంటే అలాగే చూస్తూ నుంచున్నాడు. యెవరీమె? కాసేపటికి రామయ్య వచ్చాడు. అతను చెప్పాడు.

ఆమెపేరు శ్రీలక్ష్మి. ఆ పరిసర ప్రాంతాల్లో యెవరికేం కష్టంవొచ్చినా అక్కడ ఆమె ప్రత్యక్షం అవుతుంది. ఆదుకుంటుంది. ఆమెను చిన్నవాడు మొదలుకొని వృద్ధులవరకూ "తల్లీ" అని పిలుస్తారు. తల్లిగానే భావించుకుంటారు. ఆమె అక్కడ వొక పాఠశాలలో పంతులమ్మగా పనిచేస్తూ వుంటుంది. దానికి తోడు రెండుమూడు శరణాలయాలు నడుపుతూవుంది. ఆమె జీవితం అంతా బీద ప్రజల కష్టనివారణకే అంకితం అయింది. ఈమధ్య పెద్ద భూస్వాముల దగ్గరనుంచి హరిజనులకు భూములను యిప్పించింది

ఎకరం, ముప్పాతిక ఎకరం, అరఎకరం వున్న రైతులను కొందరిని కలిపి సహకార సేద్యంకూడా పెట్టించింది. ఇలా చెప్పుకుపోయాడు రామయ్య. చెప్పిచెప్పి "ఆమె ఏది చెయ్యమన్నా చెయ్యటానికి జంకేవాడు ఈవూళ్ళో వొక్కడూలేడు.... మా పాలిట దేవత ఆమె" అన్నాడు రామయ్య.

శ్యామసుందరునికి అంతా కలగా కనిపించింది. ఆమెనుగురించి యిదమిద్ధమని ఏమీ తేల్చుకోలేకపోయాడు. ఇంకా తెలుసుకోవాలి అనిపించింది. ఎవరీమె?

ఆమె ఇంటికి మరునాడు వెళ్ళాడు శ్యామసుందరుడు — ఆమె వంట చేస్తూ వుంది. బయట వసారాలో ఆమె భర్త పిల్లలను పెట్టుకొని కూర్చునివున్నాడు. శ్యామసుందరుని చూడగానే లేచి, మర్యాద చేసి కూర్చోపెట్టాడు. అతని మాట విని బయటకు వచ్చిందామె. "క్షమించాలి. వంట కొంచెం ఆలస్యం అయింది" అన్నది. "వొక పదినిముషాలు" అని చెప్పి మళ్ళీ లోపలకు వెళ్ళింది.

"అదే చిక్కు" అన్నాడు ఆమెభర్త. "అన్నీ తనే చెయ్యాలంటుంది చేస్తుంది. బడికి వెళ్ళింది. వచ్చి వంట మొదలు పెట్టింది. ఇలా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుంటుందో లేదో శరణాలయానికి వెళ్తుంది. అక్కడనుంచీ మళ్ళీ బడి. బడి గంట కొడతారో లేదో అటునుంచి అటే వూళ్ళోకి వెళ్తుంది. రైతులకు యిదనీ, అదనీ సహాయంచేస్తూ కూర్చుంటుంది. అక్కడనుంచి కాస్త పెందలకడ వస్తే కుట్టుమిషన్ ముందువేసుకు కూర్చుంటుంది. పిల్లల చొక్కాలుకూడా తను కుట్టవలసిందే. ఇలా యెన్నాళ్ళు జరుగుతుంది చెప్పండి? తన ఆరోగ్యం చూసుకోనక్కర్లేదా?"

శ్యామసుందరుడు అతను వెలిబుచ్చిన అభిప్రాయాలన్నిటితోనూ ఏకీభవించాడు. "కాని" అని మళ్ళీ మొదలుపెట్టాడు ఆమె భర్త. "ఆమె యెంత కష్టపడినా కష్టపడ్డట్టే కనపడదు. ఏ పని చేస్తున్నా సహజంగానే వుంటుంది. ఎన్నో యేళ్ళ నుంచీ చేస్తున్న మనిషిగా కనుపిస్తుంది. ఈ పనులన్నీ ఆమె చెయ్యవలసిన పనులుగానే కనుపిస్తవి ఆమెకు తెలియవిదంటూ యేదీలేదు. ఇప్పుడీ వంటపని వున్నది చూడండీ ఏ కూరలో ఏ విటమిన్లు వున్నయో, ఎవ్వరికి ఏది అవసరమో అన్నీ ఆమెకు తెలుసు. ఆ ప్రకారం అన్నీ తానే చేస్తుంది. వంటవాణ్ణి పెడదాం అంటే "నేనుండి చేసేదియేమిటి?" అంటుంది. ఏం చెయ్యాలి?"

అతను పెద్దనిట్టూర్పు విడిచాడు. శ్యామసుందరుడు అతను చెప్పేమాటలన్నీ వింటూ కూర్చున్నాడు. ఆమెభర్తకు ఏమి జ్ఞాపకం వొచ్చిందో ఏమో లోపలకువెళ్ళి కొన్ని పేపరు కట్టింగులు తెచ్చి. "యివన్నీ ఆమె వ్రాసిన వ్యాసాలే.... వొకసారి చూడండి" అన్నాడు.




శ్యామసుందరుడు కుతూహలంతో ఆ వ్యాసాలు తిరగవెయ్యటం ప్రారంభించేడు. అతనికి ఆశ్చర్యం కలిగింది. ఆ వ్యాసాలు అనేక విషయాలకు సంబంధించినవి. పైగా ప్రతివిషయం వొక విశిష్ట దృక్పథంతో పరిశీలించబడింది. ఈమెకు యింత సామర్థ్యం ఎలా వొచ్చింది? ఇన్ని పనులు ఎలా చెయ్యగలుగుతూవుంది? శ్యామసుందరుడికి అంతా అయోమయంగా వుంది.

భోజనాలైనై. వడ్డన అంతా ఆమే చేసింది. చివరి పళ్ళాలుకూడా ఆమే తీసింది అంతా ఆమెభర్త చెప్పినట్లు అతి సహజంగా జరిగిపోయింది. ఆమె యేపని చేసినా విడ్డూరం అనిపించలేదు. యెందుకనో, భోజనాలవగానే కుంటి వాళ్ళకూ, గ్రుడ్డివాళ్ళకూ యేర్పాటైన శరణాలయానికి వెళ్ళారు. ఆమె గడపలో అడుగుపెట్టిందో, లేదో గుడ్డిపిల్లలు ఆమెను ముసురుకున్నారు. "తల్లీ తల్లీ" అని ప్రశ్నల వర్షం కురిపించారు. ఆమెను ముట్టుకుంటేనే జన్మ తరిస్తుందన్నంత పవిత్రభావంతో మసిలారు. ఆమె వాళ్లని తన సొంత బిడ్డలకంటే అప్యాయంగా చూసింది. వాళ్ళతో వున్నంతసేపూ ఆమె తన్ను తాను మరచిపోయింది. ప్రపంచాన్ని చూడలేని వాళ్ల స్పర్శకు ఆమె కరిగి నీరయింది. రూప రహితమైంది. ఏకధారగా ఆమె కళ్లవెంట నీరు కారింది ఆమెకిది గమనంలో వున్నట్టే లేదు. వొకరిని మేను నిమిరింది. ఒకరి తల సవరించింది. ఆ దృశ్యం చూచి, శ్యామసుందరుడు కన్నీరు కార్చకుండా వుండలేకపోయాడు. కన్నీరు కార్చటం

సహజమే అతని మనస్సు వర్షం కురిసిన మేఘానికివలె తేలిక పడింది. అక్కడ నుంచి వారు మహిళా సమాజానికి, సహకార వ్యవసాయ కేంద్రానికీ వెళ్ళారు. కొంతమంది బీదప్రజల యిళ్ళకువెళ్లారు. ప్రతిచోటా యిదే ఆప్యాయత యిదే ఆర్ద్రత. ఆమె యెక్కడ అడుగు పెడితే అక్కడ వెలుగులు ప్రసారితం అయ్యేవి ఆ వెలుగులో మానవుల అవధులు కరగి పోయేవి. మానవులు ఆమెముందు సహజంగా తల్లిముందు పిల్లలు ఉన్నట్లుగా ఉండటంలో యిక ఆశ్చర్యం యేముంది!

"వెళ్ళివస్తాను" అన్నాడు శ్యామసుందరుడు

"మంచిది" అన్నది ఆమె.

"మళ్ళీ కలుసుకుంటాను" అన్నాడు శ్యామసుందరుడు "సంతోషం" అన్నదామె.

శ్యామసుందరుడు అడుగులో అడుగు వేసుకుంటూ తోటవైపు నడిచాడు.

* * *

ఆ రాత్రి శ్యామసుందరునికి నిద్ర పట్టలేదు ఆమెలో కనబడే విభిన్న శక్తులను, సమన్వయం చేసుకోటానికి ప్రయత్నించాడు. తన మనస్సులో ఆమె సమగ్రస్వరూపం చిత్రించుకోవాలని తాపత్రయ పడ్డాడు. కాని, యెంత ప్రయత్నించీ లాభం లేకపోయింది, రేఖలన్నీ వున్నాయి. కాని, యే రేఖను యెక్కడ పొందుపరచాలో అతనికి కుదర్లేదు. ఆరాటం హెచ్చింది కలంతీసుకొని తన మామూలు ధోరణిలో యిలా గిలికాడు

నీదు ధవళ కాంతుల వాహినులకు
కాళరాత్రి హృదయము గగుర్పొడిచె
గాఢతిమిరములు,వెలుగులవెడలగ్రక్కె,
అవధుల కరిగె
యింద్ర ధనస్సులు వెలిసె
నీదు, జయదుందుభి వినాదములకు
శంకలు సురిగి, కళంకములు సమసె
మనసులు దద్దరిల్లె,
మరణమె బ్రద్దలయ్యె!

యింతవరకు వ్రాసేటప్పటికి అతనిలో అతనికే తెలియని ఆనందం పొంగిపొరల నారంభించింది. యింకా యిలా గిలికాడు.

మానసిక అవధులను దాట,
కానుపించె
కన్నులను మిరుమిట్లు గొలుపు
శూన్యమ్ము వెలుగు.
రూపరహితమైన ఆలోచనల కాంతి
నన్ను ముసురుకొనియె నంత
నిశ్శబ్ద గర్జనారవముల క్రాంతి
నన్ను ముంచెత్తెనంత
నిరతిశయానంద దోలికల నూగు నాకు
భువనమంతయు నీదురూపునగోచరించి
జోలలను పాడె, సమ్మోహనముగ.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"మీనా! సాయంత్రం తప్పకుండా రాజుని పంపు. లేకపోతే వద్దులే! నేనే మీ అమ్మగారికి ఫోన్ చేస్తాను." సారథి మరీ మరీ చెప్పాడు. అతనిముఖంలో ఆందోళన బాగా కన్పిస్తోంది.

సారథి నాతో మాట్లాడాలన్న ముఖ్యమైన సంగతి పూర్తిగా మర్చిపోయినట్టే వున్నాడు! రాజు—నేను యిద్దరంకలిసి బైటకి వచ్చాం. సారథికారు డ్రైవ్ చేయటం నాకలవాటే!

దోవలో వస్తుండగా రాజు చేతి రుమాలుతో భద్రంగా మడతపెట్టి దాచి వుంచిన వుత్తరం ఒకటి తీసి నాపక్కన పెట్టింది. 'వదినా! యింతక్రితం మీరు బజారు వెళ్ళబోయేముందు, నువ్వు బట్టలు మార్చుకోటానికి పైకి వెళ్ళినప్పుడు సారథి నన్ను పిలిచి బలవంతంగా యీ వుత్తరం చేతిలో పెట్టాడు. నువ్వు అది చదివితే నేను సారథియింటికి ఎందుకు వచ్చానో నీకే తెలుస్తుంది.

నేను కారు రద్దీలేని వీధిలో రోడ్డు వారగా ఆపి అది తీసుకుని చదివాను. అందులో యిలా వుంది.

ప్రియమైన రాజేశ్వరీ!

నేను వారంరోజుల నుంచి రాత్రింబవళ్ళుపడిన మధనలోనుంచి తేరుకున్న తరువాతదీ వుత్తరం! శ్రద్ధగా జాగ్రత్తగా, ఆ పాఠం చదువు. మీనాని నా భార్యగా చేసుకోవాలని నేను ఒకప్పుడు వుబలాటపడిన మాట నిజమే! మీనా అందం, ఐశ్వర్యం, ముఖ్యంగా వాళ్ళ అమ్మ వ్యక్తిత్వం నన్ను బలంగా ఆకర్షించినాయి. చదువుమాత్రమే బాగా

వున్న నేను అత్తవారుగా వీరి అండ దండలు లభిస్తే జీవితంలో యింకా పైకి ఎగ్రబాకవచ్చునని ఆశించాను కానీ రాను రాను నా భ్రమలు ఒక్కొక్కటీ తొలిగి పోసాగినాయి. మీనా యింత మూర్ఖురాలని నేను కలలో కూడా అనుకోలేదు. ఆ అమ్మాయిమీద వాళ్ళమ్మ వ్యక్తిత్వపు ప్రచారం విపరీతంగా వుంది. తల్లి నీళ్ల చూపించి యివి పాలు అంటే మీనా విస్పంకోచంగా అవునంటుంది. అవి నిజంగా పాలేనవి నమ్మకుంది కూడా। ధనం, అహంకారం, మూర్ఖత్వం పుష్కలంగా గల మీనాలో భవిష్యత్తు వూహించినకొద్దీ నాకు కాళ్ళక్రింద భూమి కదులుతున్నట్లుగా వుంది. మీనాతో ప్రధానం నాకు జరగటం లేదు. కృష్ణవేణమ్మగారితో నేను ఈ విషయం చెప్పదల్చుకున్నాను యిది వాళ్ళమీద ఎలా పని చేస్తుందో నాకు తెలుసు'' వాళ్ళతో పోట్లాట జరిగిన తర్వాత నేనిక్కడ వుండదల్చుకోలేదు. సాధ్యమైనంత త్వరలో ఢిల్లీ వెళ్లిపోతాను. నాకు మీనాని చూసిన తర్వాత డబ్బున్న అమ్మాయిలంటే హడలు పుట్టింది. వాళ్ళ జోలికే పోకూడదని పిస్తోంది చాలా సామాన్య కుటుంబాలలో నుంచి వచ్చిన అమ్మాయిని చేసుకోవాలని పిస్తోంది. ఆ వ్యక్తివి నువ్వెందుకు కాకూడదూ। నువ్వు కృష్ణవేణమ్మగారికి భయపడ నవసరంలేదు. నేను నిర్భయంగా అవిడకి మవ్వు నాకు వచ్చిన సంగతి చెప్పగలను. నిన్ను చూసిన తర్వాతనే నాకు రాబోయే భార్య యిలా వుండాలి సుమా అన్న అభిప్రాయం ఏర్పడింది రాజేశ్వరీ। నేనంటే నీ కిష్టం వుందో లేదో నాకు వెంటనే తెలియచెప్పాలి. నీ కిష్టమే అయితే క్లుప్తంగా యిద్దరం రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుని యిక్కడనుంచి వెళ్లిపోదాం. నువ్వు వీలు చూసుకుని సాయంత్రంలోపల ఒక్కసారి యిక్కడకి వస్తే మనం అన్ని విషయాలు వివరంగా మాట్లాడుకుందాం. స్నేహితురాలికి అన్యాయం జరుగుతుందేమోననే కుశంకలు వదలేయి యిందులో నువ్వు చేసింది ఏమీ లేదు. నన్ను ఆకర్షించాలనికాని, లోబరుచుకోవాలని కాని ఎప్పుడు ప్రయత్నించలేదు. నువ్వు రాకపోయినా నేను మీనాని చేసుకునేవాడిని కాదు. కాబట్టి మీనాతో వివాహానికి నాకు విముఖత్వం కలగటానికి-నీకూ ఎలాటి సంబంధమూ లేదు. నా యీ వుత్తరం చూసి కూడా మవ్వు నాతో మాట్లాడటానికి నాదగ్గరికి రావనుకో। అది నేను నీ అంగీకారంగా తీసుకుంటాను। ఈ సాయంత్రమే కృష్ణ వేణమ్మగారితో ఈ విషయం చెప్పి నువ్వుకూడా ఒప్పుకున్నావనుకుంటాను. నువ్వు వచ్చి మాట్లాడకపోతే సంపూర్ణంగా నా యీ అభ్యర్థనని మన్నించి యిష్టపడినట్టే అనుకుంటూ ఈ ఉత్తరం ముగిస్తున్నాను.

వుంటాను.

నీ

సారధి.

చదవటం పూర్తిచేసి నేను నిట్టూర్పు విడిచాను జాగ్రత్తగా మడతపెట్టి జేబు రుమాల్లో భద్రపరిచి రాజు చేతికిచ్చాను

అది నిటారుగా కూర్చుని రోడ్డువైపు చూస్తోంది

"ఏమిటి? నీ ఆలోచన!" అన్నాను

"నన్ను తక్షణం నిమ్మలూరు పంపివేయి"

"నువ్వేం తప్పు చేశావని"

"నీకు తెలియదు" రాజు నా వైపు తిరిగింది కళ్ళలో మళ్ళా నీరు తిరుగుతుండగా అంది 'వదినా! నిమ్మలూరులో ఆ పెళ్ళి గొడవమూలంగా కాస్త పట్నం వచ్చి నీ దగ్గర సరదాగావుంటే ఆ బాధంతా మర్చిపోగలను అనే ఆశతో వచ్చాను ఇలాటి విపరీతమైన సంఘటనలు ఎదురవుతాయి అంటే చచ్చినా వచ్చేదాన్ని కాదు యిందులో నా పొరపాటేదీ లేదని నువ్వు నమ్ముతావా వదినా!"

దానికి దుఃఖం వచ్చేసింది నేను రాజు తలని నా భుజంమీదకి లాక్కున్నాను

"ఏమిటో పిచ్చి తనం! ఇందులో నీ పొరపాటేంలేదని స్వయంగా సారధే ఒప్పుకుంటున్నాడుగా!"

"నా కేమిటో చాలా భయంగా వుంది"

"ఒక్కమాట చెప్పు విషయం ఇంత దూరం వచ్చిన తర్వాత నన్ను ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోతావా?"

"నే నుంటే యింకా సమస్యలు తల ఎత్తుతాయి!"

"ఎత్తనీ! ఏది జరిగినా నీ మంచికే అని నమ్ముతాను నేను ఈ రోజు యీ వుత్తరం చూడటంవల్ల నా మనసు ఎంత తేలికగా ఉంటుందో తెలుసా!"

"వదినా! నీ మాటలు నాకేం అర్థం గావటం లేదు"

"ఒక్క రెండు రోజులు ఓపికపట్టు నువ్వే తెలుసుకుందువుగాని పిచ్చి పిచ్చి ఆలోచన్లు మానేసి ధైర్యంగావుండు ఏది వుంటానని మాట యివ్వు" నేను చెయ్యి చాచాను రాజు నా చెయ్యి వెనక్కు లాక్కుంది నేను మారినట్టూ మాట యివ్వలేదు

* *

ఆ సాయంత్రం కృష్ణదగ్గరకు వెళ్ళటానికి నాకేమంత కష్టం కలగలేదు ఇంట్లోంచి బైలుదేరటానికి ఏం కారణం చెబుదామా అని సతమతమౌతున్న నాతో— టీ తాగుతుండగా అమ్మ—"అమ్మడూ! చెప్పటం మర్చిపోయాను టైలర్‌కి నీ జాకెట్ కొలతలు పంపిస్తానని చెప్పాను. ఈ మధ్య నీ జాకెట్లు అన్నీ టైట్‌గానే వున్నాయి ఖరీదుగల గుడ్డలు వెళ్ళి కాస్త వదులుగా సరైన కొలతలు యిచ్చిరా" అంటూ పురమాయించటంతో నా మనసు ఎగిరి గంతువేసినట్టయింది కోరుకున్న పెన్నిధి కళ్లెదుట నిల్చినంత ఆనందంగా అనిపించింది.

"అలాగే మమ్మీ!" ఎంతో అణకు

వుగా అన్నాను నిజమే! ఈ మధ్య నేను కాస్త లావుగా అయానని అందరూ అంటున్నారు నా పాత జాకెట్లు అన్నీ ఒంటికి అంటించినట్టు అయినాయి నేను అసలే కాస్త పొడుగ్గా వుంటాను దానికి తోడు లావుఅయితే మరీ పెద్దదానిలా కన్పిస్తానని అమ్మకి భయం నన్ను డైట్ చేయమని మందలిస్తున్న అమ్మని నాన్నగారు విన్నప్పుడల్లా కేకలేసేవారు 'నీ మొహం! లావయినంతమాత్రాన పెద్దవాళ్ళయిపోతారా! మొహంలో పసితనం ఎక్కడికి పోతుంది ఆమాటకొస్తే సన్నగా ఒరుగుల్లా వున్నవాళ్ళు ముదిరిపోయిన బెండకాయల్లా ముదిముఖాల్తో తెలియరంటావా!'' అనేవారు నాన్నగారు నా తరపున వకాల్తా పుచ్చుకోవటంతో నాకు డైటింగ్ బాధ తప్పేది లేకపోతే చచ్చిపోయి వుండేదాన్ని! నాకు అసలే విపరీతమైన ఆకలి! అయినా అమ్మకి యీ వయసుని గురించిన భయం ఏమిటో నాకు బొత్తిగా అర్థంగాదు మనిషికి కాలంతో పాటు శారీరకంగా మార్పు రావటం ఎంత సహజం! ఎన్నాళ్ళని ఏటికి ఎదురీదగలం! ఎన్నాళ్ళని కాలంతో పోరాడగలం! ఎప్పటికైనా మనం దాని చేతుల్లో ఓడిపోక తప్పదు అనవసరంగా అపరూపమైన కాలాన్ని వ్యర్థమైన శంకలతో చేజార్చుకోవటం తప్ప యింకేం మిగలదు అసలు ఏ వయసుకు తగ్గట్టు ఆ వయసులో మనిషి హుందాగా వుండటం నేర్చుకోవాలి! అలావుంటే అంతకు మించిన ఆకర్షణ — అందం యింకేవీ వుండవు వన్నడిగితే అసలైన సౌందర్యం వ్యక్తిత్వంవల్ల మాత్రమే వస్తుంది. శారీరకంగా వచ్చే అందం యీ రోజున వుంటే రేపు పోవచ్చు! వ్యక్తిత్వంద్వారా మన చుట్టూ ఏర్పరుచుకున్న ఆకర్షణ జీవితాంతం వుంటుంది

ఏమిటో! కొన్నికొన్ని విషయాల్లో అమ్మకి—నాకు స్వభావంలో — అభిప్రాయాల్లో పూర్తిగా పరస్పరవిరుద్ధంగా అనిపిస్తుంది

నేను వెళ్ళటానికి తయారవుతూవుంటే రాజు నాదగ్గరికివచ్చి ''వదినా నేను కూడా నీతోవస్తాను '' అంది.

'నువ్వెందుకు? నేను జాకెట్ క్లాత్ తలుయిచ్చి క్షణంలో వచ్చేస్తాను'' అన్నాను రాజు నాభుజంమీద చెయివేసి నా కళ్ళలోకి అర్థిస్తున్నట్టుగా చూస్తూ— దీనంగా అంది ''ఏమో వదినా! నాకెందుకో చాలా భయంగా వుంది! నా మనసు ఏమిటో అశుభాన్ని శంకిస్తోంది! వూహించనిదేదో జరగబోతున్నట్టు నా గుండెలు బిగదట్టినట్టు అవుతున్నాయి మువ్వ-నువ్వు-ఒక్క క్షణం కనుమరుగు అయితే—వెయ్యి ఆలోచన్లు నన్ను వేధిస్తున్నాయి

నా భుజంమీద వున్న రాజు చెయ్యి మృదువుగా నొక్కాను. ''ఓయ్ పిచ్చి మొహమా! నువ్వు ఒట్టి అంగారు మని



షయు వ



# Kleertone

## క్లీర్‌టోన్ ఆటోమేటిక్ ఇస్త్రీపెట్టె వాడి విద్యుత్తు పై ఖర్చు తగ్గించుకోండి

ఇంపీరియల్ ఆటోమేటిక్ ఇస్త్రీ

- 230 / 250 వోల్టులు ఎ సి గాని లేక ఎ సి/డి సి పై గాని పనిచేస్తుంది
- 800 వాట్లు కలది
- 2 7 కిలోగ్రాముల బరువుగలది
- ఇస్త్రీ పెట్టె అంతా సమానంగా వేడెక్కుతుంది

Kleertone క్లీర్‌టోన్ — సాటి లేని విద్యుత్ ఉపకరణాలు

నేషనల్ రేడియో & ఎలక్ట్రానిక్స్ కం లిమిటెడ్

(జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్)

బొంబాయి కలకత్తా ఢిల్లీ మద్రాసు

ULKA KL I TL

షివి! అంతకంటే యింకేం కాదు నువ్వు అనవసరంగా నీ పీడని చూసి దుడుసు కుంటున్నావు నీ ఆలోచన్లే విన్ను నతా యిస్తున్నాయి నే నుండగా ఏ అశుభమూ జరగదు నీకేం భయంలేదు సరేనా?'' లాలనగా దానివైపు చూసాను

''ఏమో వదినా— ' రాజు యింకేదో చెప్పబోతుండగా యింతలో క్రిందనుంచి "అమ్మాయి-రాజూ!" అన్న అమ్మపిలుపు వినిపి-చిం:

''వదినా! నేనుకూడా నీతో వస్తాను నేను లేకుండా నువ్వు వెళ్ళొద్దు'' రాజు మరోసారి నన్ను హెచ్చరిస్తున్నట్టుగా అని క్రిందకు వెళ్ళిపోయింది

పదినిముషాల్లో నేను గబగబా తయారై క్రిందకి వచ్చాను ఎక్కడ ఆలస్యం చేస్తే రాజు మళ్ళీ వచ్చి నేనుకూడా వస్తాను అని హరంచేస్తుందో నసే భయంతో జద గబగబా అల్లుకుని ఎదురుగా స్టాండ్‌మీద చేతికి అందిన చీర తీసుకుని కట్టుకుని వచ్చేసాను

అమ్మకోసం క్లబ్ తరఫునుండి ఎవరో వచ్చారు వాళ్ళంతా క్రిందహాల్లో కూర్చుని మాట్లాడుతున్నారు ఆ సంభాషణ నా గురించి వినిపించటంతో మెట్లమీద అప్రయత్నంగా ఆగిపోయాను

"అమ్మాయికి పెళ్ళి స్థిరపడిందిటగా!" ఒకావిడ అడుగుతోంది.

''అవునండీ! లగ్నం నిశ్చయం అయింది రెండురోజుల్లో ప్రధానం చేస్తున్నాం అట్టే వ్యవధికూడా లేదు. మీరందరూ తలో చెయ్యి వేయాలి ''

''అయ్యో తప్పకుండాను!''

''మీ అమ్మాయి పెళ్ళికి మీరేమో కానీ మే మ ం తా ఎదురుచూస్తున్నామంటే నమ్మండి మీరిలా చేస్తారని—అలా చేస్తారని అప్పుడే అంతా వూహిస్తున్నారు ''

''దానిదేముంది లెండి నేనుమాత్రం మీలాటిదాన్ని కానా!" అమ్మ నవ్వుతూ అంది

అల్లుడు యిల్లరికం వచ్చేట్టేగా!'' యింకో ఆవిడ అడిగింది

"రాకపోతే నేనసలు ఒప్పుకుంటానా!" అమ్మ గొంతులో ఏదో ధీమా!

' అవునండి ఒక్కగా నొక్క పిల్లయ్యె అది సహజమేగా! '

' అందులో అతనికి తల్లీతండ్రి లేరు నేను చెప్పాను 'అబ్బాయి! నువ్వే మాకు కొడుకు మా అమ్మాయే కోడలు అనుకుంటాం అని '' అంది అమ్మ

''బాగా చెప్పారు'' అందరూ గొల్లున నవ్వారు.

వాళ్ళ నవ్వు అలలుఅలలుగా తేలి వచ్చి నన్ను ముంచేయసాగింది నా గుండెల్లో అతి సున్నితమైనదేదో ఆ నవ్వులకి భయపడిపోయినట్టు ముడుచుకుపోసాగింది క్షణంసేపు కృష్ణదగ్గరకు వెళ్తున్నాననే ఆనందం — కుతూహలం కూడా చచ్చిపోయినాయి.

ఇంతలో ఒకావిడ నన్ను చూసింది.

"అదుగో! మీనా వస్తోంది."
అందరూ తిరిగి చూసారు
నేను క్రిందకి దిగివచ్చాను
"మమ్మీ! నేను వెళ్తున్నాను" అన్నాను
"వెళ్ళి త్వరగారా! చూడు! వచ్చేటప్పుడు సారథి దగ్గరికి వెళ్ళి అతన్ని కూడా తీసుకురా నాన్నగారు ఏదో మాట్లాడాలి అన్నారు"
యాంత్రికంగా తలవూపి బైటకి వచ్చేసాను
సారథి! సారథి! అనుక్షణం ఆవిడ నోట్లో అదేమాట! ఆవిడ అంతగా అభిమానిస్తున్న ఆ సారథి మనసులో నాకు స్థానం లేదని యింకోరు చోటు చేసుకున్నారని తెలిపిన క్షణంలో ఆవిడ ముఖం ఎలా వుంటుందో!
"యిల్లరికం రాకపోతే నేనసలు ఒప్పుకుంటానా!' ఆవిడమాటలు నా చెవుల్లో గింగురుమన్నాయి ఆకంఠంలో ఎంతధీమా! ఎంతనమ్మకం!
"సారధేకాదు—యీ యింటికి యిల్లరికం రావాలనే అభిలాషవున్న ఏ వ్యక్తి నీదకూడా నేను సహించలేనని ఆవిడకి అరిచి చెప్పాలనిపిస్తోంది
"అతనికి తల్లీ తండ్రిలేరు నేను చెప్పాను అబ్బాయి! నువ్వే మాకు కొడుకు మా అమ్మాయే కోడలు అనుకుంటాం!"
అమ్మఅన్న యీ మాటలు నాకు బాణాల్లా గుచ్చుకోసాగినాయి సారధిలో ముఖ్యంగా—ప్రప్రధమంగా అమ్మని ఆకట్టుకున్న విషయం ఏమిటో నాకిప్పుడు అర్థమైంది సారధికి తల్లీ తండ్రిలేరు కృష్ణవేణమ్మగారికి రాబోయే అల్లుడికి నా అనే దగ్గరవాళ్ళు ఎవరూ వుండకూడదు! సాధారణంగా పెళ్ళిఅయితే ఆడపిల్ల అత్తవారి యింటివైపు వాళ్ళని కలవాలి యిక్కడ దానికి పూర్తి విరుద్ధంగా వుంది అమ్మ మాట మాటకి ఒకిటికి పదిసార్లు సారధి విషయంలో నాకంటే కూడా ముఖ్యంగా తను అదృష్ట వంతురాలినని ఎందుకు అంటోందో నాకిప్పుడు అర్థమైంది ఆవిడ అక్షరాలా కోరుకున్న వ్యక్తి లభించాడు సారధిలో అమ్మ ఆలోచించినవన్ని వున్నాయి తనకి తగిన అల్లుడు వచ్చాడని మురిసిపోతోందే తప్ప నా వూహలకి సారధి తగినభర్త అవునా కాదా అని అమ్మ ఆలోచించటంలేదు
ఈ విషయంలో నాన్నగారుకూడా అమ్మపక్షం అవటంతో నేను పూర్తిగా ఒంటరి దాన్నయిపోయాను ఈ విషమ స్థితిలో యీ రూపేణా రాజు అనుకోకుండా వచ్చి నాకు అండగా నిలుచుంది రాజు అంటే సారధికి ఆకర్షణ కలగడం నిజంగా ఒకవిధంగా నా అదృష్టం అని చెప్పాలి చల్లగా యీరోజో—రేపో సారధికి నామనసులోవున్న యీ బాధంతా చెప్పేయ్యాలి నేను—సారధి—రాజేశ్వరి ఒకటి అయితే అమ్మ మమ్మల్ని ఏమీ

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి'



పిల్లల శక్తి చదువుల్లో ఆటల్లో త్వరగా హరింపు అయిపోతుంది. శక్తిని తిరిగి సమకూర్చటానికి ప్రతి దినం వారికి బోర్న్‌విటా ఇవ్వటం మంచిది. క్యాడ్‌బరిస్ తయారుచేసిన రుచికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారల సంతులిత మిశ్రమం–బోర్న్‌విటా.




## శక్తి, ఉత్సాహం మరియు
## రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!

*Bensons/4664 Tel*

చేయలేదు చల్లగా ఒక శుభముహూర్తాన రాజాని రిజిష్టర్ మ్యారేజ్ చేసేసుకోమని చెప్పేస్తాను అవసరంఅయితే నేను దగ్గరుండి జరిపిస్తాను

ఆలోచనల్ల పరవడిలోపడి కొట్టుకు పోతున్న నేను.

కృష్ణ వుంటున్న హోటల్ దాటి ముందుకు వెళ్ళిపోతున్నానని గుర్తుకొచ్చి కారు రివర్సుచేసి వెనక్కి తీసుకువచ్చాను హోటల్ ఆవరణనిండా—బైటా తళ తళ లాడ్తున్న కార్లు బారులు తీర్చి నిల బడ్డాయి రక రకాల మనుష్యులు హడా వుడిగా తిరుగుతున్నారు

హోటల్‌గేటుకి సుస్వాగతం అని అక్షరాలు కుట్టిన గుడ్డ వేళ్లాడుతోంది ఎవరో—బాగావున్నవాళ్ళది పెళ్ళి రిసెప్షన్‌లా వుంది

ఆజనం—ఆకలదడి చూస్తే ఒక్క క్షణం నాకు మతిపోయినట్టుగా అయింది అక్కడెక్కడా చోటులేక పోవడంతో కారు రోడ్డుమీద దూరంగా పార్కుచేసి నడిచి రావాల్సివచ్చింది

లోపలకివచ్చిన నేను ఎలాగో ఆ జనాన్నుంచి తప్పించుకుంటూ ఎంక్వయిరీ వైపు వెళ్ళాను. ఏ దెనిమిది అంతస్థులు అటుయిటు రెక్కలు చాచుకున్నట్టున్న ఆ హోటల్‌కి రెండు మూడువైపుల నుంచి మెట్లున్నాయి కృష్ణవున్నరూమ్ ఎటువైపున వుందో ఎంక్వయిరీ చేయ టానికి వెళ్తున్న నేను యింతలో మీనా అన్న పిలుపు—మోచేతి దగ్గర అంటీ అంటనట్టు తాకిన స్పర్శతో వెనక్కి తిరిగి చూసాను. నాఎదురుగా కృష్ణ నిలబడివున్నాడు.

"ఓ! నువ్వా!' అన్నాను

"నిన్ను గేటుదగ్గరే చూసాను నేను నీదగ్గరకి వచ్చేలోపలే నువ్వు జనంలో కలిసి దూరమయ్యావు" అన్నాడు.

"నీరూమ్ ఎటువైపున వుందో కను క్కుందామని వచ్చాను"

"యిటురా. యిటువైపు వెళ్ళాలి దారితీస్తూ అన్నాడు

నేను అతన్ని అనుసరించాను జనం జనం! నేల యీనినట్టుగా కిటకిట లాడ్తు న్నారు అందరిలో ఏదో వుత్సాహం!

"యిటురా! మెట్లు చాలా వున్నాయి లిఫ్టులో వెళదామా!" అన్నాడు

నేను తలవూపాను

ఇద్దరం లిఫ్ట్ దగ్గరకి వచ్చాం కృష్ణ వుంటున్న గది పై అంతస్థులో వుందిట లిఫ్టులో యిద్దరం పక్క పక్కగా నిల బడాం ఎదురుగావున్న అద్దంలో కృష్ణ పక్కగా నేను సరిగ్గా భుజాలదాకే వచ్చాను నాఎదురుగా కన్పిస్తున్న ప్రతి బింబంవైపుచూసి నేను నవ్వాను

అతను నవ్వలేదు నేను నవ్వటం యిష్టం లేనివాడిలా చప్పున ముఖం పక్కకి తిప్పుకున్నాడు

"అబ్బ! ఎంత ఎత్తున వుంది యీ గది. మెట్లమీదనుంచివస్తే నిజంగా కాళ్ల

నొప్పి పుట్టేవేమో" అన్నాను అతను రూమ్ తాళం తీయగానే గదిలోకి అడుగు పెట్టూ

"కూర్చో." అన్నాడు

నేను రూమంతా కలియచూసాను డబుల్ రూమ్। కర్టెన్లు - మంచాలమీద పరిచిన దుప్పట్లు - క్రింద పరచిన తివాసి రూమ్ ఖరీదు చాలా వుంటుందని చెబు తున్నాయి

"కూర్చో।" ఫాన్ వేస్తూ మరోసారి అన్నాడు

"నువ్విలా చాలాసార్లు నాన్నగారికి క్లయింట్స్ని తెస్తూవుంటావా?" సోఫాలో కూర్చుంటూ అడిగాను కృష్ణతో ఆ వచ్చినవాళ్లెవరో బాగా డబ్బుగల వాళ్ళే అయివుండాలి

"చాలాసార్లు కాదు సాధ్యమైనంత తక్కువగా తీసుకువస్తాను మామూలు వాళ్ళయితే మామయ్య ఛార్జీలకి తట్టుకో లేరు తట్టుకోగల తాహతు గలవాళ్ళయితే తెస్తాను "

'అదేమిటి? నువ్వు చెబితె నాన్న కాదంటారా? మా నాన్నేమీ ఎవరినీ డబ్బుకి పీడించేమనిషి కాదే।"

"కాదనుకో। నాకూ మామయ్యని మొహమాట పెట్టటం యిష్టంలేదు సరే కానీ। తాగటానికేమైనా తెప్పించ మంటావా?"

"ఎందుకులే యీ మర్యాదయి। నేను తాగాలని కోరుకునేది నువ్వు తెప్పించ లేవు కాబట్టి వూరుకో।"

"అంటే? ' సీరియస్గా అడిగాడు

"చెప్పమంటావా? నాకు అమృతం తాగాలని వుంది నువ్వు తెప్పించగలిగితే తెప్పించు "

నేను ఆశించినట్టుగా అతను నవ్వ లేదు అసలు ఈ రోజు అతని కళ్ళలో కొంటెతనమే లేదు ప్రతిసారి నన్ను చూడగానే చురుగ్గా వుండే ఆ కళ్ళు కాంతితో లీలగా మెరిసేవి ఈరోజు అదీలేదు అతని మనసులో ఏదో బాధ వున్నట్టు దాన్ని గాంభీర్యం దాచేయాలని వ్యర్థప్రయత్నం చేస్తున్నట్టు అనిపించింది నాకు

కృష్ణ నా మాటమీద ఎలాటి వ్యాఖ్యానం చేయలేదు వెళ్ళి బెల్ నొక్కాడు

"తెప్పిస్తున్నావా అమృతం?" అన్నాను నవ్వుతూ

"అంత తాహతు నాకు లేదు.

"ఏమిటి విశేషం? ఈ రోజు కోపం భోజనం చేసినట్టు కరకర మంటున్నావు "

అతను నావైపు చురుగ్గా చూసాడు

"ఎవరిమీదా కోపం? నామీదేనా।" రెట్టించాను

"అవును నీమీదే "

"చచ్చాం। నీకు నిజంగానే కోపం వచ్చినట్టుందే। నా అపరాధం ఏమిటో శలవిస్తారా కృష్ణారావుగారూ।"

"నీకంతా నవ్వులాటగా వుంది। అంతేలే। పిల్లికి చెలగాటం ఎలుకకి ప్రాణ

సంకటంట! చిన్ననలు నిమ్మలూరు రావివ్వటం నాది బుద్ధితక్కువతనం మామయ్య మొట్టమొదటసారి ఉత్తరం వ్రాసినప్పుడే. పంపవద్దు మేం పరాయి వాళ్ళం అని వ్రాస్తే సరిపోయేది అంతే! ఒక చిన్న పొరపాటు చేస్తే చచ్చినట్టు జీవితాంతం అనుభవించాల్సిందే! '

అతను నిజంగానే కోపంగా వున్నాడు

నేను విస్తుపోయినట్టు చూడసాగాను

ఇంతలో బాయ్ తలుపుమీద తట్టి "సార్!" అంటూ లోపలకు వచ్చాడు

"టిఫినేమయినా తింటావా?" కృష్ణ అడిగాడు నన్ను

నేను వద్దన్నట్టు తలవూపాను

అతను బాయ్‌వైపు తిరిగి "రెండు బాదంఫీర్" అని చెప్పేసాడు

బాయ్ వెళ్ళిపోయాడు

"రాజేశ్వరి ఎవరో మీ అమ్మకి తెలుసా!" బాయ్ వెళ్ళిపోగానే నావైపు తిరిగి అడిగాడు అతని కంఠం శాంతంగా వున్నమాట నిజమే! కానీ పదునుపెట్టిన కత్తిఅంచులా వాడిగా వుంది

నేను వులిక్కిపడ్డట్టుగా చూసాను

"చెప్పు మీనా! రాజు ఎవరో మీ అమ్మకి చెప్పే ధైర్యం లేనప్పుడు అసలు దాన్ని మీ యింటికి ఎందుకు తీసుకు వెళ్ళినట్టు! మేమందరం బ్రతికివుండగానే లేనివాళ్ళక్రింద జమచేయాల్సిన అవసరం నీకేమొచ్చింది! నేనుండగానే. నా చెల్లెలు అనాధ అని — దిక్కులేనిదని చెప్పి

యింకొకరి యింట్లో వుండటం విని నేను భరించగలవనే అనుకున్నావా?"

నేను తలెత్తలేకపోయాను. నా మనసు పాతాళలోకంలోకి కృంగిపోయినట్టుగా అయింది. ఇదంతా కృష్ణకి ఎవరు చెప్పారు? ఎలా తెలిసింది? అతను నిష్ఠూరం నిండిన గొంతుతో రెట్టించాడు.

"మాట్లాడవేం మీనా? ఎందుకిలా చేసావు? నేనింకా యిన్నాళ్ళూ రాజు ఎవరో తెలిసే మీ యింట్లో వుంటోం దనుకున్నాను. మీ అమ్మ నన్ను పరాయి వాడిగా తోసేసినా—రాజుని స్వంత మేన కోడలు కాబట్టి ఆదరించి అభిమానించిం దని ఆశపడ్డాను. రాజు అసలు ఎవరో ఆవిడకి తెలియనే తెలియదనేసరికి నే నెంత తల్లడిల్లి క్రిందులయానో నువ్వు ఊహించగలవా? ఇంతకంటే అవమానం నా జన్మలో యింకోటి వుంటుందా?"

నే నెలాగో ధైర్యం అంతా కూడ దీసుకుని తలెత్తాను.

అతనివైపు చూసిన మరుక్షణంలోనే గతుక్కుమన్నాను.

ఆ కళ్ళలో కోపం—అవమానం—బాధ—రోషం మూకుమ్మడిగా బలవంతంగా దిగమింగుతున్నట్టుగా సుడిపడుతూ కనిపించాయి.

అతను ఎంత అభిమానవంతుడో నేను ఎరగంది కాదు. నేను దాన్ని తీవ్రంగా గాయపరిచానని తెలుసుకున్నాను. కానీ నా మనసులో వున్న సంగతి వేరే నని అతనికి ఎలా తెలుస్తుంది?

నాకు చప్పున లేచి అతని దగ్గరగా వెళ్ళాలనిపించింది. అతని చేతులు నా చేతుల్లోకి తీసుకుని చాలా రోజుల నుంచి నా గుండెల్లో గుబగుబలాడుతున్న ఆలోచన్లు మనసు విప్పి చెప్పేయాలనిపించింది. కానీ ఏదీ చేయలేక పోయాను. అసలు కుర్చీలోనుంచి లేవటమే నా వశంలో లేనట్టుగా కూర్చుండి పోయాను.

"మీనా! నువ్వింత పిరికిదానివని కలలో కూడా అనుకోలేదు. నవ్వుతూ—తుళ్ళుతూ—ఆటపట్టించి—అందరినీ తమాషాచేసి ఏడిపించే ఆ అల్లరి పిల్ల వెనక అవసరంవస్తే ధైర్యంగా నిలబడగల సాహసమైన మనిషి వుందనుకున్నాను. నా కిప్పుడు అర్థం అవుతోంది. నేను ఇన్నిసార్లు వచ్చాను. మనం యిన్నిసార్లు కలుసుకున్నాం. నువ్వు ఒక్కసారి—కనీసం మర్యాదకి—మాటవరసకైనా నన్ను మీ యింటికి ఎందుకు రమ్మనమని పిలవలేదో యిప్పుడు తెలుస్తోంది. మీ అమ్మకి నా పొడంటేనే గిట్టదు. కాబట్టి నువ్వామాట అని వుండవని అనుకున్నానే కాని నేను వస్తే రాజు ఎవరో తెలిసి పోతుందని నువ్వు భయపడ్తున్నావని అనుకోలేదు. సరే! ఇప్పటికి జరిగిందేదో జరిగిపోయింది. రాజుని తక్షణం పంపేయి." అన్నట్టు చెప్పటం మర్చిపోయాను. కృష్ణ ఏదో గుర్తుకు వచ్చినవాడిలా అవతల వున్న డ్రెస్సింగ్ రూమ్‌లోకి వెళ్ళాడు.

పెట్టె తెరిచి మూసిన చప్పుడు వినిపించింది.

కృష్ణ చేత్తో పెద్ద కవరుతో తిరిగి వచ్చాడు అది నా యెదుట పెడుతూ అన్నాడు

"ఇదుగో పొలం తాలూకు డబ్బు దాని ధరకి ఎకరంమీద వెయ్యి చొప్పున ఎక్కువే కట్టి యిచ్చాను దానిమీద వడ్డీ కూడా కలిపి యిచ్చాను"

'హఠాత్తుగా యింత డబ్బు నీ కెలా వచ్చింది?"

"అది నీ కనవసరం"

"అంటే? మన మధ్యవున్న సంబంధ బాంధవ్యాలన్నీ తెంచుకు వెళ్ళటానికి వచ్చావన్నమాట అవునా?" పళ్ళుబిగువున అడిగాను

"అసలు మన మధ్య అలాంటివి వుంటేగా తెంచుకోటానికి?'

"అంటే నీ ఉద్దేశ్యం? ఏ సంబంధమూ—బాంధవ్యమూ లేకుండానే నేను నిమ్మలూరు వచ్చానా?'

"నీ అవసరానికి వచ్చావు నా మీద ప్రేమతో కానీ—నమ్మల్ని చూడాలనే అభిమానంతో కానీ రాలేదు అ సంగతి నీకూ తెలుసు.'

నేను పెదవి కొరుక్కుంటూ కూర్చుండి పోయాను

ఇంతలో బాయ్ వచ్చాడు ట్రేలో రెండు గ్లాసులతో బాదంఫీర్ తెచ్చి మా మధ్య వున్న టేబిల్‌మీద పెట్టి వెళ్ళాడు

క్షణం పేపు అతనూ ఏం మాట్లాడ లేదు నేనూ ఏం చెప్పలేక పోయాను నా మనసంతా చేదు తిన్నట్టు ఎలాగో వుండిపోయింది

బాయ్ వెళ్ళిపోయిన కొద్దిసేపటికి కృష్ణ బాదంఘీర్ వున్న గ్లాసు తీసి నా కందిస్తూ తీసుకో' అన్నాడు

'నాకేం వద్దు నన్నడిగి తెప్పించావా? ' అన్నాను

కృష్ణ సమాధానం చెప్పలేదు

నేను ఆశించినట్టు యింకోసారి బ్రతిమలాడలేదు

రెండు గ్లాసులూ పట్టుకుని లేచి వెళ్ళి బాత్‌రూమ్‌లో వాష్ బేసిన్‌లో ఒంచేసి గ్లాసులు తెచ్చి ట్రేలో పెట్టేశాడు

నేను నిర్ఘాంతపోయాను!

''ఏమిటా తీవ్రత? ఇదంతా నిజంగా నా మీద కోపమే!'' అన్నాను విస్మయంగా చూస్తూ.

''కోపమా! నీ మీదా! ఎందుకు? నిన్న డగకుండా తెప్పించిన మాట నిజమేగా! ఇదుగో—యీ డబ్బు తీసుకెళ్ళు రాజుని ఎన్నింటికి పంపిస్తావో చెప్పు ''

''ఆ రెండూ చేయలేను '' మొండిగా అన్నాను

''డబ్బు నువ్వు తీసుకు వెళ్ళక పోయినా నేను యింటికి పంపగలను రాజుని నువ్వు తీసుకురాకపోయినా రప్పించుకో గలను ఇన్నాళ్ళూ అవి చాతకాక వూరుకున్నానని మాత్రం అనుకోకు ''

"ఏం చేస్తావేం?''

''చూస్తావా? ' అతను వెంటనే లేచి ఫోన్ దగ్గరకు వెళ్ళాడు రిసెప్షన్‌కి పిలిచి మా యింటి నంబరు చెప్పి కనెక్ట్ చేయమని అడిగాడు నేను చప్పున లేచి అతని దగ్గరకి వెళ్ళాను

''ఏమిటిది? యింటికెందుకు ఫోన్ చెయ్యటం?''

''రాజుని పిలవమని. నేను మాట్లాడుతున్నానని నువ్వు యిక్కడ వున్నావని చెబుతాను '

నా గుండెలు దడదడలాడినాయి ఫోన్ నంబరు కలిపినట్టుగా వెంటనే గణగణలాడుతూ రింగ్ అయింది

కృష్ణ రిసీవర్ తీసుకుని హలో అన్నాడు

నేను అతనిచెయ్యి గట్టిగా పట్టుకుని మరోచేత ఫోన్‌మీద వేళ్ళతో గట్టిగా నొక్కి డిస్కనెక్ట్ చేసాను ఆ సమయంలో అక్కడ అమ్మేవుంటే యింకేమైనా వుందా!

''నీకేమైనా మతిపోయిందా? ఏమిటీ తొందర?" అన్నాను కోపంగా

''నీ దయవల్ల నా కిప్పుడు కాదు. ఎప్పుడూ మతిపోదు చెయి తియ్ ''

''తియ్యను నువ్వింత దౌర్జన్యం మనిషివని కలలోకూడా అనుకోలేదు నేను ఓడిపోయాను! నువ్వు చెప్పినట్టే చేస్తాను ఇవతలకి రా!''

''నిజంగా నేనా?''

నిజంగానే! ముందురా యివతలకి అతనిచేతిలో ఫోన్ లాక్కుని పెట్టేస్తూ అన్నాను

అబ్బబ్బ! ఏం మనిషివి! వచ్చినప్పటి నుంచి చూస్తున్నాను ఒకటే హడల గొడ్తున్నావు నన్ను నా నాలిక తడారి పోతోంది ముందు తాగటానికి ఏదయినా తెప్పించు

అక్కడ మంచినీళ్ళున్నాయి వెళ్ళి తాగు

ఊహూ మంచినీళ్ళతో దాహం తీరదు బాదంఫీర్ కావాలి

కృష్ణ నా ధోరణి పసిగట్టినట్టున్నాడు ముఖం తిప్పుకుంటూ విసురుగా అన్నాడు

అది యీ హోటల్లో దొరకదు అయి పోయిందిట

"నువ్వు అడక్కుండానే చెబుతావే! నేను వెళ్ళి బెల్ నొక్కాను బాయ్ వచ్చే సరికి యిద్దరం కుర్చీల్లో యధాస్థానంలో కూర్చున్నాం

కృష్ణ బాయ్‌తో రెండు ఆరెంజ్ అని చెప్పబోయాడు

ఊహూ రెండు బాదంఫీర్ అన్నాను నేను

బాయ్ తలవూపి వెళ్ళిపోయాడు

నువ్వు మండిపడటం మానేసి నాతో ఒక్కక్షణం శాంతంగా మాట్లాడుతావా!"

లాలనగా అనునయంగా అడిగాను

మండిపడటమా! అవును నీ కలాగే వుంటుంది

ముందిది చెప్పు యిదంతా నీకెవరు చెప్పారు?

ఎవరు చెబితేనేం? నిజమే చెప్పారు కాదంటావా?

కాదనను కానీ ఆ చెప్పటంలో పక్షపాతం చూపించారు నా మనసులో వున్న మంచి వుద్దేశ్యాన్ని నీకు విడమర్చి చెప్పలేదు అట్టే చూస్తే ఆ వ్యక్తి ఎవరో కాని మనిద్దరిని చెడగొట్టటానికి కావాలని చేసిన పనిలా వుంది

ఛ—ఛ! ఆ వ్యక్తి అలాటి మనిషి కాదు

నా అనుమానం దృఢమైంది

ఎవరు నీకిదంతా చెప్పింది నాన్న గారేనా? అన్నాను

అదంతా నీ కనవసరం

కాదు చాలా అవసరం నాకు తెలియకుండా—అందులో నువ్వెంత కోప్పిష్టి మనిషివో తెలిసికూడా యిలా చెప్పారంటే తప్పకుండా ఇందులో ఏదో వుంది దీనివల్ల ఆ వ్యక్తికి కలిగే లాభం ఏమిటో నేను తెలుసుకోవాలి

(ఇంకా వుంది)

Published by A Thirupathi Rayudu at No 1 Arcot Road Madras 26
and Printed by G Veera Brahmam at his Anuradha Acchagam
146 T H Road Madras 21
Controlling Editor CHAKRAPANI

వినార్ సూటింగులు—షర్టింగులు, ఎన్నికకు ఎన్నెన్ని రకాలు

# ఎన్నెన్నో ఆకర్షణీయమైన రంగులు— అందమైన నూతనమైన డిజైనులు



## Estiel

ఎస్టీల్

100% టెరీన్ సూటింగులు

ఆకట్టుకునే నూతనమైన రంగులు, ఛాయలు, డిజైనులు. "ఎస్టీల్"లో ఎక్కువ శాతం "టెరీన్" వుంది. అది అందంగా, మీకు నచ్చేటట్లు వుంటుంది. మీ రూపానికి కొత్త శోభనిస్తుంది. దుస్తుల ఆకారం ఎప్పటికీ నిలిచి వుంటుంది. "ఎస్టీల్"-డ్రిప్ డ్రై. కొద్దిగా ఇస్త్రీచేస్తే చాలును. ముడతలు నలగవు. చాలకాలం మన్నుతుంది.

## VINALIN

వినాలిన్

నిప్టైడ్ షర్టింగులు

వినాలిన్ బట్టలు, కొత్తకొత్త డిజైనులలో, నాణ్యమైన రకాలలో ఎప్పటికీ నిలిచే రంగులలో, లేత ఛాయలలో, చారలు-గీతలు, గళ్లలో వస్తున్నాయి. ప్రత్యేకమైన "పెర్మాప్రెస్" ఫినిష్ వలన వినాలిన్ బట్టలు హుందాగా, నిండుగా వుంటాయి; స్పర్శకు సుకుమారమైనవి. ఎంత నలిగినా ముడతలు చెరగవు. వినాలిన్ బట్టలు తడిపినా తగ్గిపోవు.



వినార్ లిమిటెడ్

కలకత్తా . మద్రాసు . బొంబాయి . న్యూ ఢిల్లీ

V 6192 TEL